శ్రీరస్తు

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ గరుడ పురాణము

సవ్యాఖ్యానాంధ్రతాత్పర్యసహితము

పీఠికాకర్త

## బ్రహ్మశ్రీ డా॥ గోడా వేంకటేశ్వర శాస్త్రి గారు



ప్రకాశకులు

వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్

26, రామానుజ అయ్యర్ వీధి, చెన్నై - 600 021

ఫోన్: 25951378

*****

ఆంధ్రప్రదేశ్ కార్యాలయము

8, హస్తినాపురం (దక్షిణం), నాగార్జున సాగర్ రోడ్డు,

వైశాలీ నగర్ పోస్టు, హైదరాబాదు - 500 079.

ఫోన్: 040-24093427



Rs. 100.00

శ్రీరస్తు

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# శ్రీ గరుడపురాణము

సవ్యాఖ్యానాంధ్రతాత్పర్యసహితము

పీఠికాకర్త

## బ్రహ్మశ్రీ డా॥ గోడా వేంకటేశ్వర శాస్త్రి గారు



ప్రకాశకులు

వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్

26, రామానుజ అయ్యర్ వీధి, చెన్నై - 600 021

ఫోన్: 25951378

*****

ఆంధ్రప్రదేశ్ కార్యాలయము

8, హస్తినాపురం ( దక్షిణం), నాగార్జున సాగర్ రోడ్డు,

వైశాలీ నగర్ పోస్టు, హైదరాబాదు – 500 079.

ఫోన్: 040-24093427

శ్రీ పార్థివ నామ సం। - 2005
పునర్ముద్రణ - 1000 Copies







వావిళ్ల రామస్వామి శాస్త్రులు
**(1826 - 1891)**

వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులు
**(1884 - 1956)**

*Printed and Published by*
**ALLADI SWAMINATHAN**
Advocate & Managing Trustee
V.V.S. Public Trust
For **V. Ramaswamy Sastrulu & Sons,**
26, Ramanuja Iyer Street, Chennai - 600 021.
(Phone: 044 - 2595 1378)

* * *

**Andhra Pradesh Office:**
**V. Ramaswamy Sastrulu & Sons**
No. 8, Hasthinapuram South Colony, Nagarjuna Sagar Road,
Vaishalinagar P.O., Hyderabad - 500 079
**(Phone: 040-24093427)**





# విషయ సూచిక

# పీఠిక

మానవునికి శాశ్వతమైన శ్రేయస్సును, దానికి మార్గమును తెల్పు గ్రంథములు వేదములు. అవి అపౌరుషేయములును, పరమాత్ముని నిశ్వాస రూపములును అగును. వాటి అర్థములను, అందు ప్రతిపాదింపబడిన ధర్మములను తెలుసు కొనుటకై ఇతిహాస పురాణములు వెలువడినవి.

**''ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్''** అని ఆర్యోక్తి. చాల పండితులకు సైతము పురాణములు సాధారణ కథలే. అవి అర్థవాదములు. వానిని పరిశీలించుట వలన గొప్ప లాభము లేదన్న భ్రాంతి లోకమందున్నది. కాని పురాణ పఠనము అత్యంత అవశ్యకమైనది. పురాణములు వేదోక్త ధర్మములను తేటగా ప్రతిపాదించునవి. మన పూర్వుల చరిత్రము, ధర్మాచరణము వీటిని మన కవగాహనమగునట్లు వ్రాయబడినవి. ఈ పురాణములందు **''సర్గశ్చ, ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ, వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణం''** అను ఐదు ముఖ్య విషయములు చెప్పియుండును. అవి ప్రపంచ సృష్టి; ప్రళయము, అవాంతర సృష్టి; దేవ, ఋషి, మన్వాదుల వంశము; మన్వాదుల పరిపాలనాకాలము మఱియు వానికి సంబంధించిన చరితములు అగును. ఇవి కాక మహాపురాణమగు శ్రీమద్భాగవతమందు భగవంతుని లీలలు, ఐశ్వర్యములు మొదలగు పది లక్షణములుండును. ఈ పురాణములన్నిటిని శ్రీ భగవంతుని స్వరూప భూతులగు వేదవ్యాసులు రచించిరి. శ్రీవిష్ణుపురాణ మొక్కటే వ్యాసుల తండ్రియగు పరాశరవిరచితము. పురాణములన్నియు వ్యాసులు రోమహర్షునికి చెప్పగా, ఆయన పుత్రుడగు సూతమహర్షిచే శౌనకాదులకు నైమిశారణ్యమందు సహస్రసంవత్సర సత్రయాగ కాలమందు చెప్పబడినవి.

ఈ పురాణములు సాధారణముగ సంవాదరూపములుగ నుండును. ఇందు హైందవ సంస్కృతి, జీవిత విధానము, సంస్కారములు, పండుగలు, వేదాంత తత్త్వములు, నైతిక విలువలు ఇవన్నియు చెప్పబడినవి. మహా పురాణములు 18. అవి

విష్ణు పురాణము, నారద పురాణము, పద్మ పురాణము, గరుడ పురాణము, వరాహ పురాణము, శ్రీమద్భాగవత పురాణము, బ్రహ్మ పురాణము, బ్రహ్మ వైవర్త పురాణము, బ్రహ్మాండ పురాణము, మార్కండేయ పురాణము, భవిష్య పురాణము,

వామన పురాణము, శివ పురాణము, లింగ పురాణము, స్కంద పురాణము, అగ్ని పురాణము, మత్స్య పురాణము, కూర్మ పురాణము.

ఇవి కాక 18 ఉపపురాణములు చెప్పబడినవి. అందు వాయు, నారసింహ, సౌర, కల్కి, గణేశ, విష్ణు ధర్మోత్తర దేవీ భాగవతములు ముఖ్యమైనవి. ఈ పురాణములను సాత్త్విక, రాజస తామసములగు భేదములుగా విభజించి యున్నారు. ఈ పురాణ వాఙ్మయమందు గరుడ పురాణమునకు విశేషమైన స్థానము కలదు.

ఈ గరుడ పురాణము శ్రీ విష్ణుమూర్తి చేత గరుత్మంతునికి ఉపదేశింపబడినది. ప్రథమాధ్యాయమందు విష్ణు ఆరాధనా క్రమము, తులసీ మాహాత్మ్యము, ఏకాదశీవ్రత విధి, నామ మహిమ, సదాచార విధానము మొదలగు పెక్కు గొప్ప విషయములు చెప్పబడియున్నవి.

అంతియే కాక మరణానంతరము జీవుని స్థితి చాల చక్కగా వివరింపబడినది. యమపురవర్ణనము, మరణానంతరము చేయవలసిన ఔర్ధ్వదైహిక క్రియలు, వాని అధికారులు, ఆశౌచ విధానము, దానములు, వాని ప్రశంస, చేయు విధానము, యమ యాతనలు, మార్గమందు వారికి కలుగు బాధలు, తన్నివారణార్థము పుత్రులు చేయవలసిన కర్మలు, మోక్ష స్వరూపము, అందుల కుపాయము, భగవదారాధన వైభవము, జ్ఞాన లాభము, మొదలగు విషయములు తేటతెల్లముగా విచిత్ర శైలిలో చెప్పబడియున్నవి. వాటిలో ముఖ్య విషయములు దిఙ్మాత్రముగ స్థాలీపులాక న్యాయముగా గ్రహించుటకై వివరింపబడినవి.

నైమిశారణ్యమందు ఒకానొకప్పుడు జరిగిన సహస్ర సంవత్సర సత్రయాగమందు సూతముని వచ్చియుండెను. అప్పుడు శౌనకాది మహర్షులు ఆయనను గౌరవించి 'ఇది వరకు తాము దేవయాన మార్గమును సెలవిచ్చితిరి. యమమార్గమును వినగోరెదము. అంతియేగాక సంసారదుఃఖములు, వానిని తొలగించుటకు సాధనమును తెల్పుము'' అని ప్రార్థించిరి. అప్పుడు సూతులు తొల్లి గరుడునికి శ్రీహరి ఉపదేశించిన రీతిని ఉపదేశించిరి.

జ్ఞానవంతులగు మానవులు ఉత్తమ గతిని పొందుదురు. పాపాత్ములు యమ యాతన ననుభవింతురు. బ్రతికి యున్నప్పుడు ఐహిక దుఃఖములను

మరణానంతరము యమయాతనను పాపులు అనుభవింతురు. కుటుంబ వ్యవహారములయందు ఇచ్చకలవాడై, ఇంద్రియ నిగ్రహము లేక మరణ బాధల వలన నష్టమతియై, మానవుడు తన బంధువులందఱు విలపించుచుండగా మరణించును. ఆ మరణ కాలమున జీవునకు దివ్యదృష్టి కలుగును. ప్రపంచమంతయు స్పష్టముగ కన్పించును. కాని ఏమియు పలుక అసమర్థుడగును. ప్రాణము శరీరమునుండి నిష్క్రమించు సందర్భమున వందలకొలది తేళ్ళు కుట్టిన బాధ ననుభవించును. దిగంబరులై, పాశదండధారులై, ఊర్ధ్వకేశులై, వికృతాకారులగు యమదూతల చూచి భయపడి మూత్ర పురీష విసర్జనములు కావించును. అంగుష్ఠమాత్రుడగు జీవుని యమదూతలు పాశముతో బంధించి తీసికొని పోవుదురు. వారి తర్జన భర్జనలకు బెదురుచు, ఆకలిదప్పులు, ఎండ, కార్చిచ్చు, వడగాలి వీనిచే బాధపడును. అశక్తుడైనను అనేక కష్టములతో నడచుచుండును. శవ శరీరమునుండి భూలోకమున బయలు దేరిన జీవుడు రెండు మూడు ముహూర్తములకే కటిక చీకటిలో యమలోకమునకు బోవును. దూతలు జీవునికి నరక బాధలను, యమదర్శనమును చేయింతురు. యముని ఆజ్ఞచేత జీవుని మరల ముహూర్త మాత్రమున ఖేచరముగ భూలోకమునకు కొనివత్తురు. తన శరీరమందు ప్రవేశింప దలచియు వీలుకాక శ్రమయును బొంది పుత్రాదుల చేతనీయబడిన పిండమును, ఆతురకాలిక దానములను గ్రహించును. కాని పాపాత్ములు నాస్తికులు వాటిని సైతము గ్రహింపలేరు.

మృత దివసము మొదలుకొని మొదటి పది రోజులిచ్చు పిండమును ప్రతి రోజు నాల్గుగా విభజించి రెండు భాగములు మృతుని యాతనా శరీర వృద్ధికి, ఒక భాగము యమభటులకు మరో భాగము ప్రేతమునకు చేరును. దీనివలన జీవుడు (ప్రేతము) చేతెడు పిండ శరీరము పొంది, బలము గలిగి పుణ్యాపాపములను అనుభవించును. తరువాత ఏకాదశీ, ద్వాదశీ దినముల యందు పుత్రాదులవలన నీయబడు పిండముల భుజించి పదమూడవ దినమున పాశబద్ధుడై యమభటుల వెంట కట్టబడిన కోతివలె కష్టమైన యమమార్గమున పోవును.

భూలోకమునుండి యమపురమునకు దూరము 86000 యోజనములు. మధ్యనున్న వైతరణి నది వెడల్పు 100 యోజనములు. ప్రేతుడు ఒక రోజునకు పగలు రాత్రి కలిసి 247 యోజనముల వంతున నడుచును. ఇట్లు బయలుదేరిన 348 రోజున అనగా మరణించిన 361వ రోజున తమ పురమునకు పోవును. మధ్యమార్గమునందు జీవునకు తగులు పురములు 16. అవి -

సౌమ్యపురము, సౌరి పురము, నగేంద్ర భవనము, గంధర్వ నగరము, శైలాగమ పురము, క్రౌంచపురము, క్రూర పురము, విచిత్ర భవనము, బహ్వాపద పురము, దుఃఖద పురము, నానా క్రంద పురము, సుతప్త భవనము, రౌద్ర పురము, పయోవర్షణ పురము, శీతాఢ్య పురము, బహుభీతి పురము అగును.

ద్వితీయాధ్యాయమున యమపుర మార్గము చెప్పబడి యున్నది. ప్రేతలను దారములతో కట్టి, ముక్కుదారములు వేసి, వీపులందు బల్లెములు గ్రుచ్చి యమ భటులు ఎండలలో, వర్షములలో, రాళ్లదారిలో, సూదులవలె బాధపెట్టు అసి పత్రవనములందు బలాత్కారముగ లాగుకొని వెళ్లుదురు. పైన చెప్పిన 16 పురములందు చేరు రోజులును జీవునికి భూలోకమందివ్వవలెనని చెప్పిన పిండ ప్రదాన రోజులును సరిగా నుండును. వాటిని ప్రేతము భుజించి మరల ప్రయాణమునకు సిద్ధపడును. ఒక సంవత్సరము ముగియునప్పుడు శీతాఢ్య పురమునకు చేరును. ప్రథమాబ్దికమున నీయబడిన పిండోదకములను గ్రహించి, తన బంధు జనుల నెవ్వఱను వెదికినను కనుగొనలేక దుఃఖితుడై అనేక భీతులకాకరమగు బహుభీతిపురమునకు పోవును. అది యమపురమునకు సమీపమున నుండును. ఇచ్చటనే హస్తమాత్రమగు శరీరమును వదలి యాతనా శరీరము నధిష్ఠించును. పుత్రులు పిండ ప్రదానాది ఔర్ధ్వ దేహిక కర్మలు సక్రమముగా నిర్వర్తింపనిచో పూర్వోక్తమైన అనేక దుఃఖముల ననుభవించును. యమపురమునకు ఉండు నాలుగు ద్వారములలో దక్షిణ మార్గమున వీరు వెళ్లుదురు.

తృతీయాధ్యాయమున యమపురమందలి యాతనలు చెప్పబడినవి. బహు భీతి పురమునకు 16 యోజనములందున్న యమపురమునకు పోవునప్పుడే అచ్చటి హాహాకారములను విని జీవు డేడ్చును. ఆ రోదనమును విని ధర్మధ్వజుడను ప్రతీహారికి 'భటులు పాపాత్ముడొకడు వచ్చియున్నా'డని తెల్పుదురు. ఆ ధర్మధ్వజుడు చిత్రగుప్తునికి తెలుప, చిత్ర గుప్తుడు యమధర్మరాజునకు తెల్పును. తర్వాత యముడు, చిత్రగుప్తుని ప్రేతుని పాపములడుగ, చిత్రగుప్తుడు శ్రవణులనడుగును. ఈ శ్రవణులు బ్రహ్మ పుత్రులు. మూడు లోకములందును సంచరింప గల్గిన శక్తిమంతులు. వారి భార్యలును అటువంటి వారే. ప్రతి మానవుడు రహస్యముగ చేయు పాపములన్ని వీరప్పటి కప్పుడే తెలియజేయుదురు. వారు యథార్థమునే పల్కుదురు.

ధర్మరాజు, చిత్రగుప్తుడు, శ్రవణులు, సూర్యచంద్రులు మొదలగు వారికి ప్రతి మానవుడు చేయు పుణ్య పాపములు స్పష్టముగ తెలియును. యముడు వీరి పాపములను తెలిసికొని వారికి తన భయంకరమైన స్వరూపమును చూపును. ప్రక్కనున్న చిత్రగుప్తుడు పాపులను మీరేల పాపములు చేసితిరి. మీ పాపములే మీకు దుఃఖహేతువులైనవి. అనుభవింపుడు. మాకు పక్షపాతములు లేవు. సరిగా తగిన శిక్షయే దొరకునని చెప్పును. యముడు వారలకు తగిన శిక్ష ఇమ్మని ఆజ్ఞాపించును.

సమీపమందు నిప్పుల గ్రక్కు యోజనము పొడవున్న వృక్ష ముండును. అందు తలక్రిందులుగా పాపులను వేసి కొట్టు చుందురు. వారు చేసిన పాపములను చెప్పుచు వారిని హింసింతురు. చెట్టు నుండి క్రిందపడినచో శరీరమును కుక్కలు కఱచును. వారిని త్రాళ్లతో కట్టి ముద్గరములతో కొట్టుదురు. మొలలవఱకు భూమియందు పాతి పెట్టి బాణములతో హింసింతురు. అచ్చట తామిస్ర, లోహకుండ, శాల్మలి, రౌరవ, కుడ్మల, పూతిమృత్తిక, అవీచి, అంధతామిస్ర, కుంభీపాక, ప్రతాములనబడు 84 లక్షల నరకములున్నవి. అచ్చట కల్పాంతమువఱకు ఆనరక బాధల ననుభవింతురు. ఆ తర్వాత సూకరాది అనేక పాప జన్మలను పొంది, మరల నరలోకమున మనుష్యుడుగా పుట్టును. కావున మానవుడు తన జన్మ యందు శ్రమపడినను ధర్మమును ఆచరించవలెను.

చతుర్థాధ్యాయమందు యమయాతనల ననుభవించు పాపాత్ములు, వారు చేసిన పాపములు చెప్పబడినవి. ధర్మము చేయువారు యమపురమునకు పశ్చిమ, ఉత్తర, తూర్పు దారులుగ వెళ్లవచ్చును. పాపాత్ములు దక్షిణ ద్వారము దారిగనే వెళ్లుదురు. వారు బ్రాహ్మణ హంతకులు, కల్లు త్రాగువారు, గో, శిశు హంతకులు, స్త్రీహింసకులు, గర్భపాతము చేయువారు, గురు, దేవ, విప్ర ద్రవ్యముల నపహరించినవారు, స్త్రీ, బాల ద్రవ్యాపహారులు, విశ్వాస ఘాతకులు, పంచ మహాపాతకములు చేసినవారు; వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాస నిందకులు, పెద్దల హితోపదేశములు విననివారు, ధర్మము చేయని వారు, మాతా, పితృ, గురుద్రోహులు, సద్, భార్యాహింసకులు, వ్యభిచారులు మొదలగువారు యమ పురమునకు దక్షిణ ద్వారముగా వెళ్లి వైతరణియందు దుఃఖమునుభవించి, యమయాతనలను కల్పాంతమువఱకు అనుభవింతురు. మఱల యమలోకమందే జనింతురు కొందఱు. పిమ్మట యముని ఆజ్ఞ చేత భూలోకమునందు వృక్ష,

తరు, గుల్మ, పర్వతాదులుగ జన్మ పొందుదురు. తరువాత క్రిమి, కీట, పశు, పక్ష్యాదుల జన్మలననుభవించి క్రమముగా మానవ జన్మను పొందుదురు.

పంచమాధ్యాయమందు మహా పాపములు చేసిన వారు పాపఫలానంతరము ఏజన్మలు పొందుదురో అందు వివరింపబడినవి. కొన్ని -

| | |
|---|---|
| బ్రహ్మహత్య చేసిన వాడు | చండాలుడై పుట్టి క్షయరోగి యగును. |
| స్త్రీ వధ చేసిన వారు | భిల్లులై జనింతురు |
| గురువు నవమానించువారు | అపస్మార రోగులగుదురు. |
| వేద శాస్త్రముల నిందించినవారు | పాండు రోగి యగుదురు. |
| తేనెను హరించువాడు | దోమగా జన్మించును. |
| స్వేచ్ఛాసంచారము చేయువారు | అరణ్యమున ఏనుగులగుదురు. |
| గురువును హుంకరించినవారు | బ్రహ్మరాక్షసు లగుదురు. |

కాముకుడు గుఱ్ఱమై పుట్టును. పతివ్రతాస్త్రీని హింసించినవాడు చక్రవాక పక్షియగును. ఇట్లు పాపాత్ములు యాతనలననుభవించి, పశ్వాది యోనులందు వేలకొలది జన్మములపొంది దుఃఖమనుభవించి పాప పుణ్యములు, సమానముకాగ మానవ జన్మను పొందుదురు. ఇట్లు విష్ణుమాయచే మోహితులగువారు అనేక లోకములందు అండజ, స్వేదజ, జరాయుజ, ఉద్భిజ్జములను జన్మలను పొందుచు భ్రమించు చుందురు. శ్రీహరి భక్తియు తద్వారా ఏర్పడు బ్రహ్మజ్ఞానమే విముక్తికి మార్గమగును.

షష్ఠాధ్యాయమందు జీవునికి మానవ జన్మ ఏర్పడు విధానము ఎఱింగింపబడినది. శుక్ర శోణిత సంబంధము వలన గర్భమును ప్రవేశించిన జీవుడు ఒక దినమున కలిల మగును, ఐదు దినములకు బుద్బుదాకారమును, పది దినములకు రేగు పండు వలె కఠినమైన మాంసపుముద్ద యగును. ఒక మాసమున శిరస్సును, రెండవ మాసమునందు బాహువులు, మూడవ మాసమందు గోళ్లు, రోమములు, చర్మము, నాల్గవ మాసమున ఏడు ధాతువులు ఏర్పడును. ఐదవ మాసమున ఆకలి దప్పులు పుట్టును. ఆఱవ మాసమునందు జరాయుచే కప్పబడి గర్భమందు దక్షిణముగ శిశువు తిరుగ నారభించును. మాతృభుక్తాన్న పానములచే వృద్ధి చెందుచు, అందున్న క్రిమి కీటాదులచే హింసింపబడుచు, శీతోష్ణ, కట్వన్న పదార్థములు తల్లిచే భుజింపబడి అవి సున్నిత చర్మములందు బడ దుఃఖమనుభవించుచు, సంకుచిత స్థలమునందు, హస్తపాదాది ప్రసారణమునకు

ఫలములేక బాధపడుచు, తన పరిస్థితి నెఱింగి శ్రీహరిని ప్రార్థించును. భూమియందు పుట్టగనె భగవద్భజనము, శాస్త్ర శ్రవణము చేయ సంకల్పించుకొనును. తర్వాత పది మాసములకు విగతస్మృతుడై మాతృ శరీర రక్తమలాదులతో పతిము సంకుచిత ద్వారము నుండి బయటకు వచ్చును. ఇంతవరకున్న జ్ఞానము సద్యః నశించి అజ్ఞానముచేత నావరింపబడి, ఆకలి దప్పులు, రాగద్వేషములు వీటిచె బాధింపబడి బాల్య, కౌమార, పౌగండ, యౌవన, మధ్య వయస్సులందు పంచేంద్రియముల తృప్తి బరచ యత్నించి పాపపుమూటలను చేర్చుకొనును. ఇట్లు ముక్తికి ఉత్కృష్ట జన్మయగు మానవ జన్మను పొందియు, తమ్ము ఉద్ధరించుకొనలేక మూర్ఖులు సంసార చక్రమందే భ్రమించు చుందురు.

సప్తమాధ్యాయమందు పాపాత్ములు, విషయసుఖాసక్తులు, దీన చేతస్కులు సద్గతి నొందు ఉపాయము చెప్పబడినది. అపుత్రకునికి సద్గతి చిక్కుట యరుదు. పుత్రుడు లేనివారు హరివంశ కథాశ్రవణము, శత చండీ విధానము, పరమేశ్వరారాధనము వీటిచేత పుత్రుని బడయ వలెను. పుత్రముఖ దర్శనము వలన తండ్రి పైతృక ఋణ విముక్తుడగును. పౌత్ర శరీర స్పర్శ చేత ఋణ త్రయ విముక్తుడు కాగలడు. బ్రాహ్మ వివాహమందు స్వీకరింపబడిన సవర్ణ స్త్రీయందు జనించిన పుత్రునిచే చేయబడిన శ్రాద్ధాదులు ఉత్తమ లోకములను గల్గించును. అట్టి కర్మలు లేక బాధపడు వైదిశ నగరమునకు చెందిన సుదేవుడను వైశ్యుని ప్రేతము, బభ్రువాహనుడను రాజుచే సంస్కారము చేయబడి ప్రేతత్వ విముక్తి చెందిన వృత్తాంతము, విష్ణు పూజాక్రమము చక్కగా వర్ణింపబడియున్నది.

తల్లిదండ్రులు వృద్ధులై ఆతురులైనప్పుడు కుమారులు చేయవలసిన పరలోకోపకారకములగు సత్కర్మలు అష్టమాధ్యాయ విషయములైనవి. తన యవసానకాలము సమీపించినదని తెలియగనే మానవుడు స్నానము చేసి శ్రీ మహావిష్ణువును గంధ దీపాదులతో నర్చించి, తులసీ దళములు సమర్పించి, నివేదనముచేసి బ్రాహ్మణులకు దానములు చేయవలెను. అప్పుడు చేసిన దానము లనంత ఫలముల నొసగును. అష్టాక్షరి, ద్వాదశాక్షరి, శివ కేశవ నామములు, కృష్ణనామము మొదలగునవి స్మరించవలెను. మరణ సందర్భమున బంధువు లేడ్వరాదు. భగవద్గీత, విష్ణు సహస్రనామ పారాయణములు చేసి వినిపింపవలెను. ఏకాదశీవ్రతము, భగవద్గీత, గంగోదకము, తులసీదళము, విష్ణుపాదోదకము

విష్ణునామములు మరణకాలమందు ముక్తి నిచ్చును. శ్రోత్రియులకు గోదానము చేయవలెను. కుమారుడు తండ్రి చేత దాన ధర్మములు మరణ సమయమున చేయించవలెను. అందు ముఖ్యమైనవి తిల, లోహ, హిరణ్య, కార్పాస, లవణ, ధాన్య, భూ, గోదానములు. సమస్త దానములలో ఉత్తమమైనది స్వర్ణదానము. దీనివలన బ్రహ్మ, ఋషులు, దేవతలు, ధర్మరాజ సభాసదులు ఈ ప్రేతార్థముల నిత్తురు. స్వర్ణ దాత యమలోకమునకు వెళ్లడు. స్వర్ణదాత స్వర్గలోకమునకు వెళ్లి భోగముల ననుభవించి, తర్వాత సత్యలోకమున చిరకాలము నివసించి మనుష్యలోకమున ధార్మికుడు, వాగ్మి, శ్రీమంతుడగు రాజుగా పుట్టును. పాత్రుడగు భూసురునికిచ్చిన భూదానము బ్రహ్మ హత్యాది మహా పాపములు నశింపజేయును.

శరీరమందు శక్తి యున్నప్పుడే, శ్రోత్రియుడు, సత్పాత్రుడు అగు బ్రాహ్మణుడు చిక్కినప్పుడే, వైతరణీ గోదానము చేయవలెను. చెఱకు గడలతో నావనుచేసి, దానికి పట్టుదారముకట్టి, గోతిని త్రవ్వి జలము నింపి, నావనందుంచి, గోవునందు నిలిపి యథాశాస్త్రముగ సంకల్పముచేసి, బ్రాహ్మణునికి గంధ, పుష్ప, వస్త్రాదుల నొసంగి, గోపుతోక పట్టుకొని కాలిని నావపై నుంచుకొని, గోమాతను, శ్రీహరిని ప్రార్థించి గోవునకు ప్రదక్షిణము చేసి బ్రాహ్మణునికి గోదాన మివ్వవలెను. ఇట్లు దాన ధర్మములు చేసికొని స్వర్గపాథేయము సంపాదించుకొనిన మానవులు అనాయాసముగ యమ మార్గమున వెళ్లుదురు. కావున మానవులు శక్తియున్నప్పుడే సత్పాత్రులు లభించినప్పుడే దాన ధర్మములు గావించి శ్రీహరి భక్తిగల్గి, శ్రీగురూపదేశముల పొంది, శాస్త్రాభ్యాసములు గావించుకొని సంసార బంధ విముక్తులు కావలెను.

నవమాధ్యాయమున మరణ కాలమునందు చేయవలసిన పనులు చెప్పబడినవి. అవి ఆసన్న మరణమును పొందినపుడు మొదట ఇంటి యందుండు తులసీ సన్నిధానమునందు గోమయముతో ఒక మండలము చేయవలెను. అనగా భూమిని శుద్ధముచేసి గోమయముతో అలికి ఆమండలమునందు తిలలు చల్లి, దర్భలను పఱచి, ఒక శుభ్రమైన ఆసనము చేసి, అందు సాలగ్రామశిల నుంచవలెను. పిదప ఆసన్నమరణముగా నున్న వారిని అచ్చట పరుండబెట్టి నోటిలో తులసీ దళమునుంచవలెను. మంచము, పరుపులు, చాప పీటపై పరుండబెట్టరాదు. దర్భాస్తృతమగు భూతలమందే పరుండ పెట్టవలెను. ఆతురుని నోటి యందు స్వర్ణమును, రత్నమును ఉంచి సాలగ్రామ తీర్థమును పోయవలెను. కొద్దిగా గంగాతీర్థమును ఇవ్వవలెను.

అనంతరము శ్రీమద్భాగవతమునో, వేదము, ఉపనిషత్తులు, శివ, విష్ణు స్తవములను వినిపింపవలెను. ప్రాణములు పోవునప్పుడు జలమును, అన్నమును ఇవ్వరాదు. విరక్తుడగు ద్విజుడైనచో ఆతుర సన్న్యాసమును స్వీకరింపవలెను.

ఇట్లు ఆతురకృత్యములు చేసికొని సిద్ధముగ నున్న జీవుని, దేవదూతలు అలంకరింపబడిన విమానమును తెచ్చి స్వర్గమునకు గొనిపోవుదురు. జీవుడు దివ్యదేహమును ధరించి, శుక్లమాల్యాంబర ధారియై, దివ్యాభరణ శోభితుడై, దాన ధర్మములు చేసికొనుటవలన మహానుభావుడై దేవతలచేత పూజింపబడి వెంటనే (తత్క్షణమందే) స్వర్గలోకమునకు బోవును.

అంత్యేష్టి విధానము దశమాధ్యాయమందు వివరింపబడియున్నది. పైతృక ఋణము అంత్యేష్టివలననే తొలగును. అంత్యేష్టిని గావించిన పుత్రునకు అగ్నిష్టోమ ఫలము లభింపగలదు.

తల్లిదండ్రులు మరణించినపుడు మొదట పుత్రుడు నఖ, కక్షములు వదలి ముండనము చేసికొనవలెను. స్నానము చేసి ధౌత వస్త్రములు ధరింపవలెను. అప్పుడు తెచ్చిన జలముతో శవమును స్నానము చేయించి గంధ, పుష్ప, గంగామృత్తికలతో నలంకరించి నూతన వస్త్రములతో కప్పవలెను. అపసవ్యముగ సంకల్పము చేసి ప్రేతనామగోత్రములనుచ్చరించి మరణ స్థలమున, శవాధిష్ఠాన దేవతయగు భూదేవతాతృప్తి కై సదక్షిణాకముగ పిండము నుంచవలెను. తదుపరి ద్వార దేశమందు భూత నామముతో పిండము నుంచవలెను. దీని వలన భూత కోటుల యందలి దుర్గతులు విఘ్నములు కల్గింప జాలరు. తర్వాత కోడలు మొదలగు వారు శవమునకు ప్రదక్షిణము గావించి నమస్కరింపవలెను. బంధు సహితుడై పుత్రుడు శవమును భుజములపై మోసికొని శ్మశానమునకు తీసికొనిపోవలెను.

శ్మశానమునకు పోవు త్రోవయందు భూమిని శుభ్రము చేసి ప్రోక్షించి పిశాచ, రాక్షస, యక్షులకై ప్రేత నామ గోత్రాదుల నుచ్చరించి పిండ ప్రదానము చేయవలెను. తరువాత శవమును శ్మశానమందు ఉత్తరాభిముఖముగా నుంచి దహనమున కుపయోగించు భూమిని తుడిచి, గోమయముతో అలికి, దర్భలతో ఊర్ధ్వముగా నొక గీతగీచి, నీటిని చల్లి అగ్నిని యుంచి 'క్రవ్యాద'మను పేరు గల్పింపబడిన యగ్నికి గంధ పుష్పాదులతో పూజించి

లోమభ్యః స్వాహా, త్వగ్భ్యః స్వాహా, మాంసేభ్యః స్వాహా

అను అనువాకముతో యథావిధిగా హోమము చేయవలెను. 'నీవే భూతములను భరించువాడవు. నీవే జగత్తునకు కారణము. నీవే భూత పరిపాలకుడవు. మృతుడు సంసారి కావున నీవీతనిని స్వర్గమునకు చేర్చుము' అని అగ్నిని ప్రార్థించి, చందనము, తులసి, మోదుగ, రావి మున్నగు కట్టెలతో చితిని పేర్చవలెను.

శవమును చితిపై చేర్చి, చితిమీదను శవహస్తము నందున రెండు పిండములు ప్రేత నామములతో ఉంచవలెను. ఈ చితికి 'సాధకా' మనియు పేరుగలదు. కావున చితిపై సాధక నామముతో మఱో రెండు పిండముల నుంచవలెను. పిదప లోగడ "లోమభ్యః స్వాహా" అని హోమము చేసిన అగ్నిని (అగ్నిహోత్రియైనచో అగ్నిహోత్రాగ్నిని) తృణములతో గ్రహించి కుమారు డా చితి యందుంచవలెను.

ధనిష్ఠ నుండి రేవతి వఱకు గల ఐదు నక్షత్రములకు ధనిష్ఠా పంచకమని పేరు. అందు మరణించిన వారి శవ సమీపమునందు దర్భలతో చేసిన నాల్గు ప్రతికృతుల నుంచి 'ప్రేతా జయతా నర ఇంద్రోవచ్ఛర్మ యచ్ఛతు' అను మంత్రముచే ఆయా నక్షత్రమంత్రములతో సంపుటీకరణముగ హోమములు చేయవలెను. తర్వాత శవము నా దర్భ ప్రతికృతులతో దహనము గావించి సపిండీకరణ దినమందు తిలపాత్రము, హిరణ్యము, రూప్యము, రత్నము, నేతితో నింపిన కంచు పాత్రము వీటిని క్రమముగా ఆయానక్షత్రమరణ దోష నివృత్తికై దానము చేయవలెను.

శరీరము సగము కాలిన పిదపనో పూర్తిగా కాలిన తర్వాతనో, గృహస్థుని శిరస్సును కట్టతో బద్దలు కొట్టవలెను. బ్రహ్మరంధ్రమును ఛేదించి పితృలోకము కల్గుటకై

అస్మాత్త్వమధిజాతో஽సి త్వదయం జాయతాం పునః
అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా జ్వలతు పావకః.

అను మంత్రముతో తిలలతో కలిపిన ఆజ్యాహుతిని గావించి గట్టిగా ఏడ్వవలెను.

దహనానంతరము ముందు స్త్రీలు, తరువాత పురుషులు స్నానము చేసి, మృతుని నామగోత్రముల నుచ్చరించి తిలోదకము నీయవలెను. వేపాకులను భక్షించి మృతుని గుణగణముల పొగడవలెను. ముందు స్త్రీలు, తరువాత పురుషులు ఇంటికి

వెళ్లి స్నానము నాచరించి, గోవులకు గ్రాసమిచ్చి, కుట్టుడాకుల యందు భుజింపవలెను. గృహాన్నమును భుజింపరాదు. తరువాత మృత స్థానమందు దక్షిణాభిముఖముగ అలికి పండ్రెండు దినములు అచ్చట అహర్నిశలు దీపముంచవలెను. సూర్యాస్తమయమునకు పైగా శ్మశానమందో లేక చతుష్పథమందో పాలు, నీళ్ళు మూడు రోజులుంచవలెను. పిదప కాలిన మట్టి మూకుడిలో పాలు నీరు పోసి త్రాళ్ళతో కట్టబడిన మూడు కఱ్ఱలతో గ్రహించి, ''శ్మశానాగ్నిచే కాల్చబడి, బంధువులచే వదలబడిన నీవు ఈ నీటితో స్నానము గావించి పాలను త్రాగు''మని చెప్పి శ్మశాన మందుంచి రావలెను.

మఱు రోజో లేక ధనిష్ఠా పంచకము లేని రోజో శ్మశానమునకు వెళ్ళి అస్థి సంచయనము చేయవలెను. శ్మశానమునకు వెళ్ళి స్నానము చేసి ఉన్ని, త్రాటిని చుట్టి పవిత్రమును ధరించి, శ్మశానగత భూతములకు 'యమాయ త్వా' అను మంత్రముచే మాషబలి నిచ్చి మూడు సార్లు ప్రదక్షిణము గావించి, భూమిని పాలతో ప్రోక్షించి, నీటితో తడిపి అస్థులను మోదుగాకులపై నుంచి, పాలతో నీటితో కడిగి, మట్టి మూకుటి యందుంచి యథావిధిగా శ్రాద్ధము చేయవలెను. గోమయముతో అలికి త్రికోణముగా మండలము చేసి దక్షిణాభిముఖుడై దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిశలందు మూడు పిండముల నుంచవలెను. ఆపైన చితి భస్మమును పోసి, మూత లేని నీటి కుండ యందుంచవలెను. పిదప పెరుగు, నేయి నీటితో ప్రేతమునకు బలి ఇవ్వ వలెను. పదునైదు అడుగులు ఉత్తర దిక్కుగా నడిచి అందు గోయి త్రవ్వి అస్థి పాత్రమును అందుంచి, దానిపై దాహార్తి నాశనమగు పిండ ప్రదానము చేయవలెను. తరువాత ఆ అస్థి పాత్రను తీసి జలాశయమునకు పోయి నీటితో, పాలతో బాగుగ కడిగి ఒక సంపుటమందుంచి హృదయమందు, శిరస్సునందు ఉంచుకొని ప్రదక్షిణము గావించి గంగయందు వదలవలెను.

విదేశమందో, అరణ్యాదులయందో మరణించిన వారి విషయము తెలిసిన తత్క్షణము దర్భలతో ప్రతికృతి గావించి ( శరీరము దొరక లేదుగాన), దహనము చేసి భస్మమును గంగ యందు చేర్చవలెను. వినిన రోజు మొదట కర్మ చేయవలెను. ఏ దినమున వినెనో ఆ దినముననే ప్రతి సంవత్సరము ఆబ్దికములను కావింపవలెను.

పూర్ణ గర్భవతి మరణించినచో శిశువును వేరు చేసి, శిశువుని పూడ్చి, స్త్రీని మాత్రమే దహించవలెను. ఇరువది ఏడు నెలల వఱకు శిశువుల మృత శరీరములను

పాతి పెట్టవలెను. ఆ పైని మరణించిన వారి శరీరములను దహనము చేసి, ఎముకలను గంగయందు వదలి ఉదకుంభ దానము చేసి బాలురకు భోజనము పెట్టవలెను.

గర్భమందు మృతి చెందిన శిశువునకు ఏ కర్మయు లేదు. జననానంతరము మరణించినచో పాలు దానము చేయవలెను. దంతములు వచ్చిన తర్వాత చౌలముగులోగా మరణించినచో ఉదకుంభ దానము చేసి, పాయస భోజనము పెట్టవలెను. మూడు నుండి ఐదు సంవత్సరములలోగా మరణించిన వారికి సమానులగు వారికి భోజనము పెట్టవలెను. ఉపనయనమునకు పూర్వము మరణించినచో ఉపనయనము కాని వారికి, తదనంతరము మృతించినచో ఉపనయనమైన వారికి భోజనము చేయించ వలెను. ఐదు నుండి పది సంవత్సరముల వరకున్న పొగండుడు మరణించిన ఉపనయనము కాకున్నను, పాయసముతోగాని బెల్లముతోగాని పది రోజులు పిండ ప్రదానము చేయవలెను. పదకొండు, పండ్రెండవ రోజు కృత్యములను, వృషోత్సర్జనము, మహాదానములను వదలి మిగిలిన కర్మలను చేయవలెను. తండ్రి జీవించి యుండగా పొగండుడు మరణించిన సపిండీకరణము చేయరాదు. కావున పండ్రెండవ దినమున ఏకోద్దిష్టము చేయవలెను.

స్త్రీ శూద్రాదులకు ఉపనయనమునకు బదులు వివాహము చెప్పబడినది గాన, ఉపనయనాత్పూర్వము వయస్సు ననుసరించి కర్మచేయవలెను. కిశోరుడు (పదునాలేండ్ల వయసుగలవాడు) మరణించిన శయ్యాదానము, వృషోత్సర్జనము, మహా దానములు వీటిని యథావిధి నాచరించవలెను.

సన్న్యాసి మరణించిన దహనము, ఉదక దానము, అశౌచము లేవు. సన్న్యాసులు, జ్ఞానులు స్వరూపానుసంధానము చేయు వారగుటచే వారు నిత్య ముక్తులగుదురు. వారు పుత్రాదులిచ్చు పిండముల కాశపడరు. తీర్థశ్రాద్ధమును, గయాశ్రాద్ధమును పితృభక్తితో చేయవచ్చును. కుటీచక, బహూదక, హంస, పరమహంసలగు నాల్గు విధ సన్న్యాసులను దహింపరాదు. భూమి యందు పాతి పెట్టవలెను. గంగాది నదులున్న చోటైనచో అందు వారిని విడువ వలెను.

ఏకాదశాధ్యాయమునందు కర్మ చేయవలసిన వారలను గురించి చెప్పబడియున్నది. ప్రప్రథమముగా పుత్రునికే కర్మాధికారము. పుత్రుడు లేకున్న భార్యయు, భార్యయు లేకున్న, సోదరుడు, సోదరుడును లేకున్నచో, శిష్యుడో లేక

సపిండులలో శ్రాద్ధమున కధకారులు. జ్యేష్ఠసోదరుడు అపుత్రుడైన కనిష్ఠసోదరుల పుత్రపౌత్రులు కర్మ చేయవలెను. అవ్విధముగనే కనిష్ఠసోదరుడు పుత్రహీనుడైనచో జ్యేష్ఠసోదరుని పుత్రపౌత్రులు కర్మ చేయవలెను. పుత్రులు లేని వారికి మిత్రుడు పిండదానము గావించ వచ్చును. ఎవ్వరును లేకున్న పురోహితుడు కర్మ చేయవలెను. కర్మలోపమెన్నడును చేయరాదు. స్త్రీయైనను పురుషుడైనను మిత్రులకు కర్మ చేయవలెను. జ్యేష్ఠకుమారుడు మరణించిన ఆ తండ్రి కర్మ చేయకూడదు. పుత్రులనేకులు విడివిడిగా యున్నను అందొక్కడే దహనాది సపిండీకరణమువఱకు చేయవలెను. ప్రత్యాబ్దికము పుత్రులు విభక్తులైనచో, విడివిడిగా ఆచరింపవలెను. కలిపి చేయగూడదు.

కర్మచేయునతడు ఒంటిపూట భోజనము, భూశయనము, బ్రహ్మపరత, శుచి మొదలగు వ్రతములను పాటింపవలెను.

ప్రతిరోజు రెండవయామమున (11.00 గంటలకు) నూతికో, చెరువుకో బోయి సంకల్పరహితముగ స్నానముచేసి, శుచితో, చెట్టుక్రింద దక్షిణాభిముఖుడై కూర్చుండి, ఒక వేదిక వేసి, గోమయముతో అలికి, దానిపై ఒక ఆకునుంచి, దానిపై దర్భమయుడగు (కౌశిక) ద్విజుని ఉంచి, ధ్యానావహనాదులతో పూజ చేయవలెను. తరువాత

'అతసీ పుష్పసంకాశం పీతవాసన మచ్యుతం,
యేనమస్యంతి గోవిదం నతేషాం విద్యతే భయమ్.
అనాదినిధనో దేవః శంఖచక్ర గధాధరః,
అక్షయ్యః పుండరీకాక్ష! ప్రేతమోక్ష ప్రదో భవ.

అను శ్లోకములల ప్రార్థన కావించి నమస్కరింపవలెను. ఆ తరువాత దానికి ముందుభాగమున కొన్ని దర్భలను ఆసనముగ వేసి దానిపై ప్రేత నామగోత్రముల నుచ్చరించుచు అన్నముతోగాని. యవ

పిష్టముతో గాని పిండప్రదానము చేయవలెను. ఆ పిండమునకు వట్టివేళ్ళు, చందనము, భృంగరాజపుష్పములు (గుంటగలగరపూవులు) నివేదనము చేసి ధూప, దీప, నైవేద్య, తాంబూల దక్షిణలు సమర్పించి, ప్రేత నామ గోత్రాదులతో కాకబలిని, పాలు, నీరు వీటిని జలాంజలులను చేయవలెను. ప్రేతశబ్దము నుచ్చరించుచు ఇవ్వబడిన అన్నము, వస్త్రము, జలము మున్నగునవి అక్షయ్యమగు ఫలముల నిచ్చును. కావున స్త్రీ పురుషులెవరు మరణించినను మొదటి దినమునుండి సపిండీకరణ వరకు ప్రేతశబ్దోచ్చారణముతో అన్నాదుల నీయవలెను. తొమ్మిదవ దినమున సపిండులందఱు, మరణించినవారికి స్వర్గలోకము కల్గు నిమిత్తము తైలాభ్యంగనము చేసుకొని, బయట ఒక్కచోట స్నాన మాచరించి దూర్వలు, లాజములు తీసుకొని ముందు స్త్రీలు, వెనుక పురుషులును మృతగృహమునకు వచ్చి "దూర్వావత్కుల వృద్ధిః తే లాజా ఇవ వికాసతా" అని పలుకుచు ఆ గృహమందు చల్లవలెను. పదియవరోజున మినుములతో పిండప్రదానము చేయవలెను. బంధువులందఱు క్షౌరము చేయించుకొన్న తరువాత కర్త మరల క్షౌరము చేయించుకొనవలెను. ప్రతిదినమున ఒక బ్రాహ్మణునికి మృష్టాన్నముతో మొదటిదినమునుండి పదియవ దినమువఱకు భోజనము పెట్టవలెను. ప్రేతవిముక్తికై 'అతసీపుష్ప సంకాశం' అను శ్లోకములతో శ్రీహరిని ప్రార్థించవలెను. ప్రతిరోజు ఈ విధముగ శ్రాద్ధము కావించి శ్రీహరిని స్తుతించి ఇంటికి వెళ్ళి గోమాతకు గ్రాసమునిచ్చి భుజింపవలెను.

వృషోత్సర్గవిధానము ద్వాదశాధ్యాయమునందు వర్ణింపబడినది. అది ఎట్లనిన - పదునొకండవదినమున జలాశయమునకు వెళ్ళి నాటి ఔర్ధ్వదేహిక క్రియలను చేసి, వేదపారంగతులగు బ్రాహ్మణులను నిమంత్రణము చేసి, నమస్కరించి ప్రేతవిముక్తికై ప్రార్థించవలెను.

ఆచార్యుడును స్నానసంధ్యాదుల నాచరించి మొదటి రోజునుండి పదియవ రోజు వఱకు శ్రాద్ధమును ప్రేతానామగోత్రములతో అమంత్రక ముగా గావించి, ఏకాదశ దినమున పిండప్రదానము సమంత్రకముగ చేయవలెను.

శ్రీమహావిష్ణు ప్రతికృతిని బంగారముతోను, బ్రహ్మప్రతిమను వెండితోను, ఈశ్వర ప్రతిమను రాగితోను, యముని ప్రతిమను లోహముతోను చేయించి పశ్చిమ దిగ్భాగమున గంగాజలముతో నింపిన విష్ణు కలశముపై పచ్చని గుడ్డ కట్టిన విష్ణుప్రతిమను, తూర్పుదిక్కునందు పాలతోనింపిన బ్రహ్మకలశముపై తెల్లగుడ్డ కట్టిన బ్రహ్మప్రతిమను, ఉత్తరమందు తేనె, నేయి వీటితో నింపిన రుద్ర కలశముపై ఎఱ్ఱని వస్త్రమును చుట్టిన రుద్ర ప్రతిమను, దక్షిణ భాగమునందు ఇంద్రోదకముతో నింపిన యమఘటముపై నల్లని వస్త్రముతో చుట్టిన యమ ప్రతిమను యుంచవలెను.

వీటి మధ్యభాగమందు మండలము చేసి కుశమయమగు ద్విజుని వుంచి, దక్షిణాభిముఖుడై వేదమంత్రములతో అపసవ్యముగా బ్రహ్మ విష్ణు, రుద్ర యములకు తర్పణములు, హోమములుచేసి శ్రాద్ధమును గావింపవలెను. పిదప గోదానము చేసి, ప్రేతోపభుక్తమును, వారికిష్టమైన వస్త్ర వాహన భూషణములు, ఘృత పూర్ణ కాంస్య పాత్రమును, తిలాద్యష్టమహాదానములు,శయ్యాదానమును చేయవలెను.

## శయ్యాదాన విధానము:

బ్రాహ్మణుని పాదములు కడిగి వస్త్రాదులనిచ్చి పూజించి మృష్టాన్నమునొసగి, శయ్యపై స్వర్ణ ప్రతిమనుంచి పూజించి, మృతుని ప్రతిమతో కూడిన, సర్వోపకరణములతో కూడిన మృతుని శయ్యను ఆచార్యునకు దానముచేసి ప్రదక్షిణ నమస్కారములు గావించి

పంపవలెను. ఈ శయ్యా దానము వలనను, వృషోత్సర్గము వలనను మృతులు ఉత్తమ గతిని పొందుదురు.

వృషోత్సర్గ విధానము:

అంగహీనత లేనిదియు, రోగములేనిదియు, బాల్యము కానిదగు వృషభమును తీసుకురావలెను. ఎఱ్ఱని కండ్లు, కొమ్ములు, డెక్కలు, కంఠముగలదియు, తెల్లని కడుపు, నల్లని పృష్ఠము కలది పింగళవర్ణ వృషభము బ్రాహ్మణునికి విధింపబడినది. ఎఱ్ఱని రంగు గలది క్షత్రియునికి, పీతవర్ణ వృషభము వైశ్యునకు, నల్లని రంగు గలది శూద్రునకు ప్రశస్తమగును.

మొదట గ్రహమంటపము నేర్పరచి, అయామంత్రములతో గ్రహముల నావాహనము చేసి యథాశాస్త్రముగ హోమముచేసి వృషభ మును పూజింపవలెను. పిదప వృషభమును, ఆవును తీసుకొని వచ్చి కంకణమును గట్టి వివాహ విధానము జరిపి రుద్రకలశోదకముతో వాటిని స్నానము చేయించి గంధ పుష్పాదులను పెట్టి ప్రదక్షిణము చేయవలెను. వృషభమునకు కుడిభాగమున త్రిశూలమును, ఎడమ భాగమున చక్రమును వేసి అంజలిగావించి 'నీవు ధర్మదేవతవు, బ్రహ్మ నిన్ను వృషభ రూపముగ సృష్టించెను. నిన్ను ప్రస్తుతము వదలు చున్నాను. భవసాగరమునుండి నన్ను తరింపుము' అని ప్రార్థించి నమస్కరించి వాటిని వదలవలెను. దీని వలన వారికి క్రమముగ మోక్షాంత సుఖములు వచ్చును. అపుత్రకుడు స్వయముగా వృషోత్సర్గము చేసుకొనవచ్చును. ఇందులకై కార్తికాది శుభమాసము లందో, ఉత్తరాయణమునందో ద్వాదశ్యాది తిథులందును, సూర్య చంద్రాద్యుపరాగములందో మకర, కర్కటక అయనములందో శుభ ముహూర్తమందు శుభదేశమున సిద్ధము గావించుకొని, విద్వాంసుడగు బ్రాహ్మణుని వరించి జపహోమాదులు చేయించి, దేహశోధనము

గావించుకొని పైన చెప్పినట్లు వృషోత్సర్గము చేసి హోమములను చేయించవలెను. తదుపరి సాలగ్రామమును స్థాపించి, వైష్ణవ శ్రాద్ధ మాచరించి ఆత్మశ్రాద్ధము చేయించుకొని బ్రాహ్మణునకు దానము చేయవలెను. ఈ వృషోత్సర్గము వలన మహాపాతకములు సైతము పరిహృతమగును. పుత్రవతియగుస్త్రీ తన భర్తకు పూర్వమే మరణించిన వృషోత్సర్గము చేయరాదు. పాలిచ్చుగోవును దానము చేయవలెను.

వృషోత్సర్గానంతరము సాపిండ్యమునకు పూర్వము షోడశ శ్రాద్ధముల నాచరింప వలెను. అవి 12 మాసికములు, ఒక త్రైపక్షికము, ఊనమాసిక, ఊనషాణ్మాసికము, ఊన ఆబ్దికములగును. పదునొకండవ ధినమున అన్నమువంది ఈ యుత్తమ షోడశ శ్రాద్ధముల నాచరింప వలెను. ఇదేవిధముగ మునుపు మరో రెండు షోడశ శ్రాద్ధములాచరించ వలెను. అవి మలిన షోడశ శ్రాద్ధములు (16) మృతస్థలమందు, ద్వారమందు, మధ్యమార్గమందు, చితియందు, శవహస్తమందు, అస్థిసంచయన మందు, దశాహ్నికములయందు చేయబడునవి యగును. అట్లే-

మధ్యమ షోడశ శ్రాద్ధములు

1. విష్ణువునకు
2. శివునకు
3. యమపరివారమునకు
4. సోమరాజునకు
5. హవ్యవాహునకు
6. కవ్యవాహునకు
7. యమునకు
8. రుద్రునకు
9. పురుషునకు
10. ప్రేతమునకు
11. విష్ణువునకు
12. బ్రహ్మకు
13. విష్ణువునకు
14. శివునకు
15. యమునకు
16. పురుషునకు

చేయు పిండప్రదానములగును.

ఈ మూడు విధములగు మలిన-మధ్యమ-ఉత్తమ షోడశ శ్రాద్ధములగు 48 శ్రాద్ధములెవరికి చేయబడునో వారికి ప్రేతత్వము తొలగి పితృదైవత్వము వచ్చును. ప్రమాదమువలన గాని, స్వేచ్ఛగా గాని, పాముకఱచి చనిపోయిన వారికి ఈ క్రియలతో పాటు శుక్ల-కృష్ణ పంచమి దినములందు భూమిపై పాము పడగను తీర్చి, తెల్లని పూవులతో ధూపదీపాదులతో పూజించి, బియ్యమును, నువ్వులను వేసి పచ్చిపిండిని, పాలను నివేదన చేయవలెను. బంగారముతో చేయబడిన సర్పమును, ఒక ఆవును బ్రాహ్మణునికి ఇవ్వవలెను. తరువాత నాగరాజునకు నమస్కరించి, మృతి పొందిన వారికి నారాయణ బలి నీయవలెను.

త్రయోదశాధ్యాయమందు సపిండీకరణవిధి, ఆశౌచనిర్ణయము శయ్యాదానము, పద దానము, వాటి ఫలములు చెప్పబడియున్నవి. మృతుని పిండము వసురుద్ర ఆదిత్యరూపులగు పితామహాదుల పిండములతో కలుపుటకే సపిండీకరణమని పేరు. సపిండీ కరణము చేయుటవలన పుత్రునకు శుద్ధియు, మృతునికి పుత్రునిచే చేయబడిన దానములును చేరును.

**ఆశౌచ నిర్ణయము:**

బ్రాహ్మణులకు పది రోజులు, క్షత్రియులకు పండ్రెండు రోజులు, వైశ్యులకు పదునైదు రోజులు, శూద్రులకు ముప్పది రోజులు ఆశౌచముండును. కలియుగమున సర్వులకు పదిరోజులేయని పక్షాంతరము.

| | | |
|---|---|---|
| సపిండులకు | ఆశౌచము | పదిరోజులు. |
| సమానోదకులకు | " | మూడురోజులు. |
| సగోత్రులకు | " | స్నానముతో పూర్తియగును. |

చతుర్థ పురుష మరణమున ఆశౌచము పదిరోజులు.
పంచమ పురుష " " ఆరురోజులు.
షష్ఠ పురుష " " నాల్గురోజులు.
సప్తమ పురుష " " మూడురోజులు.
అష్టమ పురుష " " ఒక్కరోజు.
నవమ పురుష " " రెండు యామములు.
దశమ పురుష " " స్నానముతో శుద్ధియగును.

పురిటికి ఇదియే నియమ మగును.

దేశాంతరమందున్నవారు పదిరోజులలోపు తెలుసుకొనిన దశరాత్రములలో మిగిలియున్న రోజులాశౌచమును వహింపవలెను. పదిరోజుల తర్వాత వినినచో మూడురోజు లాశౌచము పట్టవలెను. సంవత్సరము దాటిన తరువాత వినినచో స్నానముతో శుద్ధియగును.

మొదట ఆశౌచము పట్టునప్పుడు ఆఱవరోజున మఱియొక ఆశౌచము వచ్చినచో మొదటి ఆశౌచముతోనే శుద్ధియగును. ఆఱవ దినమునకు పిమ్మట రెండవ ఆశౌచము తెలిసినచో ద్వితీయాశౌచముతోనే శుద్ధియగును.

పుట్టినది మొదలు ఆరుమాసములలోగా బాలుడు మృతించిన జ్ఞాతులకు స్నానముతో శుద్ధి. ఏడవ మాసము మొదలు మూడేండ్లలోగా బాలుడు మృతించిన జ్ఞాతులకు ఒకరాత్రి పగలు ఆశౌచము. మూడేండ్లు మొదలు ఎనిమిదేండ్లలోగా బాలుడు మృతించిన జ్ఞాతులకు మూడు రాత్రులు ఆశౌచము. ఎనిమిది సంవత్సరములు నిండిన తర్వాత ఉపనయనమైనను కాకున్నను పూర్ణాశౌచము. పుట్టినది మొదలు మూడు సంవత్సరములలోగా బాలిక మరణించిన జ్ఞాతులకు స్నానముతో శుద్ధి. మూడు సంవత్సరములకుపైన వివాహవాగ్దానము లోపల బాలిక మరణించిన జ్ఞాతులకు ఒకదినమాశౌచము. వాక్ప్రదాన

మైన పిమ్మట భర్త్రపత్ర వంశమువారికి, పితృవంశమువారికి మూడు రోజులాశౌచము. వివాహమైన తరువాత భర్త్రవంశమువారికే ఆశౌచ ముండును.

ఆరుమాసముల లోపున గర్భస్రావమైనచో ఎన్నిమాసముల శిశువో అన్ని దినములు తల్లికి జననాశౌచము. ఆఱుమాసముల తరువాత గర్భస్రావమైనచో తల్లికి పూర్ణాశౌచము. జ్ఞాతులకు స్నానముతోనే శుద్ధి.

ఆశౌచకాలమందు ఆశీర్వాదము, దేవపూజ, ప్రత్యుత్థానము, అభినందనము, మంచమందు పరుండుట, ఇతరుల స్పృశించుట, జప, దాన, హోమ, స్వాధ్యాయ, పితృతర్పణ, బ్రాహ్మణభోజన, వ్రతములు, కామ్య కర్మలు చేయరాదు. నిత్యనైమిత్తిక కర్మలుసైతము లోపించును. బ్రహ్మచారికి, మంత్రపూతునికి, ఆహితాగ్నికి, బ్రహ్మనిష్ఠుడగు యతికి, రాజునకు ఆశౌచముండదు. అజ్ఞానమువలన సూతకాన్నము భుజించిన వానికి దోషము రాదు. ఆశౌచకాలమందు ఇతరులకు అన్నము పెట్టరాదు.

ఉపనయనము, యజ్ఞాదులు, వ్రతోద్యాపనములు, వివాహాది శుభకర్మలు తండ్రి మరణించినపుడు చేయరాదు. సపిండీకరణము చేయువరకు సన్యాసులకు భిక్షనీయరాదు. వైశ్వదేవము, నిత్యకర్మలు చేయరాదు. కావున ద్వాదశాహమందు సపిండీకరణము చేయవలెను.

## సపిండీకరణ విధానము:

స్నానము చేసి, స్థలశుద్ధిగావించి, విశ్వేదేవులను పాద్య, అర్ఘ్య, ఆచమనములతో పూజించి భూమియందు వికిరమునొసగి ఆచమనము చేయవలెను. తరువాత వసు, రుద్ర, ఆదిత్య స్వరూపులగు పితృ, పితామహ, ప్రపితామహులకును, మృతునకును పిండప్రదానము చేయవలెను. చందన, తుళసీదళ, ధూప, దీప, వస్త్ర, దక్షిణలచేత

వానిని పూజించి పిమ్మట ప్రేత పిండమును స్వర్ణశలాకచేత మూడుగా విభజించి పితామహాది పిండములతో వేరు వేరుగా కలుపవలెను. తల్లి మరణించిన పితామహితోను, తండ్రి మరణించిన పితామహునితోను సపిండీకరణము చేయవలెను. పితామహుడు జీవించియుండగా తండ్రి మరణించిన యెడల ప్రపితామహుల ముప్వురకు పిండప్రదానము గావించి వారి పిండములతో తండ్రి పిండమును కలుపవలెను. ఇట్లే పితామహి జీవించియుండ తల్లి మరణించిన ప్రపితామహి మొదలగు ముగ్గురకు పిండముంచి, వారి పిండములతో తల్లి పిండమును కలుపవలెను

అపుత్ర యగు భార్య మరణించిన భర్త తన తల్లి మొదలగువారి పిండములతో సపిండీకరణము చేయవలెను.

ఒకే సమయమున భార్యాభర్తలు మరణించిన వారల సపిండీ కరణము భర్త పితృ, పితామహ, ప్రపితామహులతో చేయవలయును గాన శ్వశురాదుల మధ్య తృణముంచి సపిండీకరణ చేయవలెను.

సపిండీకరణానంతరము వేదమంత్రములతో గూడిన స్వాధికార మును పలుకవలెను. తరువాత అతిథికి భోజనము పెట్టి, 16 గ్రాసముల భిక్ష ఇవ్వవలెను. బ్రాహ్మణ చరణములను గంధాక్షతలచే పూజించి దానము లివ్వవలెను. సంవత్సరమునకు సరిపడు అన్నము, నెయ్యి, సువర్ణము, వెండి, ఆవు, అశ్వ, గజ, రథాదులు, భూమియు దానమివ్వ వచ్చును. పుణ్యాహవాచనము చేసి నవగ్రహ, సరస్వతీ, వినాయకుల పూజించవలెను. ఆచార్యుడు యజమాని చేతికి రక్షాబంధనము కట్టి మంత్రపూతమగు అక్షతలివ్వవలెను. తర్వాత 12 బ్రాహ్మణులకు మృష్టాన్నమిడి, దక్షిణలతో 12 ఉదకుంభ దానము లివ్వవలెను. యజమానుడా పిదప కర్మవస్త్రముల త్యజించి శుక్లాంబరుడై శయ్యాదానము చేయవలెను.



శ్రీహరి గరుడునకు ఉపదేశించిన యమపుర ప్రమాణాదులు చతుర్దశాధ్యాయమున విస్తారముగ చెప్పబడినవి. యమపురము దక్షిణ నైరృతీ దిక్కుల మధ్యమందున్నది. వేయియోజన ప్రమాణముతో దేవాసురుల కభేద్యమై చతురస్రముగ, నాల్గు ద్వారములతో ఉత్తర ప్రాకారములతో శోభిల్లుచుండును.

అందు అతి సుందరమైనదియు ఇరువదియైదు యోజనముల వెడల్పు అంతే పొడుగుతో లోహ ప్రాకారములు గల్గి పతాకాదులతో గూడిన ఏడంతస్తుల మేడలతో, అనేక ఉద్యానవనంబులతో, గంధర్వ, అప్సర స్త్రీలతో సంకులమైన చిత్రగుప్తుని మందిరమున్నది. అందలి సభయందు చిత్రగుప్తుడు గొప్ప సింహాసనంబున ఆసీనుడై మనుష్యుల ఆయుర్దాయములు యధార్థముగా లెక్కించును. పుణ్యపాపములను స్వల్పముకూడ తేడా లేకుండ లెక్క కట్టుచుండును. ఈ చిత్రగుప్తా లయమునకు తూర్పుభాగమునందు జ్వర గృహంబును, దక్షిణమందు శూలరోగ లూతావిస్ఫోట మందిరమును, పశ్చిమమందు యమపాశ మందిరమును, ఉత్తరమందు రాజ యక్ష్మ పాండురోగుల గృహములును, ఈశాన్యమందు శిరోరోగ గృహమును, ఆగ్నేయమందు మూర్ఛా గృహమును, నైరృతి యందు అతిసార గృహమును మరియు వాయవ్యమునందు శీతదాహ గృహమును ఉన్నవి.

ఈ విధమైన వ్యాధులచే పరివారితుడై చిత్రగుప్తుడు మానవుల శుభా శుభముల వ్రాయుచుండును.

ఈ చిత్రగుప్తాలయమున కిరువది యోజనములదూరమందు యమపుర మధ్యమందు ధర్మరాజమందిరముండును. రెండువందల యోజనముల పొడవు, వెడల్పుగల్గి, పదియోజనముల పొడవుతో, సహస్ర స్తంభమండితమై వైఢూర్య రత్న శోభితంబులును, నానా ప్రాసాద సంకులంబులును విచిత్ర విధములుగ అలంకరింపబడినదై విశ్వకర్మచే

యోగ ప్రభావ నిర్మితమై చూచువారలకు ఆశ్చర్యము గల్గించు చుండును. ఆ మందిరమందు, వంద యోజనముల పొడవు గలదియై సూర్యప్రకాశమైనదై, కామరూపమైనది, అతి శీతలము, అత్యుష్ణము గానిది, మనోహ్లాదకారియగు దివ్య సభ గలదు. ఆ సభ దివ్యమగు మానుష కామములతోను రసవత్తరమగు భక్ష్యభోజ్యాదులతోను పుణ్యవివదభరితమై సర్వర్తు ఫలకుసుమములచే విరాజిల్లుచుండును.

ఉగ్రతపము చేసినవారు, సత్యవాదులు, సన్యాసులు, సిద్ధులు, దివ్యాంబరములు ధరించి యమసభ యందుందురు. ఛత్ర శోభిత మస్తకుడై అనేకాభరణ విభూషితుడై నీల మేఘ సమప్రభుడగు ధర్మరాజు రత్నసింహాసనమున ఆసీనుడై యుండును. చిత్రగుప్తుడు, అగ్నిష్వాత్తులగు సోమములు, అర్యమాది పితృదేవతలు, అత్రి, వసిష్ఠ, పులహ, దక్ష, అంగీరస, భృగు, అగస్త్య, నారదాది మహర్షులు ధర్మసభయందు ఆసీనులై ధర్మరాజు నుపాసించుచుందురు. దిలీప, మాంధాత, సగర, భగీరథ, అంబరీష, ముచుకుంద నిమి ప్రభృతులనేక అశ్వమేధములు చేసి ధర్మసభాసదులై ధర్మరాజును సేవించిరి. పక్షపాతము, అనృతము, మాత్సర్యము కానబడవు. సభ్యు లందఱు అనేక శాస్త్రవిదులు, ధర్మపరాయణులు. ఈధర్మ సభకు దక్షిణ మార్గముగ వెళ్లువారు చూడలేరు.

ధర్మపురమును ప్రవేశించుటకు నాల్గు ద్వారములు గలవు. సర్వ భోగములు కల్పవృక్షపునీడలు విద్రుమారామంబులు, అమృత ద్రవముతో కూడిన తూర్పు ద్వారము ద్వారా బ్రహ్మర్షులు, రాజర్షులు, అప్సరసలు, విద్యాధరులు, శివభక్తులు, మాతృ పితృ గురుభక్తులు, విద్యాదాతలు, పురాణశ్రోతలు యమపురము ప్రవేశించి ధర్మసభకు పోగలరు.

అనేక మహారథములతో కూడినదియు, హరిచందన భూషితమగు ఉత్తరమార్గము చక్రవాక శోభితమై, అమృత రసోదక సంపూర్ణమగు సరోవరముతో కూడియుండును. వేదోక్త కర్మలు చేసిన వారు, దుర్గా భాస్కర భక్తులు, ధర్మయుద్ధమున మృతిచెందినవారు, అనశన వ్రతమృతులు, పుణ్యతీర్థములందు మరణించినవారు ఈ ఉత్తర మార్గముగా యమపురమును ప్రవేశించి ధర్మసభకు చేరుకొందురు.

పశ్చిమద్వారము రత్నమందిర మండితమై ఐరావత కులోత్పన్న మత్త మాతంగములతోకూడి ప్రకాశించుచుండును. ఆత్మపరులు, శాస్త్రచింతనపరులు, విష్ణుభక్తులు, గాయత్రీ జపతత్పరులు, వాన ప్రస్థులు సత్సంగపరాయణులు, మొదలగు పుణ్యమూర్తులు అప్సరో గణవేష్టితులై అమృతపానము చేయుచు ఈ ద్వారమున యమ పురమును ప్రవేశించి ధర్మసభకు వెళ్లుదురు. ఇట్టివారిని యమ ధర్మరాజు స్వాగతవచనము పల్కి, అర్ఘ్యపాద్యాదులతో పూజించి, తమవారికి వీరి గొప్పదనమును తెల్పి, యమమండలమును ఛేదించుకొని బ్రహ్మలోకమునకు పోవువారికి నమస్కరింపుమని తెల్పును. కొందఱు బ్రహ్మలోకమునకు పోయియు, మఱికొందఱు ధర్మసభయందే కల్పాంతమువరకు ఉండియు పరమపదమును పొందుదురు.

పంచదశాధ్యాయమందు శుక్లశోణిత సంగమువలన జీవుడు మాతృగర్భమందు పాంచభౌతికమైన స్థూలశరీరమును పొందురీతి వివరింపబడినది. ఈ స్థూలశరీరమందున్న 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 5 ప్రాణములు మనోబుద్ధి చిత్తాహంకారములతో అంగశరీరము విరాజిల్లును. స్థూలశరీరమందు ప్రధాననాడులు పది, ఉపవాయువులు ఐదు, మూడుకోట్ల ఏబది లక్షల రోమములు, ఏడులక్షల కేశములు, అనేక నాడులు ఉండును. అంతియే గాక పారమార్థికముగ స్థూలశరీరమందే 14 భువనములు సూక్ష్మరూపమున యుండును.

6 చక్రములు, వానియందుండు దళములు, అందు ధ్యానింపబడు దైవములు వివరింపబడినవి. ఒక అహోరాత్రమున 21,600 శ్వాసములను హంస మంత్రరూపముగ అనుష్ఠించు చుండును. వాటిని విభజించి గణనాథాది దేవతలకు నివేదించు క్రమము, అంతర్యాగ, బహిర్యాగ క్రమములు చెప్పబడినవి. వీటన్నిటికిని సులభమైన ఉపాయము శ్రీహరి భక్తియే. తపస్సు, యోగము మున్నగు అనేక సాధనములున్నను సంసార నిర్మగ్నులకు హరిభక్తియే చాలగొప్పది.

షోడశాధ్యాయమున మోక్షోపాయము చాల విస్తృతముగా చెప్పబడినది. ఒకజీవుడు పలుమారులు నాల్గువిధములగు శరీరములను పొంది సుకృతవిశేషము వలన మానవుడై జ్ఞానవంతుడై మోక్షమును బడయును. ఎనుబదినాల్గు లక్షల జీవరాశులయందు మానవ జన్మయందే తత్వజ్ఞానము లభించును. అనేక జన్మలయందు చేసుకొన్న పుణ్యకర్మ ఫలముచే మానవజన్మ గల్గును. మోక్షమునకు సోపానభూతమై, అతి దుర్లభమైన మానవజన్మను పొంది, తనకు తరణోపాయము చూచుకొననివాడు బుద్ధిహీనుడే యగును. దేహమువలననే మోక్షోపాయములను సాధింపవలెనుగాన దానిని శ్రద్ధతో రక్షింపవలెను. ధర్మము నాచరించి జ్ఞానము, జ్ఞానముతో ధ్యానమును పొంది, ధ్యానయోగముతో శీఘ్రముగా స్వస్వరూపమగు మోక్షమును మానవుడు పొందగలడు.

పెద్దపులివలె ముసలితనము మనముందు పీఠముంచుకొని యుండును. పగిలిన కుండలోని నీటివలె ఆయుర్దాయము గడచిపోవు చుండును. రోగములు శత్రువులవలె ఎల్లప్పుడు వేచియుండును. కావున శరీరమును సర్వప్రయత్నములతో రక్షింపవలెను. శరీరముండు వరకు తత్వజ్ఞానమునకై ప్రయత్నించుచు దానిని బడయవలెను. ఇల్లు కాలిన తరువాత నూయి త్రవ్వువాడు మూఢుడే. ఆయుస్సు మెఱుపు

వంటిది. సంపదలు స్వప్న తుల్యములు. యౌవ్వనము పూపువంటిది. ఈ వంద సంవత్సరముల ఆయుస్సు నందును నిద్ర, అలసత్వము, బాల్యము, రోగములు, ముసలితనము, దుఃఖములు - వీటివలన గతించిన కాలముపోగా మిగతకాలము అతిస్వల్పమే. ఆయుర్దాయ మును స్థిరముగ నిల్పుట వాయువు నరికట్టినట్లు, ఆకాశమును ఖండించునట్లు, తరంగముల ప్రోగుచేయునట్లు అసంభవమే యగును.

వీడు నాపుత్రుడు, ఇది నాభార్య, ఇది నా ధనము, వీరు నా బంధువులు అను మానవ మేకను కాలమను తోడేలు వశపరచుకొనును. ఒక మానవుడు ఎన్ని ప్రియమైన వస్తువులతో సంబంధమును పెంచు కొనునో అన్నివేల దుఃఖబీజముల చల్లుచుండును. కావున తల వెంట్రుకలు కాలుచున్నవాడు నీటికై పరుగిడునట్లు మోక్షోపాయమునకై త్వరపడవలెను. సంగము సర్వదా పరిత్యజింపవలెను. అదివీలుకాకున్న సత్సంగమే చేయవలెను. సద్గురువును సేవించి భగవత్తత్వజ్ఞానమును, యోగమును బడసి, అహంకార మమకారముల పరిత్యజించి, గురు కారుణ్యముచేత తత్వజ్ఞానమును బడయవలెను. రాగద్వేషాది మల రహితమైనదియు. సత్యమను అమృతపూరితమైన మానసహ్రద తీర్థ మందు స్నానముచేయు ధీరుడు మోక్షమును పొందగలడు. పరిపూర్ణ వైరాగ్యమును బడసి, తనయందే మనస్సునుంచుకొని భజించుచు, పూర్ణదృష్టి, ప్రసన్నాత్మత కల్గు జీవుడు మోక్షమును పొందును. కావున మానవుడు శ్రీహరిని భజించి, శుద్ధచిత్తుడై సద్గురువునుపొంది, శాస్త్రములను శ్రవణముచేసి, మనన నిధి ధ్యాస నములను ఆచరించి తత్వజ్ఞానమును పొంది పునరావృత్తి రహితుడై తన్నుద్ధరించు కొనవలెను. ఈ పురాణమును భక్తితో విన్నవారు సైతము శ్రీహరియొక్క అనుగ్రహపాత్రులై, క్రమముగా శేయస్సును పొందగలరు.

ఈ గరుడపురాణమును, ముఖ్యముగా ఔర్ధ్వదైహిక విధిని పదిరోజులలో విన్నవారికి సకల పాప విముక్తి గల్గును. పితృదేవతలకు బ్రహ్మలోకము ప్రాప్తించును. వారి అనుగ్రహమువలన పుత్ర పౌత్ర సంతతియు, ఐశ్వర్యమును, ధర్మచింతనయు, భగవద్భక్తియు, జ్ఞానమును లభించును. ఈ గరుడపురాణ శ్రవణము ధర్మార్థ కామ మోక్షములగు నాల్గు పురుషార్థములకు హేతువగును.

ఇట్టి గొప్ప పురాణమును, తదితర వేదవాఙ్మయమును ఆంధ్రీకరించి తెలుగువారికి సులభముగ అందించి, తెలుగుతల్లికి, మానవ సముదాయమునకు "వావిళ్ల" సంస్థవారు మహదుపకారము చేయుచున్నారు. వారి కృషి సర్వతోముఖముగ ఫలించవలెననియు, ఇందుకు సహాయపడిన అందఱికి భగవదనుగ్రహము గల్గి సకల శ్రేయస్సులతో విరాజిల్లవలెనని భగవంతుని ప్రార్థించు -

మద్రాసు,
18-06-1998

విద్వజ్జన విధేయుడు
డా॥ గోడా వేంకటేశ్వర శాస్త్రి
సాహిత్య - మీమాంసా - న్యాయ- వేదాంత శిరోమణి
విద్యావారిధి, అద్వైతసిద్ధి రత్నాకర.

శ్రీరస్తు.

# గరుడపురాణము

## ప్రథమాధ్యాయము.

---

మంగళాచరణము.

మూ. ధర్మదృఢబద్ధమూలో వేదస్కంధః పురాణశాఖాఢ్యః,
క్రతుకుసుమో మోక్షఫలో మధుసూదనపాదపో జయతి. ౧

శౌనకాదులు సూతుని ఐహికాముష్మిక దుఃఖములను చెప్పుమనుట.—

---

నౌనిధి. రామసుధీవిరచితా.

అథ టీకాకారః సమస్తగ్రంథ ముద్ఘాటయన్ హరిం స్తౌతి.

శ్లో. స్మరణాద్దుర్గతిహర్తా పూజనయజ్ఞేన సద్గతేర్దాతా,
యః పరయా నిజభక్త్యా దదాతి ముక్తిం స మాం హరిః పాతు.
లక్ష్మీలతాసమాశ్లిష్టం కౌస్తుభస్తబకోజ్జ్వలం,
స్వర్గాపవర్గఫలదం హరిం కల్పద్రుమం నమః.
సారాత్సారం సముద్ధృత్య ప్రాచీనకృతసంగ్రహాత్,
తత్ర చేయం మయా టీకా యథామతి వితన్యతే.

అథ సారోద్ధారకర్తా శిష్టసంప్రదాయానుసారేణ మంగళ మాచరతి. ధర్మదృఢేతి. అత్ర వృక్షరూపేణ హరిం నిరూపయతి-మధుసూదనపాదపో జయతీతి. యథా పాదపో వృక్షః పద్భిః అధఃప్రసృతశాఖాభిః జలం పిబతీతి పాదపః తథైవాయం మధుసూదనోఽపిపాదప ఏవ పద్భ్యాం చరణాభ్యాం పాతి సంసారాద్రక్షతీతి పాదపః 'సంసారకూపపతితోత్తరణావలంబం' 'భవాద్రిపోతం వందే మహాపురుష తే చరణారవిందం' ఇతి భాగవతవచనాత్. సోఽయం కీదృశః? ధర్మదృఢబద్ధమూలః-ధర్మోఽత్ర అమృతరూపో భగవద్ధర్మః 'అద్వేష్టా సర్వభూతానా' మిత్యారభ్య 'యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే, శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః' ఇత్యంతేన గీతాయాం ద్వాదశాధ్యాయాంతే అష్టభిశ్శ్లోకైః

నైమిశేఽనిమిషక్షేత్రే ఋషయశ్శౌనకాదయః,
సత్రం స్వర్గాయ లోకాయ సహస్రసమమాసత. ౨

భగవతో క్తః స ఏవ దృఢబద్ధం మూలం యస్యేతి. అస్మద్దేశభాషాయాం "జడబంధ" ఇత్యుచ్యతే. అత్రాయమభిప్రాయః. వృక్షో యథా దృఢమూలో హి స్వస్థానే సుస్థిరో భవతి ప్రచురతరపవనాద్యుపద్రవైరపి తతస్స్వస్థానాన్నోన్మూలితత్వ ముప యాతి తథైవాయమపి భగవద్ధర్మో హృదయే సునిశ్చలో భవతి. మూర్ఛనాది ప్రబలతరదుఃఖాంతరాయైరపి భక్తహృదయాన్నాపయాతీతి. తదుక్తం శ్రీభాగవతే —"విసృజతి హృదయం న యస్య సాక్షాద్ధరిరవశాభిహితోఽప్యఘౌఘనాశః, ప్రణయరశనయా ధృతాంఘ్రిపద్మస్స భవతి భాగవతప్రధాన ఉక్తః" ఇతి. పునః కీదృశః? వేదస్కంధః పురాణశాఖాఢ్యః వేదాః స్కంధాః యస్యేతి. పురాణాన్యేవ శాఖాస్తాభిరాఢ్యః యుక్తశ్చేతి. అత్రాప్యయం భావః. వృక్షో యథా అతివిస్తృత స్కంధః శాఖాభిర్దూరతరోఽప్యుప సమీప ఏవ దృశ్యతే, తథైవాయమపి వేద పురాణైః ప్రకృతిపురుషయోః పరోఽప్యుపలభ్యతే, యథా చ వృక్షః స్కంధ శాఖాభిరేవోపసమాగతానాం బహుతరఫలాని ప్రదదాతి, తథైవాయమపి వేద పురాణైః తచ్ఛోత్రిస్మృతక్త్యానాం ధర్మార్థకామమోక్షఫలాని ప్రదదాతి. యథా చ వృక్షస్య శాఖాః స్కంధేభ్య ఏవ నిస్సరంతి.—అథ చ తత్సంలగ్నా ఏవ భవంతి' తథా పురాణాన్యపి. వేదోద్భూతాని తన్మిళితాన్యేవ చ సంతి నతు తేభ్యః పృథక్. 'ఇతిహాసపురాణాని పంచమో వేద ఉచ్యతే' ఇతి వచనాదితి. పునః కీదృశః? క్రతుకుసుమః మోక్షఫలః—క్రతవః యజ్ఞా ఏవ కుసుమాని యస్య మోక్షః ఫలం యస్యేతి. అత్రాప్యయమాశయః—వృక్షాద్యథా కుసుమోద్గమానంతరమేవ ఫలప్రాప్తిర్భవతి, తథా ద్రవ్యయజ్ఞాద్యనుష్ఠానైః శుద్ధాంతఃకరణస్యైవ తతో మోక్ష ఫలలాభో భవతీతి. కించానేన మోక్షఫలదాతాపి మధుసూదనపాదప ఏవ నాన్య ఇత్యపి సూచితం. తదుక్తం దేవైర్ముచుకుందం ప్రతి—'వరం వృణీష్వ భద్రన్తే ఋతే కైవల్యమద్య నః, ఏక ఏవేశ్వరస్తస్య భగవాన్విష్ణురవ్యయః' ఇతి ఏవంభూతో మధుసూదన పాదపో జయతి సర్వోత్కర్షేణ వర్తతే. అత్రాపి సర్వేభ్యో బ్రహ్మా దిభ్యోఽప్యధికతయా వర్తత ఇత్యర్థః. వృక్షో యథా వనస్య సర్వస్య మహాకేతురివ స్థిత ఇతి నిరూపణాత్సర్వవృక్షేభ్యోఽధికో భవతి తద్వదితి. ఇద మార్యాచ్ఛందః. ౧

ఏవం మంగళం కృత్వా ఇదానీం కథాప్రస్తావాయ సూతశౌనకసంవాద మవ తారయతి —నైమిష ఇతి. అనిమిషక్షేత్రే అనిమిషః శ్రీవిష్ణుః అలుప్తదృష్టిత్వాత్, తస్య క్షేత్రే నైమిషారణ్యే ఋషయః సహస్రం సమాః సంవత్సరాః అనుష్ఠానకాలో

తవైకదా తు మునయః ప్రాతర్హుతహుతాగ్నయః,
సత్కృతం సూత మాసీనం పప్రచ్ఛు రిద మాదరాత్. ౩

ఋషయ ఊచుః.—

కథితో భవతా సమ్యగ్దేవమార్గస్సుఖప్రదః,
ఇదానీం శ్రోతుమిచ్ఛామో యమమార్గం భయప్రదమ్. ౪
తథా సంసారదుఃఖాని తత్ క్లేశక్షయసాధనమ్,
ఐహికాముష్మికాన్ క్లేశాన్ యథావ ద్వక్తుమర్హసి. ౫

శౌనకాదులగుమహర్షులు స్వర్గలోకప్రాప్తికై వేయిసంవత్సరములు చేయువలసిన సత్రయాగమును జేయుచు ఒకనాఁడు ప్రాతఃకాలము అగ్నిహోత్రములను జేసికొని తమచే సత్కృతుండైన సూతుని జూచి "ఇంతకు మున్ను నీవు సుఖప్రదమైన దేవమార్గమును జెప్పితివి. ఇప్పుడు మాకు యమమార్గము వినఁ గోరిక కలదు. అట్లే సంసారదుఃఖములును, ఆదుఃఖములు తొలఁగు నుపాయములును, ఐహికాముష్మికక్లేశములను వినఁ దలఁపు కలదు; గావున చక్కఁగా చెప్పుము" అని యడిగిరి.

సూతుఁడు శౌనకాదిమహర్షులకు ఐహికాముష్మికదుఃఖములను జెప్పుట —

---

యస్య త త్సహస్రసమం సత్రం యజ్ఞం ఆసత అకుర్వత. కిమర్థం? స్వర్గాయ లోకాయ స్వర్గే గీయత ఇతి స్వర్గాయో హరిః స ఏవ లోకః భక్తానాం నివాసస్థానం తస్మై తత్ప్రాప్తయే ఏవ న తు స్వర్గార్థం. తస్య వినాశిత్వేన తుచ్ఛఫలత్వా దిత్యర్థః. ౨. ప్రాతః కాలే హుతా ఏవ హుతాః అగ్నయో యైస్తే మునయః దానమానాదిభిస్సత్కృతం సింహాసనే చాసీనం సూతం ఇదం వక్ష్యమాణం ఆదరాత్ పప్రచ్ఛుః. ౩. ఋషిభిస్తు అస్మిన్ సమస్తగ్రంథే నిరూపితస్య సద్గతిదుర్గతిప్రదస్య ధర్మాధర్మస్య ఏక ఏవ ప్రశ్నః కృతో భవతి కథిత ఇతి వ్యాఖ్యాం. భవతా సర్వజ్ఞేన సమ్యక్ 'తేర్చిరభిసంభవతీ' తి శ్రుత్యుక్తో ర్చిరాది ర్దేవమార్గః కథితః. బహుభిః పురాణైః నిరూపితః. ఇదానీ మితి. ౪. తథా సంసారదుఃఖాదీన్యపి శ్రోతు మిచ్ఛామ ఇతి. పూర్వేణైవ సంబంధః, తత్ క్లేశక్షయసాధనం తైః సంసారదుఃఖైః యః క్లేశః తస్య క్షయసాధనం చ-సంసారదుఃఖానాం క్లేశక్షయః యేన సాధనేన భవతీత్యపి శ్రోతుమిచ్ఛామ ఇత్యర్థః. ౫. అత్రోత్తరం శ్రీభగవద్గరుడసంవా

సూత ఉవాచ:—

శృణుధ్వం భో వివక్ష్యామి యమమార్గం సుదుర్గమమ్,
సుఖదం పుణ్యశీలానాం పాపినాం దుఃఖదాయకమ్. ౬
యథా శ్రీవిష్ణునా ప్రోక్తం వైనతేయాయ పృచ్ఛతే,
తథైవ కథయిష్యామి సందేహచ్ఛేదనాయ వః. ౭

అంతట సూతుఁడు ఇట్లు చెప్పెను—"మహర్షులారా, దుర్గమ మగు యమమార్గమును జెప్పెద వినుఁడు. అది పుణ్యాత్ములకు సుఖమును కలిగించును. పాపాత్ములకు దుఃఖమును గలిగించును. పూర్వము గరుడుఁడు అడుగఁగా శ్రీ మహావిష్ణువు చెప్పిన యీ విషయమును మీ సందేహములు తీరునట్లు చెప్పెదను.

కదాచి త్సుఖమాసీనం వైకుంఠే శ్రీహరిం గురుమ్,
వినయావనతో భూత్వా పప్రచ్ఛ వినతాసుతః. ౮

గరుడ ఉవాచ:—

భక్తిమార్గో బహువిధః కథితో భవతా మమ,
తథా చ కథితా దేవ భక్తానాం గతి రుత్తమా. ౯
అధునా శ్రోతు మిచ్ఛామి యమమార్గం భయంకరమ్,
త్వద్భక్తివిముఖానాం చ తత్రైవ గమనం శ్రుతమ్. ౧౦
సుగమం భగవన్నామ జిహ్వా చ వశవర్తినీ,
తథాపి నరకం యాంతి ధిగ్ధిగస్తు నరాధమాన్. ౧౧
అతో మే భగవన్బ్రూహి పాపినాం యా గతిర్భవేత్,
యమమార్గస్య దుఃఖాని యథా తే ప్రాప్నువంతి వై. ౧౨

ఒకప్పుడు వైకుంఠమున సుఖాసీనుఁ డగు శ్రీహరినిఁ జూచి గరుడుఁడు వినయవినమితశిరస్కుఁడై "గురూ, బహువిధ మగు భక్తిమార్గమును చెప్పితివి. అట్లే దేవతాభక్తు లగువారికి లభించు ఉత్తమ

---

దేవ సూత ఉవాచ. శృణుధ్వ మితి. సుఖదం పూర్వాదిమార్గం దుఃఖదాయకం దక్షిణమార్గ మిత్యగ్రే వక్ష్యతి. ౭. భగవద్వాక్యస్యాతిప్రామాణ్యా త్సందేహో న కర్తవ్య ఇతి భావః. ౮. వినయేన అవనతో నమ్రః. ఉత్తమా గతి స్సద్యో ముక్తిః క్రమముక్తిశ్చేతి. ౯. శ్రుతం సర్వశాస్త్రేషు, స్మృతమితి పాఠే మునిభిః కథితం. ౧౦. హరిస్మరణాత్ సులభో మోక్షః అత స్తద్రహితా నను శోచన్నాహ, సుగమం పరశోకటిదం న భవతి. ౧౧. అతస్త్వ మథ జనాం పాపినాం. ౧౨. అత్రోత్తరం సమా

గతియు చెప్పితివి. ఇప్పుడు భయంకర మగు యమమార్గమును వినఁ గోరెదను. నీయెడల విముఖు లగువారు ఆ యమలోకమునకుఁ బోవుదు రని కూడ చెప్పితివి. అయ్యో! భగవన్నామము సులభ మైనది. జిహ్వా వశమున నుండునది. అయినను నరాధములు నరకమునకుఁ బోవు చున్నారు. ఎంతమాశ్చర్యము! కావున శ్రీహరీ! పాపులకు ఏగతికలుగునో, యమమార్గమున వారి కేదుఃఖములు గలుగునో ఇవి యన్నియు వివరముగ చెప్పవలయును.

శ్రీభగవానువాచ:—

వక్ష్యేఽహం శృణు పక్షీంద్ర యమమార్గం చ యేన యే,
నరకే పాపినో యాంతి శృణ్వతా మపి భీతిదమ్. ౧౩
యే హి పాపరతా స్తార్క్ష్య దయాధర్మవివర్జితాః,
దుష్టసంగాశ్చ సచ్ఛాస్త్రసత్సంగతిపరాఙ్ముఖాః. ౧౪
ఆత్మసంభావితా స్స్తబ్ధా ధనమానమదాన్వితాః,
ఆసురం భావ మాపన్నా దైవీసంపద్వివర్జితాః. ౧౫
అనేకచిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః,
ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ. ౧౬

అందులకు శ్రీహరి యిట్లు చెప్పెను.—"వైనతేయా! ఎట్టివారు యమమార్గమున నరకమునకుఁ బోయెదరో చెప్పెద వినుము. యమ

---

సువ్యాఖ్యాభ్యాం శ్రీభగవానువాచ షడ్భిరధ్యాయైః వక్ష్యేహ మిత్యాదిభిః. యేన మార్గేణయే పాపినః నరకే యాంతి తా నపి వక్ష్యామీ త్యన్వయః. ౧౩. యే హి పాపరతా ఇత్యాదిపదానాం పతంతి నరకే ఇతి తృతీయేన సంబంధః, పాపరతాః నిషిద్ధాచరణోత్సుకాః దయా ధర్మేతి-దయానామ ప్రత్యుపకారాపేక్షారహితసర్వభూత హితానుచింతనతా. ధర్మో భగవద్ధర్మః, వర్ణాశ్రమవిహితో వా తేన వివర్జితాః రహితాః. దుష్టానాం సంగో యేషాం తే తథా సచ్ఛాస్త్రాదౌ పరాఙ్ముఖా శ్చ. ౧౪. ఆత్మని స్వస్మి న్నేవ సంభావితాః ప్రతిష్ఠితా వయ మితి మన్యమానాః అత ఏవ స్తబ్ధాః అనమ్రాః పూజ్యానప న నమంతీత్యర్థ,, ధనేన యో మానః మద శ్చ తేన, ఆసురం భావం 'దంభో దర్పోఽభిమాన శ్చే' త్యాదిభి ర్భగవతోక్తః-దైవీసంపత్ 'అభయం సత్త్వసంశుద్ధి' రిత్యాద్యాచగీతాయాం ప్రోక్తా. ౧౫. ఏవం భూతా యత్ప్రాప్నువంతి తత్ శృణు అనేకేతి. అనేకేషు పరదారపరద్రవ్యహరణాత్మకేషు ప్రవృత్తం చిత్తం అనేక చిత్తం తేన విభ్రాంతాః విక్షిప్తాః, మోహమయేన జాలేన సమావృతాః మత్స్యా ఇవ

మార్గము వినువారికిఁగూడ భయంకరమైనది. ఎవరు పాపకార్యముల యందే ఆసక్తి కలవారో, ఎవరు దయాధర్మవర్జితులో, ఎవరు దుర్మార్గులతో స్నేహము చేయుదురో, ఎవరు మంచిశాస్త్రములయెడలను, మంచివారితోడి స్నేహమునెడలను పరాఙ్ముఖులయ్యెదరో, ఎవరు ఆత్మస్తుతిపరులై యుందురో, ఎవరు వినయవిహీనులును, ఐశ్వర్యమత్తులు రాక్షసభావముపొందినవారును, దైవికసంపద్విహీనులును అయి యుందురో, ఎవరు అనేకమనోవికారములు గలిగియుందురో, ఎవరు మోహజాలమున గట్టువడియెదరో, ఎవరు కామమోహపరాయణులో వారు నరకమునకు పోయెదరు.

యే నరా జ్ఞానశీలాశ్చ తే యాంతి పరమాం గతిమ్,
పాపశీలా నరా యాంతి దుఃఖేన యమయాతనామ్. ౧౭
పాపినా మైహికం దుఃఖం యథా భవతి తచ్ఛృణు,
తత స్తే మరణం ప్రాప్య యథా గచ్ఛంతి యాతనామ్. ౧౮

ఓ గరుడుఁడా! జ్ఞానవంతులగు మానవులు ఉత్తమగతిని బొందెదరు. పాపాత్ములు దుఃఖముతో యమయాతన ననుభవింతురు. పాపులు బ్రతికియున్నంతకాలమును ఐహికదుఃఖములను మరణానంతరము యమయాతనను పొందెదరు.

సుకృతం దుష్కృతం వాపి భుక్త్వా పూర్వం యథార్జితమ్,
కర్మయోగా త్తదా తస్య కశ్చి ద్వ్యాధిః ప్రజాయతే. ౧౯
ఆధివ్యాధిసమాయుక్తం జీవితాశాసముత్సుకమ్,
కాలో బలీయా నహివ దజ్ఞాతః ప్రతిపద్యతే. ౨౦

బాల్యాద్యవస్థలయందు సుకృతఫలముల ననుభవించిన పిమ్మట వార్ధకమున దుష్కృత్యములకు ఫలముగా నొకానొక వ్యాధి పుట్టును.

---

సూత్రమయేన పాశేన నియంత్రితాః ఏవం కామభోగేషు ప్రసక్తాః అశుచౌ నరకే పతంతి. ౧౬. జ్ఞానశీలా స్తు మోక్షం యాంతి పాపశీలానా మేవ యమయాతనా భవంతీ త్యాహ య ఇతి. ౧౭. ఐహికం అస్మిన్ లోకే భోగ్యం. తతః ఐహికదుఃఖభోగానంతరం. ౧౮. పాపశీలానాం యమయాతనాం వివక్షుః ప్రసంగం మునిప్రశ్నానుసారేణ తస్యైహికదుఃఖా న్యాహ. సుకృత మిత్యాది దశభిః పూర్వం బాల్యాద్యవస్థాయాం సుకృతం భుక్త్వా తదా వార్ధక్యే దుష్కృతకర్మయోగాత్. వ్యాధి స్స్యా దిత్యర్థః. ౧౯. ఆధిః మరణభయా న్మానసీవ్యథా తేనైవ బహువర్ధమానో

పిదప ఆధివ్యాధులచే పీడితుఁడగుచుండియు ఇంకను బ్రతుకఁ గోరిక యున్న ఆనరుని బలీయ మయిన కాలము ఒడుపు వేసికొని పామువలె మ్రింగి వేయును.

తత్రాప్యజాతనిర్వేదో భ్రియమాణః స్వయంభృతైః,
జరయోపాత్తవైరూప్యో మరణాభిముఖో గృహే. ౨౧

ఆస్తేఽవమత్యోపన్యస్తం గృహపాల ఇవాహరన్,
ఆమయావ్యప్రదీప్తాగ్ని రల్పాహారోఽల్పచేష్టితః. ౨౨

వాయునోత్క్రమతోత్తారః కఫసంరుద్ధనాడికః,
కాసశ్వాసకృతాయాసః కంఠే ఘురఘురాయతే. ౨౩

శయానః పరిశోచద్భిః పరివీత స్స్వబంధుభిః,
వాచ్యమానోఽపి న బ్రూతే కాలపాశవశం గతః. ౨౪

ఆమరణకాలమున సైతము హేయత్వబుద్ధి లేక తనచేత పోషింపఁబడిన పుత్రకళత్రాదులచే పోషింపఁబడుచు ముదిమిచే వికృతిరూపము పొంది నరుఁడు ఇంటియందు మరణాభిముఖుఁడై యుండును. కొడుకులు కోడండ్రు మున్నగువారు ఈసడించుచు పెట్టిన అన్నము మున్నగువానిని సిగ్గువిడిచి కుక్కవలె భక్షించును. మఱియు రోగియు, మందాగ్నియు, అల్పాహారుఁడును, అల్పగతియు, ప్రాణోత్క్రమణముచే

---

వ్యాధిశ్చ తాభ్యాం సమ్యగ్యాతి వ్యాకులతా తయా యుక్తం తథాపి జీవితస్యైవ ఆశాయాం సముత్సుకం భోగవాసనయా సాభిలాషం తం నరం కాలః అహి ర్మూషక మివ అజ్ఞాత ఏవ అభిపద్యతే. తథాహి. "ప్రమత్త ముచ్చై రితి కృత్యచింతయా ప్రవృద్ధ లోభం విషయేషు లాలసం, త్వ మప్రమత్త స్సహసాఽభిపద్యసే క్షుల్లేలిహానోఽహి రివాఖు మంతక" ఇతి. ౨౦. తత్రాప్యంతకాలేఽపి నజ్ఞాతః కదర్యేవ న్నిర్వేదో యస్య స్వయంభృతైః స్వయంపాలితైః పుత్ర కళత్రాదిభిః భ్రియమాణః పుష్యమాణస్సన్ మరణోన్ముఖో భవతి. ౨౧. పాపినా మేవ అవజ్ఞా భవతి న తు సుకృతినా మిత్యాహ. ఆస్త ఇతి. అవమత్య అవజ్ఞయా ఉపన్యస్తం సమీపే ప్రక్షిప్తం ఆహారం గృహపాలః శ్వేవ ఆహరన్ భుంజానః ఆస్తే ఆమయావీ రోగీ. ౨౨. కఫేన సంరుద్ధాః నాడయో మార్గభూతా యస్య తేన ఉత్క్రమతా ప్రాణవాయునా వివృత్తనేత్రః కాసశ్వాసాభ్యాం కృత ఆయాసో యస్య కంఠే ఘురఘుర ఇతి శబ్దం కరోతి. ౨౩. పరివీతః పరివేష్టితః వాచ్యమానోఽపి బంధో కాలే వ్యాహారాయ

వివృతనేత్రుఁడును అయి శ్లేష్మముచే బంధింపఁబడిన నాడులు కల వాఁడై శ్వాసకాసలచే ఆయాసమును బొందుచు పరుండి బంధువు లందఱును విచారించుచు చుట్టును మూఁగియుండ కంఠమునుండి గురక వెడలుచుండ బంధువులు పిలుచుచున్నను కాలపాశబద్ధుఁ డగుటంజేసి పలుక నేరక యుండును.

ఏవం కుటుంబభరణే వ్యాపృతాత్మా జితేంద్రియః,
మ్రియతే రుదతాం స్వేషా మురువేదనయా స్తధీః. ౨౪
తస్మిన్నంతక్షణే తార్క్ష్య దైవీ దృష్టిః ప్రజాయతే,
ఏకీభూతం జగత్సర్వం న కించి ద్వక్తు మీహతే. ౨౫
వికలేంద్రియసంఘాతే చైతన్యే జడతాం గతే,
ప్రచలంతి తతః ప్రాణా యామ్యై ర్నికటవ ర్తిభిః. ౨౬
స్వస్థానాచ్చలితే శ్వాసే కల్పాఖ్యో హ్యాతురక్షణః,
శతవృశ్చికదష్టస్య యా పీడా సానుభూయతే. ౨౭

ఇట్లు నరుఁడు కుటుంబవ్యవహారములయందు ఇచ్ఛకలవాఁడును, ఇంద్రియనిగ్రహము లేనివాఁడును, మరణబాధవలన నష్టమతియై బంధువు లందఱు నేడ్చుచుండ మరణించును. వైనతేయా! ఆమరణ కాలమున జీవునకు దివ్యదృష్టి కలుగును. ప్రపంచ మంతయు కరతలా మలకమువలె కాన్పించును. అందుచే నప్పు డేమియు పలుకఁజాలకుం డును. ఇట్లు ఇంద్రియములు వికలతను బొందుటవలన చైతన్యము విలు ప్తము కాఁగా సమీపమున నుండెడి యమభటులు ప్రాణములను వాని

మానో౽పి. ౨౪.ఏవం వ్యాపృతాత్మా అసక్తచిత్తః ఉరువేదనయా అ స్తధీః శతవృశ్చిక యుగపద్దశనసదృశయా పీడయా నష్టమతిః మూర్ఛితస్సన్ రుదతాం రోదనం కుర్వ తాం స్వేషాం బంధూనాం మధ్యే మ్రియతే మరణం ప్రాప్నోతి. ౨౫. అంతక్షణే అంతసమయే దైవీ దేవానామివ దివ్యదృష్టిః యయాదృష్ట్యా యమదూతానాం ప్రత్య క్షదర్శనం భవతీత్యర్థః. పునః యయా సర్వం ఇహలోకపరలోకరూపం జగత్ ఏకీ భూతం స్వనీమానం లగ్న మివ ప్రజాయతే అత ఆశ్చర్యదర్శనాత్ న కించి ద్వక్తు మిచ్ఛతీ త్యర్థః. ౨౬. సమీపాగతైః యామ్యైః హేతుభూతై ర్యమదూతైః కృత్వా ప్రాణాః స్వస్థానాత్ ప్రచలంతి. ౨౭. ఆతురస్య మ్రియమాణస్య పాపినః క్షణో౽పి కల్పాఖ్యః మహాకష్టతయా కల్పసదృశః శతవృశ్చికైః దష్టస్య పురుషస్య యా పీడా

స్థానములనుండి తొలఁగింతురు. ఇట్లు శ్వాసము స్వస్థానమునుండి చలింపఁగానే ఆక్షణము ఆజీవునకు కల్పసమాన మగును. అప్పుడు పెక్కువేల తేళ్లు ఒక్కసారి కుట్టిన నెంతబాధ కలుగునో అంతబాధ కలుగును.

ఫేన ముద్గిరతే సోఽథ ముఖం లాలాకులం భవేత్,
అధోద్వారేణ గచ్ఛంతి పాపినాం ప్రాణవాయవః. ౨౯
యమదూతౌ తదా ప్రాప్తౌ భీమౌ సరభసేక్షణౌ,
పాశదండధరౌ నగ్నౌ దంతైః కటకటాయితౌ. ౩౦
ఊర్ధ్వకేశౌ కాకకృష్ణౌ వక్రతుండౌ నఖాయుధౌ,
స దృష్ట్వా త్రస్తహృదయః శకృన్మూత్రం విముంచతి. ౩౧

ఆసమయమున శ్లేష్మము వెడలును. నోటినుండి చొంగ కారును. పాపాత్ముల ప్రాణవాయువులు అధోమార్గమున వెడలును. అప్పుడు జీవుఁడు భయంకరులును, కోపఘూర్ణితనేత్రులును, పాశములను దండములను ధరించినవారును, దిగంబరులును పళ్లు పటపటకొఱుకుచున్నవారును, ఊర్ధ్వకేశులును, కాకులవలె నల్లనైనవారును, వంకర ముక్కులు గలవారును, గోళ్లే ఆయుధములుగా గలవారును అగు యమదూతలను జూచి భీతచిత్తుఁడై మూత్ర పురీషములను విడుచును.

అంగుష్ఠమాత్రః పురుషో హాహా కుర్వన్కళేబరాత్,
తదైవ గృహ్యతే దూతైర్యామ్యైః పశ్యన్ స్వకం గృహమ్. ౩౨
యాతనాదేహ ఆవృత్య పాశైర్బధ్వా గళే బలాత్,
నయతో దీర్ఘమధ్వానం దండ్యం రాజభటా యథా. ౩౩

భవతి సైవ తేనానుభూయతే. ౨౮. అథ ఫేన ముద్గిరతే కఫం వమతి. ౨౯. తథా ప్రాణప్రయాణే-ప్రాప్తౌ సరసభం సక్రోధం ఈక్షణం యయోః. ౩౦. తౌ దూతౌ దృష్ట్వా శకృన్మలం ముంచతి ౩౧. పురుషః జీవః, అంగుష్ఠమాత్ర ఇతీదం కంఠస్థానే షోడశదళకమలే ధ్యానస్వరూపం భవతి, నత్వంగుష్ఠమాత్రం జీవస్వరూపం సర్వశరీరవ్యాపకత్వాత్, అతోఽత్ర హృదయాకాశే ప్రతిష్ఠితత్వా త్తత్పరిమాణం పుర్యష్టకవేష్టితం సూక్ష్మశరీరకంతం ప్రాదేశమాత్రం పురుషం వసంత మితివత్ జ్ఞాతవ్యమ్. ౩౨. ఏవమైహికదుఃఖం నిరూప్యేదానీం పరలోకదుఃఖం నిరూపయతి. యాతనాదేహ ఇతి. యాతనాదేహో భోగాయ ప్రారబ్ధకర్మణా స్వప్నవ దుత్థితే, యథా భగవతా శ్రీకృష్ణేన వినష్టశరీర మపి గురోః పుత్రం తత్సదృశ మేవ యమలోకా దానీయ గురవే దత్తం, తద్వత్ స్వ

తస్యైవం నీయమానస్య దూతాస్సంతర్జయంతి చ,
ప్రవదంతి భయం తీవ్రం నరకాణాం పునః పునః. ౩౪
శీఘ్రం ప్రచల దుష్టాత్మన్ యాస్యసి త్వం యమాలయమ్,
కుంభీపాకాదినరకాం స్త్వాం నయామోఽద్య మాచిరమ్. ౩౫
ఏవం వాచ స్తదా శృణ్వన్ బంధూనాం రుదితం తథా,
ఉచ్చై ర్హాహేతి విలపన్ తాడ్యతే యమకింకరైః. ౩౬

జీవుఁడు అంగుష్ఠమాత్రుఁడై స్థూలశరీరమునుండి హాహాకారములతో వెలువడి తన గృహమును జూచుచునే యమభటులచే పట్టుకొనఁబడును. యమభటులు జీవుని యాతనాదేహమున బంధించి బలాత్కారముగ కంఠమున పాశములను బంధించి తప్పుచేసిన మనుష్యుని రాజభటులు వలె దండించుచు చాల దూరము తీసికొనిపోవుదురు. వారు ఇట్లు జీవుని తీసికొనిపోవుచు తర్జనభర్జన చేయుదురు. భయంకరము లగు నరకముల వృత్తాంతములను జీటికిని మాటికిని జెప్పుచు భయపెట్టుచుందురు. "ఓపాపాత్ముఁడా! త్వరగా నడువుము. నీవిపుడు నరకమునకుఁ బోవుచుండుట యెఱుఁగవా? అచిరకాలముననే నిన్ను కుంభీపాకాదిఘోరనరకములయందు కూలవేసెదము" అని యమభటులు మాటిమాటికిని వలుకుచుండ జీవుఁడు బంధువుల యాక్రందనధ్వనులవలన హృదయము బ్రద్దలగుచుండ తఱుచు యమభటులచే కొట్టఁబడుచు హాహాకారములు చేయుచుండును.

తతో నిర్భిన్నహృదయ స్తర్జనై ర్జాత వేపథుః,
పథి శ్వభిర్భక్ష్యమాణ ఆర్తోఽఘం స్వ మనుస్మరన్. ౩౭
క్షుత్తృట్పరీతోఽర్కదవానలానిలైస్సంతప్యమానః పథి తప్తవాలుకే,
కృచ్ఛ్రేణ పృష్ఠే కశయా చ తాడితశ్చలత్యశక్తోఽపి నిరాశ్రమోదకే,

---

సద్య శ్శరీరే ఆవృత్య నిరుధ్యతా దూతౌ నయతః గృహీత్వా గచ్ఛతః అన్యథా కేవల స్యైవ తస్య సప్తదశావయవలింగశరీరాత్మకస్య పాశైర్గళే బంధనాయోగాత్ అథ వాస్తు జ్ఞానేంద్రియపంచకం కర్మేంద్రియపంచకం ప్రాణపంచకం బుద్ధిమనసీతి చేతి ఇద మేవ కర్తృత్వభోక్తృత్వా ద్యభిమానేన ఇహలోక పరలోకగామీ వ్యావహారికో జీవ ఇ త్యుచ్యతే ఇతి. దండ్యం పాపరాధమ్. ౩౩-౩౬. తతో దూతయోః తర్జనై స్తాడనై ర్నిర్భిన్నం విదీర్ణం హృదయం యస్య సః స్వం అఘం పాపం స్మరన్ ఆర్తస్సన్ చలతీతి ద్వితీయేనాన్వయః. ౩౭. క్షుత్తృడ్భ్యాం పరీతో వ్యాప్తః,

మఱియు వారి తర్జనభర్జనలచే గుండెలవియ వడవడ వడఁకుచు మార్గమున కుక్కలచే కఱువఁబడుచు, తాను చేసిన పాపములను తలఁచుకొనుచు, జీవుఁడు మిక్కుటమగు ఆఁకలిచేతను దాహముచేతను బాధపడుచు; ఎండ, కార్చిచ్చు, వడగాలి వీఁచుచే తపింపఁజేయఁబడుచు వారు కొఱడాలతో పిఱ్ఱలమీఁద కొట్టుచుండ నడువ శక్తిలేకున్నను కాలిన ఇసుకతిప్పమీఁద ఎట్లో నడుచుచుండును.

తత్ర తత్ర పతన్ ఛ్రాంతో మూర్ఛితః పునరుత్థితః,
యథా పాపీయసా నీత స్తమసా యమసాదనమ్. ౩౯
త్రిభిర్ముహూర్తైర్ద్వాభ్యాం వా నీయతే తత్ర మానవః,
ప్రదర్శయంతి దూతా స్తా ఘోరా నరకయాతనాః. ౪౦
ముహూర్తమాత్రాత్త్వరితం యమం వీక్ష్య భయం పుమాన్,
యమాజ్ఞయా సమం దూతైః పున రాయాతి ఖేచరః. ౪౧

ఇట్లు అతికష్టముతో నడుచుచు నడుమనడుమ పడుచు లేచుచు అలసి సొలసి కటికచీకటిలో యమలోకముఁ జేరును. ఇక్కడనుండి బయలుదేఱిన రెండు ముహూర్తములకే జీవుఁడు యమలోకమునకుఁ బోవును. అచ్చట దూతలు జీవునకు నరకబాధలు అన్నియుఁ జూపి యమదర్శనముగూడ చేయింతురు. అప్పుడు యముఁడు ఆజ్ఞపెట్టఁగా భటులు జీవుని ముహూర్తమాత్రమున ఖేచరగమనమున భూలోకమునకుఁ గొనివత్తురు.

ఆగమ్య వాసనాబద్ధో దేహ మిచ్ఛ న్యమానుగైః,
ధృతః పాశేన రుదతి క్షుత్తృడ్భ్యాం పరిపీడితః. ౪౨
భుఙ్క్తే పిండం సుతైర్దత్తం దానం చాతురకాలికమ్,
తథాపి నాస్తిక స్తస్య తృప్తిం యాతి న పాతకీ. ౪౩

---

తప్తా వాలుకా యస్మిన్ నిర్గతః ఆశ్రమః విశ్రమస్థానం ఉదకంచ యస్మిన్ తస్మిన్ పథి క్షుదాదిభిశ్చలితు మశక్తోఽపి కశయా తాడితఏవ కృచ్ఛ్రేణ చలతి. ౩౮. అశక్తత్వ మేవాహ. తత్రేతి. తమసా తమోరూపేణ పథా యమస్య సాదనం గృహం ప్రతి నీతో భవతి. ౩౯. పాపాధిక్యే ద్వాభ్యాం. ౪౦. భయం యాతనాః పునః స్వగృహం ప్రతి త్వరితం శీఘ్రం దూతైః సహైవ ఖేచరః స న్నాకాశమార్గాదేవాయాతీత్యర్థః. ౪౧. దేహం ప్రతి ప్రవేష్టు మిచ్ఛన్. ౪౨. దత్తం మృత్యుస్థానాదిషు సుతాదిభిః.

ఇట్లు జీవుఁడు మఱల ఇంటికి వచ్చి కర్మబద్ధుఁ డగు జీవుఁడు దేహమును ప్రవేశింపఁ గోరియు, యమభటులు పాశములతో గట్టిగ బంధించియుండుటవలన నిష్ఫలుఁ డగును. ఆఁకలికిని, దప్పికిని ఓర్వలేక ఏడ్చును. మఱియు జీవుఁడు పుత్రులచే నీయఁబడు పిండములను, ఆతురకాలికము లగు దానములను గ్రహించును. అయినను నాస్తికుఁడు (పాపాత్ముఁడు) తృప్తి పొందఁడు.

పాపినాం నోపతిష్ఠంతి దానం శ్రాద్ధం జలాంజలిః,
అతః క్షుద్వ్యాకులా యాంతి పిండదానభుజోఽపి తే. ౪౪
భవంతి ప్రేతరూపాస్తే పిండదానవివర్జితాః,
ఆకల్పం నిర్జనారణ్యే భ్రమంతి బహుదుఃఖితాః. ౪౫
నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి,
అభుక్త్వా యాతనాం జంతుర్మానుష్యం లభతే న హి. ౪౬

పాపాత్ములకు పుత్రాదులు ఇచ్చు జలాంజలి, శ్రాద్ధము, దానమును ముట్టవు. అగుటచే పిండమును భుజించుచుండియు క్షుధార్తులై పోయెదరు. అయినను వారికి ఔర్ధ్వదైహిక క్రియలను మానఁగూడదు. మానినచో బహుదుఃఖితులై పిశాచరూపములతో నిర్జనారణ్యములయందు ప్రళయాంతమువఱకును పరిభ్రమించుచుందురు. చేసికొనిన కర్మ అనుభవింపక తప్పదు. అనేకకల్పములు గడచినను అనుభవింపఁ బడని కర్మ అట్లే నిలిచియుండును. యమయాతనల ననుభవించినఁగాని మానవజన్మ కలుగదు.

అతో దద్యాత్సుతః పిండాన్ దినేషు దశను ద్విజ,
ప్రత్యహం తే విభజ్యంతే చతుర్భాగైః ఖగోత్తమ. ౪౭

౪౩. నను భుక్తే పిండే కథం తృప్తి ర్నాయాతీతి చేత్తత్రాహ. పాపినామితి. నోపతిష్ఠంతి తృప్తిం న జనయతి-పిండదానం వర్షపర్యంతం భుంజంతి తథాపి. ౪౪. నను కృతాన్యపి పిండదానాదీని యది పాపినాం నోపతిష్ఠంతి తదాకిమనేన పిండదానేన కృతమప్యకృతసమమేవేతి చేదకృతేనతు ప్రేతరూపా భవంతీత్యాహ భవంతీతి. ౪౪. కించప్రాయశ్చిత్తరూప యమయాతనాభోగేనైవ పాపక్షయే సతి మనుష్యదేహంలభతే నాన్యథేత్యాహ. నేతి. తథాహిచ వక్ష్యతి "ఏవం దుష్కర్మకర్తాహి భుక్త్వాచ నరకాన్ క్రిమాత్,మానుష్యం లభతే తార్క్ష్య సమీభూతే శుభాశుభే" ఇతి అతో మనుష్య

భాగద్వయం తు దేహస్య పుష్టిదం భూతపంచకే,
తృతీయం యమదూతానాం చతుర్థం సోపజీవతి. ౪౮

ఆ కారణమువలన చనిపోయినది మొదలు పదిదినములవఱకును పుత్త్రుఁడు పిండప్రదానము మున్నగునవి చేయుచుండవలెను. ఇట్లీయఁబడు ప్రేతపిండము నాలుగు భాగములుగా విభజింపఁబడును. అందలి రెండుభాగములు యాతనాశరీరమును వృద్ధిపొందించును. మూఁడవ భాగము యమదూతలు అనుభవించెదరు. నాలుగవభాగము ప్రేత (మరణించినవాఁడు) భుజించును.

అహోరాత్రైశ్చ నవభిః ప్రేతః పిండ మవాప్నుయాత్,
జంతు ర్నిష్పన్న దేహశ్చ దశమే బల మాప్నుయాత్. ౪౯
దగ్ధే దేహే పున ర్దేహః పిండై రుత్పద్యతే ఖగ,
హస్తమాత్రః పురుషో యేన పథి భుఙ్క్తే శుభాశుభమ్. ౫౦

ఓ వైనతేయా! మరణించినదినము మొదలు తొమ్మిది దినములీయఁబడు ప్రేతపిండములవలన జీవునకు చేతెఁడు పిండదేహము కలుగును. పదియవనాఁటి పిండమువలన ఆదేహమునకు బలముకలిగి నడుచుటకు సమర్థ మగును. జీవుఁడు ఆపిండదేహముతోడనే పుణ్యపాపములను అనుభవించును.

ప్రథమేఽహని యః పిండః తేన మూర్ధా ప్రజాయతే,
గ్రీవా స్కంధౌ ద్వితీయేన తృతీయాద్ధృదయం భవేత్. ౫౧
చతుర్థేన భవే త్పృష్ఠం పంచమా న్నాభి రేవచ,
షష్ఠేన చ కటీగుహ్యం సప్తమా త్సక్థినీ భవేత్. ౫౨
జానుపాదౌ తథా ద్వాభ్యాం దశమే హ్ని క్షుధా తృషా,
పిండజం దేహ మాశ్రిత్య క్షుధావిష్టః తృషార్దితః. ౫౩

జన్మని సంచితసుకృతకర్మోదయవశా త్కదాచి త్సద్గతి రపి భవిష్యతీతి తస్మాదకరణా దల్పమపి విహితాచరణ మేవ యుక్త మితి భావః. ౪౬, ౪౭. తదేవాహ, సః ప్రేతః ఉపజీవతి భక్షయతి. ౪౮. పిండం పిండజశరీరం నిష్పన్నః పిండై రుత్పన్నో దేహో యస్య సజంతుః జీవః బలంమార్గగమనసామర్థ్యమ్. ౪౯.యేనపిండజదేహేన పథి యమమార్గే శుభేషు పుణ్యఫలేషు అశుభం పాపఫల మేవ భుఙ్క్తే. ౫౦. పిండజదేహోత్పత్తి

ఏకాదశం ద్వాదశం చ ప్రేతో భుఙ్క్తే దినద్వయమ్. ౫౪
త్రయోదశేఽహని ప్రేతో యన్త్రితో యమకింకరైః,
తస్మిన్ మార్గే వ్రజత్యేకో గృహీత ఇవ మర్కటః. ౫౫

మొదటినాఁడు ఈయఁబడు పిండమువలన శిరస్సును, రెండవ నాఁటి పిండమువలన కంఠమును భుజములును, మూఁడవనాఁటి పిండమువలన హృదయమును, నాల్గవనాఁటి పిండమువలన పృష్ఠమును, అయిదవ నాఁటి పిండమువలన బొడ్డును, ఆఱవనాఁటి పిండమువలన మొలయు గుహ్యప్రదేశమును, ఏఁడవనాఁటి పిండమువలన తొడలును, ఎనిమిదవ నాఁటి పిండమువలన పిక్కలును, తొమ్మిదవనాఁటి పిండమువలన పాదములును పుట్టును. పదవనాఁటి పిండమువలన ఆఁకలియు దప్పియు కలుగును. ఇట్లు సంప్రాప్త మయినపిండశరీరము నాశ్రయించి జీవుఁడు ఆఁకలివలనను దప్పికవలనను బాధపడుచు ఏకాదశ ద్వాదశదినముల యందు పుత్త్రాదులచే నీయఁబడు పిండములను భుజించును. పదమూఁడవ నాఁడు యమభటులవెంట పాశబద్ధుఁడై కట్టఁబడిన కోఁతివలె దుర్గమమగు యమమార్గమున వెడలును.

షడశీతిసహస్రాణి యోజనానాం ప్రమాణతః,
యమమార్గస్య విస్తారో వినా వైతరణీం ఖగ. ౫౬
అహన్యహని వై ప్రేతో యోజనానాం శతద్వయమ్,
చత్వారింశ త్తథా సప్త దివా రాత్రేణ గచ్ఛతి. ౫౭
అతీత్య క్రమశో మార్గే పురాణీమాని షోడశ,
ప్రయాతి ధర్మరాజస్య భవనం పాతకీ జనః. ౫౮
సౌమ్యం సౌరిపురం నగేంద్రభవనం గంధర్వ శైలాగమౌ
క్రౌంచం క్రూరపురం విచిత్రభవనం బహ్వాపదం దుఃఖదమ్,
నానాక్రందపురం సుతప్తభవనం రౌద్రం పయోవర్షణం
శీతాఢ్యం బహుభీతి ధర్మభవనం యామ్యం పురం చాగ్రతః. ౫౯
యామ్యపాశైర్ధృతః పాపీ హాహేతి ప్రరుదన్ పథి,
స్వగృహం తు పరిత్యజ్య పురం యామ్య మనువ్రజేత్ ౬౦

ప్రకారమాహ ప్రథమేహనీతి సార్ధ ద్వాభ్యామ్. ౫౮-౫౯. షోడశపుర నామా న్యాహ, సౌమ్యమిత్యాది. ధర్మభవనం ధార్మికైర్లభ్యం వక్ష్యమాణం దివ్యసభాసహితం యామ్యం

ఓవైనతేయా! భూలోకమునుండి యమపురము ఎనుబదియాఱు ఆమడల దూరమున నున్నది. ఇందు వైతరణీనదియొక్క వైశాల్యము చేరలేదు. ఇట్టి మార్గమున ఒక రాత్రియుఁ బగలును రెండువందల నలువదియేడు ఆమడలు చొప్పున జీవుఁడు సౌమ్యపురము, సౌరిపురము, నగేంద్రభవనము, గంధర్వనగరము, శైలాగమపురము, క్రౌంచపురము, క్రూరపురము, విచిత్రభవనము, బహ్వాపదపురము, దుఃఖదపురము, నానాక్రందపురము, సుతప్తభవనము, రౌద్రపురము, పయోవర్షణపురము, శీతాఢ్యపురము, బహుభీతిపురము అనుపదునాఱుపురములు దాఁటి ఏడ్చుచు స్వగృహము విడిచి తుదకు యమపురముఁ జేరును.

ఇతి శ్రీసారోద్ధారే-గరుడపురాణే-పాపినామైహికాముష్మికదుఃఖ
నిరూపణం నామ ప్రథమోఽధ్యాయః.

---

పాపిభిర్లభ్యం యమయాతనారూపం చకార ఇత్యేవ భేద ఇతి జ్ఞాపనార్థః తత్తు అగ్రతః షోడశపురేభ్యః అగ్రే భవతీతి. ౫౯, ౬౦. ఇతి శ్రీగరుడపురాణటీకాయాం ప్రథమోఽధ్యాయః.

# ద్వితీయాధ్యాయము

శ్రీహరి గరుడునకు యమమార్గవృత్తాంతము చెప్పుట.

గరుడ ఉవాచ:—

కీదృశో యమలోకస్య పంథా భవతి దుఃఖదః,
యత్ర యాంతి యథా పాపా స్తన్మే కథయ కేశవ. ౧

శ్రీభగవా నువాచ:—

యమమార్గం మహాదుఃఖప్రదం తే కథయామ్యహమ్,
మమ భక్తోఽపి తచ్ఛ్రుత్వా త్వం భవిష్యసి కంపితః. ౨
వృక్షచ్ఛాయా న తత్రాస్తి యత్ర విశ్రమతే నరః,
యస్మిన్మార్గే న చాన్నాద్యం యేన ప్రాణాన్సముద్ధరేత్. ౩
న జలం దృశ్యతే క్వాపి తృషితోఽతీవ యః పిబేత్,
తపంతే ద్వాదశాదిత్యాః ప్రళయాంతే యథా ఖగాః. ౪

"శ్రీహరీ! దుఃఖప్రద మగు యమమార్గ మెట్టిది? ఆమార్గమునఁబోవు పాపులు ఎట్లు వెడలెదరు? ఈసంశయములను బాపు" మని గరుడుఁడు అడుగఁగా శ్రీహరి యిట్లు చెప్పెను. "ఓయీ! వినుము. యమమార్గవృత్తాంతమును జెప్పినచో నాభక్తుఁడవగు నీవు గూడ గజ గజ వడఁకిపోయెదవు. ఏమార్గమున చెట్లనీడయైన లేదో, ఏమార్గమున ఆఁకలి నకనక లాడుచున్నను ప్రాణములను నిలుపుకొనుటకు కొంచె మయిన అన్నాదికము లభింపదో, ఏత్రోవయందు దాహాము వలన నాలుక ఎండిపోవుచున్నను ఆలిచిప్పెడు జల మయిన లభింపదో, ఏదారియందు ద్వాదశాదిత్యులు ప్రళయకాలమునందువలె ఎల్లపుడు ఎండకాయుచుందురో అట్టిమార్గమున పాపాత్ములు నడచి పోవుచుందురు.

---

ఐహికాముష్మికం దుఃఖం శ్రుత్వా సంక్షేపతోఽధునా, తదేవ విస్తరాచ్ఛ్రోతుం గరుడః పరిపృచ్ఛతి, కీదృశ ఇతి. ౧. ఆముష్మికం సమాసేన ప్రోక్తం దుఃఖం తదేవ హి, ద్వితీయే పునరధ్యాయే విస్తరేణాహ మాధవః. ౨. యమమార్గస్య దుఃఖప్రదత్వ మే

తస్మిన్గచ్ఛతి పాపాత్మా శీతవాతేన పీడితః,
కంటకై ర్విధ్యతే క్వాఽపి క్వచిత్సర్పైర్మహావిషైః. ౫
సింహైర్వ్యాఘ్రైశ్చ్ఛ్వభిర్ఘోరైర్భక్ష్యతే క్వాఽపి పాపకృత్,
వృశ్చికై ర్దంశ్యతే క్వాఽపి క్వచిద్దహ్యతి వహ్నినా. ౬

ఆమార్గమున చలిగాలి వడవడ వడఁకించును. ఒక్కొక్కచోట కాళ్లలో ముండ్లుగ్రుచ్చుకొనును. ఒక్కొక్కచోట ఘోరవిషపూర్ణములగుపాములు కఱచును. సింహములు, పెద్దపులులు, కుక్కలు మున్నగు క్రూరజంతువులు ఒక్కొక్కచోట కఱచును. ఒక్కొక్కచోట తేళ్లు కుట్టును, ఒక్కొక్కచోట అగ్ని దహించును.

తతః క్వచి న్మహాఘోర మసిపత్రవనం మహత్,
యోజనానాం సహస్రే ద్వే విస్తారాయామతః స్మృతమ్. ౭
కాకోలూక వటా గృధ్ర సరఘా దంశ సంకులమ్,
సదావాగ్ని చ తత్పత్రై శ్ఛిన్నభిన్నః ప్రజాయతే. ౮

ఒకచోట రెండువేలయోజనముల పొడవును వెడల్పును గలదియు, మహాఘోరమైనదియు, కాకులు, గుడ్లగూబలు, గ్రద్దలు, తేనెటీఁగలు, దోమలు మున్నగువానిచే నిండినదియు అగు అసిపత్రవనము గలదు, అందు గొప్పదావాగ్ని గలదు. అందలి చెట్ల యాకులు కత్తులవలె నుండును. జీవుని పిండశరీరము ఆ యాకులచే ఛిన్నభిన్నమగుచుండును.

క్వచి త్పతత్యంధకూపే వికటాత్పర్వతాత్క్వచిత్,
గచ్ఛతే క్షురధారాసు శంకూనా ముపరి క్వచిత్. ౯
స్ఖలత్యంధే తమస్యుగ్రే జలే నిపతితః క్వచిత్,
క్వచిత్పంకే జలూకాఢ్యే క్వచిత్సంత ప్తకర్దమే. ౧౦
సంత ప్తవాలుకా కీర్ణే ధ్మాతతామ్రమయే క్వచిత్,
క్వచి దంగారరాశౌ చ మహాధూమాకులే క్వచిత్. ౧౧
క్వచి దంగారవృష్టిశ్చ శిలావృష్టి స్స వజ్రకా,
ర క్తవృష్టి శ్శస్త్రవృష్టిః క్వచి దుష్టాంబువర్షణమ్. ౧౨

---

పాపం,వృశ్చికాయేత్యాదివైతరణీ నిరూపణాంతమ్, 3-8, సరఘా మధుమక్షికా, ౮, ౯-౧౨, క్షారం భస్మమహానిమ్నాని మహాగర్తాః వప్రప్రరోహాణం ఉచ్చప్రదేశాః

క్షార కర్దమ వృష్టిశ్చ మహానిమ్నాని చ క్వచిత్,
వప్రప్రరోహణం క్వాపి కందరేషు ప్రవేశనమ్, ౧౩
గాఢాంధకారస్తత్రాస్తి దుఃఖారోహశిలాః క్వచిత్,
పూయశోణితపూర్ణాశ్చ విష్ఠాపూర్ణా హ్రదాః క్వచిత్. ౧౪

మఱియు నొక్కొక్కచోట చీకటితో నిండియున్న నూతులలోఁ గూలఁబడును. ఒక్కొక్కచోట పర్వతాగ్రములనుండి పడును. ఒక్కొక్కస్థలమున మిగుల పదునుగల కత్తులమీఁదను, మేకులమీఁదను నడుచును. ఒక్కొక్కయెడల గాఢాంధకారమున నడుచుచు నీళ్లలోఁబడి పోవుచుండును. ఒక్కొక్కస్థలమున జలగలతో నిండియున్న బురదగుంటలలో పడిపోవును. ఇట్లే మార్గమధ్యమున ఇంకను అనేక బాధలు కలుగును. తెక తెక ఉడుకుచుండు బురదలోఁ గూలఁబడును. ఎఱ్ఱగ రాగివలె క్రాగిన యినుకలోను, నిప్పులతో నిండియున్న మార్గమునందును, మిక్కుటమగు పొగగల దారియందును నడుచును. అక్కడక్కడ నిప్పులవాన, రాళ్లవాన, పిడుగులు, రక్తపువాన, వేఁడినీళ్లు, బూడిదె, బురద అతిదారుణముగ మీఁద పడుచుండును. ఒక్కొక్కచో అగాధము లగు గోతులలో పడిపోవును. ఒక్కొక్కచో గుట్టలెక్కును. గుహలలో దూరును. అంతటను గాఢాంధకారమును, దుఃఖమును కలిగించు కఱకురాళ్లును ఉండును. అక్కడక్కడ చీము, రక్తము, మలము మున్నగు అసహ్యపదార్థములతో నిండియుండు చెఱమడుగులు గలవు. వానిలోఁ గూలఁబడుచుండును.

మార్గమధ్యవహత్యుగ్రా ఘోరా వైతరణీ నదీ,
సా దృష్టా దుఃఖదా కింవా యస్యా వార్తా భయావహా, ౧౫
శతయోజనవిస్తీర్ణా పూయశోణితవాహినీ,
అస్థిబృందతటా దుర్గా మాంసశోణితకర్దమా, ౧౬
అగాధా దుస్తరా పాపైః కేశశైవాలదుర్గమా,
మహాగ్రాహసమాకీర్ణా ఘోరపక్షిశతైర్వృతా. ౧౭
ఆగతం పాపినం దృష్ట్వా జ్వాలాధూమసమాకులా,

---

హణమ్. ౧౩. తత్ర కందరే-దుఃఖారోహా దుఃఖేనారోఢుమశక్యా. ౧౪. సా దృష్టా సతీదుఃఖదా భవతీతి కిం వాచ్యమ్. ౧౫. తామేవ నిరూపయతి శతయోజనే త్యేకా

శ్రూయతే సా నదీ తార్‌క్ష్య కటాహోత్క్షిప్తం యథా. ౧౮
క్రిమిభిస్సంకులా ఘోరై స్సూచీవక్త్రై స్సమంతతః,
వజ్రతుండై ర్మహాగృధ్రైర్వాయసైః పరివారితా. ౧౯
శింశుమారైశ్చ మకరై ర్జలూకామత్స్యకచ్ఛపైః,
అన్యై ర్జలస్థజీవైశ్చ పూరితా మాంసభేదకైః. ౨౦

ఇట్లు భయంకరమై యుండు యమమార్గమున వినినంతమాత్రమునసే గజగజవడకించుచు భీకర మగు వైతరణీనది ప్రవహించుచున్నది. దాని వెడల్పు నూఱామడలు. అందు చీమును, రక్తమును ఎడతెగకుండ ప్రవహించుచుండును. దానితీరములు ఎముకల గుట్టలు. అందలిబురద మాంసమును రక్తమును. వెంట్రుకలే అందు నాచు. అందు పెద్ద పెద్ద మొసళ్లు ఉండును. క్రూరపక్షులు అనేకములు అందు నిండియుండును. అది పాపాత్ముఁడగు జీవుఁడు చూచినవెంటనే సెగలతోడను పొగలతోడను నిండి కడవలో నేయి కాగుచున్నట్లు సలసల కాగుచు మఱింత భయంకర మగును. మఱియు నది సూదులవంటి ముక్కులు గల పురుగులతోడను, వజ్రతుండములు గల పెద్ద గ్రద్దలతోడను, బొంతకాకులతోడను మాంసమునే భక్షించి బ్రతుకు నీటి కోఁతులు, మొసళ్లు, జలగలు, చేపలు, తాఁబేళ్లు మున్నగు భయంకర జంతువులతోడను నిండియుండును.

పతితా స్తత్ప్రవాహే చ క్రందంతి బహుపాపినః,
హాభ్రాతః పుత్ర తాతేతి ప్రలపంతి ముహుర్ముహుః. ౨౧
క్షుధితా స్తృషితాః పాపాః పిబంతి కిల శోణితమ్,
సా సరిద్రుధిరాపూరం వహంతీ ఫేనిలం బహు. ౨౨
మహాఘోరాతిగర్జంతీ దుర్నిరీక్ష్యా భయావహా,
తస్యాదర్శనమాత్రేణ పాపా స్స్యుర్గత చేతనాః. ౨౩

పాపాత్ములగు జీవులు ఆ నదియందు పడి యందు సంభవించు బాధలు పడలేక "అన్నా! తండ్రీ! కొడుకా!" యని మాటిమాటికి ఏడ్చుచుందురు. మరియు ఆఁకలియు దప్పికయు తీర్చుకొను నుపాయములు లేక అందలి రక్తమునే ద్రావుచుందురు. అది ఎప్పుడును తరిగి

---

దశభిః. ౧౬-౨౯. ఏవ ముక్తప్రకారేణ బహువిధాః క్లేశాః యస్మి న్నితి కేచిత్

పోక రక్తముతోడను మజ్జగలతోడను పాఱుచుండును. పెద్దధ్వనులం చేయుచు చూడశక్యము లేనిదై అది ప్రవహించుచుండును. దానినిఁ జూచినతోడనే పాపాత్ములు భయమఱచిపోయెదరు.

బహువృశ్చికసంకీర్ణా సేవితా కృష్ణపన్నగైః,
తన్మధ్యే పతితానాం చ త్రాతా కోఽపి న విద్యతే. ౨౪
ఆవర్తశతసాహస్రైః పాతాళే యాంతి పాపినః,
క్షణం తిష్ఠంతి పాతాళే క్షణా దుపరివర్తినః. ౨౫
పాపినాం పతనాయైవ నిర్మితా సా నదీ ఖగ,
నాపరం దృశ్యతే తస్యా దుస్తరా బహుదుఃఖదా. ౨౬
ఏవం బహువిధక్లేశే యమమార్గేతి దుఃఖదే,
క్రోశంతశ్చ రుదంతశ్చ దుఃఖితా యాంతి పాపినః. ౨౭

అనేకములగు తేళ్లు, నల్లత్రాచులు నిండియున్న ఆనదియందు పడిన పాపాత్ములను రక్షించువా రెవ్వరును లేరు. ఆనదియందలి పెద్ద పెద్ద సుడిగుండములలోఁ బడి పాపులు చూచుచుండఁగా పాతాళమునకుఁ బోయెదరు. ఉత్తరక్షణముననే మఱల పైకి ఎగురఁగొట్టఁబడుచుండెదరు. ఆనది పాపాత్ములు పడుచుండుటకొఱకే నిర్మింపఁబడినది. ఇంతకంటె దుస్తర మగునది మఱియొకటి కనఁబడదు. ఇట్లు అనేకవిధముల దుఃఖములను గలిగించు ఆయమమార్గమున పాపులు అనేకవిధముల దుఃఖించుచు పోవుచుందురు.

పాశేన యంత్రితాః కేచి త్కృష్యమాణా స్తథాంకుశైః,
శస్త్రాగ్రైః పృష్ఠతః ప్రోతై ర్నీయమానాశ్చ పాపినః. ౨౮
నాసాగ్రపాశకృష్టా శ్చ కర్ణపాశై స్తథాపరే,
కాలపాశైః కృష్యమాణాః కాకైః కృష్యా స్తథాపరే. ౨౯
గ్రీవాబాహుషుపాదేషు బద్ధాః పృష్ఠే చ శృంఖలైః,
అయోభారచయం కేచి ద్వహంతః పథి యాంతి తే. ౩౦
యమదూతై ర్మహాఘోరై స్తాడ్యమానాశ్చ ముద్గరైః,

---

యమలోకస్య పంథా భవతి దుఃఖద ఇతి ప్రథమప్రశ్నం సమాధాయ యత్ర యాంతి యథా పాపాఇతి ద్వితీయస్యోత్తరమాహ, యావదధ్యాయసమాప్తి. ఏవ మితి. ౨౭. శస్త్రాణాం శంకుత్రిశూలాదీనాం పృష్ఠతః ప్రోతైరగ్రైః. ౨౮. నాసాగ్రేత్యస్య

వమంతో రుధిరం వక్త్రాత్తదేవాశ్నంతి తే పునః. ౩౧
శోచంతే స్వాని కర్మాణి గ్లానిం గచ్ఛంతి జంతవః,
అతీవ దుఃఖసంపన్నాః ప్రయాంతి యమమందిరమ్. ౩౨
తథా చ స్వజనాన్మార్గే పుత్రపౌత్ర ఇతి బ్రువన్,
హాహేతి ప్రరుదన్నిత్య మనుతప్యతి మందధీః. ౩౩

యమదూతలు కొందఱను త్రాళ్లచే బంధించి తీసికొనివెళ్లెదరు, మఱికొందఱను పృష్ఠభాగమున శూలములు గ్రుచ్చి తీసికొని వెళ్లెదరు, కొందఱను ముక్కుత్రాళ్లు కట్టి లాగుకొనిపోయెదరు. చెవులకు త్రాళ్లు కట్టి కొందఱను ఈడ్చుకొనిపోయెదరు. కాలపాశములతో కొందఱ లాగుకొనిపోయెదరు. కొందఱపాపులను కాకులు లాగుచుండును. మెడ, చేతులు, పాదములు, పృష్ఠభాగము వీనికి బరువైన లోహపు బేడిలను తగిలించి నెత్తిమీఁద ఇనుపకడ్డీలను బెట్టి యమభటులు కొందఱను తోలుకొనిపోయెదరు. భయంకరులగు యమదూతలు ముద్గరములు మున్నగు సాధనములతో మోద పాపులు ఆ బాధలు అనుభవింపలేక అనుభవించుచు, నోటినుండి రక్తమును గ్రక్కుకొని దానినే త్రావుచు పోవుచుందురు. ఇట్లు పాపులు తాము చేసిన దుష్కృత్యములకు తగిన ఫలముల ననుభవించుచు ఆయాసముతో యమమందిరమునకుఁ బోవుదురు. పాపి ఆ మార్గమున మాటిమాటికిని కొడుకులు మనుమలు మున్నగువారినిఁ దలంచుకొని దుఃఖించుచుండును.

మహతా పుణ్యయోగేన మానుషం జన్మ లభ్యతే,
తత్ప్రాప్య న కృతో ధర్మః కీదృశం హి మయా కృతమ్. ౩౪
మయా న దత్తం నహుతం హుతాశనే
తపో న తప్తం త్రిదశా న పూజితాః,

---

వల్. ౨౯. అయోభారచయం లోహభారసమూహమ్. ౩౦-౩౪. అనుతాప మేవాహ, మయేతి సప్తభిః. దేహో యస్యాస్తీతి దేహిన్ స్థూలసూక్ష్మదేహాభిమానిన్ జీవ, ఇత్యను తాపాత్స్వయమేవాత్మానం సంబోధ్యాహ. మయా స్థూలదేహేన దానం న దత్తం న హుతం చేతి. అత స్త్వయా కర్తృత్వాభిమానినా కృతం యద్వికర్హితం కర్మ తత్త్వ

న తీర్థసేవా విహితా విధానతో
దేహిన్ క్వచి న్నిస్తర యత్త్వయా కృతమ్. ౩౫
న పూజితా విప్రగణా స్సురాపగా
న చాశ్రితా స్సత్పురుషా న సేవితాః,
పరోపకారా న కృతాః కదాచన
దేహిన్ క్వచి న్నిస్తర యత్త్వయా కృతమ్. ౩౬

“గొప్ప పుణ్యము చేసినఁగాని మనుష్యజన్మము లభింపదు. దుర్లభ మగు ఆ మనుష్యజన్మ పొందియు అది యెన్నటికిని తప్పిపోకుండుటకు తగిన ధర్మమును జేయనైతిని. అయ్యో! ఎంత వెఱ్ఱినైతిని. తపస్సు చేయలేదు. దేవపూజలు అంతకు మునుపే చేయలేదు. దాన ధర్మములును జేయలేదు. యజ్ఞాది క్రతువులను కలలోనైనఁ దలంపలేదు. యథావిధిగా కాశీ మున్నగు పుణ్యక్షేత్రములకైన వెళ్లలేదు. బ్రాహ్మణులనైన పూజింపలేదు. గంగాదిపుణ్యనదులనైన సేవింపలేదు. మోక్షప్రాప్తికి ఆధారభూతమగు సజ్జనసేవయైన చేయలేదు. పరోపకారమును కలనైనఁ దలంపలేదు. నేను చేసిన పాపకర్మలను ఎవరనుభవించెదరు?

జలాశయో నైవ కృతో హి నిర్జలే
మనుష్యహేతోః పశుపక్షిహేతవే,
గోవిప్రవృత్త్యర్థ మకారి నాణ్వపి
దేహిన్ క్వచి న్నిస్తర యత్త్వయా కృతమ్. ౩౭
న నిత్యదానం న గవాహ్నికం కృతం
న వేదశాస్త్రార్థవచః ప్రమాణితమ్,
శ్రుతం పురాణం న చ పూజితో జ్ఞో
దేహిన్ క్వచి న్నిస్తర యత్త్వయా కృతమ్. ౩౮

మేవ నిస్తర - భోక్తృత్వాభిమానినా తత్ఫలం భుఙ్క్ష్వేత్యర్థః. అత్ర త్వయేతి లోకోక్త్యా పరత్వాపరత్వనిర్దేశః. పాపః పుణ్యం చేతి. ౩౫, ౩౬. గోవిప్రాణాం వృత్తి రాజీవికా తదర్థం స్వల్పమపి ధనాదికం నాకారి న కృతం మయేతి. ౩౭. నిత్యదానం అన్నాదికం గవాహ్నికం చేతి ఏకస్యాః గోః ఏకాహతృప్తిజనకం తృణాది తథాహ్నిక మితి పాఠే, ఆహ్నికం ‘స్నానం సంధ్యాం జపం హోమం స్వాధ్యాయం దేవ

మనుష్యుల నిమిత్తముగాని పశువులు పక్షులు మున్నగు ప్రాణుల నిమిత్తము గాని నిర్జలస్థలములలో నూతులు చెఱువులు మున్నగు వానిఁ ద్రవ్వింపలేదు. బ్రాహ్మణులు, గోవులు వీని విషయమున అణుమాత్ర మైన పుణ్యము చేయలేదు. దినదినమును ఉన్నంతవఱ కయిన అన్నదానము చేయలేదు. గోవులకు ఒకనాఁడైన కడుపునిండ గడ్డి యైన వేయలేదు. నాస్తికబుద్ధినై వేదశాస్త్రములను నమ్మక స్వేచ్ఛగా సంచరించితిని. పురాణములను వినలేదు. పౌరాణికుల నైన పూజింపలేదు. నేను చేసిన పాపకర్మల నెవ రనుభవించెదరు?

భర్తుర్మయా నైవ కృతం హితం వచః
పతివ్రతం నైవ కదాపి పాలితమ్,
న గౌరవం క్వాపి కృతం గురూచితం
దేహిన్ క్వచి న్నిస్తర యత్త్వయా కృతమ్. ౩౯
న ధర్మబుద్ధ్యా పతిరేవ సేవితో
వహ్నిప్రవేశో న కృతో మృతే పతౌ,
వైధవ్య మాసాద్య తపో న సేవితం
దేహిన్ క్వచి న్నిస్తర యత్త్వయా కృతమ్. ౪౦
మాసోపవాసై ర్నవిశోషితం మయా
చాంద్రాయణై ర్వా నియమైస్స విస్తరైః,
నారీశరీరం బహుదుఃఖభాజనం
లబ్ధం మయా పూర్వకృతై ర్వికర్మభిః. ౪౧

---

తార్చన' మితి శ్రుత్యుక్తం ఆవశ్యకం కర్మ. కించ వేదశాస్త్రాణా మర్థం 'అవశ్య మేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ' మిత్యాది యథార్థం వచః న ప్రమాణితం నాస్తికతయా ప్రమాణం న కృతమ్. జ్ఞః తద్వక్తా. ౩౮. హితం మమైవ సుఖదం భర్తుర్వచః గురూణాం శ్వశ్ర్వాదీనాం ఉచితం గౌరవం చరణసేవాదికం క్వాపి కదాచిదపి న కృతమ్. ౩౯. పతిసేవన మేవ స్త్రీణాం పరమో ధర్మ ఇతి బుద్ధ్యా పతి ర్నైవ సేవితః, కింతు దాంభికాః ముండాః సేవితాః. ౪౦. తపస్సేవన మేవాహ. మాసోపవాసై రితి. బహుదుఃఖానాం వైధవ్యపరాధీనతాదీనాం పూర్వజన్మని కృతైః వికర్మభిః నిషిద్ధాచరణైః మయా జీవేన నారీశరీరం లబ్ధమిత్యత్ర స్థూలశరీరాభిప్రాయేణ జీవస్యోక్తిః-కించ సూక్ష్మశరీరాభిమానవతి జీవేతు వాసనానుసారేణైవ పురంజనవ న్నరనారీ

నన్ను కంటికి రెప్పవలె కాపాడు భర్తమాటను ఒకమాఱు అయిన వినలేదు. భర్తను పూజింపవలయునను నీతిని కలనైనఁ దలంపలేదు. అట్టి నాకు పాతివ్రత్య ముండునా? అత్తమామలు మున్నగు పూజ్యులను ఎన్నఁడును పూజింపనేలేదు. నాకు స్వర్గ మెట్లు వచ్చును? నేను చేసిన పాపము నెవ రనుభవించెదరు? భర్త నెప్పుడును ధర్మబుద్ధితో సేవింపలేదు. భర్త మరణించినపుడు సహగమనము నైన చేయలేదు. వైధవ్యము వచ్చినపుడు చేయవలసిన ఒంటిపూట భోజనము, ఉపవాసము, కృచ్ఛ్రచాంద్రాయణాదికములు, ఫలములు, కూరలు తినియుండుట, భూమిమీఁద పరుండుట, తలంటుకొనకుండుట, పరిమళద్రవ్యములను స్వీకరింపకపోవుట, పతి బుద్ధితో శ్రీహరినిఁ బూజించుట, భర్తలకు ఇష్ట మయిన పదార్థములను యోగ్యులకు సమర్పించుట మున్నగు కృత్యములను వేనిని చేయలేదు. పూర్వజన్మమున అనేకపాపకర్మలు చేయుటవలన సంప్రాప్తించినట్టియు, వైధవ్యము, పరాధీనత్వము మున్నగు అనేకదుఃఖములకు ఆకర మైనట్టియు స్త్రీజన్మము నెత్తి మాసోపవాసాదికములచే దానిని మఱల రాకుండ చేసికొనలేక పోయినాను. నేను చేసిన పాపముల నెవరు అనుభవించెదరు?

ఏవం విలప్య బహుశస్సంస్మరన్ పూర్వదైహికమ్,
మానుషత్వం మమ కుత ఇతి క్రోశ న్ప్రసర్పతి. ౪౨

అని యిట్లు అనేకవిధముల విలపించుచు పురాకృతపాపములను దలంచుకొనుచు మఱల నాకు మనుష్యజన్మ యెట్లు లభించు నని యేడ్చుచు ఆమార్గమున పోవును.

దశసప్తదినా న్యేకో వాయువేగేన గచ్ఛతి,
అష్టాదశే దినే తార్క్ష్య ప్రేతస్సౌమ్యపురం వ్రజేత్. ౪౩

ఇట్లు బయలువెడలిన జీవుఁడు వాయువేగమున పదునేడు దినములు నడిచి పదునెన్మిదవదినమున సౌమ్యపురమును జేరును.

త్వం న తు వాసన మితి. తదుక్తం శ్రీరామస్వామినా తారాం ప్రతి—"న స్త్రీ పుమాన్వా షండో వా జీవ స్సర్వగతోఽవ్యయః, ఏక ఏవాద్వితీయోఽయ మాకాశవ దలేపకః" ఇతి. ౪౧. ఏవ మనుతాపం నిరూప్య మార్గగమనం నిరూపయతి. ఏవ మిత్యాది. ౪౨.

తస్మిన్పురవరే రమ్యే ప్రేతానాం చ గణో మహాన్,
పుష్పభద్రానదీ తత్ర న్యగ్రోధః ప్రియదర్శనః. ౪౪
పురే తత్ర స విశ్రామం ప్రాప్యతే యమకింకరైః,
దారపుత్రాదికం సౌఖ్యం స్మరతే తత్ర దుఃఖితః. ౪౫
ధనాని భృత్యమాత్రాణి సర్వం శోచతి వై సదా,
తదా ప్రేతాం స్తు తత్రత్యాః కింకరాశ్చేదమబ్రువన్. ౪౬
క్వ ధనం క్వ సుతా జాయా క్వ సుహృత్క్వచ బాంధవాః,
స్వకర్మోపార్జితం భోక్తా మూఢ యాహి చిరం పథి. ౪౭

ఆపట్టణమున ప్రేతగణము నివసించియుండును. పుష్పభద్రయను నది ప్రవహించుచుండును. విశ్రమించుట కనుకూలమగు పెద్దమఱ్ఱి చెట్టును గలదు. యమభటులు జీవులను అచ్చట విశ్రమింపఁజేయుదురు. విశ్రమించియున్నపుడు భార్య, బిడ్డలు మున్నగు బంధువులును, ధనమును సౌఖ్యములును జ్ఞప్తికిరాఁగా జీవులు శోకించుచుందురు. వారినిఁ జూచి యమకింకరులు "ఓ జీవులారా! ధన మెక్కడ? భార్య లెక్కడ? మిత్రు లెక్కడ? బంధువు లెక్కడ? వారిని తలఁచుకొనుట వ్యర్థము. మీరుచేసిన కర్మలకు ఫలము అనుభవింపఁదీరవలెను" అని పలుకుచుందురు.

జానాసి సంబలబలం బల మధ్వగానాం
నో సంబలాయ యతసే పరలోకపాంథ!,
గంతవ్య మస్తి తవ నిశ్చిత మేవ తేన
మార్గేణ యత్ర భవతి క్రయవిక్రయోఽపి. ౪౮

---

నదీన్యగ్రోధయోః సంయోగాదస్య సౌమ్యత్వం రమ్యత్వం చేతి. అన్యత్ర 'వృక్షచ్ఛాయా న తత్రాస్తి న జలం దృశ్యతే క్వచి'దితి నిరూపణా దేతద్విపరీతత్వమ్. ౪౪,౪౫. తత్రత్యాః సౌమ్యపురవాసినః. ౪౬. చిరం యాహి వర్షపర్యంతం గచ్ఛ. ౪౭. హే పరలోకపాంథ! త్వం సంబలబలం సమ్యగ్ప్రతిహతం బలం యస్యేతి సంబలః, యమస్తస్య బలం పరాక్రమం నో జానాసి కించ, అధ్వగానాం అధ్వని యమమార్గే యుష్మదాదిభి స్సహ గచ్ఛంతీ త్యధ్వగాః - అస్మదాదయో దూతాః తేషాం బలం నో జానాసి. కించ సంబలాయ యమార్థం నో యతసే యథా యమో యాతనాం న దదాతి తథా యత్నం న కరోషీతి సావజ్ఞ వచనాని-అత్ర నో ఇత్యస్య దేహళీదీపన్యాయేన

అబాలఖ్యాతమార్గోఽయం నైవ మర్త్య శ్రుతస్త్వయా,
పురాణసంభవం వాక్యం కిం ద్విజేభ్యోఽపి న శ్రుతమ్. ౪౯

మఱియు యమకింకరు లిట్లుపలికెదరు. "మూఢులగు ఓ పరలోక పాంథులారా! ప్రయాణీకులకు దారిబత్తెమే యాధారమని మీరెఱుఁగరా? ఎఱిఁగియున్న దానికొఱ కేల ప్రయత్నింపలేదు? ఏమార్గమున అమ్మువారును కొనువారును లేరో ఆ మార్గమున నడువవలయునని మీకు తెలియదా? ఓ మూఢమనుజుఁడా! పరలోకమార్గమున ఏమియు లభింపదని బాలురకుఁగూడ తెలియును. నీకేల తెలియలేదు? బ్రాహ్మణుల వలన పురాణముల నెప్పుడును వినలేదా?

ఏవముక్త స్తతో దూతైస్తాడ్యమానశ్చ ముద్గరైః,
నిపత న్నుత్పత న్ధావ న్పాశై రాకృష్యతే బలాత్. ౫౦
అత్ర దత్తైః సుతైః పౌత్రైస్స్నేహాద్వా కృపయాఽపివా,
మాసికం పిండ మశ్నాతి తత స్సౌరిపురం వ్రజేత్. ౫౧

యమకింకరులు ఇట్లు పలుకును ముద్గరములతో కొట్టుచుండ జీవులు పడుచు, లేచుచు, పరుగెత్తుచు, పాశములచే లాగఁబడుచు అక్కడ స్నేహముచేతఁగాని, కృపచేతఁగాని కుమారులు వగయిరాలచే మాసికములయం దీయఁబడిన పిండములను దిని పిదపసౌరిపురమును జేరుదురు.

తత్ర నామ్నాస్తి రాజావై జంగమః కాలరూపధృత్,
తం దృష్ట్వా భయ భీతో సౌ విశ్రామే కురుతే మతిమ్. ౫౨
ఉదకం చాన్నసంయుక్తం భుక్త్వా తత్ర పురే గతః,
త్రైపక్షికే వై యద్దత్తం స తత్పుర మతిక్రమేత్. ౫౩

---

సర్వత్ర సంబంధః. యత్ర యస్మిన్మార్గే క్రయవిక్రయ శ్చాపి నాస్తి తేన గంతవ్య మస్తీతి. ౪౯. బాలా నభివ్యాప్యేత్యాబాలం - ఆబాలం ఖ్యాతః-బాలాఅపి జానంతీ త్యర్థః - స చాసౌ మార్గ శ్చాయం న శ్రుతః కిం? ౪౯, ౫౦. గృహా త్త్రయో దశేఽహని మార్గే వ్రజతి - అష్టాదశేఽహని సౌమ్యపురం ప్రాప్నోతి-అత్ర సౌమ్య పురే మాసిక మశ్నాతి - త్రైపక్షికస్య చ విశ్రామాభావా దకథిత మపి భోజనం మార్గే ఏవ జ్ఞాతవ్యమ్. ౫౧. తత్ర సౌరిపురే కాలరూపధృత్ కాలో యమ స్తద్రూపం ధరతీతి విశేషణాత్-యమవ జ్జంగమస్యాపి సౌరిత్వం-సూర స్సూర్యః తస్యా పత్యం సౌరి స్తస్య పురం-అతోఽస్య సౌరిపుర మితి నామ. ౫౨,౫౩. నగేంద్ర భవనం-

సాక్షాత్తుగ యమునింబోలు జంగమఁ డను రాజు ఆ నగరమును పాలించుచుండును. అతనిం జూచి జీవుఁడు భయభ్రాంతుఁడై విశ్రమించుటకు స్థలముఁ జూచును. అచ్చట జీవుఁడు త్రైపక్షికశ్రాద్ధమున పుత్త్రాదులచే నీయఁబడు పిండోదకముల ననుభవించి బయలుదేఱును.

తతో నగేంద్రభవనం ప్రేతో యాతి త్వరాకృతిః,
వనాని తత్ర రౌద్రాణి దృష్ట్వా క్రందతి దుఃఖితః. ౫౪
నిర్ఘృణైః కృష్యమాణస్తు రుదతే చ పునః పునః,
మాసద్వయావసానేతు తత్పురం వ్యథితో వ్రజేత్. ౫౫
భుక్త్వా పిండం జలం వస్త్రం దత్తం యద్బాంధవైరితః,
కృష్యమాణః పునః పాశై ర్నీయతే గ్రే చ కింకరైః. ౫౬
మాసే తృతీయే సంప్రాప్తే ప్రాప్య గంధర్వపత్తనమ్,
తృతీయమాసికం పిండం తత్ర భుక్త్వా ప్రసర్పతి. ౫౭
శైలాగమం చతుర్థే చ మాసి ప్రాప్నోతి వై పురమ్,
పాషాణాస్తత్ర వర్షంతి ప్రేతస్యోపరి భూరిశః. ౫౮
చతుర్థమాసికం పిండం భుక్త్వా కించిత్సుఖీ భవేత్,
తతో యాతి పురం ప్రేతః క్రౌంచం మాసేఽథ పంచమే. ౫౯
హస్తదత్తం తదా భుంక్తే ప్రేతః క్రౌంచపురే స్థితః,
యత్పంచమాసికం పిండం భుక్త్వా క్రూరపురం వ్రజేత్. ౬౦

ఇట్లు రెండవమాసముదాఁటిన తరువాత నగేంద్రభవనపురము చేరును. భయంకరములగు అచ్చటి అసిపత్త్రారణ్యములను జూచి ఏడ్చును. యమదూతలు జీవుని అవనములో నిర్దయులై యీడ్చెదరు.

---

న గచ్ఛంతీతి నగాః వృక్షాః తేషా మింద్రాః ఉచ్ఛ్రితతరతరవః తేషాం భవనం స్థానం- అతోఽస్య నగేంద్రభవన మితి నామ. తదే వాహ. తత్ర తత్పురమార్గే మధ్యే చ రౌద్రాణి అసిపత్రవనాని దృష్ట్వా క్రందతీతి. ౫౪-౫౬. గంధర్వపత్తనం - యథా సూర్య ఉదయే దృశ్యతే తథా దూరాదేవ దృశ్యమానం సమీపగమనా దదృశ్యం భవతీతి హేతో స్తస్య గంధర్వనగరం నామ. ౫౭. శైలానాం పాషాణానాం ఆగమం పతనం యస్మిన్నితి శైలాగమం నామ. ౫౮. క్రౌంచం 'కృంచ్ హింసాయా' మితి ధాతోః హింస్రజనై ర్వ్యాప్తత్వా దస్య క్రౌంచపురం నామ. ౫౯. క్రూరా

జీవుఁడాబాధల కోఁగలేక యేడ్చుచుండును. అచ్చట పిండములను భుజించిన తరువాత యమభటులు వానిని పాశబద్ధునిఁ గావించి ముందు నగరమునకు ఈడ్చుకొనిపోవుదురు. మూఁడవమాసమున గంధర్వపురముఁ జేరును. ఆ పురమునందే మూఁడవమాసికమున ఈయఁబడిన పిండములను భక్షించును. నాల్గవమాసమున శైలాగమపురము ప్రవేశించును. అచ్చట ప్రేతలమీఁద రాళ్లవాన సంతతధారగా పడుచుండును. గావుననే దానికి ఆపేరు వచ్చినది. నాల్గవమాసపిండముల నచ్చట భక్షించి జీవుఁడు కొంచెము సుఖము పొందును. అయిదవమాసమున క్రౌంచపురము చేరును. ఆ పట్టణమందలి ప్రజలందఱు హింసకులే యగుటం జేసి ఆ పురమునకు క్రౌంచమని పేరువచ్చినది. అయిదవ మాసికపు పిండముల నక్కడ స్వీకరించి పిదప క్రూరపురము చేరును.

సార్థకైః పంచభి ర్మాసై ర్న్యూనషాణ్మాసికం భవేత్,
తత్ర దత్తేన పిండేన ఘటే నాప్యాయిత స్థ్సితః. ౬౧
ముహూర్తార్థం తు విశ్రమ్య కంపమాన స్సుదుఃఖితః,
తత్పురం తు పరిత్యజ్య తర్జితో యమకింకరైః. ౬౨
ప్రయాతి చిత్రభవనం విచిత్రో నామ పార్థివః,
యమస్యైవానుజో భ్రాతా యత్ర రాజ్యం ప్రశాస్తిహి. ౬౩
తం విలోక్య మహాకాయం యదా భీతః పలాయతే,
తదా సమ్ముఖ మాగత్య కైవర్తా ఇద మబ్రువన్. ౬౪

అందలి ప్రజలు నిర్దయాత్ములగుటవలన ఆ పురమున కా పేరు వచ్చినది. అచ్చటనే యుండి ఊనషాణ్మాసికమున (నూటడెబ్బదియొకటవరోజున) ఈయఁబడు పిండోదకాదులను భుజించి ఆ సందర్భమున చేయఁబడిన ఉదకుంభదానమువలన కొంచెము తృప్తుఁడై రెండుగడియల కాలము మాత్రము విశ్రమించి ఆ పురమును విడిచి యమకింకరులచే తర్జనభర్జన చేయఁబడుచు వడఁకుచు బయలుదేఱును. తరువాత జీవుఁడు విచిత్రభవనము అను పట్టణము చేరును. యముని సోదరుఁడగు విచిత్రరాజు ఆ పురమును పాలించుచుండును. జీవుఁడు స్థూలశరీ

---

ణాం నిర్దయానాం పుర మితి. ౬౦. ఆప్యాయితః కించి త్తృప్తః. ౬౧, ౬౨. చిత్ర ఏవ విచిత్రః-జయఏవ విజయ ఇతివత్ తస్య విచిత్రస్య భవనం మందిరం యత్ర

రుఁడు అగు ఆ రాజును జూచి భయభ్రాంతుఁడై పాఱిపోవును. అంతట పల్లెవాండ్రు కొందఱు ఎదురువచ్చి యిట్లు పలుకుదురు.

వయం తే తర్తుకామాయ మహావైతరణీం నదీమ్,
నావ మాదాయ సంప్రాప్తా యది తే పుణ్య మీదృశమ్. ౧౫
దానం వితరణం ప్రోక్తం మునిభి స్తత్త్వదర్శిభిః,
ఇయం సా తీర్యతే యస్మా త్తస్మా ద్వైతరణీ స్మృతా. ౧౬
యది త్వయా ప్రదత్తా గా స్తదా నౌ రుపసర్పతి,
నాన్యథాతి వచ స్తేషాం శ్రుత్వా హా దైవ భాషతే. ౧౭
తం దృష్ట్వా కథ్యతే సాతు తాం దృష్ట్వా సోతిక్రందతే,
అదత్తదానః పాపాత్మా తస్యామేవ నిమజ్జతి. ౧౮
తన్ముఖే కంటకం దత్వా దూతై రాకాశసంస్థితైః,
బడిశేన యథా మత్స్య స్తథా పారం ప్రణీయతే. ౧౯
పాణ్మాసికం చ యత్పిండం తత్ర భుక్త్వా ప్రసర్పతి,
మార్గే స విలపన్యాతి బుభుక్షాపీడితో వ్యాలమ్. ౨౦

"ఓ జీవుఁడా! మేము వైతరణీనదిని దాఁటించు పల్లెవాండ్రము. పడవ రేవున సిద్ధముగా నున్నది. ఋషులు గోదానమును వితరణ మని పలుకుచున్నారు. ఇది గోదానమువలన దాఁటఁబడుచున్నది; గావున వైతరణి'యనిపిలువఁబడుచున్నది. నీవు గోదానము చేసితివా? అట్లయివ యెడల నీవు పడవ యెక్కవచ్చును. లేకున్న లేదు." ఈమాటలు విని జీవుఁడు తాను గోదానము చేసియుండకపోయినచో "హా, దైవమా" యని యేడ్చును. గోదానము చేయుని జీవునిఁ జూచి ఆనది సలసల కాఁగఁ దొడంగును. దానినిఁ జూచి జీవుఁడు వడవడ వడఁకును. గోదానము

తస్మి న్విచిత్రభవనే. ౧౩,౧౪. ఈదృశం నాకారోహణయోగ్యమ్. ౧౫. తదేవాహ. దానమితి ద్వాభ్యామ్. యా త్వయా మర్త్యలోకే శ్రుతా సేయం తవాగ్రే వర్తమానా యస్మా ద్వితరణా ద్గోదానా త్తీర్యతే తస్మా ద్ధేతో ర్వైతరణీతి. ౧౬. ఉపసర్పతి సమీపే ఆయాస్యతి అన్యథా గోదానం వినా నేతి హాదైవే త్యదానా న్నిర్వేదవచనమ్. ౧౭. నిమజ్జతి నిమగ్నో భవతి. ౧౮. నిమజ్జితస్య పారప్రాప్తిప్రకార మాహ తన్ముఖఇతి. బడిశం మత్స్యవేధనమ్. ౧౯. పాణ్మాసికం పిండం భుక్త్వాపి బుభుక్షాపీడిత ఇత్యత్రాపి "తథాఽపి నాస్తిక స్తాస్య! తృప్తిం యాతి న పాతకీ, పాపినాం నోపతిష్ఠంతి

చేయని జీవుఁడు ఆ నదిలో దిగిపోవలయును. గాలముతో చేపను పైకి లాగునట్లు ఆ పాపాత్ముని నోట ముల్లు గ్రుచ్చి యమకింకరులు ఆకాశ వీథిని నడచుచు నదిని దాఁటించెదరు. జీవుఁడు అపుడు ఆఱవమాసికమున ఈయఁబడిన పిండోదకములను భక్షించియు ఇంకను మిగుల నాఁకలిగొని యేడ్చుచు బయలుదేఱును.

సప్తమే మాసి సంప్రాప్తే పురం బహ్వాపదం వ్రజేత్,
తత్ర భుఙ్క్తే ప్రదత్తం యత్సప్తమే మాసి పుత్రకైః. ౨౧
తత్పురం తు వ్యతిక్రమ్య దుఃఖదం పుర మృచ్ఛతి,
మహద్దుఃఖ మవాప్నోతి ఖే గచ్ఛన్ ఖేచరేశ్వర. ౨౨
మాస్యష్టమే ప్రదత్తం యత్పిండం భుక్త్వా ప్రసర్పతి,
నవమే మాసి సంపూర్ణే నానాక్రందం పురం వ్రజేత్. ౨౩
నానాక్రందగణాన్ దృష్ట్వా క్రందమానాంత్సుదారుణాన్,
స్వయం చ శూన్యహృదయ స్సమాక్రందతి దుఃఖితః. ౨౪

ఏడవమాసమున బహ్వాపదపురమును ప్రవేశించి ఏడవమాసికమున నీయఁబడిన పిండోదకాదులను స్వీకరించును. తరువాత ఆకాశగమనమున దుఃఖదనగరమును ప్రవేశించి ఎనిమిదవమాసికమున ఈయఁబడిన పిండాదికమును భుజించును. పిమ్మట తొమ్మిదవ నెల పూర్తి యగునప్పటికి నానాక్రందపురముం జేరును. అందున్న ప్రేతగణములు అనేకవిధముల దుఃఖించుచుండును. అగుటవలననే ఆపట్టణమునకు నానాక్రందపుర మని పేరు వచ్చినది. జీవుఁడు అక్కడ ఆ రోదనధ్వనులు విని శూన్యహృదయుఁడై చేయునదిలేక తానుగూడ రోదనముచేయును.

విహాయ తత్పురం ప్రేత స్తర్జితో యమకింకరైః,
సుతప్తభవనం గచ్ఛే ద్దశమే మాసి కృచ్ఛ్రితః. ౨౫

---

దానం శ్రాద్ధం జలాంజలి''రితి పూర్వవత్ జ్ఞాతవ్యమ్. ౨౦. బహువిధా క్షుధాద్యాపత్ యస్మిన్నితి బహ్వాపదం నామ. ౨౧. ఖే క్వచి న్నిరాలంబమార్గే ఖగవ ద్గచ్ఛన్ మహాదుఃఖం ప్రాప్నోతి-అతోఽస్య దుఃఖదం నామ. ౨౨. నానాగణాః క్రందంతి యస్మిన్నితి నానాక్రందం నామ పురమ్. ౨౩. నానాప్రకారైః ఆక్రందంతి చ తే గణాః తాన్ అతిదారుణాన్ దృష్ట్వా స్వయమ ప్యతిదుఃఖిత స్సన్ ఆక్రందతి. ౨౪పరితో

పిండదానం జలం తత్ర భుక్త్వాపి న సుఖీ భవేత్,
మాసి చైకాదశే పూర్ణే పురం రౌద్రం స గచ్ఛతి. ౭౬
దశైకమాసికం తత్ర భుంక్తే దత్తం సుతాదిభిః,
సార్ధే చైకాదశే మాసి పయోవర్షణ మృచ్ఛతి. ౭౭
మేఘాస్తత్ర ప్రవర్షంతి ప్రేతానాం దుఃఖదాయకాః,
న్యూనాబ్దికం చ యచ్ఛ్రాద్ధం తత్ర భుంక్తే స దుఃఖితః. ౭౮

పదునొకండవ మాసమున రౌద్రపురము ప్రవేశించి ఏకాదశ మాసికమున నీయఁబడిన పిండాదికములను స్వీకరించి పిదప పదునైదు దినములకు అనఁగా ౩౪౫ వ రోజునకు పయోవర్షణనగరము చేరును. ప్రేతలకు ఉపద్రవము కలిగించునంతటి వర్షమును మేఘములు అక్కడ కురియును; గాన దానికి ఆపేరు వచ్చినది. అందు జీవుఁడు న్యూనాబ్దిక శ్రాద్ధమున నీయఁబడిన పిండోదకములను స్వీకరించును.

సంపూర్ణే తు తతో వర్షే శీతాఢ్యం నగరం వ్రజేత్,
హిమా చ్ఛతగుణం తత్ర మహాశీతం తపత్యపి. ౭౯
శీతార్తః క్షుధితస్సోఽపి వీక్షతే హి దిశో దశ,
తిష్ఠతే బాంధవః కోఽపి యో మే దుఃఖం వ్యపోహతి. ౮౦

సంవత్సరము పూర్తి యగునప్పటికి శీతాఢ్యనగరము ప్రవేశించును. ఎండకాయుచున్నను మంచుకంటె నూఱురెట్లధికముగా చలి కాయుచుండుటవలన ఆపురమునకు ఆపేరు వచ్చినది. జీవుఁడు ఆచలికి ఓర్వలేకయు, ఆఁకట నకనక మాడుచుండియు "ఈనాదుఃఖమును పోఁగొట్టఁగల బంధువు లెచ్చటను లేరా!" యని దశదిశలును జూచును.

---

దావాగ్నినా ఉపర్యంగారవృష్ట్యాచ సుష్ఠు అతితప్తం చ తద్భవనం చేతి సుతప్తభవనం నామ. ౭౫. రౌద్రాణాం భయంకరాణాం పుర మితి రౌద్రపురం నామ. ౭౬. పయసాం సంతప్తజలానాం వర్షణం వృష్టి ర్యస్మిన్నితి పయోవర్షణం నామ పురం ఋచ్ఛతి. 'ఋచ్ఛ గతా'వితి ధాతో ర్గచ్ఛతీత్యర్థః. ౭౭, ౭౮. హిమాదపి శతగుణేనశీతేనాఢ్యం యుక్తం భవతీతి శీతాఢ్యంనామ. ౭౯. వ్యపోహతి దూరీకరోతి. ౮౦. తాదృశం

కింకరాస్తే పఠంత్యత్ర క్వ తే పుణ్యంహి తాదృశమ్,
భుక్త్వా చ వార్షికం పిండం ధైర్య మాలంబతే పునః. ౭౧
తత స్సంవత్సరస్యాంతే ప్రత్యాసన్నే యమాలయే,
బహుభీతిపురే గత్వా హస్తమాత్రం సముత్సృజేత్. ౭౨

అట్లు దుఃఖితుఁడై యున్న ఆజీవునిఁ జూచి యమకింకరులు "ఓరీ! అట్టి పుణ్యము నీకెక్కడ నున్నది? విచారించిన నేమియు ఫలము లేదు. పాపోవక అనుభవింపుము" అని పలుకుచుందురు. ప్రేత అచ్చటనే ప్రథమాబ్దికమున ఈయఁబడిన పిండోదకాదులను భక్షించి కొంచెము ధైర్యము వహించును. పిదప అనేకవిధములగు భీతులకు ఆకరమయిన బహుభీతిపురము ప్రవేశించును. అక్కడకు యమపురము సమీపమున నున్నది. అచ్చట హస్తప్రమాణమై యున్న పిండజశరీరమును విడిచిపెట్టును.

అంగుష్ఠమాత్రో వాయుశ్చ కర్మభోగాయ ఖేచర,
యాతనాదేహ మాసాద్య సహ యామ్యైః ప్రయాతి చ. ౭౩
ఔర్ధ్వదైహికదానాని యైర్న దత్తాని కాశ్యప,
ఏవం కష్టేన తే యాంతి గృహీతా దృఢబంధనైః. ౭౪
ధర్మరాజపురే సంతి చతుర్ద్వారాణి ఖేచర,
తత్రాయం దక్షిణద్వారమార్గ స్తే పరికీర్తితః. ౭౫
అస్మిన్ పథి మహాఘోరే క్షుత్తృష్ణాశ్రమపీడితాః,
యథా యాంతి తథా ప్రోక్తం కిం భూయః శ్రోతుమిచ్ఛసి. ౭౬

---

యాదృశేన ఏతద్దుఃఖం యాతి. ౭౧. యమపురయాతనాపాన్నిధ్యాద్బహుప్రకారం భీతి ర్భవతి యస్మిన్నితి బహుభీతిపురం నామ - తస్మిన్నేవ హస్తమాత్రం పిండజం దేహం త్యజతి. ౭౨. వాయు రిత్యుపలక్షణం వాయ్వాదిసప్తదశతత్త్వాత్మకలింగశరీరాభిమానీ జీవః యాతనాదేహం ప్రారబ్ధకర్మభోగాయ స్వప్నవదుత్థితం స్వసదృశం శరీరం సమాశ్రితస్సన్. ౭౩. 'కీదృశో యమలోకస్య పంథాః' 'తత్ర యాంతి యథా పాపా' ఇతి ప్రశ్నస్యోత్తర ముపసంహరతి. ఏవమితి. ౭౪-౭౬. ఇతి శ్రీగరుడపురాణటీకాయాం యమమార్గనిరూపణో నామ ద్వితీయోఽధ్యాయః.

అంగుష్ఠ ప్రమాణుఁడును, లింగశరీరాభిమానియు నగు జీవుఁడు ప్రారబ్ధకర్మ ననుభవించుటకు స్వప్నమువలె బయలుదేఱిన యాతనాశరీరము నధిష్ఠించి పాపాత్ములతో కలిసి వెళ్లును. ఓగరుడుఁడా! పుత్రులు మున్నగువారు శ్రాద్ధకర్మ సరిగఁ జేయనిచో పితరులు దృఢపాశములచే బంధింపఁబడి పూర్వోక్తము లగుకష్టముల ననుభవించెదరు. ఓ వైనతేయా! యమపురమునకు నాలుగు ద్వారములు గలవు. అందు దక్షిణ ద్వారమార్గముయొక్క వృత్తాంతమును నీకు చెప్పితిని. ఇంక నేమి వినఁగోరెదవు? అని శ్రీహరి యడిగెను.

ఇతి శ్రీగరుడపురాణే సారోద్ధారే యమమార్గనిరూపణో నామ
ద్వితీయోఽధ్యాయః.



# తృతీయాధ్యాయము

శ్రీహరి గరుడునకు యమబాధలను వివరించి చెప్పుట.

గరుడ ఉవాచ:—

యమమార్గ మతిక్రమ్య గత్వా పాపీ యమాలయే,
కీదృశీం యాతనాం భుంక్తే తన్మే కథయ కేశవ. ౧

శ్రీభగవానువాచ:—

ఆద్యంతం చ ప్రవక్ష్యామి శృణుష్వ వినతాత్మజ,
కథ్యమానేఽపి నరకే త్వం భవిష్యసి కంపితః. ౨

"శ్రీహరీ! ఇట్లు యమమార్గమును గడచి యమపురము ప్రవేశించిన తరువాత జీవులు ఎట్టి బాధల ననుభవించెదరు!" అని గరుడుఁ డడుగఁగా శ్రీహరి యిట్లు చెప్పఁదొడఁగెను.—"ఓవినతాత్మజా! పాపాత్ములనుభవించు యమయాతనలను వివరముగా చెప్పెదను. సావధానుఁడవై వినుము. నరకబాధలను వినినచో నీవు భయపడెదవు.

చత్వారింశ ద్యోజనాని చతుర్యుక్తాని కాశ్యప,
బహుభీతిపురా దగ్రే ధర్మరాజపురం మహత్. ౩
హాహాకారసమాయుక్తం దృష్ట్వా క్రందతి పాతకీ,
తత్క్రందితం సమాకర్ణ్య యమస్య పురచారిణః. ౪
గత్వా చ తత్ర తే సర్వే ప్రతీహారం వదంతి హి,
ధర్మధ్వజః ప్రతీహార స్తత్ర తిష్ఠతి సర్వదా. ౫

బహుభీతిపురమునకు నలువదినాలుగు ఆమడల దూరమున గొప్పది యగు యమధర్మరాజు పట్టణ మున్నది. అందు నరకబాధల ననుభవించుచుండు పాపుల హాహాకారములను వినుటతోడనె పాపా

---

'యాతనాదేహ మాశ్రిత్య కర్మభోగాయ యాంతి తే' ఇతి శ్రుత్వా తు గరుడో యాతనామేవ పృచ్ఛతి. 'గత్వా యమపురం పాపా యమం దృష్ట్వా సకింకరం, భుంజంతి యాతనా మాహ తృతీయ' ఇతి మాధవః యమమార్గ మితి. ౧.

త్ముఁడు అగు ప్రేత వచ్చెను. యమపురమునందుండు చారులు ఆయేదుపు విని పోయి దక్షిణద్వారమును కాచుచుండెడి ధర్మధ్వజుఁ డను ప్రతీహారితో పాపాత్ముఁడు ఒకఁడు వచ్చియున్నాఁడని చెప్పెదరు.

స గత్వా చిత్రగుప్తాయ బ్రూతే తత్ర శుభాశుభమ్,
తత స్తం చిత్రగుప్తోఽపి ధర్మరాజం నివేదయేత్. ౬
నాస్తికా యే నరా స్తత్ర మహాపాపరతా స్సదా,
తాంశ్చ సర్వాన్యథాయోగ్యం సమ్యగ్జానాతి ధర్మరాట్. ౭
తథాఽపి చిత్రగుప్తాయ తేషాం పాపం స పృచ్ఛతి,
చిత్రగుప్తోఽపి సర్వజ్ఞః శ్రవణా న్పరిపృచ్ఛతి. ౮

ద్వారపాలకుండు అగు ఆ ధర్మధ్వజుఁడు చిత్రగుప్తుని దగ్గఱకు వెళ్లి వాని పుణ్యపాపములను జెప్పును. ఆ చిత్రగుప్తుఁడు యమధర్మరాజుతోఁ జెప్పును. ధర్మరాజు వచ్చిన పాపులలో ఎవరు నాస్తికులో, ఎవరు మహాపాపాత్ములో లెస్సగు గ్రహించును. అయినను ఆతఁడు చిత్రగుప్తుని అడుగును. సర్వజ్ఞుఁడగు చిత్రగుప్తుఁడు శ్రవణులనడుగును.

శ్రవణా బ్రహ్మణః పుత్రాస్స్వర్భూపాతాళచారిణః,
దూరశ్రవణవిజ్ఞానాః దూరదర్శనచక్షుషః. ౯
తేషాం పత్న్య స్తథా భూతాశ్శ్రవణ్యః పృథగాహ్వయాః,
స్త్రీణాం విచేష్టితం సర్వం తా విజానంతి తత్త్వతః. ౧౦
నరైః ప్రచ్ఛన్నప్రత్యక్షం యత్ప్రోక్తం చ కృతం చ యత్,
సర్వ మావేదయంత్యేవ చిత్రగుప్తాయ తే చ తాః. ౧౧
చారా స్తే ధర్మరాజస్య మనుష్యాణాం శుభాశుభమ్,
మనోవాక్కాయజం కర్మ సర్వం జానంతి తత్త్వతః. ౧౨
ఏవం తేషాం శక్తిర స్తి మర్త్యామర్త్యాధికారిణామ్,
కథయంతి నృణాం కర్మ శ్రవణా స్సత్యవాదినః. ౧౩

---

౬-౭. తత్ర దక్షిణద్వారే. ౫,౬,౭,౮. ఆద్యంత మితి, ఆది మారభ్య అంతపర్యంతమ్. ౯. బ్రహ్మణః పుత్రా ఇతి సప్తభిః దూరాత్ శ్రవణే శక్తేః శ్రవణా ఇత్యపేక్షాయా మాహ. దూరదర్శనే దూరగతవస్తుప్రత్యక్షీకరణే చక్షుర్యేషాం విశేషం విజ్ఞానం యేషాం తే దూరదర్శనే. ౧౦. తే శ్రవణాః తే. ౯. పృథక్ స్త్రీవాచకం అహ్వయం నామ యాసాం తాః.

వ్రతైర్దానైశ్చ సత్యోక్త్యా యస్తోషయతి తాన్నరః,
భవంతి తస్య తే సౌమ్యాస్స్వర్గమోక్షప్రదాయినః. ౧౪
పాపినాం పాపకర్మాణి జ్ఞాత్వా తే సత్యవాదినః,
ధర్మరాజపురః ప్రోక్తా జాయంతే దుఃఖదాయినః. ౧౫

శ్రవణు లన నెవ్వరో చెప్పెదవినుము. వారు బ్రహ్మపుత్రులు. వారు స్వర్గమర్త్యపాతాళలోకములయం దప్రతిహతముగా సంచరించుచుందురు. వారికి దూరశ్రవణదూరదర్శనశక్తులుగలవు. వారిభార్యలును అట్టివారే. శ్రవణుని భార్యను శ్రవణి యందురు. ఆ శ్రవణులు ముల్లోకములలో నుండు స్త్రీల చేష్ట లన్నియు లెస్సగ గ్రహింతురు. స్త్రీలును పురుషులును గూడ ప్రత్యక్షముగను, రహస్యముగను చేసిన పాపములను వారు చిత్రగుప్తునకు చెప్పెదరు. ధర్మరాజు చారులగు ఆ శ్రవణులకు మనుష్యులు మనోవాక్కాయకర్మలతో చేసిన పాపము లన్నియు స్పష్టముగాఁ దెలిసిపోవును. దేవమనుష్యాదిసర్వప్రాణులమీఁదను అధికారము గలిగిన యాశ్రవణులకు మనుష్యాదులు చేసిన పాపములు తెలిసికొనుటకు శక్తిగలదు. వారు యథార్థముసే చెప్పెదరు. వ్రతములు చేసియు, దానములిచ్చియు, సత్యముపలికియు ఎవరు వారిని సంతోషపెట్టెదరో వారికి వారు స్వర్గసుఖముల నిచ్చెదరు. సత్యవాదులగు శ్రవణులు పాపుల చరిత్రములను యమునకుఁ దెలిపి వారికి కష్టములను కలిగింతురు.

ఆదిత్యచంద్రా వనిలో యమశ్చ
ద్యౌర్భూమి రాపో హృదయం యమశ్చ,
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యే
ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్. ౧౬

చంద్రుఁడు, సూర్యుఁడు, వాయువు, అగ్ని, అంతరిక్షము, భూమి, ఉదకము, అంతరాత్మ, యముఁడు, అహోరాత్రములు, ప్రాతః

---

తా॥ శ్రవణ్యశ్చేతి. ౧౧-౧౫. ఆదిత్యాదయోఽపి నరస్య వృత్తం శుభాశుభాచరణం జానంతి సాక్షితయా పశ్యంతీత్యర్థః. ద్యౌః అంతరిక్షం తదంతర్గతగ్రహనక్షత్రాదయో వా. హృదయం అంతరాత్మా అహంకారాదీనాం దేవతా. రాత్రిశ్చ ఉభేఇతి సంధ్యాభావ అర్థః. ధర్మః హరేర్హృదయా దుత్పన్నో యమః. ౧౬. సర్వశః సర్వే హ్యేతే

కాలము, సాయంకాలము ధర్మమును మనుష్యులు చేయు సమస్త కృత్యములను జూచుచుందురు.

ధర్మరాజ శ్చిత్రగుప్తః శ్రవణా భాస్కరాదయః,
కాయస్థం తత్ర పశ్యంతి పాపం పుణ్యం చ సర్వశః. ౧౭
ఏవం సునిశ్చయం కృత్వా పాపినాం పాతకం యమః,
ఆహూయ తా న్నిజం రూపం దర్శయత్యతిభీషణమ్. ౧౮
పాపిష్ఠా స్తే ప్రపశ్యంతి యమరూపం భయంకరమ్,
దండహస్తం మహాకాయం మహిషోపరి సంస్థితమ్. ౧౯
ప్రళయాంబుదనిర్ఘోషం కజ్జలాచలసన్నిభమ్,
విద్యుత్ప్రభాయుధై ర్భీమం ద్వాత్రింశద్భుజసంయుతమ్. ౨౦
యోజనత్రయవిస్తారం వాపీతుల్యవిలోచనమ్,
దంష్ట్రాకరాళవదనం రక్తాక్షం దీర్ఘనాసికమ్. ౨౧

ధర్మరాజు చిత్రగుప్తుఁడు శ్రవణులు సూర్యచంద్రాదులు తమ తమ స్థానములయందుండియే, మనుష్యుల పుణ్యపాపములను ఎఱింగెదరు. యముఁడిట్లు పాపాత్ముల పాపములను నిశ్చయించి వారిని బిలిచి అతిభయంకరమగు తననిజరూపమును జూపును. దండహస్తుడును, మహాశరీరుఁడును, దున్నపోతు నెక్కియున్నవాఁడును, ప్రళయకాలమునందలి మేఘముయొక్క ధ్వనిగలవాఁడును కాటుకకొండవంటి దేహకాంతికలవాఁడును, మెఱపువలె మెఱయు ఆయుధములచే భయంకరమయినవాఁడును, ముప్పదిరెండు భుజములు కలవాఁడును, మూఁడు ఆమడలపొడవు కలవాఁడును, దిగుడుబావులవంటి కండ్లుకలవాఁడును,

ధర్మరా ట్చిత్రగుప్తాదయః తత్ర స్వస్థానే స్థితాఏవ కాయస్థం శరీరే స్థితం యత్పాపం పుణ్యం చ తత్సర్వం పశ్యంతీ త్యర్థః. కాయస్థ మితి పాపపుణ్యయో ర్యేవ విశేషణం-నతు జాతిపరమ్. యే కేచిత్ చిత్రగుప్తం కాయస్థం జాతివిశేషం వదంతి, త న్న. నహి తస్మి న్పరలోకే కశ్చి జ్జాతివిశేషోఽస్తి. తత్ర త్యాకా దేవజాతిరేవ. యది జాతి విశేష స్తదా తు 'కాయస్థః పశ్యతీ' త్యేవ పాఠ స్స్యాత్. సతు కస్మిన్నపి పుస్తకే నాస్తి, అతో యదనవద్యం తత్ జ్ఞాతవ్య మితి. కించ చిత్రగుప్తస్య ద్వాదశపుత్రా స్సంతి. తేషాం వంశోద్భవా ఇమే భూమిష్ఠాః కాయస్థా భవంతీత్యపి బహుముఖగతకథానకం వదతి, తత్ గ్రంథాంతరే లోకవ్యవహారేయది భవతి, తదా భవతు నామ. అత్రాపి

దంష్ట్రాభీషణముఖుఁడును, రక్తనేత్రుఁడును, దీర్ఘనాసికుఁడును అగు ఆ యమునిఁ జూచి పాపాత్ములు భయపడుదురు.

మృత్యుజ్వరాదిభి ర్యుక్త శ్చిత్రగుప్తోఽపి భీషణః,
సర్వే దూతా శ్చ గర్జంతి యమతుల్యా స్తదంతికే. ౨౨
తం దృష్ట్వా భయభీత స్తు హాహేతి వదతే ఖలః,
అదత్తదానం పాపాత్మా కంపతే క్రందతే పునః. ౨౩

చిత్రగుప్తుఁడును మృత్యుజ్వరాది రోగములతోఁ గూడి అతి భయంకరాకారుఁడై యముని సమీపమున నుండును. యమునికంటెను భయంకరులగు దూతలు యమసమీపముననుండి గర్జించుచుందురు. ఇట్లు ఎప్పుడు నేమియు దానము చేసి యెఱుంగని పాపాత్ముఁడు వారినిఁ జూచి వడఁకిపోవుచుండును.

తతో వదతి తాన్ సర్వాన్ క్రందమానాం శ్చ పాపినః,
శోచత స్స్వాని కర్మాణి చిత్రగుప్తో యమాజ్ఞయా. ౨౪
భో భో పాపా దురాచారా అహంకార ప్రదూషితాః,
కిమర్థ మార్జితం పాపం యుష్మాభి రవివేకిభిః. ౨౫
కామక్రోధా ద్యదుత్పన్నం సంగమేన చ పాపినామ్,
తత్పాపం దుఃఖదం మూఢాః కిమర్థం చరితం జనాః. ౨౬
కృతవంతః పురా యూయం పాపాన్యత్యంతహర్షితాః,
తథైవ యాతనా భోగ్యాః కి మిదానీం పరాఙ్ముఖాః. ౨౭
కృతాని యాని పాపాని యుష్మాభిస్సుబహూన్యపి,
తాని పాపాని దుఃఖస్య కారణం చ నవంచనాః. ౨౮
మూర్ఖేఽపి పండితే వాపి దరిద్రే వా శ్రియాన్వితే,
సబలే నిర్బలే వాపి సమవర్తీ యమః స్మృతః. ౨౯
చిత్రగుప్తస్యేతివాక్యం శ్రుత్వా తే పాపిన స్తదా,
శోచంత స్స్వాని కర్మాణి తూష్ణీం తిష్ఠంతి నిశ్చలాః. ౩౦

మమ నాగ్రహ ఇతి. ౧౯-౨౧. తదంతికే యమసమీపే చిత్రగుప్తోఽపి భీషణః భయంకర ఏవాస్తే నతు కుండలాద్యలంకృత ఇతి. ౨౨-౨౬. తథైవాత్యంతహర్షేణైవ. భోగ్యాః భోక్తుం యోగ్యా ఏవ. ౨౭,౨౮. సంభావితానాం పాపాపరాధం రాజవద్ధర్మరాడపి క్షమతే-అప్రతిష్ఠితం మామేవ మారయతీతి మామంస్థా ఇత్యాహ మూర్ఖేఽపీతి. ౨౯,౩౦.

అంతట తమతమ పాపకర్మలను తలంచుకొని ఏడ్చెడి పాపాత్ములను జూచి యమునిచే ఆజ్ఞప్తుఁడై చిత్రగుప్తుఁ డిట్లు పలుకును.—"ఓరీ! పాపాత్ములారా! దురహంకారులై పాపము లేలచేసితిరి? మూఢులారా! పాపాత్ములతో సహవాసము చేసి కామక్రోధవశవర్తులై నరకదుఃఖములను కలుగఁజేయు పాపముల నేల చేసితిరి? చాల ఆనందముతో పాపములను చేసినారు. తత్ఫలముల ననుభవించునపు డేల దుఃఖించెదరు? మీపాపములే మీయీబాధలకు హేతువులైనవి; గాని మేము మిమ్ము వంచించుట లేదు. యమధర్మరాజు మూర్ఖులను, పండితులను, దరిద్రులను, ధనవంతులను, బలవంతులను, బలహీనులను ఒక్కరీతినే శిక్షించును; గాని పక్షపాతముఁజూపఁడు." ఈమాటలు విని పాపాత్ములు తమ కర్మలను దలఁచుకొని చేయునది లేక సిగ్గులై మారుమాటలేనివారై యూరకుందురు.

ధర్మరాజోఽపి తాన్ దృష్ట్వా చోరవన్నిశ్చలస్థితాన్,
ఆజ్ఞాపయతి పాపానాం శాస్తిం చైవ యథోచితాః ౩౧
తతస్తే నిర్దయా దూతా స్తాడయిత్వా వదంతి చ,
గచ్ఛ పాపి న్మహాఘోరా న్నరకా నతిభీషణాన్. ౩౨
యమాజ్ఞాకారిణో దూతాః ప్రచండశ్చండకాదయః,
ఏకపాశేన తాన్ బద్ధ్వా నయంతి నరకా న్ప్రతి. ౩౩

ఇట్లు చిత్రగుప్తుని మాటలు విని దొంగలవలె సిగ్గులై యున్న ఆ పాపాత్ములను జూచి యముఁడు "వారివారి పాపములకు తగిన యాతనల ననుభవింపఁజేయుఁడు" అని భటుల కాజ్ఞాపించును. అంతట చండుఁడు ప్రచండుఁడు మున్నగుదూతలు నిర్దయాత్ములై వారినందఱ నొక్కత్రాటికి గట్టి నరకములదగ్గఱకు తీసికొనిపోవుదురు.

తత్ర వృక్షో మహా నేకో జ్వలదగ్నిసమప్రభః,
పంచయోజనవిస్తీర్ణ ఏకయోజన ముచ్ఛ్రితః. ౩౪
తద్వృక్షే శృంఖలైర్బద్ధ్వాఽధోముఖం తాడయంతి తే,
రుదంతి జ్వలితా స్తత్ర తేషాం త్రాతా న విద్యతే. ౩౫

చోరో యథా చౌర్యకర్మణి జ్ఞాతే సతి సునిశ్చలో భవతి తద్వ దిత్యర్థః. శాస్తిం ప్రాయశ్చిత్తరూపాం యాతనామ్. ౩౧-౩౩. తత్ర నరకతలే. ౩౪. అధోముఖం

ఆనరకముల సమీపమున అయిదామడల విస్తీర్ణమును ఒక యోజనము ఔన్నత్యమును గలిగిన యొకవృక్షము అగ్నిహోత్రమువలె వెలుఁగుచుండును. పాపాత్ముల నందఱను ఆచెట్టునకు తలక్రిందుగాఁ గట్టి యమదూతలు కొట్టుచుందురు. వారిని రక్షింపువా రచ్చట నెవ్వరు నుండరు.

తస్మిన్ వై శాల్మలీవృక్షే లంబంతేఽనేకపాపినః,
క్షుత్పిపాసాపరిశ్రాంతా యమదూతైశ్చ తాడితాః. ౩౬
క్షమధ్వం భోఽపరాధం మే కృతాంజలిపుటా ఇతి,
విజ్ఞాపయంతి తాన్ దూతాన్పాపిష్ఠా స్తే నిరాశ్రయాః. ౩౭
పునః పున శ్చ తే దూతై ర్హన్యంతే లోహయష్టిభిః,
ముద్గరై స్తోమరైః కుంతై ర్గదాభి ర్ముసలై ర్భృశమ్. ౩౮

అనేకపాపాత్ములు ఆబూరుగుచెట్టునకు కట్టఁబడి వ్రేలాడుచుందురు. క్షుత్పిపాసాపరిశ్రాంతులగు ఆజీవులు "మమ్ము రక్షింపుఁడు" అని దోయిలించుకొని ప్రార్థింతురు; గాని యామాటలను వినిపించుకొనక యమదూతలు వారిని మాటిమాటికిని ఇనుపయూచలతోడను పలుసాధనములతోడను మోదుచుందురు.

తాడనా చ్చైవ నిశ్చేష్టా మూర్ఛితాశ్చ భవంతి తే,
తథా నిశ్చేష్టితాన్ దృష్ట్వా కింకరా స్తే వదంతి హి. ౩౯
భోభో పాపా దురాచారాః కిమర్థం దుష్టచేష్టితమ్,
సులభాని న దత్తాని జలా న్యన్నా న్యపి క్వచిత్. ౪౦
గ్రాసార్థ మపి నో దత్తః న శ్వ వాయసయో ర్బలిః,
నమస్కృతా నాతిథయో న కృతం పితృతర్పణమ్. ౪౧
యమస్య చిత్రగుప్తస్య న కృతం ధ్యాన ముత్తమమ్,

బధ్వా. ౩౫-౩౯. దుష్టచేష్టితం దుష్టాచరణం కిమర్థం కృత మితి శేషః. ౪౦. బలిరితి వైశ్వదేవాదిక మపి న కృత మిత్యర్థః. ౪౧. కించ త్వయా యాతనానివర్తకం యమచిత్రగుప్తయో ర్ధ్యానం మంత్రజప శ్చాపి న కృత ఇత్యాహుః. యమస్యేతి ధ్యానమంత్రౌ మంత్రమహోదధావుక్తౌ. త ద్యథా - "పాథస్సంయుత మేఘసన్నిభతనుః ప్రద్యోతనస్యాత్మజో నౄణాం పుణ్యకృతాం శుభావహవపుః పాపీయసాం దుఃఖకృత్, శ్రీమాన్ దక్షిణదిక్పతి ర్మహిషగో భూషాంబరాలంకృతో ధ్యేయ స్సంయమనీ

న జప్తశ్చ తయో ర్మంత్రో న భవేద్యేన యాతనా. ४२
నాపి కించి త్కృతం తీర్థం పూజితా నైవ దేవతాః,
గృహాశ్రమస్థితే నాపి హంతకారోపి నోద్ధృతః. ४३
శుశ్రూషితాశ్చ నో సంతో భుజ్‌క్ష్వ పాపఫలం స్వకమ్,
యత స్త్వం ధర్మహీనోసి తతస్సంతాడ్యసే భృశమ్. ४४
క్షమాపరాధం కురుతే భగవాన్ హరి రీశ్వరః,
వయం తు సాపరాధానాం దండదా హి తదాజ్ఞయా. ४५
ఏవ ముక్త్వా చ తే దూతా నిర్దయం తాడయంతి తాన్,
జ్వలదంగారసదృశాః పతితా స్తాడనా దధః. ४६

ఇట్లు కొట్టఁబడి చేష్టలు ఉడిగియున్న పాపాత్ములనుజూచి యమభటులు ఇట్లు పలుకుదురు.— "ఓ పాపాత్ములారా! మీరు దుష్టకర్మల నేలచేసితిరి? ఒకప్పుడైనను మిగులసులభము లగు జలదానాదులైన నేల చేయకపోయితిరి! వైశ్వదేవమును చేయరైతిరి. అతిథిపూజ, పితృతర్పణము మున్నగు నిత్యనైమిత్తికాదికర్మలనుగూడ చేయరైతిరి. యముని యొక్కయు చిత్రగుప్తునియొక్కయు మంత్రములు యమయాతనలను తొలఁగించును. వానినైన జపింపరైతిరి. గృహస్థులు అయ్యు దేవపూజనైన చేయలేదాయె. తీర్థక్షేత్రములను సేవింపలేదు. సత్పురుషులను పూజింపలేదు. అన్నదానము చేయలేదు. కావున మీరు చేసికొనిన పాపములను అనుభవింపక తీఱదు. మీతప్పిదములను ఈశ్వరుఁడు మాత్రమే క్షమింపఁగలఁడు. అతని యానతిచొప్పున మేము పాపులను దండింతుము." యమదూతలు ఇట్లు పలుకుచు మఱలమఱల కొట్టుచుండఁగా ఆ పాపులు చెట్టునుండి క్రింద పడుచుందురు.

---

పతిః పితృగణస్వామీ యమో దండభృత్. అభ్యస్తోఽయం మహామంత్ర స్సకలాఘవినాశనః, నరకప్రాప్తిరోధా పాపా ద్యమభీతినివర్తకః", ఇతి. "కిరీటోజ్జ్వలం వస్త్రభూషాభిరామం విచిత్రాసనాసీన మిందుప్రభాస్యమ్, నృణాం పాపపుణ్యాని పత్రే లిఖంతం భజే చిత్రగుప్తం సఖాయం యమస్య. సిద్ధమంత్ర మిమం పుంసాం జపతాం చిత్రగుప్తకః, ప్రసన్నోఽగణయే త్పుణ్యం పాపం నైవ కదాచన" ఇతి. అత్ర రహస్యత్వాన్మంత్రా న లిఖితా. ४२. నోద్ధృతః న నిష్క్రాసితః. ४३, ४४. 'క్షమధ్వం భో అపరాధం మే' ఏత స్యోత్తర మహ. అపరాధే క్షమేతి క్షమాపరాధం తు హరిః కురుతే-

పతనా త్తస్య పత్రైశ్చ గాత్రచ్ఛేదో భవే త్తతః,
తా నధఃపతితాన్ శ్వానో భక్షయంతి రుదంతి తే. ౪౭
రుదంత స్తే తతో దూతై ర్ముఖ మాపూర్య రేణుభిః,
నిబధ్య వివిధైః పాశై ర్హన్యంతే కేపి ముద్గరైః. ౪౮
పాపినః కేపి భిద్యంతే క్రకచైః కాష్ఠవ ద్ద్విధా,
క్షిప్త్వా చాన్యే ధరాపృష్ఠే కుఠారైః ఖండశః కృతాః. ౪౯
అర్ధం ఖాత్వాఽవటే కేచిద్భిద్యంతే మూర్ధ్ని సాయకైః,
అపరే యంత్రమధ్యస్థాః పీడ్యంతే చేక్షుదండవత్. ౫౦
కేచిత్ప్రజ్వలమానైస్తు సాంగారైః పరితో భృశమ్,
ఉల్ముకై ర్వేష్టయిత్వా చ ధ్మాయంతే లోహపిండవత్ ౫౧
కేచి ద్ఘృతమయే పాకే తైలపాకే తథా పరే,
కటాహక్షి ప్త వటవత్ప్రక్షిప్యంతే యత స్తతః. ౫౨
కేచి న్మత్తగజేంద్రాణాం క్షిప్యంతే పురతః పథి,
బధ్వా హస్తౌ చ పాదౌ చ క్రియంతే కేప్యధోముఖాః. ౫౩

చెట్టునుండి క్రిందఁబడునపుడు దాని యాకులచే శరీరము తెగి పోవుచుండును. క్రిందఁబడిన పాపులను కుక్కలు కఱచుచుండును. ఆ బాధ కోర్వలేక వారు ఏడ్చుచుందురు. ఇట్లేడ్చెడి ఆ పాపులనోళ్లలో దుమ్ముగొట్టి త్రాళ్లతో కట్టి యమకింకరులు ముద్గరములతో కొట్టుచుందురు. ఆ బాధలకుఁ గూడ ఓర్వఁజాలక వారు ఏడ్చుచుందురు. యమభటులు కొందఱపాపులను అంపములతో కఱ్ఱలు కోసినట్లు కోయుచుందురు. కొందఱను భూమిమీఁద పరుండఁజేసి గొడ్డళ్లతో ముక్కలు చేయుచుందురు. కొందఱను మొలవఱకును భూమిలో పాతిపెట్టి బాణములతో శిరములు ఛేదించుచుందురు. కొందఱను చెఱుకుగడలను వలె గానుగులో పెట్టి త్రిప్పుచుందురు. కొందఱను నిప్పులలో నుంచి

---

తదగ్రే ఇదం కిమర్థం నోక్తం యత్రానంతాపరాధానాం క్షమా స్యాదితి భావః. ౪౫-౪౯. అవటే గర్తేఽర్ధం ఖాత్వా కటిపర్యంతం రజోభిః పూరయిత్వా దృఢ లక్ష్యం కృత్వేత్యర్థః. ౫౦. ఉల్ముకైః జ్వలత్కాష్ఠైశ్చ పరితః స్సమంతా ద్వేష్టయిత్వా భృశ మత్యంతం ధ్మాయంతే భస్త్రాభి ర్ధమంతే. ౫౧. వటో వటక స్తద్వత్ ప్రక్షిప్యంతే. ౫౨. శలాకయా ఊర్ధ్వాధోముఖాః క్రియంతే. ౫౩-౫౪. అమిషగృధ్నుభిః

ఇనుము కాల్చినట్లు సమ్మెటలతోఁ సాగఁగొట్టెదరు. సలసల క్రాఁగు నేతిలోఁ గొందఱను, నూనెలోఁ గొందఱను పడవైచి లేపుచుందురు. కొందఱను కాళ్లుచేతులు కట్టి బోరగిలఁ బరుండఁబెట్టి ఏనుఁగులచే త్రొక్కింతురు.

క్షిప్యంతే కేఽపి కూపేషు పాత్యంతే కేఽపి పర్వతాత్,
నిమగ్నాః కేఽపి కుండేషు తుద్యంతే క్రిమిభిః పరే. ౫౪
వజ్రతుండై ర్మహాకాకై ర్గృధ్రై రామిషగృధ్నుభిః,
నిష్కృష్యంతే శిరోదేశే నేత్రే చాస్యే చ చంచుభిః. ౫౫
ఋణం ద్రై ప్రార్థయంత్యన్యే దేహి దేహి ధనం మమ,
యమలోకే మయా దృష్టో ధనం మే భక్షితం త్వయా. ౫౬
ఏవం వివదమానానాం పాపినాం నరకాలయే,
ఛిత్వా సందంశకై ర్గాత్రా న్మాంసఖండాన్ దదంతి చ. ౫౭

కొందఱను నూతులలోఁ బడఁద్రోయుదురు. మఱికొందఱను పర్వతాగ్రములనుండి క్రిందికి గెంటివేయుదురు. కొందఱను పురుగుల గుంటలలోఁ బడగెంటుదురు. ఆపురుగులు పాపాత్ముల ననేకవిధముల హింసించుచుండును. వజ్రపుముక్కులుగల బొంతకాకులు శిరస్సుల మీఁదను కండ్లలోను నోళ్లయందును పొడిచి మాంసమును పీకుకొని తినుచుండును. మఱియు ఇహలోకమున ఋణముచేసి ఆఋణముతీర్చని మహాపాపులను ఆఋణ మిచ్చినవారు "నాడబ్బు హరించి యెక్కడకుఁ బోయెదవు? ఎన్నిచోట్ల వెదకినను కనఁబడ వైతివి. యమలోకమున దాఁగుకొంటివా?" యని గద్దించుచుందురు. యమభటులు ఇట్లు వివాదపడు ఆపాపుల శరీరములను ముక్కలుముక్కలుగా ఖండించి వేయుచుందురు.

ఏవం సంతాడ్య తా న్దూతా స్సంక్రమ్య యమశాసనాత్,

---

ర్మాంసలుబ్ధైః – శిరోదేశే మస్తకే – 'శిరోద్దేశే' ఇతి పాఠే నాడీస్థానే. అత్ర కాకాః వజ్రతుండై ర్మస్తకం విదార్య నాడిం చోత్పాట్య తదంతర్గతం మజ్జాం మాంసం భక్షయంతీ త్యర్థః. కించ నేత్రే నేత్రస్థానే చ ముఖే చ నిష్కృష్యంతే. ౫౫-౫౬. యథా నృపస్యాధికారిణః ప్రథమం సాపరాధం సంతాడ్య పశ్చాత్ కారాగారే

తామిస్రాదిషు ఘోరేషు క్షిప్యంతే నరకేషు చ. ౫౮
నరకా దుఃఖబహుళా స్తత్ర వృక్షసమీపతః,
తేష్వస్తి యన్మహద్దుఃఖం తద్వాచామప్యగోచరమ్. ౫౯

యమదూతలు ఇట్లు కొట్టి తిట్టి యమాజ్ఞచే పాశములతోఁ గట్టి బరబర యీడ్చుకొనిపోయి ఘోరము లగు తామిస్రాదినరకములలోఁ గూలఁద్రోయుదురు. ఆ బూరుగుచెట్టుసమీపమున బహు దుఃఖప్రదము లగు నరకము లనేకములు గలవు. వానిని వర్ణింప నెవ్వరితరము?

చతురశీతిలక్షాణి నరకా స్సంతి ఖేచర!,
తేషాం మధ్యే ఘోరతమా ధౌరేయా స్త్వేకవింశతిః. ౬౦
తామిస్రో లోహకుండశ్చ మహారౌరవశాల్మలీ,
రౌరవః కుడ్మలః కాలసూత్రకః పూతిమృత్తికా. ౬౧
సంఘాతో లోహితోదశ్చ సవిష స్సంప్రతాపనః,
మహానిరయకాకోలౌ సంజీవనమహాపథౌ. ౬౨
అవీచి రంధతామిస్రః కుంభీపాక స్తథైవచ,
సంప్రతాపననామైక స్తపన స్త్వేకవింశతిః. ౬౩
నానాపీడామయాస్సర్వే నానాభేదైః ప్రకల్పితాః,
నానాపాకవిపాకాశ్చ కింకరాఖ్యై రధిష్ఠితాః. ౬౪

వైనతేయా! ఎనుబదినాలుగులక్షల నరకములుగలవు. వానిలో ముఖ్యము లగు కొన్నిటిపేరులను చెప్పెదను. తామిస్రము, లోహకుండము, మహారౌరవము, శాల్మలి, రౌరవము, కుడ్మలము, కాలసూత్రము, పూతిమృత్తిక, సంఘాతము, లోహితోదకము, సవిషము, సంప్రతాపనము, మహానిరయము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, సంప్రతాపనము, ప్రతాపనము అని యిరువదియొక్క మహానరకములు గలవు. ఎనుబది

---

నృపాజ్ఞయా ప్రక్షిపంతి తద్వ దత్రా పీత్యాహ. ఏవ మితి. ౫౮. గోచరం వర్ణయితు మశక్యమ్, స్వభోగవేద్యత్వా దతః కిం వర్ణయా మీతి. ౫౯. ధౌరేయాః ప్రధానాః అతిదుఃఖదా ఇత్యర్థః. ౬౦. తానేవాహ. తామిస్ర ఇతి త్రిభిః. గ్రంథవిస్తరభయా న్నామనిరుక్తి ర్న కృతా. ౬౨, ౬౩. నానాప్రకారాణాం పాపానాం విపా

నాలుగులక్షలనరకములలో నవి అనేకబాధలకు స్థానములు. అనేకభేద ములతో కల్పితములు, ఆయామహాపాపములకు తగినవియునై క్రూరా గ్రేసరులగు అనేకయమకింకరులతో నిండియుండును.

ఏతేషు పతితా మూఢాః పాపిష్ఠా ధర్మవర్జితాః,
తత్ర భుంజంతి కల్పాంతే తాస్తా నరకయాతనాః. ౬౫
యాస్తామిస్రాంధతామిస్రా రౌరవాద్యాశ్చ యాతనాః,
భుజ్క్తే నరో వా నారీ వా మిథస్సంగేన నిర్మితాః. ౬౬

ధర్మమును జేసియెఱుఁగని మహాపాపాత్ములు ఈమహానరకముల యందుఁ బడి కల్పాంతమువఱకును ఆయానరకబాధల ననుభవింతురు. స్త్రీలుగాని, పురుషులుగాని పరస్పరసంగమముచే నిర్మితము లగు అంధ తామిస్రాదినరకములలోఁ బడి యాతనల ననుభవింతురు.

ఏవం కుటుంబం బిభ్రాణ ఉదరంభర ఏవ వా,
విసృజ్యేహోభయం ప్రేత్య భుజ్క్తే తత్ఫలమీదృశమ్. ౬౭
ఏకః ప్రపద్యతే ధ్వాంతం హిత్వేదం స్వం కళేబరమ్,
కుశలేతరపాథేయో భూతద్రోహేణ యద్భృతమ్. ౬౮

కుటుంబపోషణపరుఁడైనను, కేవలోదరంభరుఁడైనను నరుఁడు ఇహలోకమందే కుటుంబమును స్థూలశరీరమును విడిచి పరలోకమున ఆపాపమునకు తగినఫలము ననుభవించును. భూతద్రోహముచేసి అన్యాయముగా సంపాదింపఁబడిన ధనముతో పోషింపఁబడిన ఈస్థూల శరీరమును విడిచి పాపపాథేయుఁడై ఒక్కఁడే మహానరకములను బొంది పాపమును అనుభవించును. దారపుత్త్రాదులు అన్యాయార్జితధన మును అనుభవించినను వారలకు పాపము ఉండదు. వారికి నరకమును

---

తాః ఫలరూపాశ్చేతి. ౬౪. ౬౫. మిథస్సంగేన పరస్పరాసక్త్యా. ౬౬. యాతనా ముపసంహరతి ఏవ మితి. ఉభయం కుటుంబం స్వదేహం చ-ప్రేత్య పరలోకే. ౬౭. ఉపార్జితం ధనం భుంజంతి. బహవః కర్తైవ తు నరకం యాతీ త్యాహ.ఏక ఇతి. భూత ద్రోహవైరేణ యద్భృతం పోషితం త దిదం కళేబరం స్థూలశరీరం ఇహైవ హిత్వా-కుశలా దితర త్పాపం త దేవ పాథేయం భోగ్యం యస్య స కర్తైవ ధ్వాంతం తమః నర కం ప్రపద్యతే-నతు భోక్తారః.తథా చ స్మృతిః. "దేశగ్రామకులాని స్యుర్భాగభాంజి కృతాదిషు, కలౌతు కేవలం కర్తా ఫలభు క్పుణ్యపాపయోః" ఇతి. ౬౮. నను పాపమపి

లేదు. కుటుంబపోషకుఁ డొక్కఁడే పుణ్యపాపములను అనుభవింప వలెను. కావున అన్యాయముగా ధనము నార్జించి కుటుంబపోషణము చేయరాదు.

దైవేనాసాదితం తస్య శమలం నిరయే పుమాన్,
భుఙ్క్తే కుటుంబపోషస్య హృతద్రవ్య ఇవాతురః. ౬౯
కేవలేన హ్యధర్మేణ కుటుంబభరణోత్సుకః,
యాతి జీవోఽన్ధతామిస్రం చరమం తమసః పదమ్. ౭౦
అధస్తాన్నరలోకస్య యావంతో యాతనాదయః,
క్రమశస్సమనుక్రమ్య పునరత్రాఽవ్రజేచ్ఛుచిః. ౭౧

అన్యాయార్జితద్రవ్యమువలన కుటుంబపోషణము చేసినవానికి దైవము నరకమున బాధలు సిద్ధముగా నుంచును. కేవలము అధర్మమార్గమునందే కుటుంబపోషణము గావించినవాఁడు ఘోరాతిఘోరమును, మహాదుఃఖప్రదము నగు అంధతామిస్రనరకమును పొందును. జీవుఁడు ఇట్లు నరకమును పొంది అచ్చటి యాతనల నన్నిటిని అనుభవించి సూకరాద్యనేకజన్మముల నెత్తి క్షీణపాపుఁ డై మరల నరలోకమున మనుష్యుఁడే యై పుట్టును.

ఇతి శ్రీగరుడపురాణే-సారోద్ధారే-యమయాతనానిరూపణో నామ
తృతీయోఽధ్యాయః.

---

విహాయ కిం న గచ్ఛే త్తత్రాహ. దైవేనేతి. తస్య కుటుంబపోషస్య శమలం పాపం దైవేన ఈశ్వరేణ ప్రాపితం భుంక్తే. అతః పాపత్యాగేన స్వతంత్ర ఇతి భావః. ౬౯. నను కుటుంబపోషణం తు విహిత మేవ తత్రాహ. కేవలేన హ్యధర్మేణేతి తమసః నరకస్య చరమం పదం అంతిమం స్థానం మహాదుఃఖప్రద మిత్యర్థః. ౭౦. పునర్మనుష్యశరీరప్రాప్తికారణ మాహ. నరలోకస్య మనుష్యదేహప్రాప్తే రధస్తా దర్వాక్ యావంత్యో యాతనాః ఆదిశబ్దేన సూకరాదియోనయో యాస్తా స్సర్వాః క్రమేణ సంప్రాప్య భోగేన క్షీణపాపః శుచిస్సన్ అత్ర పునః నరత్వం ప్రాప్నోతీత్యర్థః. ౭౧.

ఇతి శ్రీగరుడపురాణటీకాయాం యమయాతనానిరూపణో నామ
తృతీయోఽధ్యాయః.

# చతుర్థాధ్యాయము

శ్రీహరి నరకప్రదములగు పాపములను వివరముగా చెప్పుట.

శ్రీగరుడ ఉవాచ :—

కైర్గచ్ఛంతి మహామార్గే? వైతరణ్యాం పతంతి కైః?
కైః పాపైర్నరకే యాంతి? తన్మే కథయ కేశవ!. ౧

శ్రీభగవానువాచ:—

సదైవాకర్మనిరతా శ్శుభకర్మపరాఙ్ముఖాః,
నరకాన్నరకం యాంతి దుఃఖాద్దుఃఖం భయాద్భయమ్. ౨

"శ్రీహరీ! ఎట్టి పాపములను జేసిన యమయాతనల ననుభవింతురు? ఎట్టిపాపములు చేసిన వైతరణియందు పడెదరు? ఎట్టి పాపములు చేసిన నరకములపాలు అయ్యెదరు? ఆపాపములను వివరింపుము" అని గరుడుఁడు అడుగఁగా శ్రీహరి యిట్లు చెప్పెను. "ఓగరుడా! పాపకర్మలయందే యిచ్ఛ కలవారును, పుణ్యకర్మల నెప్పుడును కలనైన తలంపనివారును, ఎన్నటికిని సద్గతినిఁ బొందరు. వారికి దుఃఖములో దుఃఖమును, నరకములో నరకమును, భయమున భయమునే కలుగుచుండును.

ధర్మరాజపురే యాంతి త్రిభిర్ద్వారైస్తు ధార్మికాః,
పాపాస్తు దక్షిణద్వారమార్గేణైవ వ్రజంతి తత్. ౩
అస్మిన్నేవ మహాదుఃఖే మార్గే వైతరణీనదీ,
తత్ర యే పాపినో యాంతి తానహం కథయామి తే. ౪

---

'పాపాన్యేవ మనుష్యాణాం యాతనా దుఃఖదాని చ', ఇతి శ్రుత్వా చ గరుడః పాపాన్యేవవిపృచ్ఛతి. 'శాస్త్రేషు బహుధా ప్రోక్తం నరకప్రదపాతకమ్, తస్య పారం సముద్ధృత్య చతుర్థే ప్రాహ మాధవః,' కైరితి. ౧. అత్ర దుఃఖస్యానంతరం సుఖమిత్యాగమాపాయిత్వం న కింతు పాపినాం దుఃఖభయానంతరం దుఃఖభయాన్యేవేతి నిరూపయన్ శ్రీభగవానువాచ. సదై వేతి. ౨.తత్పురం ప్రతి. ౩. అస్మిన్ దక్షిణ



ధర్మము చేసినవారు పశ్చిమోత్తరప్రాగ్ద్వారములనుండి యమపురము ప్రవేశింతురు. పాపాత్ములు దక్షిణద్వారమునుండి ప్రవేశింతురు. అనేకవిధము లగు దుఃఖములకు నాకర మగు నీదక్షిణద్వారమునందే వైతరణి గలదు. ఆమార్గమున యమపురమునకుఁ బోవు పాపాత్ములను జెప్పెద వినుము.

బ్రహ్మఘ్నాశ్చ సురాపాశ్చ గోఘ్నా వా బాలఘాతుకాః,
స్త్రీఘాతీ గర్భపాతీ చ యే చ ప్రచ్ఛన్నపాపినః. ౫
యే హరంతి గురోర్ద్రవ్యం దేవద్రవ్యం ద్విజస్య వా,
స్త్రీద్రవ్యహారిణో యే చ బాలద్రవ్యం ద్విజస్య యే. ౬
యే ఋణం న ప్రయచ్ఛంతి యే వై న్యాసాపహారకాః,
విశ్వాసఘాతకా యే చ సవిషాన్నేన మారకాః. ౭
దోషగ్రాహీ గుణాశ్లాఘీ గుణవత్సు సమత్సరాః,
నీచానురాగిణో మూఢాః సత్సంగతిపరాఙ్ముఖాః. ౮
తీర్థసజ్జనసత్కర్మగురుదేవవినిందకాః,
పురాణవేదమీమాంసాన్యాయవేదాంతదూషకాః. ౯
హర్షితా దుఃఖితం దృష్ట్వా హర్షితే దుఃఖదాయకాః,
దుష్టవాక్యస్య వక్తారో దుష్టచిత్తాశ్చ యే సదా. ౧౦
న శృణ్వంతి హితం వాక్యం శాస్త్రవార్తాం కదాపి న,
ఆత్మసంభావితాః స్తబ్ధా మూఢాః పండితమానినః. ౧౧
ఏతే చాన్యే చ బహవః పాపిష్ఠా ధర్మవర్జితాః,
గచ్ఛంతి యమమార్గే హి రోదమానా దివానిశమ్. ౧౨

బ్రాహ్మణహంతకులు, కల్లుద్రావువారు, గోహంతకులు, శిశుగోహంతకులు, స్త్రీలను హింసించువారు, గర్భపాతమును జేసినవారు, రహస్యముగా పాపములు చేయువారు, గురువులయొక్కయు, బ్రాహ్మణులయొక్కయు, దేవతలయొక్కయు ద్రవ్యములను హరించువారు, స్త్రీలద్రవ్యమును హరించువారు, పిల్లలద్రవ్యమును హరించువారు, అప్పుతీర్చని

మార్గే. ౪. బ్రహ్మఘ్నా ఇత్యాదిపదానాం 'గచ్ఛంతి యమమార్గేహి' ఇత్యనేనసంబంధః.
౫,౬,౭. దోషానేవ గృహ్ణాతీతి దోషగ్రాహీ - గుణానాం శ్లాఘాం న కరోతీతి గుణా

వారు, దాచియుంచిన ద్రవ్యము నపహరించెడువారు, విశ్వాసఘాతకులు, అన్నములో విషము పెట్టి పరులను చంపువారు, దోషములను శ్లాఘించెడివారు, గుణములను నిందించెడివారు, గుణవంతులను పరిహసించువారు, నీచులతో చెలిమిచేయువారు, సత్పురుషులతో సహవాసము చేయనివారు, పుణ్యతీర్థములను, సజ్జనులను, సత్కర్మలను, గురువులను, దేవతలను నిందించువారలు, పురాణములను, వేదములను, మీమాంసాన్యాయశాస్త్రములను, వేదాంతశాస్త్రమును దూషించువారు, పరులకు సంతోషము కలిగిన దుఃఖించువారు, పరులకు దుఃఖము కలిగిన సంతోషించువారు, దుష్టవాక్యములను పలుకువారు, దుష్టస్వభావము కలవారు, పెద్దలహితోపదేశములను విననివారు, శాస్త్రీయవచనములను మన్నింపనివారు, ఆత్మస్తుతిపరాయణులును, పరనిందాపరతంత్రులు, స్తబ్ధులు, పండితంమన్యులు. ధర్మముచేయనివారు, ఇంకను ఇట్టిపాపకార్యములను జేయువారును, దక్షిణమార్గమునఁ బడి రాత్రింబగళ్లు ఏడ్చుచు పోయెదరు.

యమదూతై స్తాడ్యమానా యాంతి వైతరణీం ప్రతి,
తస్యాం పతంతి యే పాపా స్తా నహం కథయామి తే. ౧౩
మాతరం యేఽవమన్యంతే పితరం గురు మేవ చ,
ఆచార్యం చాపి పూజ్యం చ తస్యాం మజ్జంతి తే నరాః. ౧౪
పతివ్రతాం సాధుశీలాం కులీనాం వినయాన్వితామ్,
స్త్రియం త్యజంతి యే ద్వేషా ద్వైతరణ్యాం పతంతి తే. ౧౫
సతాం గుణసహస్రేషు దోషా నారోపయంతి యే,
తే ష్వవజ్ఞాం చ కుర్వంతి వైతరణ్యాం పతంతి తే. ౧౬
బ్రాహ్మణాయ ప్రతిశ్రుత్య యథార్థం న దదాతి యః,
ఆహూయ నా స్తి యో బ్రూయా త్తయోర్వాసశ్చ సంతతమ్. ౧౭
స్వయం దత్త్వాపహర్తా చ దానం దత్త్వాఽనుతాపకః,

శ్లాఘీ-మత్సరాః ఠ దుత్కర్ష మసహమానాః, నీచేష్వేవ అనురాగః స్నేహః యేషామ్. ౮-౧౬. ఏతావ ద్దానం తుభ్యం ప్రదాస్యామీతి ప్రతిశ్రుత్య ప్రతిజ్ఞాయ - యథార్థం యథాప్రతిజ్ఞం ఆగచ్ఛ దానం దాస్యామీ త్యాహూయ పశ్చా న్నాస్తి తుభ్యం న దదామీతి బ్రూయాత్. ౧౭. స్వదత్తస్యాపి దానస్య యో హర్తా-అనుతాప

పరవృత్తిహరశ్చైవ దానే దత్తే నివారకః. ౧౮
యజ్ఞవిధ్వంసకశ్చైవ కథాభంగకరశ్చ యః,
క్షేత్రసీమాహరశ్చైవ యశ్చ గోచరకర్షకః. ౧౯
బ్రాహ్మణో రసవిక్రేతా యది స్యా ద్వృషలీపతిః,
వేదోక్తయజ్ఞా దన్యత్ర స్వాత్మార్థం పశుమారకః. ౨౦
బ్రహ్మకర్మపరిభ్రష్టో మాంసభోక్తా చ మద్యపః,
ఉచ్ఛృంఖలస్వభావో య శ్శాస్త్రాధ్యయనవర్జితః. ౨౧
వేదాక్షరం పఠేచ్ఛూద్రః కాపిలం యః పయః పిబేత్,
ధారయే ద్బ్రహ్మసూత్రం చ భవే ద్వా బ్రాహ్మణీపతిః. ౨౨
రాజభార్యాభిలాషీ చ పరదారాపహారకః,
కన్యాయాం కాముకశ్చైవ సతీనాం దూషకశ్చ యః. ౨౩
ఏతే చాన్యే చ బహవో నిషిద్ధాచరణోత్సుకాః,
విహితత్యాగినో మూఢా వైతరణ్యాం పతంతి తే. ౨౪

తల్లిదండ్రులకు, గురువునకు, ఆచార్యునకు, పూజ్యులకు అవమానము గలిగించువారును, పతివ్రతయు, సాధుశీలయు, కులీనయు, వినయాన్వితయు నగుభార్యను నిర్నిమిత్తముగా ద్వేషమువలన విడుచు

---

కః వృథైవ దత్తమితి పశ్చాత్తాపకరః దుర్వాక్యై ర్వా ప్రసన్నైర్వా సంతాపకరో వా-దానే అన్యేన దత్తే సతి-స్వయం దత్తాపహర్తా చేత్యాదిపదానామ్ "వైతరణ్యాం పతంతి తే" ఇత్యనేన సంబంధః. ౧౮. యజ్ఞేషు ద్రవ్యయజ్ఞాదిషు విఘ్నకర్తా-హరేః కథాయాః నివారణకర్తా-క్షేత్ర ఇత్యుపలక్షణం గ్రామస్యాపి పరంపరాగతసీమాహర్తా - గోచరకర్షకః గావ శ్చరంతి యస్మి న్నితి గోచరం వనం-భాషాయాం 'బీడు' ఇతి ప్రసిద్ధమ్, తస్మిన్ కృషికర్తా. ౧౯. వృషల్యాః స్మృతౌ కథితాః "వేశ్యాఽసతీ చ దాసీ చ కుమారీ స్యా ద్రజస్వలా, దయా చ సంగ్రహణీ భార్యా వృషల్యః పంచ సంస్మృతాః" వేశ్యా ఇత్యత్ర 'వంధ్యే'తి పాఠః క్వాచిత్కః. అన్యత్ర యజ్ఞం వినా-వేదోక్తయజ్ఞేషు పశుహింసా విహితైవ తథాచ శ్రుతిః 'దేవా యు ద్యజ్ఞం తన్వానాః, అబధ్నన్ పురుషం పశుమ్' ఇతి. స్మృతిశ్చ "యజ్ఞార్థం పశవ స్సృష్టా స్స్వయమేవ స్వయంభువా, అత స్త్వాం ఘాతయా మ్యత్ర తస్మా ద్యజ్ఞే వధోఽవధః" ఇతి. ౨౦. ఉచ్ఛృంఖలస్వభావః నిరంకుశస్వభావః. ౨౧. కపిలాయాః గోః ఇదం కాపిలమ్. ౨౩. కాముకః కామాభిలాషీ-సతీనాం పతివ్రతానాం దూషకః బలాత్ శీలభ్రష్టకరః.

వాఁడును, సజ్జనులయందు దోషారోపణము చేయువారును, సత్పురుషుల నవమానించువారును, బ్రాహ్మణులకు ఇచ్చెద నని మాటయిచ్చి ఈయనివారును, దానము ఇచ్చెద నని పిలిచి నీ కివ్వ ననువారును, తాము ఇచ్చినదానిని మరల పుచ్చుకొనువారును. దానముచేసి పిదప అయ్యో, ఇచ్చివేసితిమే యని పరితపించువారును, పరవృత్తుల నపహరించువారును, దానముచేయవద్దని దాతలకు బోధించువారును, యజ్ఞవిధ్వంసకులును, హరికథలకు విఘ్నములు గలిగించువారును, పరక్షేత్రములను, సరిహద్దులను అపహరించువారును, పశువుల బీళ్లు దున్నువారును, పాదరసమును అమ్ముబ్రాహ్మణుఁడును, శూద్రస్త్రీభర్తయగు బ్రాహ్మణుఁడును, యజ్ఞములలో అగ్నినిమిత్తముగాక తమనిమిత్తము పశువులను హింసించువారును, వేదోక్తకర్మలను చేయనివారును, మాంసమును భుజించువారును, కల్లుద్రావువారును, నిరంకుశస్వభావులును, శాస్త్రములు, వేదములు చదువనివారును, కపిలగోవుల పాలను ద్రావువారును, యజ్ఞోపవీతములను ధరించు ద్విజేతరులును, బ్రాహ్మణస్త్రీలను పెండ్లియాడినవారును, రాజభార్యలను పొందఁగోరువారును, పరభార్యాపహారులును, కన్యలతో రమింపఁగోరువారును, పతివ్రతలను దూషించువారును, శాస్త్రములు నిషేధించు పనులు చేయువారును, శాస్త్రములు విధించు పనులు చేయనివారును, ఇంకను ఇట్టి పాపకార్యములు చేయువారును వైతరణీనదియందు కూలఁబడెదరు.

సర్వం మార్గ మతిక్రమ్య యాంతి పాపా యమాలయే,
పునర్యమాజ్ఞయాఽఽగత్య దూతా స్తస్యాం క్షిపంతి తాన్. ౨౫
యావై ధురంధరా సర్వం ధారేయాణాం ఖగాధిప,
అత స్తస్యాం ప్రక్షిపంతి వైతరణ్యాం చ పాపినః. ౨౬

౨౩,౨౪. దూతాః పునః ప్రత్యాగత్య వైతరణ్యాం తాన్ క్షిపంతి. ౨౫. నను పూర్వం నరకేష్వేవ కిం న పాత్యంతే-అత ఆహ. యా ఇతి. ధారేయాణాం సర్వనరకేషు ముఖ్యానాం - ఏకవింశతినరకాణాం ధురం యాతనాప్రయాసం ధారయతీతి ధురంధరా-ఏకైవ సర్వనరకాణాం దుఃఖప్రదేత్యర్థః. అతో నరకాన్ విహాయ పూర్వం వైతరణ్యాం క్షిపంతీతి భావః. ౨౬. దానాద్యుపాయం వినైవ తస్యాం దుఃఖం భజ

కృష్ణా గార్యది నో దత్తా నోర్ధ్వదేహక్రియాః కృతాః,
తస్యాం భుంక్త్వా మహద్దుఃఖం యాంతి వృక్షం తతోద్భవమ్. ౨౭
కూటసాక్ష్యప్రదాతారః కూటధర్మపరాయణాః,
ఛలేనార్జనసంసక్తాశ్చౌర్యవృత్త్యా చ జీవినః. ౨౮
ఛేదయంత్యతివృక్షాంశ్చ వనారామవిభంజకాః,
వ్రతం తీర్థం పరిత్యజ్య విధవాశీలనాశకాః, ౨౯
భర్తారం దూషయేన్నారీ పరం మనసి ధారయేత్,
ఇత్యాద్యాశ్శాల్మలీవృక్షే భుంజతే బహుతాడనమ్. ౩౦

యమమార్గము నంతనుదాటి యమలోకమును ప్రవేశించిన పాపాత్ములను యముని సెలవుచొప్పున కింకరులు ఆవైతరణియందుఁ గూలఁద్రోయుదురు. గోదానము చేయనివారును, ఎవరికి ఊర్ధ్వదేహక్రియలు చేయఁబడవో వారును ఆనదియందు అనేకదుఃఖముల ననుభవించి దానియొడ్డునున్న బూరుగుచెట్టు నాశ్రయించుకొనియుందురు. తప్పుసాక్ష్యములు పలుకువారును, వేదబాహ్యములగు ధర్మములయందాసక్తిగలవారును, వంచనముచేసి డబ్బుసంపాదించువారును, దొంగతనముచే జీవించువారును, పెద్దపెద్ద వృక్షములను పడఁగొట్టువారును, ఫలవృక్షములను నరుకువారును, పూలతోఁటలను పాడుచేయువారును, వ్రతములను తీర్థయాత్రలను జేయనీయక వితంతుస్త్రీలను మోసముచేసి లోభపెట్టి చెఱుచువారును, భర్తను విడిచి పరపురుషునిఁ గోరుచుండువారును ఇంక నిట్టివారును బూరుగుచెట్టునకుఁ గట్టఁబడి యమభటులచే కొట్టఁబడుచుందురు

తాడనాత్పతితాన్ దూతాః క్షిపంతి నరకేషు తాన్,
పతంతి తేషు యేపాపాస్తానహం కథయామి తే. ౩౧
నాస్తికా భిన్నమర్యాదాః కదర్యా విషయాత్మకాః,

తీ త్యాహ కృష్ణేతి. ౨౭. కూటసాక్ష్యం మిథ్యాసాక్ష్యం - వివదతాం మధ్యే యో మిథ్యావాదినం సంత 'మయం సత్యం వదతీ'తి బ్రువంతి తే - కూటధర్మో వేదబాహ్య ధర్మః-ఛలేన వంచనాదినా అర్జనే ధనసంచయే కూటసాక్ష్యాదయః వృక్షే తాడనం భుంజతే ఇతి తృతీయేన సంబంధః. ౨౮. అతివృక్షాన్ ఉచ్చైస్తరతరూన్ -వనం ఫల ప్రధానం-ఆరామం పుష్పప్రధానమ్. ౨౯, ౩౦, ౩౧. నాస్తికాః జగత్కర్తా ఈశ్వ

దాంభికాశ్చ కృతఘ్నాశ్చ తే వై నరకగామినః. ౩౨
కూపానాం చ తటాకానాం వాపీనాం దేవసద్మనామ్,
ప్రజాగృహాణాం భేత్తార స్తే వై నరకగామినః. ౩౩
విసృజ్యాశ్నంతి యే దారాన్ శిశూన్ భృత్యాం స్తథా గురూన్,
ఉత్సృజ్య పితృదేవేజ్యాం తే వై నరకగామినః. ౩౪
శంకుభి స్సేతుభిః కాష్ఠైః పాషాణైః కంటకై స్తథా,
యే మార్గ ముపరుంధంతి తే వై నరకగామినః. ౩౫
శివం శివాం హరిం సూర్యం గణేశం సద్గురుం బుధమ్,
న పూజయంతి యే మందా స్తే వై నరకగామినః. ౩౬
ఆరోప్య దాసీం శయనే విప్రో గచ్ఛే దధోగతిమ్,
ప్రజా ముత్పాద్య శూద్రాయాం బ్రాహ్మణ్యా దేవ హీయతే. ౩౭
న నమస్కారయోగ్యో హి స కదాపి ద్విజాధమః,
తం పూజయంతి యే మూఢా స్తే వై నరకగామినః. ౩౮

ఇట్లు కొట్టుటం జేసి క్రిందఁబడిన ఆ పాపాత్ములను యమభటులు మఱల నరకములయందు పడఁద్రోయుదురు. నరకమునకుఁబోవు పాపాత్ములను నీకుఁ జెప్పెద వినుము. నాస్తికులును, పరంపరాగతములగు ధర్మములను మర్యాదలను విడుచువారును, కదర్యులును, విషయసుఖాభిలాషులును, దాంభికులును, కృతఘ్నులును, నూతులు, చెఱువులు,

---

రో నాస్తీతి వాదకాః దానాదిఫలం పరలోకే నాస్తీతి వాదినో వా-భిన్నా దూరీకృతా పరంపరాగతధర్మ మర్యాదా యై స్తే-కదర్యా స్తు స్మృతా వుక్తాః. "ఆత్మానం ధర్మకృత్యం చ పుత్రాన్ దారాంశ్చ పీడయేత్, దేవతా౽తిథిభృత్యాంశ్చ స కదర్య ఇతి స్మృతః" ఇతి. 'ప్రాయోధర్మః కదర్యాణాం న సుఖాయ కదాచన, ఇహచాత్మోపతాపాయ పరత్ర నరకాయ చ' ఇత్యర్థః. విషయేష్వేవ ఆత్మా మనో యేషాం తే-దాంభికాః మిథ్యాచారాః లోకవంచనాయ తపోజపాదౌ ప్రవృత్తా ఇతి. కృతఘ్నాః కృతోపకారనాశకాః. ౩౨, ౩౩. విసృజ్య అశ్నంతి ద్వేషాత్ కృపణతయా వా దారాదీన్ పరిత్యజ్య అశ్నంతి, ఏకాకినఏవ మృష్టాన్నం భుంజంతి. యే చ పితృదేవానాం ఇజ్యాం యాగం ఉత్సృజ్య వైశ్వదేవ మకృత్వా. 'పితృదేవేజ్య' మితి పాఠేతు పితృదేవానాం ఇజ్యం పూజ్యం హరిం ఉత్సృజ్య తస్మై అనివేద్య అశ్నంతి యే తే వై నరకగామినః. ౩౪, ౩౫, ౩౬. ప్రజాం సంతానం-హీయతే చ్యుతో భవతి. ౩౭,

మడుగులు మున్నగువానిని పాడుచేయువారును, దేవాలయములను పడఁగొట్టువారును, ఇండ్లను కూలద్రోయువారును, భార్యన్, బిడ్డలను విడిచి ముందు తాము భుజించువారును, తల్లిదండ్రులను పూజింపని వారును, ముండ్లకంపలు, రాతిబండలు మున్నగువానిచే మార్గములను పాడుచేయువారును, శ్రీహరిని, శంకరుని, పార్వతిని, సూర్యుని, గణపతిని, సద్గురువులను, పండితులను పూజింపనివారును, దాసీసంభోగము చేయువారును, శూద్రస్త్రీయందు బిడ్డలను గనువారును, అట్టి బ్రాహ్మణులను పూజించువారును నరకములను బొందెదరు.

బ్రాహ్మణానాం చ కలహం గోయుద్ధం కలహప్రియాః,
నవర్జ్యం త్యనుమోదంతే తే వై నరకగామినః. ౩౯
అనన్యశరణస్త్రీణా మృతుకాలవ్యతిక్రమమ్,
యే ప్రకుర్వంతి విద్వేషా త్తే వై నరకగామినః. ౪౦
యేఽపి గచ్ఛంతి రాగాంధా నరా నారీం రజస్వలామ్,
పర్వ స్వప్సు దివా శ్రాద్ధే తే వై నరకగామినః. ౪౧
యే శారీరం మలం వహ్నౌ ప్రక్షిపంతి జలేఽపి చ,
ఆరామే పథి గోష్ఠే వా తే వై నరకగామినః. ౪౨
శస్త్రాణాం యే చ కర్తారః శరాణాం ధనుషాం తథా,
విక్రేతార శ్చ యే తేషాం తే వై నరకగామినః. ౪౩
చర్మవిక్రయిణో వైశ్యాః కేశవిక్రేయికాః స్త్రియః,
విషవిక్రయిణ స్సర్వే తే వై నరకగామినః. ౪౪
అనాథం నానుకంపంతి యే సతాం ద్వేషకారకాః,
వినాపరాధం దండంతి తే వై నరకగామినః. ౪౫
ఆశయా సమను ప్రాప్తా బ్రాహ్మణా నర్థినో గృహే,
న భోజయంతి పాకేఽపి తే వై నరకగామినః. ౪౬
సర్వభూతే ష్వవిశ్వస్తా స్తథా తేషు వినిర్దయాః,

---

౩౮, ౩౯. అనన్యశరణా శ్చ తాః స్త్రియ శ్చ-తాసాం స్వకీయానాం వైరేణ ఋతుదానం న దదతి యే, ౪౦-౪౩. శేషో భగ స్తం విక్రీణంతి తాః వ్యభిచారోపజీవిన్య ఇత్యర్థః. ౪౪, ౪౫. పాకే సత్యపీతి శేషః. ౪౬. కస్మిన్నపి విశ్వాసం న కుర్వంతి

సర్వభూతేషు జిహ్మా యే తే వై నరకగామినః. ౪౭
నియమా స్సముపాదాయ యే పశ్చా దజితేంద్రియాః,
విగ్లాపయన్తి తా న్భూయ స్తే వై నరకగామినః. ౪౮
అధ్యాత్మవిద్యాదాతారం నైవమన్యంతి యే గురుమ్,
తథా పురాణవక్తారం తే వై నరకగామినః. ౪౯
మిత్రద్రోహకరా యే చ ప్రీతిచ్ఛేదకరాశ్చ యే,
ఆశా చ్ఛేదకరా యే చ తే వై నరకగామినః. ౫౦

బ్రాహ్మణుల కలహమును, గోవుల యుద్ధమును నివారింపనివారును, ఋతుకాలములందు స్వస్త్రీలను పొందనివారును, రాగాంధులై బహిష్ఠ అయియున్న స్త్రీలతో రమించువారును, సర్వకాలములయందును ఉదకంబుల, దివాభాగమున, శ్రాద్ధదినమున సంభోగము చేయువారును, మలములను అగ్నియందు, జలమునందు, ఉద్యానవనములయందు, మార్గములయందు, గోష్ఠములయందును వేయువారును, శస్త్రములను, శరములను, చాపములను చేయువారును, చేయించువారును, విక్రయించువారును, చర్మవ్యాపారము చేయు వైశ్యులును, వ్యభిచరించుస్త్రీలును, విషములను అమ్మువారును, అనాథలను రక్షింపనివారును, సత్పురుషులతో విరోధించువారును, అపరాధము చేయనివారిని దండించువారును, భోజనము నాశించివచ్చిన బ్రాహ్మణునకు భోజనము పెట్టనివారును, సమస్తభూతములను నమ్మనివారును, భూతదయ లేనివారును, సర్వభూతములను వంచించువారును, నియమములను బూని అజితేంద్రియులై మఱల విడుచువారును, వేదాంతోపదేశికుని, పురాణము చెప్పెడువారిని గురువుగా భావింపనివారును, మిత్రద్రోహము చేసినవారును, ప్రీతివిచ్ఛేదకరులును, ఆశాభంగము జేయువారును నరకమునకుఁ బోవుదురు.

వివాహం దేవయాత్రాం చ తీర్థసార్థా న్విలుంపతి,
స వసే న్నరకే ఘోరే తస్మా న్నావర్తనం పునః. ౫౧
అగ్నిం దద్యా న్మహాపాపీ గృహే గ్రామే తథావనే,

అవిశ్వస్తాః శఠాః కుటిలాః. ౪౮. నియమాన్ సంధ్యావందనకృచ్ఛ్రచాంద్రాయణాదీన్ సముపాదాయ ప్రతిజ్ఞాయాప్యకృత్వా-యే అజితేంద్రియాః అదాంతమనసః

స నీతో యమ దూతైశ్చ వహ్నికుండేషు పచ్యతే. ౫౨
అగ్నినాదగ్ధగాత్రోఽసౌ యదా ఛాయాం ప్రయాచతే,
నీయతే చ తదా దూతైరసిపత్రవనాంతరే. ౫౩
ఖడ్గతీక్ష్ణైశ్చ తత్పత్రై ర్గాత్రచ్ఛేదో యదా భవేత్,
తదోచుః శీతలచ్ఛాయే సుఖనిద్రాం కురుష్వ భోః. ౫౪
పానీయం పాతు మిచ్ఛ న్వై తృషార్తో యది యాచతే,
పానార్థం తైల మత్యుష్ణం తదాదూతైః ప్రదీయతే. ౫౫
పీయతాం భుజ్యతాం పాన మన్న మూచు స్తదేతి తే,
పీతమాత్రేణ తేనైవ దగ్ధాంత్రా నిపతంతి తే. ౫౬
కథంచి త్పున రుత్థాయ ప్రలపంతి సుదీనవత్,
వివశా ఉచ్ఛ్వసంతశ్చ తే వక్తు మపి నాశకన్. ౫౭

వివాహమును, దేవయాత్రను, తీర్థయాత్రను భగ్నపఱచిన వాఁడు శాశ్వతముగ మహానరకమున ఘోరయాతనలను అనుభవించుచుండును. ఇండ్లు, గ్రామములు, వనములు తగులఁబెట్టినవానిని యమదూతలు అగ్నిగుండములలో పడఁద్రోసి కాల్చెదరు. అగ్నిదగ్ధశరీరులగువారలు నీడకుఁ గొనిపొండని ప్రార్థింప వారిని యమదూతలు అసిపత్రవనమునకుఁ గొనిపోయెదరు. అచ్చట కత్తులవలె నుండు ఆకులచే శరీరములు తఱుగుకొనిపోఁగా విలపించుచుండు పాపాత్ములను జూచి యమదూతలు ''అసిపత్రవృక్షముల నీడలయందు నిద్రబొండు'' అని పలుకుదురు. ఆపాపులు దాహము తీర్చుకొనుటకు మంచినీళ్లు ఈయవలసినదని కోరఁగా యమభటులు సలసల క్రాఁగుచుండు నూనె నిచ్చెదరు. పాపులు చేయునదిలేక కింకరుల నిర్బంధమువలన ఆనూనెను ద్రావి ప్రేగులు మండిపోఁగా క్రిందఁబడిపోయెదరు. పిదప కొంతసేపటికి ఎట్లో లేచి అతిదీనముగ విలపింతురు.

ఇత్యేవం బహుళ స్తార్క్ష్య! యాతనాః పాపినాం స్మృతాః,
కి మేతై ర్విస్తరా త్ప్రోక్తై స్సర్వశాస్త్రేషు భాషితైః. ౫౮

---

త్యజంతి తే. ౪౭-౫౩. శీతలా ఛాయా యస్మి న్నితి శీతలచ్ఛాయం వనం తస్మి న్నితి శేషః. ౫౪-౫౮. యావదాభూతసంప్లవం మహాప్రళయపర్యంతం-కులాలాగ్ని

ఏవం వై క్లిశ్యమానా స్తే నరా నార్య స్సహస్రశః,
పచ్యంతే నరకే ఘోరే యావదాభూతసంప్లవమ్. ౫౯
తస్యాక్షయం ఫలం భుక్త్వా తత్రై వోత్పద్యతే పునః,
యమాజ్ఞయా మహీం ప్రాప్య భవంతి స్థావరాదయః. ౬౦
వృక్షగుల్మలతావల్లీ గిరయశ్చ తృణాని చ,
స్థావరా ఇతి విఖ్యాతా మహామోహసమావృతాః. ౬౧

ఇట్లు అనేకవిధములగు యాతనలను పాపులు అనుభవించెదరు. గరుడుఁడా! సర్వశాస్త్రములయందును ఈ విషయము విశేషముగా చెప్పఁబడియున్నది. ఇట్లు నరకములయందు మహాప్రళయమువఱకు పాపులు బాధపడుచు మఱల ఆ యమలోకమున పుట్టుదురు. పిమ్మట యమాజ్ఞచే భూలోకమునకుఁ జని స్థావరము లగు తరులతాగుల్మపర్వతాదిరూపములం బొందుదురు.

కీటాశ్చ పశవ శ్చైవ పక్షిణశ్చ జలే చరాః,
చతురశీతిలక్షేషు కథితా దేవయోనయః. ౬౨

---

కుంభేషు ఘటవ త్పచ్యంతే. ౫౯. నను "దినాంతే బ్రహ్మణః ప్రోక్తో నాశో లోకత్రయస్య వై, పరార్ధద్వితయాంతేఽపి బ్రహ్మాండస్యాపి సంక్షయః." ఇతి పురాణవచనాత్ కథం మహాప్రళయపర్యంతం పాపినాం నరకే నివాస స్సంభవతి. బ్రహ్మణో దినాంతఏవ తేషాం వినాశ స్స్యాదితిచే త్తత్రాహ. తస్యేతి. తే పాపినః పున రుత్పత్తిసమయే తత్ర నరకే ష్వేవ ఉత్పద్యంతే-తస్య పాపస్య అక్షయం ఫలం భుంజంతి. తదుక్తం బృహన్నారదీయే—"నిర్గుణోఽపి నిరానంద స్సర్వాత్మా సర్వభావనః, చరాచరాత్మకం విశ్వం యథాపూర్వ మకల్పయత్. స్థావరాద్యాశ్చ విప్రేంద్రా యత్ర యత్ర వ్యవస్థితాః, తస్మా త్కృతానాం పాపానాం పుణ్యానాం చైవ సత్తమాః. అవశ్య మేవ భోక్తవ్యం సర్వథా హ్యక్షయం ఫలమ్. నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" ఇతి. స్మృతి శ్చ "నిశాంతే పున రుత్థాయ ప్రళయే యల్లయంగతమ్, బ్రహ్మా జగత్త్రయం సర్వం యథాపూర్వ మకల్పయత్." ఇతి. శ్రుతిశ్చ—"ధాతా యథా పూర్వమకల్పయత్, దివం చ పృథివీ చాంతరిక్ష మథోసువః" ఇతి. అత స్స్వర్గ నరకస్థాస్స్వస్వస్థానేష్వే వోత్పత్య శుభాశుభకర్మఫల మక్షయ మేవ భుంజంతీత్యర్థః. ౭౦. ఇతి శ్రీగరుడపురాణటీకాయాం చతుర్థోఽధ్యాయః.

ఏతా స్సర్వాః పరిభ్రమ్య తతో యాంతి మనుష్యతామ్,
మానుషేఽపి శ్వపాకేషు జాయంతే నరకాగతాః. ౬౩
తత్రాపి పాపచిహ్నై స్తే భవంతి బహుదుఃఖితాః,
గలత్కుష్ఠాశ్చ జన్మాంధా మహారోగసమాకులాః. ౬౪
భవం త్యేవం నరా నార్యః పాపచిహ్నోపలక్షితాః. ౬౫

తరువాత క్రమముగా కీటములు, పశువులు, పక్షులు, మున్నగు వానిలోఁ బుట్టి తుదకు మనుష్యుఁడై పుట్టును. నరకలోకమునుండి వచ్చిన పాపులు మనుష్యులలో చండాలజాతియందు పుట్టి కుష్ఠువు మున్నగు జాడ్యములవలన పీడింపఁబడుచుందురు.

ఇతి శ్రీగరుడపురాణే సారోద్ధారే నరకప్రదపాపచిహ్న
నిరూపణో నామ చతుర్థోఽధ్యాయః.

---

# పంచమాధ్యాయము

గరుడ ఉవాచ:—

యేన యేన చ పాపేన యద్యచ్చిహ్నం ప్రజాయతే,
యాం యాం యోనిం చ గచ్ఛంతి తన్మే కథయ కేశవ!. ౧

శ్రీభగవానువాచ:-

యైః పాపై ర్యాంతి యాం యోనిం పాపినో నరకాగతాః,
యేన పాపేన యచ్చిహ్నం జాయతే మమ తచ్ఛృణు. ౨

"శ్రీహరీ! ఏపాపమువలన ఏచిహ్నములు కలుగును? ఏజన్మ కలుగును?" అని గరుడుఁడు అడిగెను. శ్రీహరి గరుడుఁడా! నరకము నుండి వచ్చినవార లేయేపాపములచే నేయేజన్మముల నెత్తుదురో, ఏయే పాపమున కేయేచిహ్నమో చెప్పెదను వినుమని యిట్లుచెప్పెను.

బ్రహ్మహా క్షయరోగీ స్యా ద్గోఘ్న స్స్యా త్కుబ్జకో జడః,
కన్యాఘాతీ భవే త్కుష్ఠీ త్రయ శ్చండాలయోనిషు. ౩
స్త్రీఘాతీ గర్భపాతీచ పుళిందో రోగవా న్భవేత్,
అగమ్యాగమనా త్షండో దుశ్చర్మా గురుతల్పగః. ౪

బ్రహ్మహత్య చేసినవాఁడు చండాలుఁడై పుట్టి క్షయరోగము కలవాఁడగును. గోహత్య చేసినవాఁడు చండాలురలో మఱుగుజ్జువాఁడై పుట్టును. కన్యకను చంపినవాఁడు చండాలుఁడై, పుట్టి కుష్ఠరోగి యగును. స్త్రీలను చంపినవాఁడు, గర్భపాతములు చేసినవాఁడును భిల్లుఁడై పుట్టి సదా రోగములతో బాధపడుచుండును. అగమ్యాగమనము చేసినవాఁడు (తనగోత్రమునఁదలి స్త్రీతో అక్రమ సంబంధము గలవాఁడు) నపుంసకుఁ డగును. గురుభార్యతోఁ గూడిన వాఁడు దుశ్చర్మము కలవాఁ డగును.

---

శ్రుత్వా చ పాపచిహ్నాని గళత్కుష్ఠాదికాని చ, ఇదానీం గరుడస్తాని యథా పాపం విపృచ్ఛతి. యేనేతి. ౧. మనుజైః పాతకం కర్మ కృతం య త్పూర్వజన్మని, హరి స్తత్సూచకా న్యాహ పాపచిహ్నాని పంచమే. యైరితి. ౨, ౩. పుళిందః భిల్లః అగమ్యా స్వగోత్రజా-దుశ్చర్మా, గజచర్మా-గురుతల్పగః గురుకులస్త్రీకాముకః. ౪. అతి

మాంసభోక్తాఽతిరక్తాంగః శ్యావదంతస్తు మద్యపః,
అభక్ష్యభక్షకో లౌల్యాద్బ్రాహ్మణస్స్యాన్మహోదరః. ౫
అదత్త్వా మిష్టమశ్నాతి స భవేద్గళగండవాన్,
శ్రాద్ధేఽన్నమశుచిం దత్త్వా చిత్రకుష్ఠీ ప్రజాయతే. ౬
గురోర్గర్వేణావమానాదపస్మారీ భవేన్నరః,
నిందకో వేదశాస్త్రాణాం పాండురోగీ భవేద్ధ్రువమ్. ౭
కూటసాక్షీ భవేన్మూకః కాణస్స్యాత్పంక్తిభేదకః,
అనోష్ఠస్స్యాద్వివాహఘ్నో జన్మాంధః పుస్తకం హరేత్. ౮
గోబ్రాహ్మణపదాఘాతాత్ ఖంజః పంగుశ్చ జాయతే,
గద్గదోఽనృతవాదీ స్యాత్తచ్ఛ్రోతా బధిరో భవేత్. ౯
గరదస్స్యాజ్జడోన్మత్తో ఖల్వాటోఽగ్నిప్రదాయకః,
దుర్భగః పలవిక్రేతా రోగవాన్నరమాంసభుక్. ౧౦

మాంసము తిను బ్రాహ్మణుఁడు అతిరక్తమను కుష్ఠరోగము కలవాఁడగును. కల్లుద్రావువాఁడు నల్లని పండ్లుగలవాఁడగును. మధురములగు పదార్థములను ఇతరులకుఁ బెట్టక తానొక్కఁడే తినువాఁడు గళగండరోగము గలవాఁడగును. తినరానివస్తువులను తిను బ్రాహ్మణుఁడు మహోదరజాడ్యముకలవాఁడగును. శ్రాద్ధమున అశుచిపదార్థములను బెట్టువాఁడు చిత్రకుష్ఠువు కలవాఁడగును. గర్వమువలన గురువు నవమానించువాఁడు అపస్మారరోగము గలవాఁడగును. వేదశాస్త్రములను నిందించువాఁడు పాండురోగియై పుట్టును. అబద్ధసాక్ష్యముచెప్పువాఁడు మూఁగవాఁడై పుట్టును. పంక్తిభేదము చేయువాఁడు అనఁగాఁ బంతిలో ఒకనికి ఒకవిధముగను, మఱియొకనికి మఱియొక విధముగను

---

రక్తాంగః కుష్ఠవిశేషః శ్యావదంతః-స్వభావతః కృష్ణదంతః 'శావదంత' ఇతి పాఠే తు శావాః అతిసూక్ష్మాః భోజనే బహుదుఃఖదాః దంతాః యస్యేతి శావదంతః. శావదంతానాం తు న కించిద్దుఃఖానుభవోఽస్తి-అతః పాపచిహ్నేనాఽతిదుఃఖప్రదత్వాత్ శ్యావదంత ఇత్యేవ పాఠో యుక్తః. లౌల్యాత్ అజితేంద్రియత్వాత్ - మహోదరః జలోదరరోగీ. ౫, ౬. అపస్మారీ మూర్ఛారోగీ. ౭, ౮. పాదేన తాడనాత్ ఖంజః. పద్భ్యామాఘాతాత్ పంగుః, గద్గదః అస్ఫుటవక్తా. తస్య అనృతవాదస్య శ్రోతా. ౯. పలవిక్రేతా మాంసవిక్రయీ. ౧౦. కునఖీ నిసర్గతః కుత్సితనఖః కుష్ఠి

బెట్టెడివాఁడు కాణుఁడై (ఒక కన్ను లేనివాఁడై) పుట్టును. పెండ్లి చెడఁగొట్టువాఁడు ఓష్ఠములు లేనివాఁడగును. పుస్తకములను దొంగిలించువాఁడు పుట్టుగ్రుడ్డి యగును. గోవులను బ్రాహ్మణులను కాలితో తన్నినవాఁడు ఖంజుఁ డగును. రెండు కాళ్లతోఁడను తన్నినవాఁడు కుంటివాఁడగును. అబద్ధము చెప్పెడివాఁడు అస్ఫుటవాక్కులు కలవాఁ డగును. అబద్ధములను వినువాఁడు చెవిటివాఁ డగును. విషము పెట్టువాఁడు ఉన్మత్తుఁ డగును. ఇండ్లు మున్నగువానిని తగులఁబెట్టువాఁడు ఖర్వాటుఁడు (బట్టతలవాఁడు) అగును. మాంసము నమ్మువాఁడు కురూపి యగును. పరమాంసమును భుజించువాఁడు రోగి యగును.

హీనజాతౌ ప్రజాయేత రత్నానా మపహారకః,
కునఖీ స్వర్ణహర్తా స్యా ద్ధాతుమాత్రహరోఽధనః. ౧౧
అన్నహర్తా భవే దాఖుః శలభో ధాన్యహారకః,
చాతకో జలహర్తా స్యా ద్విషహర్తా చ వృశ్చికః. ౧౨
శాకం పత్రం శిఖీ హృత్వా గంధాఞ్ఛుచుందరీ శుభాన్,
మధుదంశః ఫలం గృధ్రో లవణం చ పిపీలికా. ౧౩
తాంబూలఫలపుష్పాదిహర్తా స్యా ద్వానరో వనే,
ఉపానత్తృణకార్పాసహర్తా స్యా న్మేషయోనిషు. ౧౪

రత్నములను దొంగిలించువాఁడు హీనజాతులలో పుట్టును. బంగారము హరించువాఁడు పుప్పిగోళ్లవాఁడై పుట్టును. లోహాదులను హరించువాఁడు నిర్ధనుఁడై పుట్టును. అన్నమును అపహరించువాఁడు ఎలుకయై పుట్టును. ధాన్యమును దొంగిలించువాఁడు మిడుతయై పుట్టును. నీళ్లు దొంగిలించువాఁడు చాతకపక్షి యగును. విషమును హరించువాఁడు తేలు అయి పుట్టును. కూరలను, ఆకులను అపహరించువాఁడు నెమలియై పుట్టును. పరిమళ ద్రవ్యములను దొంగిలించువాఁడు చుంచు అగును. తేనెను దొంగిలించువాఁడు దోమయై పుట్టును.

---

సదృశః. ౧౧. ఆఖుః మూషకః-ధాన్యం సతుషాన్నమ్. ౧౨. శాకం హృత్వా శిఖీ మయూర స్స్యాత్-హృత్వే త్యస్య సర్వత్ర, సంబంధః-శుభాన్ మృగమదాదీన్ గంధాన్ హృత్వా ఛుచుందరి స్యాత్ భాషాయాం 'చామరేడ' ఇతి. మధు హృత్వా దంశః మధుమక్షికా స్యాత్ ౧౩, ౧౪. రౌద్రేణ హింస్రకర్మణా

మాంసమును దొంగిలించువాఁడు గ్రద్ద యగును. ఉప్పు అపహరించువాఁడు చీమ యగును. ఫలములను, పుష్పములను, తాంబూలమును హరించువాఁడు అడవిలో కోఁతియై పుట్టును. చెప్పులను, గడ్డిని, దూదిని హరించువాఁడు మేఁక యగును.

యస్తు రౌద్రోపజీవి చ మార్గే సార్థా న్విలుంపతి,
మృగయావ్యసనీ యస్తు ఛాగ స్స్యా ద్వధికే గృహే. ౧౫
యో మృతో విషపానేన కృష్ణసర్పో భవే ద్గిరౌ,
నిరంకుశస్వభావ స్స్యా త్కుంజరో నిర్జనే వనే. ౧౬
వైశ్వదేవ మకర్తార స్సర్వభక్షాశ్చ యే ద్విజాః,
అపరీక్షితభోక్తారో వ్యాఘ్రా స్స్యు ర్నిర్జనే వనే. ౧౭
గాయత్రీం న స్మరే ద్యస్తు యో న సంధ్యా ముపాసతే,
అంతర్దుష్టో బహి స్సాధు స్స భవే ద్బ్రాహ్మణో బకః. ౧౮

త్రోవలు కాచి బాటసారులను దోఁచుకొనువాఁడును, వేఁటకాఁడును కటికవానియింట మేఁకయై పుట్టుదురు. విషము తిని మరణించినవాఁడు కొండమీఁద నల్లత్రాఁచు అయి పుట్టును. స్వేచ్ఛాసంచారము చేయువాఁడు అరణ్యమున ఏనుఁగయి పుట్టును. వైశ్వదేవము చేయనట్టియు, భక్షింపరాని పదార్థములను భక్షించునట్టియు, పరీక్షింపక అశుచిపదార్థములను భక్షించునట్టియు బ్రాహ్మణులు మహారణ్యమున పెద్దపులులై పుట్టుదురు. గాయత్రిని జపింపనట్టియు, సంధ్యోపాసనము చేయనట్టియు, అంతర్దుష్టులును, బహిస్సాధువులును అగు బ్రాహ్మణులు కొంగ లగుదురు.

---

ఉపజీవీ-సార్థాన్ యాత్రికజనసమూహాన్. ౧౫, ౧౬. విశ్వం సర్వజాతీయం ప్రాణిజాతం-దేవా దేవతా యస్మిన్ త ద్విశ్వదేవం స్వార్థేతద్ధితః-వైశ్వదేవం నామ కర్మ-త దకర్తారః - సర్వేషాం కులాలరజకాదీనా మప్యన్నం భక్షయంతి తే సర్వభక్షాః. "గణాన్నం గణికాన్నం చ భుక్త్వా చాంద్రాయణం చరే" దితి నిషేధాత్, సర్వభక్ష మపి భక్షయం తీతి వా అపరీక్షితభోక్తారః హేయోపాదేయపరీక్షా మకృత్వా యే భుంజంతి తేఽపి. ౧౭, ౧౮. అయాజ్యాన్ యాజయితు మనర్హాన్ పతితయవనాదీన్ యాజయ తీతి 'అయాజ్యయాచక' ఇతి పాఠాంతరమ్. బహూన్ దక్షిణాలోభేన యాజయతి బహుయాజీ-తస్య భావ స్తత్త్వం-తస్మాత్, నిర్మంత్రం

అయాజ్యయాజకో విప్ర స్స భవే ద్గ్రామసూకరః,
ఖరో వై బహుయాజిత్వా త్కాకో నిర్మంత్రభోజనాత్. ౧౯
పాత్రే విద్యా మదాతా చ బలీవర్దో భవే ద్ద్విజః,
గురుసేవా మకర్తా చ శిష్య స్స్యా ద్గోఖరః పశుః. ౨౦
గురుం హుంకృత్య తుంకృత్య విప్రం నిర్జిత్య వాదతః,
అరణ్యే నిర్జలే దేశే జాయతే బ్రహ్మరాక్షసః. ౨౧
ప్రతిశ్రుతం ద్విజే దాన మదత్వా జంబుకో భవేత్,
సతా మసత్కారకరః ఫేత్కారోఽగ్నిముఖో భవేత్. ౨౨
మిత్రద్రు గ్గిరిగృధ్ర స్స్యా దులూకః క్రమవంచనాత్,
వర్ణాశ్రమపరీవాదా త్కపోతో జాయతే వనే. ౨౩
ఆశాచ్ఛేదకరోయస్తు స్నేహచ్ఛేదకర స్తు యః,
యో ద్వేషాత్ స్త్రీపరిత్యాగీ చక్రవాక శ్చిరం భవేత్. ౨౪
మాతాపితృగురుద్వేషీ భగినీ భ్రాతృవైరకృత్,
గర్భే యోనౌ వినష్ట స్స్యా ద్యావద్యోనిసహస్రశః. ౨౫
శ్వశ్ర్వై గ్గాలిప్రదా నారీ నిత్యం కలహకారిణీ,
సా జలూకా చ యూకా స్యా ద్భర్తారం భర్త్సతే చ యా. ౨౬
స్వపతిం చ పరిత్యజ్య పరపుంసానువర్తినీ,
వల్గులీ గృహగోధా స్యా ద్ద్విముఖీ వాథ సర్పిణీ. ౨౭

యజ్ఞము చేయఁదగనివానిచేత యజ్ఞము చేయించిన బ్రాహ్మణుఁడు ఊరఁబందియై పుట్టును. తఱుచు యజ్ఞములను జేయించువాఁడు గాడిద యగును. పిలువకుండ భోజనమునకు వచ్చినవాఁడు కాకియై పుట్టును. విద్య చెప్పఁదగినవానికి చెప్పనివాఁడు ఎద్దు అయి పుట్టును. గురుసేవ చేయని శిష్యుఁడు గోఖరపశువై పుట్టును. గురువును నీవు నీ వనియు, హుంకరించియు అవమానించువాఁడును, బ్రాహ్మణుని జయించినవాఁడును నీరులేని మహారణ్యమున బ్రహ్మరాక్షసుఁడై పుట్టును. బ్రాహ్మణులకు దాన మిచ్చెద నని ఈయనివాఁడు నక్కయై పుట్టును.

---

అమృతోపస్తరణాదిమంత్రం వినా, ఆమంత్రణరహితం వా. ౧౯, ౨౦. హుంకృత్య తుంకృత్య గురు మవజ్ఞాయే త్యర్థః. ౨౧, ౨౨. మిత్రద్రుక్ మిత్రద్రోహీ-గిరిగృధ్రః. క్రయే వ్యవహారే. పరివాదాత్ నిందనాత్. ౨౩—౨౫. భర్త్సతే ధిక్క-

మిత్రద్రోహి పర్వతముమీఁద గ్రద్దయై పుట్టును. అమ్మకమున మాయ చేయువాఁడు గుడ్లగూబయై పుట్టును. వర్ణాశ్రమాచారములను నిందించువాఁడు అరణ్యమున పావురమై పుట్టును. ఆశాభంగము చేసినవాఁడును, పతివ్రతయగు భార్యను విడుచువాఁడును చక్రవాకజన్మ మెత్తుదురు. తల్లిదండ్రులను, గురువులను, అక్కచెల్లెండ్రను, అన్నదమ్ములను ద్వేషించువాఁడు అనేకపర్యాయములు గర్భమునందే మరణించును. అత్తమామలను బాధించునదియు, ప్రతిదినము కలహించుచుండునదియు నగు ఆఁడుది జలగయై పుట్టును. తన భర్తను విడిచి పరపురుషునిఁ గోరు ఆఁడుది బల్లియై పుట్టును. లేదా రెండుతలల పాము అగును.

య స్స్వగోత్రోపఘాతీ చ స్వగోత్రస్త్రీనిషేవణాత్,
తరక్షు శ్శల్లకో భూత్వా ఋక్షయోనిషు జాయతే. ౨౮
తాపసీగమనాత్కామీ భవే న్మరుపిశాచకః,
అప్రాప్తయౌవనాసంగా ద్భవే దజగరో వనే. ౨౯
గురుదారాభిలాషీ చ కృకలాసో భవే న్నరః,
రాజ్ఞీం గత్వా భవే ద్దుష్టో మిత్రపత్నీం చ గర్దభః. ౩౦
గుదగో విడ్వరాహ స్స్యా ద్వృష స్స్యా ద్వృషలీపతిః,
మహాకామీ భవే ద్య స్తు స్యా దశ్వః కాములంపటః. ౩౧
మృత స్యైకాదశాహం తు భుంజాన శ్శ్వా విజాయతే,
లభే ద్దేవలకో విప్రో యోనిం కుక్కుటసంజ్ఞికామ్. ౩౨
ద్రవ్యార్థం దేవతాపూజాం యః కరోతి ద్విజాధమః,
స వై దేవలకో నామ హవ్యకవ్యేషు గర్హితః. ౩౩

జ్ఞాతివంశమును నశింపఁజేసినవాఁడును, సగోత్రకన్యను పొందినవాఁడును, శివంగియు ఏఁదుపందియు ఎలుఁగుగొడ్డు నగును. తాపసస్త్రీని పొందినవాఁడు మరుపిశాచము అగును. అప్రాప్తయౌవన యగు బాలికతో క్రీడించువాఁడు అడవిలో కొండచిలువ యగును. గురుభార్యను

టీక. ౨౮-౨౯. అప్రాప్తయౌవనా అజాతరజస్కా-తస్యాః సంగాత్. ౨౯, ౩౦. వృషలీ వ్యాఖ్యాతా. ౩౧. ఏకాదశాహం ఆ ఏకాదశాహమితిచ్ఛేదః. ఏకాదశాహపర్యంతం సూతకాన్నమిత్యర్థః. ౩౨. దేవలక మాహ. హవ్యకవ్యేషు గర్హితః పితృదేవ

గోరువాఁడు తొండయై పుట్టును. రాజపత్నిని, మిత్రునిభార్యను గూడువాఁడు గాడిద యగును. గుదసంభోగము చేయువాఁడు పందియగును. వృషలీభర్త ఎద్దు అగును.అతికాముకుఁడై యుండువాఁడు గుఱ్ఱమగును. సూతకాన్నమును భుజించినవాఁడు కుక్కయగును. దేవలకుఁడు కోడియై పుట్టును. జీతమున కేర్పడి దేవాలయాదులలో దేవపూజ చేయువాఁడు దేవలకుఁ డనిపించుకొనును. వాఁడు సర్వకర్మలయందును బహిష్కరణీయుఁడు అని యెఱుఁగవలెను.

మహాపాతకజాన్ ఘోరాన్నరకాన్ప్రాప్య దారుణాన్,
కర్మక్షయే ప్రజాయంతే మహాపాతకిన స్త్విహ. ౩౪
ఖరోష్ట్రమహిషీణాం హి బ్రహ్మహా యోనిమృచ్ఛతి,
వృకశ్వానసృగాలానాం సురాపా యాంతి యోనిషు. ౩౫
క్రిమికీటపతంగత్వం స్వర్ణస్తేయీ సమాప్నుయాత్,
తృణగుల్మలతాత్వం చ క్రమశో గురుతల్పగః. ౩౬
పరస్య యోషితం హృత్వా న్యాసాపహరణేన చ,
బ్రహ్మస్వహరణాచ్చైవ జాయతే బ్రహ్మరాక్షసః. ౩౭
బ్రహ్మస్వం ప్రణయాద్భుక్తం దహత్యాసప్తమం కులమ్,
బలాత్కారేణ చౌర్యేణ దహత్యాచంద్రతారకమ్. ౩౮
లోహచూర్ణాశ్మచూర్ణే చ విషం చ జరయే న్నరః,
బ్రహ్మస్వం త్రిషు లోకేషు కః పుమాన్ జరయిష్యతి. ౩౯
బ్రహ్మస్వరసపుష్టాని వాహనాని బలాని చ,
యుద్ధకాలే విశీర్యంతే సైకతా స్సేతవో యథా. ౪౦
దేవద్రవ్యోపభోగేన బ్రహ్మస్వహరణేన చ,
కులాన్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ. ౪౧

---

కార్యేషు భోజయితు మనర్హః. ౩౩. మహాపాపినాం యోని మాహ త్రిభిః. ౩౪-౩౬. న్యాసస్యస్వగృహే ధృతస్య పరధన స్యాపహరణేన గ్రహణేన. ౩౭. ప్రసంగాద్బ్రహ్మస్వ హరణేదోషమాహ. బ్రహ్మస్వ మితి చతుర్భిః. ప్రణయాత్ కపటస్నేహాత్ భుక్తం భక్షితం బ్రహ్మస్వం బ్రాహ్మణధనం ఆసప్తమం సప్తమపురుషపర్యంతం కులం దహతి. పుణ్యలోకై స్సహ దగ్ధం కరోతి బలాద్భుక్తంసత్ ఆచంద్రతారకం చంద్రతారాపర్యంతం భావికులం దహతి-వంశచ్ఛేదం కరోతీ త్యర్థః. ౩౮. కః? న కోపీ త్యర్థః. ౩౯. విశీర్యంతే పలాయంతే. ౪౦. అకులతాం ఉచ్ఛేదతాం. ౪౧. అతిక్రమం

స్వమాశ్రితం పరిత్యజ్య వేదశాస్త్రపరాయణమ్,
అన్యేభ్యో దీయతే దానం కథ్యతేఽయ మతిక్రమః. ౪౨
బ్రాహ్మణాతిక్రమో నాస్తి విప్రే వేదవివర్జితే,
జ్వలంత మగ్ని ముత్సృజ్య నహి భస్మని హూయతే. ౪౩

మహాపాపములు చేసినవారు మహానరకములు అనుభవించి పాపక్షయ మైన పిమ్మట మరల నీభూలోకమునఁ బుట్టుదురు. బ్రహ్మహత్య చేసినవాఁడు గాడిద, లొట్టిపిట్ట, దున్నపోతుజన్మము లెత్తును. సురాపానము చేసినవాఁడు తోడేళ్లు, కుక్కలు, నక్కలు మున్నగుజన్మముల నెత్తును. బంగారము హరించువాఁడు క్రిమికీటపక్షిజన్మము లందును. గురుభార్యను పొందినవాఁడు చెట్టు చేమ అయి పుట్టును. పరభార్యను హరించినవాఁడు, దాచుమని యిచ్చిన వస్తువును హరించినవాఁడును, బ్రాహ్మణద్రవ్యమును హరించినవాఁడును బ్రహ్మరాక్షసుఁడై పుట్టును. బ్రాహ్మణద్రవ్యము స్నేహముచే తినినను ఏడుతరములను దహించివేయును, బలాత్కారించిగాని, దొంగిలించిగాని యెవఁడు బ్రాహ్మణద్రవ్యమును హరించునో వానివంశము నిర్ధూమధామమైపోవును. లోహపుచూర్ణమును రాతిపొడిని జీర్ణింపఁ జేసికొనవచ్చును; గాని బ్రాహ్మణద్రవ్యమును జీర్ణింపఁజేసికొనుటకు మూఁడులోకముల నెవ్వనికిని తరముగాదు. ఏవిధమున నైనను హరింపఁబడిన బ్రాహ్మణద్రవ్యముచే పోషింపఁబడిన రాజులయొక్క వాహనములు, బలములు యుద్ధకాలమున యిసుకవంతెనలవలె పీడిపోవును. దేవబ్రాహ్మణద్రవ్యములను హరించిన కులములు నశించిపోవును. బ్రాహ్మణాతిక్రమణము చేసినను అట్టి గతి గలుగును. తన్ను ఆశ్రయించుకొనియున్న వేదశాస్త్రపారంగతుని విడిచి యితరునకు దాన మిచ్చుటయే బ్రాహ్మణాతిక్రమణ మనఁబడును. వేదమును చదువనివానివిషయమున ఈసూత్రము వర్తింపదు. మండుచున్న అగ్నియందే అందఱును హోమము చేయుదురు; గాని బూడిద

వ్యాచష్టే. స్వమితి. ౪౨. విప్రే స్వమాశ్రితే వేదవర్జితే కుపాత్రే సతి-అతిక్రమదోషో నాస్తీత్యర్థః. జ్వలంతం దూరే దీప్యమానం అగ్నిం భస్మని నికటవర్తిని. యథా దూరా దాహృత్య అగ్నావేవ హవన ముచితం తథా నికటవర్తినం మూర్ఖం పరిత్యజ్య విదుషా దానీయపాత్రే ప్రదేయమితి భావః. ౪౩. పాత్రం పరిత్యజ్య అపాత్రదానస్య

యందు ఎవరును చేయరు. అట్లే వేదశాస్త్రములను చదువుకొనిన వాఁడే యైనచో ఇఁక పరున కీయవలసిన యగత్యము ఏమి యుండును?

అతిక్రమే కృతే తార్క్ష్య! భుక్త్వా చ నరకాన్ క్రమాత్,
జన్మాంధస్స్యా ద్దరిద్రస్స్యా న్న దాతా కింతు యాచకః. ౪౪

పాత్రునకు దానము చేయక అపాత్రునకు దానము చేయువాఁడు క్రమముగా అనేకనరకముల ననుభవించి పుట్టుగ్రుడ్డివాఁడును, దరిద్రుఁడు నగును. మఱియు ఎప్పటికిని ఒకనిని ఆశ్రయించియే బ్రతుకవలసినవాఁడుగూడ నగును.

స్వదత్తాం పరదత్తాం వా యో హరే చ్చ వసుంధరామ్,
షష్టివర్షసహస్రాణి విష్ఠాయాం జాయతే కృమిః. ౪౫
స్వాయ మేవ చ యో దత్వా స్వాయ మేవాపకర్షతి,
స పాపీ నరకం యాతి యావదాభూతసంప్లవమ్. ౪౬
దత్వా వృత్తిం భూమిదానం యత్నతః పరిపాలయేత్,
న రక్షతి హరే ద్యస్తు స పంగు శ్శ్వాఽభిజాయతే. ౪౭
విప్రస్య వృత్తికరణే లక్షధేనుఫలం భవేత్,
విప్రస్య వృత్తిహరణా న్మర్కట శ్శ్వా కపి ర్భవేత్. ౪౮
ఏవమాదీని చిహ్నాని యోనయ శ్చ ఖగేశ్వర!,
స్వకర్మవిహితా లోకే దృశ్యంతేఽత్ర శరీరిణామ్. ౪౯
ఏవం దుష్కర్మకర్తారో భుక్త్వా నిరయయాతనామ్,
జాయంతే పాపశేషేణ ప్రోక్తా స్వేతాసు యోనిషు. ౫౦

తానుగాని పరులుగాని యిచ్చినభూమిని హరించినవాఁడు అమేధ్యమున అరువదివేలయేండ్లు పురుగై పుట్టును. తా నిచ్చిన భూమిని తానే హరించినవాఁడు మహాప్రళయపర్యంతము నరకమున నివసించి యుండును. బ్రాహ్మణునకు భూమి నిచ్చినవాఁడు ఆభూమిని బహుభద్రముగా కాపాడుచుండవలెను. అట్లు కాపాడఁడేని కుంటికుక్కయై జన్మించును. బ్రాహ్మణునకు వృత్తిని కల్పించినవారికి లక్షగోదానముల ఫలము లభించును. బ్రాహ్మణవృత్తిని హరించినవానికి కోఁతిజన్మగాని

ఫల మాహ, అతీతి, ౪౪, ౪౫, అపకర్షతి హరతి, ౪౬-౪౯, ఉపసంహరతి, ఏవమితి, ౫౦, తిర్యక్ఛరీరతాం పశుపక్షిదేహభావమ్, భారవహనేన ఉద్భవో యేషాం

కుక్క-పుట్టుకగాని ప్రాప్తించును. గరుడుఁడా! పూర్వోక్తము లగుచిహ్నములును, పూర్వోక్తము లగు జన్మములును పాపాత్ములకు కలుగును. పాపములు చేసినవారు ఆయా యాతనల ననుభవించి పాపశేషముతో పూర్వోక్తజన్మము లెత్తెదరు.

తతో జన్మసహస్రేషు ప్రాప్య తిర్యక్ఛరీరతామ్,
దుఃఖాని భారవహనోద్భవాదీని లభంతి తే. ౫౧
పక్షిదుఃఖం తతో భుక్త్వా వృష్టిశీతాతపోద్భవమ్,
మానుషం లభతే పశ్చా త్సమీభూతే శుభాశుభే. ౫౨
స్త్రీపుంసో స్తు ప్రసంగేన భూత్వాగర్భే క్రమా దసౌ,
గర్భాదిమరణాంతం చ ప్రాప్య దుఃఖం మ్రియే త్పునః. ౫౩
సముత్పత్తి ర్వినాశశ్చ జాయతే సర్వదేహినామ్,
ఏవం ప్రవర్తితం చక్రం భూతగ్రామే చతుర్విధే. ౫౪
ఘటీయంత్రం యథా మర్త్యా భ్రమంతి మమ మాయయా,
భూమౌ కదాచి న్నరకే కర్మపాశసమావృతాః. ౫౫

పిమ్మట పశుయోనులయందు వేయి జన్మము లెత్తి బరువు మోయుటవలన కలుగు దుఃఖములను అనుభవించి అనంతరము పక్షియోనులందు వేయి జన్మము లెత్తి శీతాతపవర్షాదులవలనఁ గలుగు దుఃఖముల ననుభవించి పుణ్యపాపములు సమానములు కాఁగా మానవజన్మ మెత్తెదరు. స్త్రీపురుషసమావేశమునందు శుక్లశోణితములు కలిసి గర్భమున ప్రవేశించి క్రమముగ జననాది దుఃఖముల ననుభవించి మరణము నొందుచుందురు. మరల పుట్టుచు చచ్చుచుందురు. ఇట్లు చతుర్విధమగు భూతజాలము తిరుగుచుండును. నామాయచే మోహితులగు మనుజులు ఘటీయంత్రమువలె భూలోకమున కొన్నాళ్లును, నరకలోకమున కొన్నాళ్లును కర్మపాశబద్ధులై తిరుగుచుందురు.

అదత్తదానా చ్చ భవే ద్దరిద్రో
దరిద్రభావా చ్చ కరోతి పాపమ్,

తాని పశుదేహే లభంతే. ౫౧. వృష్ట్యాదిభవం దుఃఖం పక్షిదేహే ఇతి. ౫౨-౫౪.
ఇతి శ్రీగరుడపురాణటీకాయాం పంచమోఽధ్యాయః.

పాపప్రభావా న్నరకే ప్రయాతి,
పున ర్దరిద్రః పున రేవ పాపీ. ౫౬
అవశ్య మేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్,
నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతై రపి. ౫౭

దానధర్మములు చేయనివాఁడు దరిద్రుఁడై పుట్టును. దారిద్ర్యదోషమువలన పాపము చేయును. పాపమువలన నరకము పొందును. ఇట్లు మఱలమఱల దరిద్రుఁడును పాపియునై పుట్టుచుండును. గరుడుఁడా! చేసికొనిన పుణ్యాపాపములు అనుభవించి తీరవలెను. ఎన్నికల్పములకైన అనుభవింపనిదే పురాకృతకర్మ నశింపదు.

ఇతి శ్రీగరుడపురాణే సారోద్ధారే పాపచిహ్న
నిరూపణోనామ పంచమోఽధ్యాయః.



# షష్ఠాధ్యాయము

గరుడ ఉవాచ:—

కథ ముత్పద్యతే మాతు ర్జఠరే నరకాగతః,
గర్భాదిదుఃఖం యద్భుంక్తే త న్మే కథయ కేశవ!। ౧

శ్రీభగవా నువాచ:—

స్త్రీపుంసో స్తు ప్రసంగేన నిరుద్ధే శుక్రశోణితే,
యథాఽయం జాయతే మర్త్య స్తథా వక్ష్యా మ్యహం తవ. ౨

"శ్రీహరీ! నరకమునుండి వచ్చిన పాపులు తల్లి గర్భమున నెట్లు ప్రవేశించెదరు? ఎట్లు పుట్టెదరు? గర్భాదిదుఃఖముల నెట్లనుభవించెదరు? సవిస్తరముగా నెఱింగింపు" మని గరుడుఁ డడుగఁగా శ్రీహరి అది యంతయుఁ జెప్పెద వినుము. అని యిట్లు చెప్పఁదొడఁగెను.

ఋతుమధ్యే హి పాపానాం దేహోత్పత్తిః ప్రజాయతే,
ఇంద్రస్య బ్రహ్మహత్యాఽస్తి యస్మిం స్తస్మి న్దినత్రయే. 3
ప్రథమేఽహని చండాలీ ద్వితీయే బ్రహ్మఘాతినీ,
తృతీయే రజకీ ప్రోక్తా నరకాగతమాతరః. ౪
కర్మణా దైవనేత్రేణ జంతు ర్దేహోపపత్తయే,

---

పాతకీ నరకం గత్వా జాయతే నిర్ధనే కులే, ఇతి శ్రుత్వా తు గరుడ స్తజ్జన్మ పరిపృచ్ఛతి కథ మితి. ౧. ప్రోక్త మాముష్మికం దుఃఖం యేషా మధ్యాయపంచకే, తేషాం వక్ష్యేఽధునా ప్రాహ జన్మ కర్మ చ కేశవః. స్త్రీతి. ప్రసంగేన సంగమేన-నిరుద్ధే గర్భఏవ స్థితే సతి. ౨. యస్మి న్ ఋతుమధ్యే హత్యా చతుర్థాంశేన అస్తి తస్మి న్నేవ దినత్రయే పాపినాం దేహోత్పత్తి రిత్యన్వయః. 3. బ్రహ్మఘాతినీ మహాపాతకయుక్తేవ అస్పర్శ్యా-ఏతాః స్త్రియః మలినదినాంతర్గతా శ్చండాల్యాదిసమా హి నరకేభ్యః ఆగతానాం మాతరో భవంతి. ఏతాస్వేవ నరకగతా ఉత్పద్యంత ఇత్యర్థః. ౪. దైవం ఈశ్వరః తదేవ నేతృప్రవర్తకం యస్య తద్దైవనేత్రం తేన పూర్వకృతేన కర్మణా జంతు ర్జీవః దేహస్య ప్రాప్తయే పుంసః పురుషస్య రేతసః శుక్రస

స్త్రియాః ప్రవిష్ట ఉదరం పుంసో రేతఃకణాశ్రయః. ౫

పూర్వకాలమున దేవేంద్రుఁడు వృత్రాసురునిఁ బరిమార్చుటం జేసి అతనిని బ్రహ్మహత్యామహాపాప మాక్రమించెను. దానికి దుఃఖించి దేవేంద్రుఁడు బ్రహ్మ నారాధింప నతఁడు సాక్షాత్కరించి కరుణించి ఆపాతకమును నాలుగుభాగములు గావించి స్త్రీల రజస్సున నుండు నట్లేర్పఱిచి అంతర్హితుఁ డయ్యెను. నాఁటినుండియు స్త్రీలు బహిష్ఠలగు కాలమున మొదటి మూఁడుదినములయందును క్రమముగ చండాలి, బ్రహ్మఘాతిని, రజకి అని చెప్పఁబడుచున్నారు. ఈమూఁవురును నరకలోకమునుండి వచ్చిన పాపాత్ములకు ఈలోకమున తల్లులగుచున్నారు. పాపాత్ములు పురుషుని రేతఃకణము నాశ్రయించి పూర్వ జన్మకృత కర్మానుసారముగ దేహోత్పత్తికై స్త్రీల గర్భములను ప్రవేశింతురు.

కలిలం త్వేకరాత్రేణ పంచరాత్రేణ బుద్బుదమ్,
దశాహేన తు కర్కంధూః పేశ్యండం వా తతః పరమ్. ౬
మాసేన తు శిరో ద్వాభ్యాం బాహ్వంగాద్యంగవిగ్రహః,
నఖలోమాస్థిచర్మాణి లింగచ్ఛిద్రోద్భవ స్త్రిభిః. ౭
చతుర్భి ర్ధాతవ స్సప్త పంచభిః క్షుత్తృడుద్భవః,
షడ్భి ర్జరాయుణా వీతః కుక్షౌ భ్రామ్యతి దక్షిణే. ౮
మాతు ర్జగ్ధాన్నపానాద్యై రేధద్ధాతురసంమతే,

---

కణో బిందుః తస్యాశ్రయస్సన్ స్త్రియాః ఉదరం ప్రవిష్టో భవతి. అత్రాయం విశేషః. "శుక్రశోణితసంయోగా త్పిండోత్పత్తిః ప్రజాయతే, రక్తాధిక్యే భవే న్నారీ శుక్రాధిక్యే భవే త్పుమాన్, సమానే ద్రవ్యసంయోగే తృతీయా ప్రకృతి ర్భవేత్, విభక్తే రేతసి ప్రాయో భవే ద్యుగ్మ మపి క్వచిత్." ఇతి. ౫. 'భూత్వా గర్భే క్రమా' దితి పూర్వసూచితక్రమేణైవ గర్భోత్పత్తిప్రకార మాహ. కలిల మితి. చతుర్భిః. కలిలం శుక్రశోణితమిశ్రితం భవతి, తతో బుద్బుదం వర్తులం భవతి, పేశీమాంసం పిండాకారం భవతి. కర్కంధూః బదరీఫలం కఠినం భవతి అండం వా యోన్యంతరే. ౬. బాహ్వంగా ద్యంగానాం విగ్రహః విభాగః-లింగచ్ఛిద్రాణి చ తేషా ముద్భవః. ౭. జరాయుణా గర్భవేష్టనేన వీతః ప్రావృతః. ౮. మాతు ర్జగ్ధేన భక్షితే నాన్నేన పానాద్యైశ్చ ఏధమానా ధాతవో యస్య జంతూనాం సంభవో

శేతే విణ్మూత్రయో ర్గర్తే స జంతు ర్జంతుసంభవే. ౯

క్రిమిభిః క్షతసర్వాంగ స్సౌకుమార్యా త్ప్రతిక్షణమ్,
మూర్ఛా మాప్నో త్యురుక్లేశ స్తత్ర తైః క్షుధితై ర్ముహుః. ౧౦

గర్భమున ప్రవేశించిన యొకదినమునకు కలిల మగును. అయిదు దినములకు బుద్బుదాకార మగును. పదిదినములకు బదరీఫలమువలె కఠిన మగు మాంసపు ముద్ద యగును. ఒక మాసమునకు శిరస్సు ఏర్పడును. రెండుమాసములకు బాహువులు మున్నగు అవయవము లేర్పడును. మూఁడుమాసములకు గోళ్లు, రోమములు, చర్మము, లింగము, నవరంధ్రములు అంకురించును. నాలుగుమాసములకు సప్త ధాతువులు ఉద్భవించును. అయిదుమాసములకు ఆఁకలియు, దప్పియు కలుగును. ఆఱుమాసములకు జరాయువు (మావి) చే కప్పఁబడి కడుపులో దక్షిణమున తిరుగుచుండును. ఇట్లు మాతృభుక్తాన్న పానాదులచే క్రమముగా వృద్ధిపొందుచు దుర్గంధభూయిష్ఠ మగు మల మూత్రముల గుంటలో శయనించుచు నచ్చటి పురుగులు సుకుమార మగు శరీరమును కఱచుచుండ ఆబాధ కాగలేక మాటిమాటికి మూర్ఛిల్లుచుండును.

కటుతీక్ష్ణోష్ణలవణరూక్షామ్లాదిభి రుల్బణైః,
మాతృభుక్తై రుపస్పృష్ట స్సర్వాంగోత్థిత వేదనః. ౧౧
ఉల్బేన సంవృత స్తస్మి న్నంత్రైశ్చ బహి రావృతః,
ఆస్తే కృత్వా శిరః కుక్షౌ భుగ్నపృష్ఠశిరోధరః. ౧౨

యస్మిన్ తస్మిన్. అసమ్మతే దుర్గంధే గర్తే శేతే. తథా చ మార్కండేయపురాణే "నాడీ చాప్యాయినీ నామ నాభ్యాం తస్య నిబధ్యతే, స్త్రీణాం తథాంత్రసుషిరే సా నిబద్ధోపజాయతే, క్రమంతే భుక్తపీతాని స్త్రీణాం గర్భోదరే తథా, తై రాప్యాయిత దేహోఽసౌ జంతు ర్వృద్ధి ముపైతి హి" ఇతి. ౯. 'కథ ముత్పద్యతే!' ఇతి ప్రశ్నస్యోత్తర ముక్త్వా 'గర్భాదిదుఃఖం యద్భుక్తే' ఇత్యస్యోత్తర మాహ. తత్రత్యైః గర్భస్థితైః క్షుధితైః ఖాదద్భిః క్రిమిభిః సౌకుమార్యాత్ కోమలత్వేన క్షతాని సర్వాంగాని యస్య. ౧౦. ఉల్బణైః దుస్సహైః సర్వాంగేషు ఉత్థితా వేదనా యస్య ఆస్తే ఇ త్యుత్తరేణాన్వయః. ౧౧. ఉల్బేన జరాయుణా భుగ్నం వక్రం పృష్ఠం శిరోధరా గ్రీవా చ యస్య. ౧౨. దైవా త్పూర్వకర్మవశాత్-

అకల్ప స్సర్వాంగచేష్టాయాం శకుంత ఇవ పంజరే,
తత్ర లబ్ధ స్మృతి ర్దైవా త్కర్మజన్మశతోద్భవమ్. ౧౩
స్మరణ్ దీర్ఘ మనుచ్ఛ్వాసం శర్మ కిం నామవిందతే,
నాధమానఋషి ర్భీతః సప్తవధ్రిః కృతాంజలిః. ౧౪
స్తువీత తం విక్లబయా వాచా యే నోదరేఽర్పితః,
ఆరభ్య సప్తమా న్మాసాం ల్లబ్ధబోధోఽపి వేపితః. ౧౫
నైకత్రాఽస్తే సూతివాతై ర్విష్ఠాభూరివ సోదరః,

మాతృభుక్తములును, దుస్సహములును అగు కట్వామ్లలవణాది పదార్థములచేత సర్వాంగములయందును వేదన కలుగుచుండ మావిచేతను, ప్రేవులచేతను చుట్టఁబడి వక్రీభూతపృష్ఠశిరోధరుఁడై అధశ్శిరస్కుఁడై కదలుటకు నైతము శక్తిలేక పంజరమందలిపక్షివలెనుండును. అంత దైవవశమున స్మృతి వచ్చి పూర్వజన్మమున చేసినపాపములన్నియు జ్ఞాపకము రాఁగా దీర్ఘనిశ్వాసములు విడుచుచు సుఖములేకయుండును. పిదప పరితపించుచు బంధభూతములగు సప్తధాతువులు కలిగి కృతాంజలియై గద్గదస్వరముతో భగవంతుని స్తోత్రము చేయుచుండును. ఏడవ మాసము మొదలు జ్ఞానము గలిగి సూతికావాతములచే నిటునటు కదల్పఁబడుచు సమానోదరజన్మ యగు క్రిమివలె నొకచోట నుండక తిరుగుచు జీవుఁడు భగవంతుని స్తోత్రము చేయును.

జీవ ఉవాచ:

శ్రీపతిం జగదాధార మశుభక్షయకారకమ్. ౧౬
వ్రజామి శరణం విష్ణుం శరణాగతవత్సలమ్,
త్వన్మాయామోహితో దేహే తథా పుత్రకళత్రకే. ౧౭
అహం మమాభిమానేన గతోఽహం నాథ సంసృతిమ్,
కృతం పరిజన స్యార్థే మయా కర్మ శుభాశుభమ్. ౧౮
ఏకాకీ తేన దగ్ధోఽహం గతా స్తే ఫలభాగినః,

---

లబ్ధస్మృతిర్యేన సః దీర్ఘం దురంతం అనుచ్ఛ్వాసం యథా భవతి తథా తత్రస్థితస్సన్ శర్మ సుఖం నైవ విందత ఇతి. ౧౩. సూతిహేతుభి ర్వాతై ర్వేపితః. సోదరః సమానోదరజన్మా - విష్ఠాభూః క్రిమిరివ నాథమానః యాచమానః. ఉపతప్యమానో వా - ఋషిః దేహాత్మదర్శీ-సప్తవధ్రయః బంధనభూతాః ధాతవో యస్య సః. ౧౫. అత్రాఽతిదుఃఖితో జీవో మందవిరక్తఇవ స్తౌతి. శ్రీపతి మిత్యాద్యష్టభిః. ౧౬, ౧౭.

యది యోన్యాః ప్రముచ్యేఽహం తత్ స్మరిష్యే పదం తవ. ౧౯
త ముపాయం కరిష్యామి యేన ముక్తిం వ్రజా మ్యహమ్,
విణ్మూత్ర కూపే పతితో దగ్ధోఽహం జఠరాగ్నినా. ౨౦
ఇచ్ఛ న్నితో వివసితుం కదా నిర్యాస్యతే బహిః,
యే నేదృశం మే విజ్ఞానం దత్తం దీనదయాళునా. ౨౧
తమేవ శరణం యామి పునర్మే మాస్తు సంసృతిః,
న చ నిర్గంతు మిచ్ఛామి బహిర్గర్భా త్కదాచన. ౨౨
యత్ర యాతస్య మే పాపకర్మణా దుర్గతి ర్భవేత్,
తస్మా దత్ర మహాదుఃఖే స్థితోఽపి విగతక్లమః. ౨౩
ఉద్ధరిష్యామి సంసారా దాత్మానం తే పదాశ్రయః,

శ్రియఃపతియు, జగదాధారభూతుఁడును, సమస్తపాపక్షయకారకుఁడును, శరణాగతరక్షకుఁడును అగుశ్రీమహావిష్ణువును శరణమును పొందుచున్నాను. శ్రీహరీ! నీమాయచే మోహితుఁడనై పుత్రకళత్రాదులయందు అహంకారమమకారములు గలిగి సంసారమునఁ బడితిని. భార్యాపుత్త్రాదుల పోషణకై మంచి చెడ్డల నరయక దుర్మార్గమున చరించి ధనసంపాదనము చేసినాను. భార్యాపుత్త్రాదులు నేను సంపాదించిన ధనమంతయు ననుభవించి తమదారినిఁ బోయినారు; గాని నన్ను చూడరైరి. ఓభగవంతుఁడా! ఈగర్భకుహరమునుండి బయటపడవేయుము. ఎల్లపుడును నీ చరణకమలములనే స్మరించుచుండెదను. ముక్తిమార్గమును వెదకికొందును. సంసారములు ఇక నెప్పుడును స్మరింపను. శ్రీహరీ! మలమూత్రకూపమునఁబడి జఠరాగ్నిచే మాడిపోవుచున్నాను. ఎట్లయినను నాకు బయటకు వచ్చుటకు అనుగ్రహింపుము. దీనదయాళూ! ఇట్టి జ్ఞానము ఎవరికృపవలన కలిగినదో అట్టి పరమేశ్వరుఁడ వగు నిన్ను శరణము పొందుచున్నాను. ఓశరణాగతత్రాణపరా

పరిజనస్యార్థే కుటుంబపాలనాయ. ౧౮, ౧౯. స్వదుఃఖం విజ్ఞాపయ న్నాహ. ఇతో గర్భాత్ - వివసితుం నిర్గంతు - మిచ్ఛన్ అసౌకదా బహిః నిర్యాస్యతే నిష్క్రాస్యతే. ౨౦. తత్కృతముపకారం స్మర న్నాహ. యే నేతి. ౨౧. వా అథవా. ౨౨. తస్మాదత్ర తనిస్థితోఽపి విగతక్లమః అవ్యాకులస్సన్. కాఽత్ర తవ సాధనసామగ్రీ త్యత్రాహ. తే పదాశ్రయస్స న్నితి. ౨౩. దశమాస్యః దశ మాసా గర్భే వ్యతీతా యస్యేతి-

యణా! భక్తవత్సలా! నాకు మఱల నెప్పటికిని సంసారము లేకుండఁ జేయుము. గర్భకుహరమునుండి బయటకు వచ్చిన పాపములు చేయుట గాక పుణ్యకర్మల నాచరించుటకు వలనుపడదు. గావున బయటకు రానొల్లను. గర్భకుహరమునుండియే గర్భనరకము ననుభవించుచు నీపాదముల నాశ్రయించి అనాయాసముగ ముక్తిపొందుదును.

ఏవం కృతమతి ర్గర్భే దశమాస్య స్తువ న్నృషిః. ౨౪
సద్యః క్షిప త్యవాచీనం ప్రసూత్యై సూతిమారుతః,
తేనావసృష్ట స్సహసా కృత్వా వాక్శి రవాతురః. ౨౫
వినిష్క్రామతి కృచ్ఛ్రేణ నిరుచ్ఛ్వాసో హతస్మృతిః,
పతితో భువి విణ్మూత్రే విష్ఠాభూ రివ చేష్టతే. ౨౬
రోరూయతి గతే జ్ఞానే విపరీతం గతిం గతః,
గర్భే వ్యాధౌ శ్మశానే చ పురాణే యా మతి ర్భవేత్. ౨౭
సా యది స్థిరతాం యాతి కో న ముచ్యేత బంధనాత్,
యదా గర్భా ద్బహి ర్యాతి కర్మభోగా దనంతరమ్. ౨౮
తదైవ వైష్ణవీ మాయా మోహయత్యేవ పూరుషమ్,
స తదా మాయయా స్పృష్టో న కించి ద్వదతే వశః. ౨౯
శైశవాదిభవం దుఃఖం పరాధీనతయాశ్నుతే,
పరచ్ఛందం న విదుషా పుష్యమాణో జనేన సః. ౩౦
అనభిప్రేత మాపన్నః ప్రత్యాఖ్యాతు మనీశ్వరః,
శాయితో ఽశుచిపర్యంకే జంతుస్స్వేదజదూషితే. ౩౧
నేశః కండూయ నేంగానా మాసనోత్థానచేష్టనే,

---

ఋషిః జీవః. సద్యః తత్క్షణ మేవ - అవాచీనం అవాఙ్ముఖం. సూతి హేతు ర్మారుతః- ప్రసూత్యై జననార్థం - క్షిపతి నుదతి. ౨౪. అవసృష్టః అధిక్షిప్తస్సన్. ౨౫, ౨౬. శ్మశానే మృతానుగమనే - పురాణే తచ్ఛ్రవణే. ౨౭. కిమితి స్థిరతాం నయాతీ త్యత్రాహ. యదేతి. ౨౮, ౨౯. గర్భదుఃఖ ముక్త్వా శైశవదుఃఖ మాహ. పరేతి త్రిభిః. పరస్య ఛందం మభిప్రాయం-న విదుషా జనేన - పుష్యమాణః పాల్యమానః - అనభిప్రేతం ప్రతికూలం - ఆపన్నః ప్రాప్తస్సన్ - స్తన్యార్థం రోదనే ఉదరవ్యథాం ప్రకల్ప్య నింబరసపానం ఉదరవ్యథయా రోదనే స్తన్యపాన మిత్యాది. ౩౦. ఆసనోత్థానచేష్టనేచ నేశః అనీశస్సన్ రోరూయతీ త్యనుషంగః. ౩౧. అమా

తుదం త్యామత్వచం దంశా మశకా మత్కుణాదయః ౩౨
రుదంతం విగతజ్ఞానం క్రిమయః క్రిమికం యథా,
ఇత్యేవం శైశవం భుక్త్వా దుఃఖం పౌగండ మేవ చ ౩౩

ఇట్లు కృతమతియై స్తోత్రము చేయు ఆజీవుని పదవమాసంబున ప్రసవహేతు వగు మారుతము అవాఙ్ముఖముగా చిమ్మును. అట్లు చిమ్మఁబడి అవాక్ఛిరుఁడై ఆతురుఁడును, విగతస్మృతియు, నిరుచ్ఛ్వాసుఁడును అయి అతికష్టముమీఁదఁ బయటకువచ్చును. భూమిమీఁదఁబడి మలమూత్రములయందు కృమివలె కదలుచుండును. అంతట జ్ఞానము నశించి అజ్ఞానము ఆవరింప ఏడువఁదొడఁగును. గర్భమునందున్నపుడును, జబ్బుచేసినపుడును, శ్మశానమునం దున్నపుడును, పురాణమును వినునపుడును గలుగు జ్ఞానము స్థిర మగునెడల మనుజు లందఱును ముక్తిని పొందితీఱెదరు. గరుడుఁడా! అట్టి జ్ఞానము స్థిరముగ నెప్పుడును ఉండదుసుమా. జీవుఁడు గర్భగోళమునుండి బైటకు వచ్చినవెంటనే వైష్ణవమాయ కప్పివేయును. అట్లు మాయాచ్ఛాదితుఁడయి నేమియుఁ బలుకనేరక పరాధీనుఁడై బాల్యాదికములగు దుఃఖము లనుభవించుచుండును. కాఁబట్టి పూర్వజన్మజ్ఞానము మనుజులకు స్థిరముగా నుండదు. పరుల మనోభావముల నెఱుంగనివారిచే పోషింపఁబడుటయు, ప్రతికూలములును, అనిష్టములును అగువానిని పొందుటయు, వలదని చెప్పుటకు శక్తి లేకపోవుటయు, నల్లులు మున్నగు జంతువులతో నిండి అపరిశుభ్రమైయున్న మంచముమీఁద పరుండుటయు, అవయవములను గోకుకొనుటకు, శక్తిలేకయుండుటయు, లేచుటకు నడచుటకు శక్తిలేకపోవుటయు మొదలగు శైశవదుఃఖములచే బాధపడుచుండు జీవుని లేతచర్మమును నల్లులు చీమలు మున్నగునవి తినుచుండును. అట్టి బాధ పడలేక ఏడ్చుచుండు జీవుని కృములు భక్షించుచునే యుండును. పిదప పౌగండ (యౌవన) దుఃఖముల ననుభవించును.

తతో యౌవన మాసాద్య యాంతి సంపద మాసురీమ్,

---

కోమలా త్వక్ యస్య తమ్. విగతం గర్భే జాతం జ్ఞానం యస్య. ౩౨. శైశవం పంచవర్షాణి పౌగండం యౌవనా ధర్వాక్. తత్ర చ అధ్యయనాదిదుఃఖాని యౌవన దుఃఖ మాహ. ఆసురీం దంభో దర్పోఽభిమానశ్చేత్యాదికామ్. ౩౩. తదా యౌవన

తదా దుర్వ్యసనాసక్తో నీచసంగపరాయణః. ౩౪
శాస్త్రసత్పురుషాణాం చ ద్వేష్టా స్యాత్కామలంపటః,
దృష్ట్వా స్త్రియం దేవమాయాం తద్భావైరజితేంద్రియః. ౩౫
ప్రలోభితః పతత్యంధే తమస్యగ్నౌ పతంగవత్,
కురంగమాతంగపతంగభృంగమీనా హతాః పంచభిరేవ పంచ,
ఏకః ప్రమాదీ స కథం న హన్యతే యస్సేవతే పంచభిరేవ పంచ. ౩౬
అలబ్ధాభీప్సితోఽజ్ఞానాదిద్ధమన్యుశ్శుచార్పితః,
సహ దేహేన మానేన వర్ధమానేన మన్యునా. ౩౭
కరోతి విగ్రహం కామీ కామిష్వంతాయ చాత్మనః,
బలాధికైస్స హన్యేత గజైరన్యైర్గజో యథా. ౩౮
ఏవం యో విషయాసక్త్యా నరత్వమతిదుర్లభమ్,
వృథా నాశయతే మూఢస్తస్మాత్పాపతరో హి కః? ౩౯
జాతిశతేషు లభతే భువి మానుషత్వం
తత్రాపి దుర్లభతరం ఖలు భో ద్విజత్వమ్,

---

సమయే. ౩౪. కామలంపటతామేవాహ. దృష్ట్వేతి. దేవస్య మమ మాయారూపం-తద్భావైః తస్యాః కటాక్షకపటస్నేహవంచనాదిభిర్భావైః ప్రలోభితస్సన్ అంధే తమసి మహామోహే పతతి. ౩౫. తత్ర పంచేంద్రియప్రధానో నరః పతతీతి కిం వాచ్యమ్. ఏకైకేంద్రియాసక్త్యైవ బహవో నష్టా ఇత్యాహ. కురంగేతి పంచభిః. శబ్దస్పర్శరూపరసగంధైర్మోహితాః కురంగాదయః పంచహతా ఏవ, కించ పంచభిః శ్రవణాదిభిరింద్రియైః పంచ శబ్దాదివిషయాన్ యః ఏక ఏవ ప్రమాదీ అవివేకీ సేవతే సః యువా కథం న హన్యతే? అపితు హన్యత ఏవేత్యర్థః. ౩౬. హనన మేవ నిరూపయతి. అలబ్ధేతి ద్వాభ్యామ్. న లబ్ధం అభీప్సితం వాంఛితం కామిన్యాదిసుఖం యేన సః-అజ్ఞానాదవిచారాత్ - ఇద్ధః ప్రవృద్ధః మన్యుః కోపో యస్యేతి. యదా వాంఛితలాభో న జాతః తదా శుచార్పితః శోకేన యుక్తో భవతి. యదా దేహేన సహైవ వర్ధమానేన మన్యునా చ-ఆత్మనః అంతాయ స్వస్య నాశాయ - కామిషు అన్యజారేషు-కామినీనిమిత్తం విగ్రహం విరోధం కరోతి. ౩౭. తదా కామీ యువా బలేన అధికైర్జారైర్హన్యేత-యథా ప్రబలైర్గజైర్హీనో గజ ఇవ. ౩౮. యో విషయాసక్త్యా వృథైవ నరత్వం నాశయతి త మనుశోచన్నాహ. ఏవ మితి ద్వాభ్యామ్. ౩౯. జాతిశతే ష్వితి. పశ్వాదిజాతీనాం శతేషు - శతశబ్దోఽత్రానం

యస్తన్న పాలయతి లాలయతీంద్రియాణి
తస్యామృతం క్షరతి హస్తగతం ప్రమాదాత్. ౪౦

శ్రోత్రేంద్రియప్రధాన మగు లేడి శబ్దముచే చెడినది. త్వగింద్రియప్రధాన మగు ఏనుఁగు స్పర్శచే చెడినది. చక్షురింద్రియప్రధాన మగు పక్షి రూపమువలన చెడినది. జిహ్వేంద్రియప్రధాన మగు తుమ్మెద రసముచే చెడినది. ఘ్రాణేంద్రియప్రధానమగు చేప గంధముచే చెడినది. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లను జ్ఞానేంద్రియములతో శబ్దస్పర్శరూపరసగంధము లనుభవించుచున్నట్టియు, అవివేకియు, యౌవనుఁడును అగు మనుష్యుఁడు అవశ్యము చెడితీరును. యౌవనప్రాదుర్భావ మగుటతోడనే మనుష్యులకు ముందుగ సంభోగేచ్ఛ పొడమును. తరువాత దానినిమిత్తము ప్రయత్నించును. ప్రయత్నము విఫల మయిన అజ్ఞానమువలన కోపముఁ జెందును. పిమ్మట దుఃఖమును పొందును. అనంతరము శరీరముతోఁగూడ దినదిన ప్రవర్ధమాన మగు కోపము బొంది ఇతర కాముకులతో విరోధించును. అంతట బలాధికు లగు వారి వలన తాను ఏనుఁగులచే ఏనుఁగు చెడినట్లు హతుఁడై పోవును. ఇట్లు విషయసుఖతత్పరుఁ డగుటంజేసి అతిదుర్లభ మగు మనుష్యజన్మమును వ్యర్థముగ చెడఁగొట్టుకొను మనుష్యునికంటె మూఢుఁడును, పాపాత్ముఁడును మఱియొకఁ డుండునా? గరుడుఁడా! పశుపక్షిమృగాది తిర్యగ్జన్మల నెత్తక మనుష్యజన్మ పొందుట అతికష్టము. అందును బ్రాహ్మణజన్మ నెత్తుట మఱియుఁ గష్టము. అట్టి బ్రాహ్మణజన్మ నెత్తియు బ్రాహ్మణత్వమును రక్షించుకొనక విషయాసక్తుఁడై ఇంద్రియము

త్వాచకః - అనేకజీవజాతిష్వి త్యర్థః. భువి కర్మభూమౌ చ మానుషత్వం యన్మనుష్యశరీరం లభతే త ద్దుర్లభం హి - భగవన్నామస్మరణార్హత్వాత్. "అహో బత శ్వపచోఽతో గరీయాన్ యజ్జిహ్వాగ్రే వర్తతే నామ తుభ్య" మితి వచనాత్. తత్రాపి నర దేహేఽపి ద్విజత్వం బ్రాహ్మణత్వం దుర్లభతరం అతిదుర్లభం ఖలు. అతః భో గరుడ! యో ద్విజ స్తత్ర తారుణ్యే పాలయతి- దేహ మితి శేషః. తత్ ద్విజత్వం న పాలయతి-ఇంద్రియాణి లాలయతి విషయాస్వాదనలంపటాని కరోతి. తస్య ద్విజస్య హస్తగతం అనాయాసేన కరతలే ప్రాప్తం పానేన అజరామరత్వప్రద మమృతం ప్రమాదాత్ పాన స్యాలస్యాత్ క్షరతి వృథైవ నిస్సరతి. తప స్తీర్థాదిషు సమగ్రం ముక్తిప్రదం తారుణ్యం క్షుద్రవిషయాభిలాషే వృథైవ యాతీ త్యర్థః. ౪౦. తత

లను జయింపలేక చెడిపోవు బ్రాహ్మణుఁడు తన హస్తమున నున్న అమృతమును క్రింద జారవిడుచు వెంగలివంటివాఁడు.

తత స్తాం వృద్ధతాం ప్రాప్య మహావ్యాధిసమాకులః,
మృత్యుం ప్రాప్య మహాదుఃఖం నరకం యాతి పూర్వవత్ ౮౧
ఏవం గతాగతైః కర్మపాశై ర్బద్ధాశ్చ పాపినః,
కదాపి న విరజ్యంతే మమ మాయావిమోహితాః. ౮౨
ఇతి తే కథితా తార్క్ష్య పాపినాం నారకీ గతిః,
అంత్యేష్టికర్మహీనానాం కిం భూయః శ్రోతుమిచ్ఛసి? ౮౩

అనంతరమును వార్ధకమును పొంది అనేకరోగములచే బాధపడును మృతిఁ బొంది మహాదుఃఖాకరము లగు నరకములకు మరల పోవును. ఇట్లు గతాగతములచే పాపాత్ములు కర్మబద్ధులై మన్మాయామోహితు లగుటం జేసి ఎన్నటికిని వైరాగ్యమును బొందక సంసారమునఁబడి మునిఁగి తేలుచు దరిగానక దుఃఖించుచుందురు. గరుడుఁడా! ఔర్ధ్వదైహికవిహీను లగు పాపాత్ములకు గలుగు యమయాతనలను చెప్పినాను. మరల నింకేమి వినఁగోరెదవు?

ఇతి శ్రీగరుడపురాణే సారోద్ధారే పాపినాం జన్మాదిదుఃఖ
నిరూపణో నామ షష్ఠోఽధ్యాయః.

---

స్త్రీరూణ్యానంతరం తాం "అ స్త్రీఽవమలోల్పపన్న స్త్రీ" మిత్యాదినా పూర్వోక్తాం వృద్ధతాం ప్రాప్య పూర్వవత్ 'యాతనాదేహ ఆవృత్య' ఇత్యాది పూర్వోక్తప్రకారేణ. ౮౧. ఏవం షడధ్యాయోక్తప్రకారేణ గతాగతైః గత్వా నరకే-ఆగతా భువి-ఏతద్రూపైః కర్మణాం పాశై ర్బద్ధాః న విరజ్యంతే విరక్తిం న లభంతే. అత్ర హేతుః మమ మయావిమోహితా ఇతి. ౮౨. పాపగతి ముపసంహరతి. ఇతీతి. ౮౩. ఇతి శ్రీగరుడపురాణటీకాయాం షష్ఠోఽధ్యాయః.

# సప్తమాధ్యాయము



సూత ఉవాచ:—

ఇతి శ్రుత్వా తు గరుడః కంపితో౽శ్వత్థపత్రవత్,
జనానా ముపకారార్థం పునః పప్రచ్ఛ కేశవమ్. ౧

గరుడ ఉవాచ:—

కృత్వా పాపాని మనుజాః ప్రమాదాద్బుద్ధితో౽పి వా,
న యాంతి యాతనా యామ్యాః కేనోపాయేన కథ్యతామ్. ౨
సంసారార్ణవమగ్నానాం నరాణాం దీనచేతసామ్,
పాపోపహతబుద్ధీనాం విషయోపహతాత్మనామ్. ౩
ఉద్ధారార్థం వద స్వామిన్పురాణార్థవినిశ్చయమ్,
ఉపాయం యేన మనుజాస్సద్గతిం యాంతి మాధవ. ౪

శ్రీభగవానువాచ:—

సాధు పృష్టం త్వయా తార్క్ష్య మానుషాణాం హితాయ వై,
శృణుష్వావహితో భూత్వా సర్వం తే కథయామ్యహమ్ ౫

అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లని చెప్పందొడంగెను. గరుడుఁడు రావియాకువలె వడఁకిపోయి "శ్రీహరీ! మనుష్యులు ప్రమాదమువలనఁగాని, బుద్ధిపూర్వకముగఁ గాని పాపములు చేసినను యమయాతనల నెట్లనుభవింపకుందురో ఆ యుపాయములను జెప్పుము. సంసారసాగరనిమగ్నులును, దీనచేతస్కులును, పాపాత్ములును, విషయసుఖాసక్తులును అగు మనుజులు ఏ యుపాయమువలన సద్గతిఁ బొందుదురో వానినిఁ గూడఁ జెప్పుము." అని యడుగ శ్రీహరి యిట్లు చెప్పెను. మానవుల నుద్ధరించుటకు మంచిప్రశ్న నడిగితివి. సావధానుఁడవై వినుము.

---

గరుడష్షడ్భిరధ్యాయైః శ్రుత్వా పాతకయాతనాం, అథ తన్నాశకోపాయ మష్టభిః పరిపృచ్ఛతి. ఇతీతి. ౧. ఊర్ధ్వదైహికదానేన గతః ప్రేతో౽పి సద్గతిం, ఇత్యాద్యాసప్తమే విష్ణుర్బభ్రువాహనసత్కథామ్. ప్రమాదాత్ అనవధానత్వాత్. ౨, ౩.

దుర్గతిః కథితా పూర్వ మపుత్రాణాం చ పాపినామ్,
పుత్రిణాం ధార్మికాణాం తు న కదాచిత్ఖగేశ్వర. ౬
పుత్రజన్మావరోధ స్స్యా ద్యది కేనాపి కర్మణా,
తదా కశ్చి దుపాయేన పుత్రోత్పత్తిం ప్రసాధయేత్. ౭
హరివంశకథాం శ్రుత్వా శతచండీవిధానతః,
భక్త్యా శ్రీశివమారాధ్య పుత్ర ముత్పాదయేత్సుధీః. ౮
పున్నామ్నో నరకాద్యస్మాత్పితరం త్రాయతే సుతః,
తస్మా త్పుత్ర ఇతి ప్రోక్తః స్వయమేవ స్వయంభువా. ౯
ఏకోఽపి పుత్రో ధర్మాత్మా సర్వం తారయతే కులమ్,
పుత్రేణ లోకా న్జయతి శ్రుతి రేషా సనాతనీ. ౧౦
ఇతి వేదై రపి ప్రోక్తం పుత్రమాహాత్మ్యముత్తమమ్,
తస్మాత్పుత్రముఖం దృష్ట్వా ముచ్యతే పైతృకాదృణాత్. ౧౧
పౌత్రస్య స్పర్శనాన్మర్త్యో ముచ్యతే చ ఋణత్రయాత్,
లోకా నత్యే ద్దివః ప్రాప్తిః పుత్రపౌత్రప్రపౌత్రకైః. ౧౨

గరుడుఁడా! తొల్లి అపుత్రకు లగు పాపాత్ములకు దుర్గతి కలుగునని చెప్పఁబడియున్నది. పుత్రవంతు లగు ధర్మాత్ములకు దుర్గతి ఎప్పుడును కలుగదు. ప్రాక్తన జన్మకర్మంబున సంతానము లేనివారు హరివంశకథ వినుట, శతచండీవిధానము, శివపూజ మొదలగు నుపాయములవలన పుత్రులు కలుగునట్లు చేసికోవలెను. పుంనామనరకమువలన తలిదండ్రులను రక్షించును; గావున సుతునకు పుత్రుఁడు అని బ్రహ్మ పేరు పెట్టెను. ధర్మాత్ముఁ డగు నొక పుత్రునివలననే వంశ మంతయు తరించును. వేదములయందు పుత్రమహిమ వేయినోళ్ల కొనియాడఁబడియున్నది. పుత్రముఖములను జూచుట తోడనే మనుజుఁడు పైతృకఋణము

పురాణార్థేషు విశేషేణ నిశ్చయో యస్య త ముపాయం వద. ౪-౬. మృతస్య పుణ్య పాపాభ్యాం ద్వే గతీ. తత్ర పాపగతి స్తు నిరూపితా. ఇదానీం పుణ్యగతిం శ్రీభగవా నువాచ. సాధ్వీతి యావద్గ్రంథసమాప్తి. కించ అపుత్రాణామేవ దుర్గతి ర్భవతి. నతు పుత్రిణాం అతః పుత్రమహిమానం నిరూపయతి. ౭. ఉపాయానేవాహ. హరివంశేతి. ౮-౧౧. లోకాన్ యమలోకాదీన్ అత్యేత్ అతిక్రమతి - పుత్రాదిభిః కృత్వా దివః స్వర్గస్య ప్రాప్తి ర్భవతి. ౧౨. అత్ర విశేష మాహ. బ్రాహ్మ్యోఢేతి. బ్రాహ్మ్యవివా

నుండి విముక్తిఁ బడయును. పౌత్రునియంగస్పర్శమువలన పితృఋణము, దేవఋణము, మునిఋణము ఈమూఁడుఋణములవలన ముక్తుఁడగును. పుత్రపౌత్రప్రపౌత్రులచే సమస్తయమలోకముల నతిక్రమించు స్వర్గము నకుఁ బోవును.

బ్రాహ్మోఢాపుత్రోన్నయతి సంగృహీతస్త్వధో నయేత్,
ఏవం జ్ఞాత్వా ఖగశ్రేష్ఠ హీనజాతిసుతాం త్యజేత్. ౧౩
సవర్ణేభ్యస్సవర్ణాసు యే పుత్రా ఔరసాః ఖగ,
త ఏవ శ్రాద్ధదానేన పితౄణాం స్వర్గహేతవః ౧౪
శ్రాద్ధేన పుత్రదత్తేన స్వర్యాతీతి కి ముచ్యతే?,
ప్రేతోఽపి పరదత్తేన గతస్స్వర్గం మయా శృణు. ౧౫
అత్రైవోదాహరిష్యేఽహ మితిహాసం పురాతనమ్,
ఔర్ధ్వదైహికదానస్య పరం మాహాత్మ్యసూచకమ్. ౧౬
పురా త్రేతాయుగే తార్క్ష్య! రాజాఽసీద్బభ్రువాహనః,
మహోదయే పురే రమ్యే ధర్మనిష్ఠో మహాబలః. ౧౭
యజ్వా దానపతిః శ్రీమా న్బ్రహ్మణ్యస్సాధువత్సలః,
శీలాచారగుణోపేతో దయాదాక్షిణ్యసంయుతః. ౧౮
పాలయామాస ధర్మేణ ప్రజాః పుత్రానివౌరసాన్,
క్షత్రధర్మరతో నిత్యం సదండ్యాన్ దండయన్నృపః. ౧౯
స కదాచి న్మహాబాహుః ససైన్యో మృగయాం గతః,
వనం వివేశ గహనం నానావృక్షసమన్వితమ్. ౨౦
నానామృగగణాకీర్ణం నానాపక్షినినాదితమ్,

---

హీన ఊఢా వివాహితా యా పత్నీ తస్యాః పుత్రో బ్రాహ్మోఢాపుత్రః-సతు ఉత్ ఊర్ధ్వం స్వర్గాదిలోకం నయతి. ఉన్నయతీ త్యత్ర సంధిరార్షః, బ్రాహ్మ్యం తు ''సవర్ణాయా స్సవర్ణేన వరేణ సహ జాయతే, వివాహో వేదవిధినా బ్రాహ్మ్య ఇత్యభిధీయతే'' ఇతి. సంగృహీతః అవివాహితాయాః పుత్రస్తు అధః అధోగతిం నయతి. ౧౩. సవర్ణేభ్యః స్వపతిభ్యః సవర్ణాసు స్వస్త్రీషు. ఔరసా, ఇతి దత్తక్రీతాదివ్యావృత్తిః-స్వరితి త్యవ్యయం-స్వర్యాతీతి కిం వాచ్యం-పరదత్తేన శ్రాద్ధేనే త్యనుషంగః. ౧౫. అత్రపుత్రమాహాత్మ్యప్రస్తావేన శ్రాద్ధమహిమాన మితిహాసముఖేన ప్రస్తౌతి. అత్రేతి. యావదధ్యాయసమాప్తి. ౧౬—౨౧. తేన నృపేణ దూరాత్ప్రిక్షిప్తేన అతీవ సుదృఢేనాపి

బ్రాహ్మవివాహమున స్వీకరింపఁబడిన కన్యకకు పుట్టిన పుత్త్రుఁడు స్వర్గాదిపుణ్యలోకమును పొందించును. అవివాహిత పత్నీపుత్త్రుఁడు నరకలోకమును పొందించును. సవర్ణస్త్రీయందుకలిగిన ఔరసపుత్త్రుని వలన చేయఁబడిన శ్రాద్ధాదికము తలిదండ్రులకు స్వర్గాదిలోకములను కలిగించును. పరులు చేసిన శ్రాద్ధములవలననే మృతిఁ బొందినవారు స్వర్గలోకమును పొందుచుండఁగా ఔరసులు చేసిన శ్రాద్ధాదికమువలన స్వర్గాదిపుణ్యలోకములు కలుగుటలో నాశ్చర్యమేమి! గరుడుఁడా! ప్రాచీనమును, ఔర్ధ్వదైహికమహిమాసూచకమును అగు నొక యితిహాసమును చెప్పెద వినుము. తొల్లి త్రేతాయుగమున బభ్రువాహనుఁడను రాజు ఉండెను. అతని రాజధాని మహోదయ మను నగరము. యాగశీలుఁడు, మహాదాత, శ్రీమంతుఁడు, బ్రాహ్మణప్రియుఁడు, సాధువత్సలుఁడు, శీలాచారవంతుఁడు, సద్గుణోపేతుఁడు, భూతదయ గలవాఁడు, పరిజనులయందు దాక్షిణ్యము గలవాఁడు, క్షత్త్రియధర్మనిరతుఁడు అగు ఆ బభ్రువాహనమహారాజు ప్రజలను పుత్త్రులనువోలె పరిపాలించుచుండెను. ఒకనాఁడు ఆ మహారాజు సైన్యసమన్వితుఁడై, వేఁటకు బయలుదేఱి నానావృక్షసమన్వితంబును, అనేకవిధ మృగసమూహసంకులమును, నానాపక్షిగణనినాదితమును అగు నొక మహారణ్యము ప్రవేశించెను.

వనమధ్యే తదా రాజా మృగం దూరా దదృశ్యత. ౨౧
తేన విద్ధో మృగోఽతీవ బాణేన సుదృఢేన చ,
బాణ మాదాయ తం తస్య వనేఽదర్శన మేయివాన్. ౨౨
కక్షేణ రుధిరార్ద్రేణ స రాజాఽనుజగామ తమ్,
తతో మృగప్రసంగేన వన మన్య ద్వివేశ సః. ౨౩
క్షుత్క్షామకంఠో నృపతిః శ్రమసంతాపమూర్ఛితః,
జలాశయం సమాసాద్య సాశ్వ ఏవ వ్యగాహత. ౨౪

బాణేన విద్ధ ఏవ - న తు మృతః - ఏయివాన్ గతః. ౨౨, ౨౩. క్షుధా క్షామః శుష్కః కంఠో యస్య - దూరగమనేన శ్రమః ఖేదః అతపేన సంతాపః తాభ్యాం మూర్ఛితః అస్వస్థః - సరోవరం ప్రాప్య అశ్వేన సహిత ఏవ వ్యగాహత తస్మిన్ ప్రవిష్టః. ౨౪. తతః అశ్వాదవతీర్య తదుదకం పపౌ - సలిలా జ్జలపానాత్ విశ్రమః

పపౌ తదుదకం శీతం పద్మగంధానువాసితమ్,
తతోఽవతీర్య సలిలాద్విశ్రమో బభ్రువాహనః. ౨౫
దదర్శ న్యగ్రోధతరుం శీతచ్ఛాయం మనోహరమ్,
మహావిటపవిస్తీర్ణం పక్షిసంఘవినాదితమ్. ౨౬
వనస్య తస్య సర్వస్య మహాకేతుమివ స్థితమ్,
మూలం తస్య సమాసాద్య నిషసాద మహీపతిః. ౨౭

ఇట్లు వనమును ప్రవేశించి దూరమున ఒక మృగమును జూచి దానిమీఁదికి బాణము విడిచెను; గాని ఆమృగము ఆబాణముతోడనే పాఱిపోయెను. అంతట నారాజు మృగశరీరమునుండి స్రవించు రక్తధార నాధారము చేసికొని మృగమును కనుగొనఁబోవ ఆమార్గము మఱియొక మహారణ్యమునకుఁ బోయెను. అప్పటికి ఆరాజు మార్గాయాసమువలనను, ఆకలివలనను, గొంతుక యెండిపోవ సంతాపమూర్ఛితుఁడై యెట్లో వెదకి ఒక జలాశయము నారసి అశ్వంబును దానును అందలి తీయని నీరు త్రావి శీతలచ్ఛాయయు, మనోహరమును, పెద్ద కొమ్మలచే విస్తార ప్రదేశమును ఆక్రమించినదియు, అనేకపక్షిగణములకు ఆశ్రయమును, ఆమహారణ్యమునకు కేతువుఁబోలె విరాజిల్లుచున్నదియు అగు నొక వటవృక్షమును జూచి దానిక్రిందికిఁ బోయెను.

అథ ప్రేతం దదర్శాసౌ క్షుత్తృడ్భ్యాం వ్యాకులేంద్రియమ్,
ఊర్ధ్వకచం బలినం కుబ్జం నిర్మాంసం భీమదర్శనమ్. ౨౮
తం దృష్ట్వా వికృతం ఘోరం విస్మితో బభ్రువాహనః,
ప్రేతోఽపి దృష్ట్వా తం ఘోరామటవీ మాగతం నృపమ్. ౨౯
సముత్సుకమనా భూత్వా తస్యాంతిక ముపాగతః,
అబ్రవీచ్చ తదా తార్క్ష్య ప్రేతరాజో నృపం వచః. 30
ప్రేతభావో మయా త్యక్తః ప్రాప్తోఽస్మి పరమాం గతిమ్,
త్వత్సంయోగాన్మహాబాహో! జాతో ధన్యతరోఽస్మ్యహమ్. 3౧

అంతట దప్పికచేతను, ఆకలిచేతను వ్యాకులేంద్రియమైనదియు, ఊర్ధ్వకేశములుగలిగినదియు, బలముగలదియు, పొట్టిదియు, నిర్మాంసమైనదియు, భయంకరమైనదియు, వికృతమైనదియు, ఘోరమైనదియునగు

---

విగతశ్రమః బభూవ. ౨౫. న్యగ్రోధతరుం వటవృక్షమ్. ౨౬. మహాకేతుం ఉచ్ఛ్రతర

నొక ప్రేతము బభ్రువాహనమహారాజు నారసి ఆశ్చర్యముం బొంది ప్రసన్నచిత్తముతో ఆరాజుసమీపమునకు వచ్చి "ఓరాజా! నీసంయోగమువలన నాప్రేతత్వము వదలిపోయినది. పరమగతిని పొందితిని. నేను ధన్యతం బడసితిని" అని పలికెను.

రాజోవాచ:—

కృష్ణవర్ణ! కరాళాస్య! ప్రేతత్వం ఘోరదర్శనమ్,
కేన కర్మవిపాకేన ప్రాప్తం తే బహ్వమంగళమ్. ౩౨
ప్రేతత్వకారణం తాత బ్రూహి సర్వ మశేషతః,
కోఽసి త్వం కేన దానేన ప్రేతత్వం తే వినశ్యతి. ౩౩

ప్రేత ఉవాచ:—

కథయామి నృపశ్రేష్ఠ! సర్వమే వాదిత స్తవ,
ప్రేతత్వకారణం శ్రుత్వా దయాం కర్తుం త్వమర్హసి. ౩౪
వైదిశం నామ నగరం సర్వసంపత్సమన్వితమ్,
నానాజనపదాకీర్ణం నానారత్న సమాకులమ్. ౩౫
హర్మ్యప్రాసాదశోభాఢ్యం నానాధర్మసమన్వితమ్,
తత్రాఽహం న్యవసం తాత దేవార్చనరతస్సదా. ౩౬
వైశ్యో జాత్యా సుదేవోఽహం నామ్నా విదితమస్తు తే,
హవ్యేన తర్పితా దేవాః కవ్యేన పితర స్తథా. ౩౭
వివిధై ర్దానయోగైశ్చ విప్రాస్సంతర్పితా మయా,
దీనాంధకృపణేభ్యశ్చ దత్తమన్న మనేకధా. ౩౮
తత్సర్వం నిష్ఫలం రాజన్! మమ దై వాదుపాగతమ్,
యథా మే నిష్ఫలం జాతం సుకృతం తద్వదామి తే. ౩౯

అది విని రాజు "ఓకృష్ణవర్ణుండా! కరాళాస్యుండా! ఘోరదర్శనంబును, బహ్వమంగళంబును అగు నీప్రేతత్వ మెట్టుల కలిగినది!

---

త్వా ద్వవధ్వజ మివ. ౨౪ - ౨౯. సముత్సుకమనాః ప్రసన్నచిత్తః. ౩౦ - ౩౪. నానాజనపదాకీర్ణం అనేకదేశోద్భవైః జనైః పరిపూర్ణం - నానారత్నైశ్చ 'జాతౌ జాతౌ యదుత్కృష్టం తద్రత్న మభిధీయతే' ఇతి స్త్రీగజాశ్వాది శ్రేష్ఠవస్తుభిః పూర్ణమ్. ౩౫. 'హర్మ్యం రాజగృహం ప్రోక్తం ప్రాసాదో ధనినాం గృహమ్' తేషాం శోభాభి రాఢ్యం యుక్తం - నానాధర్మైః శ్రౌతస్మార్తైః. ౩౬. కోఽసి త్వ మితి ప్రశ్నస్యోత్తర మాహ. వైశ్య ఇతి. 'దేవార్థ మన్నం హవ్యం స్యాత్ పిత్రర్థం

ప్రేతత్వకారణ మెద్ది? నీవెవరవు? ఎద్దాన నీప్రేతత్వము నశించును? నీవృత్తాంతమును సాకల్యంబుగా నెఱింగింపుము" అని యడుగ ప్రేతము ఇట్లు చెప్పెను. "నాకీప్రేతభావ మెట్లు వచ్చినదో మొదటినుండియు చెప్పెద వినుము. సమస్తసంపదభిరామంబును, నానాజానపదసంకులంబును, నవరత్నవిపణిశోభితంబును, హర్మ్యవిరాజితంబును, ప్రాసాదమాలావిరాజమానంబును, నానావిధధర్మవిభూషితంబును అగు వైదిశంబను నొక నగరము గలదు. అదియే నాకు వాసస్థానము. నేనెల్లప్పుడును దేవపూజ చేయుచుందును. జాతికి వైశ్యుఁడను. నాపేరు సుదేవుఁడు. హవ్యముల చేత దేవతలను, కవ్యముల చేత పితరులను వివిధదానముల చేత బ్రాహ్మణులను తృప్తి పొందించితిని. దీనులు, అంధులు, అనాథలు మొదలగువారికి అనేకపర్యాయములు అన్నము పెట్టి సంతోషపఱిచితిని; గాని దైవవశమున అది యంతయు నిష్ఫలమైనది. అది యంతయుఁ జెప్పెద వినుము.

మమ వై సంతతి ర్నాస్తి న సుహృన్న చ బాంధవః,
న చ మిత్రం హి మే తాదృగ్యః కుర్యాదౌర్ధ్వదైహికమ్. ౪౦
యస్య న స్యా న్మహారాజ! శ్రాద్ధం మాసికషోడశమ్,
ప్రేతత్వం సుస్థిరం తస్య దత్తైః శ్రాద్ధశతై రపి. ౪౧
త్వమౌర్ధ్వదైహికం కృత్వా మా ముద్ధర మహీపతే!,
వర్ణానాం చైవ సర్వేషాం రాజా బంధురిహోచ్యతే. ౪౨
తస్మాం తారయ రాజేంద్ర మణిరత్నం దదామి తే,
యథా మే సద్గతి ర్భూయా త్ప్రేతయోనిశ్చ గచ్ఛతి. ౪౩
తథా కార్యం త్వయా వీర మమ చేదిచ్ఛసి ప్రియమ్,
క్షుధా తృషాదిభిర్దుఃఖైః ప్రేతత్వం దుస్సహం మమ. ౪౪

కవ్యేనైవ చ'. ౩౯. నను సుకృతం కథం నిష్ఫలం జాత మహో ఇత్యాశంక్యాహ. మమేతి. ౪౦. కించ అపుత్రస్య మమైవ ప్రేతత్వం జాత మితి న. కింతు షోడశ శ్రాద్ధరహితస్య సపుత్రస్యాఽపి స్యాదిత్యాహ. యస్యేతి. ౪౧. విపది రక్షకత్వాత్ బంధురితి హేతోః పుత్రాద్యభావే రాజాదిః క్రియాం కారయే దితి భావః. తదుక్తం విష్ణుపురాణే 'ఉచ్ఛిన్నబంధుజాతీనాం కారయే దవనీపతిః' ఇతి. ౪౨. పూర్వ సుకృతప్రభావా న్మణిరత్నలాభః. ౪౩-౪౪. సర్వయోనిషు ఆహారసుఖేన దుఃఖ

స్వాదూదకం ఫలం చాస్తి వనేఽస్మిఞ్ఛీతలం శివమ్,
న ప్రాప్నోమి క్షుధార్తోఽహం తృషార్తో న జలం క్వచిత్ ౪౫
యది మే హి భవేద్రాజ! న్విధి ర్నారాయణో మహా౯,
తదగ్రే వేదమన్త్రైశ్చ క్రియా సర్వౌర్ధ్వదైహికీ. ౪౬
తదా నశ్యతి మే నూనం ప్రేతత్వం నాత్ర సంశయః,
వేదమన్త్రాస్తపో దానం దయా సర్వత్ర జంతుషు. ౪౭
సచ్ఛాస్త్రశ్రవణం విష్ణోః పూజా సజ్జనసంగతిః,
ప్రేతయోనివినాశాయ భవంతీతి మయా శ్రుతమ్. ౪౮

ఓరాజా! నాకు పుత్రులు లేరు. మిత్రులు లేరు. బంధువులు లేరు. నాకు ఔర్ధ్వదైహికము నిర్వర్తించుటకు మఱెవ్వరును లేరు. షోడశశ్రాద్ధసహితం బగు నౌర్ధ్వదైహికము ఎవ్వనికి జరుగదో ఎన్ని శ్రాద్ధములు చేసినను వానికి ప్రేతత్వము వదలదు. కావున ఓ మహా రాజా! నీవు ఔర్ధ్వదైహికము గావించి నన్నుద్ధరింపుము. సర్వవర్ణములకు రాజు బాంధవు డని శ్రుతులు చెప్పుచున్నవి. కాంబట్టి నన్ను ఉద్ధరింపుము. నీకు మణిరత్నము నిచ్చెదను. నాకు సద్గతి కలుగునట్లును, ప్రేతత్వము విముక్తియగునట్లును అనుగ్రహింపుము. ఆఁకలి దప్పిక వీనిచే నాకు ప్రేతత్వము దుస్సహముగా నున్నది. ఈమహారణ్యమున స్వాదూదకమును, మధురఫలంబులును గలవు. ఇన్ని యున్నను నాకు ఆఁకలి దప్పిక తీర్చుకొనుటకు లభింపకున్నవి. ఓరాజా! విధిపూర్వకముగా నారాయణబలి చేసి నీవు తత్సన్నిధిని నాకు ఔర్ధ్వదైహిక క్రియను చేసిన వెంటనే నాకు ఈప్రేతత్వము వదలిపోవును. అందులకు సందేహము లేదు. వేదమంత్రపఠనము, తపస్సు, దానము, భూతదయ, సచ్ఛాస్త్రశ్రవణము, విష్ణుపూజ, సజ్జనసహవాసము మొదలగునవి ప్రేతత్వవినాశమునకు కారణ మని నేను వినియున్నాను.

అతో వక్ష్యామి తే విష్ణుపూజాంప్రేతత్వనాశనీమ్,

---

సహిష్ణుతా భవతి. మమ తదభావా ద్దుఃఖం దుస్సహ మేవేత్యాహ, స్వాద్వితి. ౪౫. కేన దానేన తే ప్రేతత్వం వినశ్యతీతి ప్రశ్నస్యోత్తరమాహ పంచభిః, యదీతి. ౪౬, ౪౭. సచ్ఛాస్త్రశ్రవణేన ధుంధుమారో విముక్తః, సజ్జనానాంధర్మదత్తాదీనాం సంగాద్బ్రహవః కలహాదయో విముక్తా ఇతి. ౪౮. కించ మమ ప్రేతత్వంతు విష్ణుపూజయైవ యాస్య

సువర్ణద్వయ మానీయ సువర్ణం న్యాయసంచితమ్,
తస్య నారాయణస్యైకాం ప్రతిమాం భూప! కల్పయేత్. ౪౯
పీతవస్త్రయుగచ్ఛన్నాం సర్వాభరణభూషితామ్,
స్నాపితాం వివిధై స్తోయై రధివాస్య యజే త్తతః. ౫౦
పూర్వే తు శ్రీధరం తస్యాదక్షిణే మధుసూదనమ్,
పశ్చిమే వామనం దేవ ముత్తరే చ గదాధరమ్. ౫౧
మధ్యే పితామహం చైవ తథా దేవం మహేశ్వరమ్,
పూజయేచ్చ విధానేన గంధపుష్పాదిభిః పృథక్. ౫౨
తతః ప్రదక్షిణీకృత్య వహ్నౌ సంతర్ప్య దేవతాః,
ఘృతేన దధ్నా క్షీరేణ విశ్వేదేవాంశ్చ తర్పయేత్. ౫౩

ప్రేతత్వమును తొలఁగించు విష్ణుపూజాక్రమమును నీకు చెప్పెద వినుము. రెండుమాడల యెత్తుగల బంగారముతో నారాయణ ప్రతిమను శేయించి పచ్చని రెండు వస్త్రములచేతను, అలంకారములచేతను అలంకరించి అనేకవిధములయిన ఉదకములతో నభిషేకించి సింహాసనమున నుంచి పూజింపవలెను. ఆ ప్రతిమకు పూర్వదిగ్భాగంబున శ్రీధరుని దక్షిణభాగమున మధుసూదనుని పశ్చిమభాగమున వామనుని, ఉత్తరభాగమున గదాధరుని, మధ్యను పితామహుని, మహేశ్వరుని ఉంచి యథాశాస్త్రముగ గంధపుష్పాక్షతాదులతో పూజించి ప్రదక్షిణము చేసి అగ్నిహోత్రమున నేతితోను, పాలతోను, పెరుగుతోను, హోమము గావించి విశ్వేదేవతలకుఁ గూడ తర్పణము చేయవలెను.

తతస్స్నాతో వినీతాత్మా యజమానస్సమాహితః,
నారాయణాగ్రే విధివత్స్వాం క్రియామౌర్ధ్వదైహికీమ్. ౫౪
ఆరభేత యథాశాస్త్రం క్రోధలోభవివర్జితః,
కుర్యాచ్ఛ్రాద్ధాని సర్వాణి వృషస్యోత్సర్జనం తథా. ౫౫
తతః పదాని విప్రేభ్యో దద్యాచ్చైవ త్రయోదశ,

---

తిత్యాహ. అత స్తాం వక్ష్యామీతి. సువర్ణద్వయ మితి. పంచగుంజో మాషః-సువర్ణం షోడశమాషసంఖ్యాకం, తస్య-ద్వయం ద్వాత్రింశన్మాషకం-సువర్ణం కాంచనం తస్య ప్రతిమాం ప్రకల్పయేత్. ౪౯. వివిధై రనేకతీర్థోద్భవైః, అలాభే వాపీకూపజలైర్వా. అధివాస్య సింహాసనే స్థాపయి త్వాపూజయేత్. ౫౦. పూజనప్రకార మాహ. పూర్వ

శయ్యాదానం ప్రదత్వా చ ఘటం ప్రేతస్య నిర్వపేత్. ౫౫

రాజోవాచ:—

కథం ప్రేతఘటం కుర్యా ద్దద్యాత్కేన విధానతః,
బ్రూహి సర్వానుకంపార్థం ఘటం ప్రేతవిముక్తిదమ్. ౫౬

ప్రేత ఉవాచ:—

సాధు పృష్టం మహారాజ! కథయామి నిబోధ తే,
ప్రేతత్వం న భవే ద్యేన దానేన సుదృఢేన చ. ౫౭
దానం ప్రేతఘటం నామ సర్వాశుభవినాశనమ్,
దుర్లభం సర్వలోకానాం దుర్గతిక్షయకారకమ్ ౫౮
సంతప్తహాటకమయం తు ఘటం విధాయ,
బ్రహ్మేశకేశవయుతం సహ లోకపాలైః,
క్షీరాజ్యపూర్ణ వివరం ప్రణిపత్యభక్త్యా
విప్రాయ దేహి తవ దానశతైః కిమన్యైః! ౬౦
బ్రహ్మా మధ్యే తథా విష్ణు శ్శంకర శ్శంకరోఽవ్యయః,
ప్రాచ్యాదిషు చ తత్కంఠే లోకపాలా న్క్రమేణ తు. ౬౧
సంపూజ్య విధివద్రాజన్! ధూపైగకుసుమచందనైః,
తతో దుగ్ధాజ్యసహితం ఘటం దేయం హిరణ్మయమ్. ౬౨
సర్వదానాధికం చైత న్మహాపాతకనాశనమ్,
కర్తవ్యం శ్రద్ధయా రాజ! న్ప్రేతత్వవినివృత్తయే. ౬౩

పిమ్మట స్నానము చేసి నారాయణప్రతిమాసన్నిధానమున క్రోధరహితుఁడై యథాశాస్త్రముగ ఔర్ధ్వదైహికక్రియ నారంభింపవలెను. సమస్తశ్రాద్ధములు వృషోత్సర్జనము చేసిన పిమ్మట బ్రాహ్మణులకు పదమూఁడుదానములును శయ్యాదానముగూడ చేసి ప్రేతతృప్తికరమగు ఘటదానము చేయవలెను. ఇదివిని "ఓయీ! ప్రేతఘటము నెట్లు

ఇత్యాదిపంచభిః. ౫౫. నిర్వపేత్ ప్రేతఘటం దద్యాత్. ౫౬,౫౭. సుదృఢేన త్యక్తుమయోగ్యేన- అవశ్యం కర్తవ్యే నేత్యర్థః. ౫౮,౫౯. తదేవాహ. సంతప్తహాటకమయం శోధితసువర్ణరచితం- బ్రహ్మాదియుతం బ్రహ్మాదిభిః స్వపూజార్థం స్వస్వస్థానే హ్యధిష్ఠితం- తేషాం ఘనితనహాంతనామాక్షరై ర్యుక్త మిత్యర్థః. దుగ్ధఘృతపూర్ణం చ కృత్వా 'అతసీపుష్పసంకాశ'మితి మంత్రేణ ప్రణమ్య ప్రదేహీతి. ౬౦-౬౩. తస్య భూపతేః,

చేయవలెను? ఏవిధానమున దాని నీయవలెను? ప్రేతత్వవిముక్తిహేతు
భూతం బగు ఘటముసంగతి సాంతముగఁ జెప్పు" మని రాజడుగఁగా
ప్రేతము మరల నిట్లు చెప్పెను. మహారాజా! మంచి ప్రశ్న యడిగి
తివి. దేనివలన ప్రేతత్వము నశించునో అట్టి ప్రేతఘటదానము సంగతి
చెప్పెద వినుము. అది సమస్తామంగళములను బోఁగొట్టును. దుర్గతిని
బోనాడి సుగతి నిచ్చును. అందఱకు నది లభింపదు. ఆఘటమును
ఎట్లు చేయింపవలె నందువా? బంగారముతో కలశము చేయించి బ్రహ్మ
విష్ణుమహేశ్వరలోకపాల ప్రతిమలు దానిమీఁద చెక్కించి దానిని పాల
తోడను, నేతితోడను నింపి భక్తితో నమస్కరించి బ్రాహ్మణునకు
నీయవలెను. ఇతరదానములతోఁ బనిలేదు. ఆఘటమునకు మధ్యను
బ్రహ్మవిష్ణుమహేశ్వరులను, ప్రాచ్యాదిదిక్కుల నింద్రాదిలోకపాలకులను
ధూపదీపాదులచే పూజించి దుగ్ధాజ్యసహితంబును, సర్వదానాధిక
పుణ్యంబును అగు ఘటమును ప్రేతత్వవిమోచనార్థమై శ్రద్ధగలిగి
బ్రాహ్మణున కీయవలెను.

శ్రీభగవానువాచ:—

ఏవం సంజల్పతస్తస్య ప్రేతేన సహ కాశ్యప!,
సేనాఽఽజగామానుపదం హస్త్యశ్వరథసంకులమ్. ౬౪
తతో బలే సమాయాతే దత్వా రాజ్ఞే మహామణిమ్,
నమస్కృత్య పునః ప్రార్థ్య ప్రేతోఽదర్శనమేయివాన్. ౬౫
తస్మాద్వనాద్వినిష్క్రమ్య రాజాఽపి స్వపురం యయౌ,
స్వపురం చ సమాసాద్య తత్సర్వం ప్రేతభాషితమ్. ౬౬
చకార విధివత్పక్షి! న్నౌర్ధ్వదైహికజం విధిమ్,
తస్య పుణ్యప్రదానేన ప్రేతో ముక్తో దివం యయౌ. ౬౭
శ్రాద్ధేన పరదత్తేన గతః ప్రేతోఽపి సద్గతిమ్,
కిం పునః పుత్రదత్తేన పితా యాతీతి చాద్భుతమ్. ౬౮

పదం పదన్యాసం అను లక్షీకృత్య-సేనా ఆజగామ. ౬౪. మమ కృత్యం న విస్మరణీయ మితి సంప్రార్థ్య అంతర్ధానం గతః. ౬౫,౬౬. విధిం కృత్వా ప్రేతాయ దదౌ. ౬౭. ఇతి హోమకథనస్యాభిప్రాయ మాహ. శ్రాద్ధేనేతి. ౬౮. ఇతి శ్రీగరుడపురాణటీకాయాం సప్తమోఽధ్యాయః.

ఇతిహాసమిమం పుణ్యం శృణోతి శ్రావయేచ్చ యః,
న తౌ ప్రేతత్వమాయాతః పాపాచారయుతావపి. ౬౬

ఈకథ యిట్లు చెప్పి ముగించెను. ఓగరుడుఁడా! అట్లు రాజును ప్రేతమును సంభాషించుచుండ గజాశ్వరథభటసంకుల మగు నా రాజుసైన్యము అచ్చటికి వచ్చినఁ జూచి యాప్రేతము రాజునకు మణి నిచ్చి నమస్కరించి మరల ప్రార్థించి అంతర్ధాన మయ్యెను. రాజును అచ్చటనుండి బయలుదేరి స్వపురమునకు వచ్చి ప్రేతము చెప్పినట్లు యథాశాస్త్రముగ ఔర్ధ్వదైహికమును జేసి పుణ్యమును ప్రేతమునకు ఈయఁగా ఆప్రేతము ప్రేతత్వమును బాసి స్వర్గమునకుఁ బోయెను. గరుడుఁడా! పరులు చేసిన శ్రాద్ధమువలననే ప్రేతము స్వర్గాది పుణ్యలోకములను పొందుచుండ ఔరసపుత్త్రులచే చేయఁబడు శ్రాద్ధము వలన సద్గతిఁ బొందుటలో నేమి యాశ్చర్యమున్నది? ఎవ్వరు ఈయితిహాసమును విందురో లేక వినిపించెదరో ఆయిరువురును మహాపాపాచారులైనను ప్రేతత్వమును బొందక స్వర్గాదిపుణ్యలోకములకుఁ బోవుదురు.

ఇతి శ్రీగరుడపురాణే సారోద్ధారే బభ్రువాహనకృత
ప్రేతసంస్కారోనామ సప్తమోఽధ్యాయః.



# అష్టమాధ్యాయము

గరుడ ఉవాచ:—

ఆముష్మికీం క్రియాం సర్వాం వద సుకృతినాం మమ,
కర్తవ్యా సా యథా పుత్రై స్తథా చ కథయ ప్రభో! ౧

శ్రీ భగవానువాచ:—

సాధు పృష్టం త్వయా తార్క్ష్య! మానుషాణాం హితాయ వై,
ధార్మికార్థం చ యత్కృత్యం తత్సర్వం కథయామి తే. ౨
సుకృతీ వార్ధకే దృష్ట్వా శరీరం వ్యాధిసంయుతమ్,
ప్రతికూలాన్ గ్రహాంశ్చైవ ప్రాణఘోషస్య చాశ్రుతిమ్. 3
తదా స్వమరణం జ్ఞాత్వా నిర్భయస్స్యాదతంద్రితః,
అజ్ఞాతజ్ఞాతపాపానాం ప్రాయశ్చిత్తం సమాచరేత్. ౪

అంతట గరుడుఁడు "శ్రీహరీ! తలిదండ్రులు వృద్ధులై ఆతురులై నపుడు పరలోకోపయోగ మగు కర్మను కుమారులు ఎట్లు చేసిన ఆతలిదండ్రులకు సద్గతి గల్గునో యట్లు చేయఁదగు నయాముష్మిక కర్మను చెప్పు" మని యడుగఁగా "మానుషహితార్థము మంచివిషయము నడిగితివి చెప్పెద విను" మని శ్రీహరి యిట్లు చెప్పెను. పుణ్యాత్ముఁడగు వాఁడు ముసలితనమున శరీరము వ్యాధిపీడిత మగుటను, బాధిర్యమువలన ప్రాణఘోష వినఁబడకుండుటయుఁ జూచి తనకు మరణము తప్పదని యెఱింగి, ఆలస్యము చేయక జ్ఞానాజ్ఞానకృతసమస్తపాపములు పోవుటకు సర్వప్రాయశ్చిత్తము చేసికొనవలెను.

---

కర్మణాఽఽముష్మికేనైవ సద్గతిం లభతే నరః, తద్వినా నేతి గరుడ స్తదేవ పరిపృచ్ఛతి. ఆముష్మికీ మితి. ఆముష్మికీం పరలోకోపయోగినీం సర్వాం ఆతురకృత్యాదికాం సత్క్రియామ్.౧. 'అష్టమే నామమాహాత్మ్యం దానం చాతురకాలికం, ధర్మప్రశంసాం ప్రోవాచ భగవా న్ధర్మవత్సలః' ౨. ప్రశ్న మభినంద్య ధార్మికార్థం సుకృతిజనోచితం కృత్యం శ్రీభగవా నువాచ. సుకృతీత్యాది. అశ్రుతిం కర్ణే రుద్ధే సతి - అంతశ్శబ్దస్యాశ్రవణం చ దృష్ట్వా తదేతి ద్వితీయేన సంబంధః. 3. నిర్భయః మృత్యుభయశూన్యః స్యాత్ - అపరిహార్యత్వాత్. అతంద్రితః ఆతురకృత్యే నిరాకులశ్చ స్యాత్

యదా స్యా దాతురః కాల స్తదా స్నానం సమాచరేత్,
పూజనం కారయే ద్విష్ణో స్సాలగ్రామస్వరూపిణః. ౫
అర్చయే ద్గంధపుష్పైశ్చ కుంకుమై స్తులసీదళైః.
ధూపై ర్దీపైశ్చ నై వేద్యై ర్బహుభి ర్మోద కాదిభిః. ౬
దత్వా చ దక్షిణాం విప్రాన్నైవేద్యాదపి భోజయేత్,
అష్టాక్షరం జపే న్మంత్రం ద్వాదశాక్షరమేవచ. ౭
సంస్మరేచ్ఛృణుయా చ్చైవ విష్ణోర్నామ శివస్య చ.
హరేర్నామ హరేత్పాపం నృణాం శ్రవణగోచరమ్. ౮
రోగిణోఽంతికమాసాద్య శోచనీయుం న బాంధవైః,
స్మరణీయం పవిత్రం మే నామధేయం ముహుర్ముహుః. ౯
మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః,
రామో రామశ్చ కృష్ణశ్చ బుద్ధః కల్కీ తథైవ చ. ౧౦
ఏతాని దశనామాని స్మర్తవ్యాని సదా బుధైః,
సమీపే రోగిణో బ్రూయుర్బాంధవా స్తే ప్రకీర్తితాః. ౧౧
కృష్ణేతి మంగళం నామ యస్య వాచి ప్రవర్తతే,
తస్య భస్మీభవంత్యాశు మహాపాతకకోటయః. ౧౨

అవసానకాలము సమీపించుట యెఱింగి స్నానము చేసికొని సాలగ్రామరూపి యగు విష్ణువును గంధపుష్పాదులచేతను, తులసీదళములచేతను పూజించి ఉండ్రాళ్లు మొదలగు పిండివంటలతో నైవేద్యము చేసి బ్రాహ్మణులకు దక్షిణాదు లిచ్చి పిమ్మట అష్టాక్షరిని గాని ద్వాదశాక్షరిని గాని జపింపవలెను. శివకేశవుల నామములు విన్నను, స్మరించినను మనుజుల సమస్తపాపములు తొలఁగిపోవును. హరినామస్మరణమువలన పాపము నశించును. రోగివద్ద కూర్చుండి బంధువులు ఏడువఁగూడదు. పవిత్ర మగు నానామమును కీర్తించుచుండవలెను. రోగివద్ద కూర్చుండి "మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః, రామో రామశ్చ కృష్ణశ్చ బుద్ధః కల్కీ తథైవ చ" అని

చ్ఛేతి. ౪. ఆతురః కాలః అంత స్సమయః, ౫-౬. అత్ర గురు ర్యథా గురుమహిమానం శాస్త్రేణ శిష్యాయోపదిశతి తథైవ హరి రపి హరినామమహిమానం స్వముఖే నాహ, సంస్మరే దిత్యాది వింశద్భిః, ౭-౧౩. నను అజామిళ స్తు బహుపాపకృత్-

యెవ్వరు ఈనా పది నామములను స్మరించెదరో వారే బంధువులు. ఎవని నోటినుండి "కృష్ణ" యను మంగళశబ్దము వెలువడునో వాని సమస్తపాపములు భస్మమై పోవును.

మ్రియమాణో హరేర్నామ గృణన్పుత్రోపచారితమ్,
అజామిళో ప్యగాద్ధామ కింపునశ్శ్రద్ధయా గృణన్. ౧౩
హరి ర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః,
అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః. ౧౪
హరేర్నామ్నశ్చ యాశక్తిః పాపనిర్హరణే ద్విజ!,
తావత్కర్తుం సమర్థో న పాతకం పాతకీజనః. ౧౫
కింకరేభ్యో యమః ప్రాహ నయధ్వం నాస్తికం జనమ్,
నైవానయత భో దూతా! హరినామస్మరన్నరమ్. ౧౬

మహాపాపాత్ముఁడగు అజామిళుఁడు అవసానకాలమున 'నారాయణా' యని పుత్రుని పిలుచుటవలన వైకుంఠమును బడసెను. అట్టియెడల శ్రద్ధాభక్తులతో హరిని స్మరించువారికి మోక్షము గలుగు నని చెప్పుటకు సందేహ మేమి? స్మరించినవారు దుర్మార్గు లయినను నేను వారిపాపముల నన్నిటిని శమింపఁ జేయుదును. తెలియక త్రొక్కినను అగ్ని కాలకుండ నుండదు గదా! పాపములను తొలఁగించుటలో హరినామమునకుఁ గల శక్తి యింత యని చెప్పుటకు అయితిగాదు. యముఁడు దన భటులకు "నాస్తికుని నాలోకమునకు తీసికొని రండు. హరినామస్మరణ చేయువానిని మాత్రము తీసికొనిరావలదు" అని చెప్పెను.

అచ్యుతం కేశవం రామనారాయణమ్
కృష్ణదామోదరం వాసుదేవం హరిమ్,

---

కథం ధామాగాదితీమామాశంకాం పరిహరన్నాహ. హరిరితి వ్యాఖ్యామ్. ౧౪, ౧౫. అత్ర నామమాహాత్మ్యం 'న సాంపరాయం ప్రతిభాతి బాలం ప్రమాద్యంతం ధనలోభేన మూఢమ్. అయం లోకో నాస్తిపరశ్చ నాస్తీతి పునః పునర్వశ మాపద్యతే మే' ఇతి శ్రుత్యుక్తేన యమదూతసంవాదే నాహ - కింకరేభ్య ఇత్యాది. ౧౬. హరినామాస్యైవాహ. అచ్యుత మిత్యాది. ౧౭. యే అచ్యుతాదినామకదంబం స్మరంతి

శ్రీధరం మాధవం గోపికావల్లభమ్,
జానకీనాయకం రామచంద్రం భజే. ౧౭

కమలనయన వాసుదేవ విష్ణో ధరణిధరాచ్యుత శంఖచక్రపాణే,
భవశరణమితీరయంతియేవై త్యజభటదూరతరేణ తానపాపాన్. ౧౮

"అచ్యుతా, కేశవా, నారాయణా, రామా, కృష్ణా, దామోదరా, వాసుదేవా, శ్రీహరీ, శ్రీధరా, మాధవా, గోపికావల్లభా, జానకీనాయకా, రామచంద్రా, కమలనయనా, విష్ణో, ధరణిధరా, శంఖచక్రపాణీ" అని హరినామస్మరణ చేయుచు "శ్రీహరీ! నిన్ను నమ్మి సేవించు నన్ను రక్షింపుము" అని శ్రీహరి నెల్లప్పుడును భజనసేయు పుణ్యాత్ములను దూరముగా నుండియు చూడకుము. వారిని నాలోకమునకు తీసికొనివచ్చుటకు సైతము ప్రయత్నింపకుము" అని యముఁడు తనభటులకు చెప్పెను.

తానానయధ్వ మసతో విముఖాన్ముకుంద
పాదారవిందమకరందరసా దజస్రమ్,
నిష్కించనైః పరమహంసకులై రసజ్ఞై
ర్జుష్టా న్గృహే నిరయవర్త్మని బద్ధతృష్ణాన్. ౧౯
జిహ్వా నవక్తి భగవద్గుణనామధేయమ్
చేతశ్చ న స్మరతి తచ్చరణారవిందమ్,
కృష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాపి
తానానయధ్వమసతోఽకృతవిష్ణుకృత్యాన్. ౨౦

ముకుందపాదారవిందధ్యానము చేయని పాపాత్ములను నాలోకమునకు తీసికొనిరండు, ఏవిధమగు పుణ్యమును జేయనివారిని, నిరయ

---

తాన్ అపాపాన్ పుణ్యరూపాన్ దూరతరేణ త్యజ. ౧౮. కే ఆనేతవ్యాః ఇత్యత్రాహ తానితి ద్వాభ్యాం అసతః దుష్టాన్ తానేవాహ ముకుందపాదారవిందయోః యో మకరందరూపో రస స్తస్మా ద్విముఖాన్ - హరిభక్తిరహితా నిత్యర్థః. కీదృశాత్ నిష్కించనై అజస్రం జుష్టాత్. తేషాం జ్ఞాపకమాహ. నిరయవర్త్మని స్వధర్మకూపే గృహే బద్ధా తృష్ణా యైస్తాన్. ౧౯. కించ యద్యేషా జిహ్వా ఇత్యాద్యన్వయః. న కృతం విష్ణోః కృత్య మారాధనం యై స్తా నానయధ్వ మితి. ౨౦. అతో హరి

మార్గ మగు గృహమున బద్ధతృష్ణులై నట్టియు, పాపులను తీసికొని రండు. ఎవ్వని జిహ్వ భగవంతుని గుణగణములను బలుకదో, ఎవ్వని చిత్తము ముకుందుని పాదారవిందములను ధ్యానింపదో, ఎవ్వని శిరము కృష్ణుని ఒక్కమారైన నమస్కరింపదో అట్టి దుర్మార్గులను నాలోకమునకు తీసికొనిరండు" అని యముఁడు తనభటులకు ఆజ్ఞాపించును.

తస్మాత్సంకీర్తనం విష్ణోర్జగన్మంగళమంహసామ్,
మహతామపి పక్షీంద్ర! విద్ధ్యైకాంతికనిష్కృతిమ్. ౨౧

ప్రాయశ్చిత్తాని చీర్ణాని నారాయణపరాఙ్ముఖమ్,
న నిష్పునంతి దుర్బుద్ధిం సురాకుంభమివాపగాః. ౨౨

కృష్ణనామ్నా న నరకం పశ్యంతి గతకిల్బిషాః,
యమం చ తద్భటాంశ్చైవ స్వప్నేఽపి న కదాచన. ౨౩

మాంసాస్థిరక్తవత్కాయే వైతరణ్యాం పతేన్న సః,
యోఽంతే దద్యాద్ద్విజేభ్యశ్చ నందనందనగామితి. ౨౪

అతః స్మరేన్మహావిష్ణోర్నామ పాపౌఘనాశనమ్,
గీతాసహస్రనామాని పఠేద్వా శృణుయాదపి. ౨౫

ఏకాదశీవ్రతం గీతాగంగాంబుతులసీదళమ్,

---

విముఖా నేవానయంత్వితి యమోదూతానాజ్ఞాపయతి. తస్మాజ్జగతోఽపిమంగళరూపం-మహతాం బహూనామప్యంహసాం పాపానాం ఐకాంతికనిష్కృతిం పరమప్రాయశ్చిత్తరూపం విద్ధి. ౨౧. కించ చీర్ణాని కృతాన్యపి తాని హరివిముఖం న పునంతి. కింతు అధక్తా నరకేష్వేవ పతంతీత్యర్థః. ౨౨. తర్హి కేన పతంతీత్యత ఆహ. కృష్ణనామ్నా గతం కిల్బిషం పాపం యేషాం తే - స్వప్నేఽపి న యమం పశ్యంతీత్యన్వయః. ౨౩. మాంసాస్థిరక్తాని విద్యంతే యస్యాం సా మాంసాస్థిరక్తవతీ-సా చాసౌ కాయవైతరణీ చ. ప్రసిద్ధాపి సా అస్థిబృందతటాదుర్గమామాంసశోణితకర్దమా భవతి. అతః తత్సాదృశ్యాత్ కాయోఽపి వైతరణీవ. తస్యాం యథా యః ద్విజేభ్యో గాం దద్యాత్ సః న పతేత్. తథైవాస్యామపి యః అంతసమయే నందనందనేతి గాం వాణీం ద్విజేభ్యః దంతేభ్యః దద్యాత్. తవర్గస్య దంతస్థానీయత్వాత్. సోఽపి కాయవైతరణ్యాం న పతేత్. కింతు ముక్తో భవతీత్యర్థః. తత్ర యథా 'ఏకాహ్యేకస్య దాతవ్యా బహూనాం న కదాచన' ఇతి నిషేధాత్, తథాఽత్రాపి ద్విజేభ్యశ్చేతిచకారః

విష్ణోః పాదాంబునామాని మరణే ముక్తిదాని చ. ౨౬
తతస్సంకల్పయేదన్నం సఘృతం చ సకాంచనమ్,
సవత్సా ధేనవో దేయాశ్శ్రోత్రియాయ ద్విజాతయే. ౨౭

ఆకారణమువలన మహాపాపములకు నివృత్తికరమును, జన్మంగళకరమును అగు విష్ణునామస్మరణము అవశ్యముచేయవలెను. నారాయణపరాఙ్ముఖుఁడగువానిని ప్రాయశ్చిత్తములు సైతము పునీతునిఁ గావింపఁజాలవు. నదు లన్నియుఁ గలిసియు కల్లుకుండను పవిత్రము గావింపఁజాలవు గదా! గరుడుఁడా! కృష్ణనామోచ్చారణము వలన గతపాపు లగు మహాపుణ్యాత్ములు యముని యమకింకరులను గూడచూడరు. అవసానకాలమున ఎవఁడు "నందనందనా" యనిపలుకునో వాఁడు వైతరణీనదిం బడఁడు. కావున మహాపాపములను గూడ నశింపఁ జేయు శ్రీమహావిష్ణువునామమును స్మరింపవలెను. భగవద్గీతాపారాయణమును, విష్ణుసహస్రనామపారాయణమును, అథవా తచ్ఛ్రవణము నైనచేయవలెను. ఏకాదశీవ్రతమును, భగవద్గీతయు, గంగోదకమును, తులసీదళమును, విష్ణుపాదోదకమును, విష్ణునామమును మరణకాలమున ముక్తి నిచ్చును. ముక్తినిఁ గోరువాఁడు పరులకు వస్త్రసోపేత మగు అన్నము పెట్టవలెను. దూడలతోఁగూడ ఆవులను శ్రోత్రియ బ్రాహ్మణులకు దానము చేయవలెను.

అంతే జనో యద్దదాతి స్వల్పం వా యదివా బహు,
తదక్షయం భవేత్తార్క్ష్య యత్పుత్రశ్చానుమోదతే. ౨౮
అంతకాలే తు సత్పుత్రస్సర్వదానాని దాపయేత్,
ఏతదర్థం సుతో లోకే ప్రార్థ్యతే ధర్మకోవిదైః. ౨౯
భూమిస్థం పితరం దృష్ట్వా హ్యర్ధోన్మీలితలోచనమ్,
పుత్రైస్తృష్ణా న కర్తవ్యా తద్ధనే పూర్వసంచితే. 30

పానఃపువ్యావిధానార్థః. ఆలో నందనందనేతి వాణీం బహువారమావర్తయేదిత్యవిరోధః. ౨౫-౨౬, ఏవం నామమాహాత్మ్యం నిరూప ఇదానీ మవశ్యదాతవ్యాతురదానే పుత్రం ప్రోత్సాహతియతి. తత ఇత్యాది. ౨౭. అనుమోదతే యన్మనసి చింతయతి వా వాచా వదతివా తద ప్యక్షయం భవే దితి. ౨౮. ఏతదర్థం ఆతురదానదాపనార్థమ్. ౨౯. పూర్వం పిత్రైవ సంచితే - అత స్తస్యైవ ధనే. 3౧. అతివాహః పరలోకగామీ - త

స తద్దదాతి సత్పుత్రో యావజ్జీవత్యసౌ చిరమ్,
అతివాహా స్తు తన్మార్గే దుఃఖం న లభతే యతః. ౩౧
ఆతురే చోపరాగే చ ద్వయం దానం విశిష్యతే,
అతోఽవశ్యం ప్రదాతవ్య మష్టదానం తిలాదికమ్. ౩౨

అవసానకాలమున కొద్దిగ నిచ్చినను, గొప్పగ నిచ్చినను అది అక్షయ మగును. మఱియు కుమారుఁడు ఆమోదించిన అదియు అక్షయ మగును. తండ్రి యవసానకాలమున కుమారుఁడు తండ్రిచేత సకలదానములును చేయింపవలెను. అవసానసమయమున దానములు చేయింతురను నాశచేతనే ధర్మాత్ములను పుత్రులను కోరుచుందురు. సత్పుత్రులు తమ తండ్రుల సంపాదనమును మిగుల్చుకొనక దానధర్మములకు వినియోగింతురు. సత్పుత్రుఁడు బహుకాలము జీవనాధార మగునటుల దానము చేయును. ఆతురదానములు చేసినచో యమమార్గమున దుఃఖములు కలుగవు. ఆతురకాలము, గ్రహణము—ఈ రెండును దానములు చేయించుటకు ఉత్తమమైనవి అగుటచే ఆతురకాలమున తిలదానము మున్నగు ఎనిమిది దానములను చేయవలెను.

తిలా లోహం హిరణ్యం చ కార్పాసో లవణం తథా,
సప్తధాన్యం క్షితి ర్గావ ఏకైకం పావనం స్మృతమ్. ౩౩
ఏతదష్టమహాదానం మహాపాతకనాశనమ్,
అంతకాలే ప్రదాతవ్యం శృణు తస్య చ యత్ఫలమ్. ౩౪
మమ స్వేదసముద్భూతాః పవిత్రాస్త్రివిధా స్తిలాః,
అసురా దానవా దైత్యా స్తృప్యంతి తిలదానతః. ౩౫
తిలాః శ్వేతా స్తథా కృష్ణా దానేన కపిలా స్తిలాః,
సంహరంతి త్రిధా పాపం వాఙ్మనఃకాయసంచితమ్. ౩౬
లోహదానం చ దాతవ్యం భూమియు క్తేన పాణినా,
యమసీమాం న చాప్నోతి న గచ్ఛే త్తస్య వర్త్మని. ౩౭
కుఠారో ముసలో దండః ఖడ్గశ్చ చ్ఛురికా తథా,
శస్త్రా ణ్యే యమహా స్తే చ నిగ్రహే పాపకర్మణామ్ ౩౮

మార్గే - యతః ఆతురదానాత్. ౩౧. అష్టమహాదానం ఫలసహిత మాహ - ఆతురఇతి. ౩౨-౩౪. తిలదానఫలమాహ అసురా ఇతి సార్ధేన. ౩౫, ౩౬. భూమియుక్తేన

యమాయుధానాం సంతుష్ట్యై దానమేతదుదాహృతమ్,
తస్మాద్దద్యాల్లోహదానం యమలోకే సుఖావహమ్. ౩౯
ఘోరణశ్శ్యామసూత్రశ్చ శుండామర్కోప్యుదుంబరః,
శేషంబలో మహాదూతా లోహదానాత్సుఖప్రదాః. ౪౦

తిలదానము, లోహదానము, హిరణ్యదానము, కార్పాసదానము, లవణదానము, సప్తధాన్యదానము, భూదానము, గోదానము ఇవి యెనిమిది మహాదానములు. వీనిలో నొక్కొక్కటియే పావనము గావించును. మహాపాపవినాశకరము లగు ఈ యెనిమిది దానములను అవసానమునఁ జేయవలెను. వాని ఫలము నెఱింగించెద వినుము. శ్వేతతిల లనియు, కృష్ణతిల లనియు, కపిలతిల లనియు నాశరీరమునందలి చెమ్మటవలన మూఁడువిధము లగు తిలలు పుట్టినవి. వానిని దానము చేసిన అసురులు, దానవులు, దైత్యులు తృప్తిఁ జెందెదరు. మఱియు మనోవాక్కాయములచేఁ జేయఁబడిన త్రివిధము లగు మహాపాపములు నశించును. ఇఁక లోహదానఫలము చెప్పెద వినుము. భూమిని స్పృశించి లోహదానము చేయవలెను. లోహదానము చేసినవాఁడు యమమార్గమున బోఁడు. యమాలయమునకును బోఁడు. కుఠారము, ముసలము, యమదండము, ఖడ్గము, చురిక మున్నగు యముని యాయుధములకు ఈదానమువలన తృప్తి కలుగును. కాఁబట్టి యమలోకసుఖకర మగు ఈదానము అవశ్యము చేయవలెను. మఱియు ఘోరణుఁడు, శ్యామసూత్రుఁడు, శుండామర్కుఁడు, ఉదుంబరుఁడు, శేషంబలుఁడు మొదలగు యమదూత లందఱు నీలోహదానమువలన సుముఖులగుదురు.

శృణు తార్క్ష్య పరం గుహ్యం దానానాం దానముత్తమమ్,
దత్తేన తేన తుష్యంతి భూర్భువస్స్వర్గవాసినః ౪౧
బ్రహ్మాద్యా ఋషయో దేవా ధర్మరాజసభాసదః,
స్వర్ణదానేన సంతుష్టా భవంతి వరదాయకాః. ౪౨
తస్మాద్దేయం స్వర్ణదానం ప్రేతోద్ధరణహేతవే,

భూమ్యాం కరణం ధృత్వేత్యర్థః. లోహదానఫలమాహ. యమేతి సార్ధత్రిభిః. ౩౭-౪౦.

న యాతి యమలోకం స స్వర్గతిం తాత గచ్ఛతి. ౪౩
చిరం వసేత్సత్యలోకే తతో రాజా భవేదిహ,
రూపవాన్ధార్మికో వాగ్మీ శ్రీమానతులవిక్రమః. ౪౪
కార్పాసస్య తు దానేన దూతేభ్యో న భయం భవేత్,
లవణం దీయతే యచ్చ తేన నైవ భయం యమాత్. ౪౫
అయోలవణకార్పాసతిలకాంచనదానతః,
చిత్రగుప్తాదయ స్తుష్టా యమస్య పురవాసినః. ౪౬
సప్తధాన్యప్రదానేన ప్రీతో ధర్మధ్వజో భవేత్,
తుష్టా భవంతి యేఽన్యేఽపి త్రిషు ద్వారేష్వధిష్ఠితాః. ౪౭
వ్రీహయో యవగోధూమా ముద్గా మాషాః ప్రియంగవః,
చణకా స్సప్తమా జ్ఞేయా స్సప్తధాన్య ముదాహృతమ్. ౪౮

ఓగరుడుఁడా! స్వర్ణదానఫలము చెప్పెద వినుము. సమస్తదానములలో సువర్ణదాన ముత్తమోత్తమము. సువర్ణదానమువలన సమస్తలోకవాసులు తృప్తిఁ జెందెదరు. మఱియు బ్రహ్మయు, ఋషులు, దేవతలు, ధర్మరాజుసభాసదులు ఈదానమువలన ఈప్సితార్థముల నిత్తురు; గావున ప్రేతముక్తికై స్వర్ణదానము అవశ్యము చేయవలెను. సువర్ణదాత యమలోకమునకు వెళ్లఁడు. స్వర్గలోకమును బొంది యచ్చటఁ గొన్ని దినములు నివసించి పిమ్మట సత్యలోకమునకుఁ బోయి యచ్చట చిరకాలము నివసించి తర్వాత మనుష్యలోకమున రూపవంతుఁడును, ధార్మికుఁడును, వాగ్మియు, శ్రీమంతుఁడును, అతులపరాక్రమశాలియు అగు రాజయి పుట్టును. కార్పాసదానము చేసిన యమదూతలవలని భయ ముండదు. లవణదానము చేసినచో యమునివలని భయము పోవును. లోహలవణతిల కార్పాససువర్ణదానములచే యమపురనివాసులు అగు చిత్రగుప్తాదులు తృప్తిం బొందుదురు. వ్రీహిధాన్యము, గోధూమధాన్యము, యవధాన్యము, ముద్గ (పెసలు) ధాన్యము మాషధాన్యము, ప్రియంగుధాన్యము, చణకధాన్యము ఇవి సప్తధాన్యములు, ఈసప్తధాన్యములను దానము చేసిన యముని సోద

---

స్వర్ణదానఫలమాహ - శృణ్వితి చతుర్భిః. ౪౧-౪౪. లోహాదిపంచదానేన తుష్టాః భవంతీతి శేషః. ౪౬. త్రిషు. వక్ష్యమాణేషు. ౪౭-౪౮. భూమిదానఫల మాహ. గోచ

రుఁడగు ధర్మధ్వజుఁడు ప్రీతుఁడగును. మఱియు మూఁడుద్వారముల యందును ఉండువారుగూడ తృప్తిఁ జెందెదరు.

గోచర్మమాత్రం వసుధా దత్త్వా పాత్రే విధానతః,
పునాతి బ్రహ్మహత్యాయా దృష్ట మేత న్మునీశ్వరైః ౪౯
న వ్రతేభ్యో న తీర్థేభ్యో నాన్యదానా ద్వినశ్యతి,
రాజ్యే కృతం మహాపాపం భూమిదానా ద్విలీయతే. ౫౦
పృథివీం సస్యసంపూర్ణాం యో దదాతి ద్విజాతయే,
స ప్రయాతీంద్రభవనం పూజ్యమాన స్సురాసురైః. ౫౧
అత్యల్పఫలదాని స్యు రన్యదానాని కాశ్యప,
పృథివీదానజం పుణ్య మహ న్యహని వర్ధతే. ౫౨
యో భూత్వా భూమిపో భూమిం నో దదాతి ద్విజాతయే,
స నాప్నోతి కుటీం గ్రామే దరిద్ర స్స్యా ద్భవే భవే. ౫౩
అదానా ద్భూమిదానస్య భూపతిత్వాభిమానతః,
నివసే న్నరకే యావ చ్ఛేషో ధారయతే ధరామ్. ౫౪
తస్మా ద్భూమీశ్వరో భూమిదాన మేవ ప్రదాపయేత్,
అన్యేషాం భూమిదానార్థం గోదానం కథితం మయా. ౫౫

పాత్రుఁడగు ద్విజునకు గోచర్మమాత్ర మగు భూమి నిచ్చిన బ్రహ్మహత్యాదిమహాపాపములు నశించు నని మహర్షులు కనుఁగొనిరి. గోచర్మమాత్ర మగు భూమి యనఁగా రెండువందల గోవులు రెండు వందల వృషభములతో కలిసి పడుకొనిన నెంతభూమి యాక్రమింపఁబడునో అంతభూమి యన్నమాట. రాజ్యము చేయునపుడు సంభవించు పాపములు వ్రతములు చేసినను, తీర్థయాత్రలు చేసినను నశింపవు. భూమిదానమువలన మాత్రమే అవి నశించును. ఎవ్వరు సస్యపూర్ణ

---

ర్మప్రమాణం యథా "గోశతం వృషసంయుక్తం యత్రోపవిశతే భువి, త ద్భూపరిమితం జ్ఞేయం గోచర్మమాన ముత్తమమ్" ఇతి. ౪౯, ౫౦. స్వల్పేన భూమిదానేన మహాపాప మపయాతి. కించ సస్యపూర్ణాయాః ప్రదానేన త్వింద్రభవనం ప్రయాతీ త్యాహ. పృథివీమితి. ౫౧, ౫౨. అదానే దోషమాహ. య ఇతి ద్వాభ్యాం కుటీం స్వకీయాం పర్ణశాలా మపి నాప్నోతి ఈదృశో దరిద్ర స్స్యాత్. ౫౩. తావ న్నివసే దితి సంబంధః. ౫౪. భూమే రపి గోరూపత్వా ద్గోదాన మేవ. ౫౫. అంతధేనుః

యగు భూమిని బ్రాహ్మణులకు దానము చేసెద రట్టివారు సురాసురులచే పూజింపఁబడుచు స్వర్గమునకుఁ బోవుదురు. గరుడుఁడా! ఇతర దానము లన్నియు కొద్దిఫలము నిచ్చును. భూదానమువలన కలుగు పుణ్యము ప్రతిదినము వృద్ధిపొందుచుండును. భూమిపతి యయ్యు నెవఁడు బ్రాహ్మణునకు భూదానము చేయఁడో అతడు ఉత్తరజన్మమున మహాదరిద్రుఁ డగును. గృహశూన్యుఁడును అగును. భూమిపతిత్వాభిమానమువలన నెవఁడు భూమిదానము జేయఁడో వాఁడు శేషుఁడు భూమిని మోయునంతకాలము నరకమున నుండును; గావున భూమి గలవారు భూమిదానమును చేసితీరవలెను. భూమిలేనివారికి ఆఫలము లభించుటకు గోదానము చెప్పబడినది.

తతోఽంతధేను ర్దాతవ్యా రుద్రధేనుం ప్రదాపయేత్,
ఋణధేనుం తతో దత్వా మోక్షధేనుం ప్రదాపయేత్. ౫౬
దద్యాద్వైతరణీధేనుం విశేషవిధినా ఖగ,
తారయంతి నరం గావ స్త్రివిధా చ్చైవ పాతకాత్. ౫౭
బాల్యే యచ్చ కౌమారే య త్పాపం యౌవనే కృతమ్,
వయఃపరిణతౌ యచ్చ యచ్చ జన్మాంతరేష్వపి. ౫౮
య న్నిశాయాం తథా ప్రాతః య న్మధ్యాహ్నాపరాహ్ణయోః,
సంధ్యయో ర్యత్కృతం పాపం కాయేన మనసా గిరా. ౫౯
దత్వా ధేనుం సకృద్వాపి కపిలాం క్షీరసంయుతామ్,
సోపస్కరాం సవత్సాం చ తపోవృత్తసమన్వితే. ౬౦
బ్రాహ్మణే వేదవిదుషి సర్వపాపైః ప్రముచ్యతే,
ఉద్ధరే దంతకాలే సా దాతారం పాపసంచయాత్. ౬౧

తర్వాత గోదానముచేయవలెను. వెనుక చెప్పంబడిన ఎనిమిది దానములలో చివరది యగుగోదానము చేయవలెను. మృత్యుదుఃఖ

---

అష్టదానోక్తాః - రుద్రధేనుం రుద్రస్య మృత్యుంజయత్వా న్మృత్యుదుఃఖనివృత్త్యర్థం - ఋణధేనుః జ్ఞాతాజ్ఞాతఋణవిముక్త్యర్థం - మోక్షధేనుః మోక్షార్థం. ౫౬. వైతరణీతారణార్థం పంచమీచేతి. ౫౭. బాల్యాదిషు య త్పాపం కృతం తస్మా త్తారయం తీతి పూర్వేణైవ సంబంధః. ౫౮, ౫౯. సకృత్ సర్వజన్మని ఏకవారమేవాఽపి ౬౦, ౬౧. వ్యస్థచిత్తస్య పాఠధానస్య తు ఏకైవ గౌః - ఆతురస్య సన్నిహితమరణ

నివారణమునిమిత్తము ఒక గోదానము చేయవలెను. జ్ఞాతాజ్ఞాతఋణవిముక్తినిమిత్తము మఱియొక గోదానము చేయవలెను. మోక్షార్థము మఱియొక గోదానము చేయవలెను. వైతరణీనదిని తరించుటకు ఒక గోదానము చేయవలెను. దీనిని తప్పకుండ చేయవలెను. బాల్య కౌమారయౌవనవార్ధకములయందు మనోవాక్కాయములచే చేయఁబడిన సమస్తపాపములును ఈగోదానమువలన తొలఁగిపోవును. ఇంతియగాక జన్మాంతరములయందు చేయఁబడిన పాపములును నశించును. రాత్రి, ప్రాతఃకాలము, మధ్యాహ్నము, అపరాహ్ణకాలము, ఉభయ సంధ్యలు వీనియందు చేసిన పాపము లన్నియు, ఒక్క కపిలగోవును దానము చేసిన పోవును. పాలు ఇచ్చునదియు, అలంకారములతోఁ గూడినదియు, సవత్సయు నగు కపిలగోవును వేదవేత్తయు తపోవృత్త సమన్వితుఁడును అగు బ్రాహ్మణునకు ఇచ్చిన సమస్తపాపములు నశించును అంతకాలమున ఈయఁబడిన గోదానము దాతకు సకలపాపములను తొలఁగించును. పుణ్యలోకములనుగూడ కలిగించును.

ఏకా గౌ స్స్వస్థచిత్తస్య హ్యాతురస్య చ గోశతమ్,
సహస్రం మ్రియమాణస్య దత్తం చిత్తవివర్జితమ్. ౬౨
మృతస్యైతత్ప్వనర్లక్షం విధిపూర్వకం చ తత్సమమ్,
తీర్థయాత్రాసమోపేతం దాన మేకం చ లక్షధా. ౬౩
పాత్రే దత్తం చ యద్దానం తల్లక్షగుణితం భవేత్,
దాతుః ఫల మనంతం స్యా న్న పాత్రస్య పరిగ్రహః. ౬౪
స్వాధ్యాయహోమసంయుక్తః పరపాకవివర్జితః,
రత్నపూర్ణా మపి మహీం ప్రతిగృహ్య న లిప్యతే. ౬౫
విషశీతాపహా మంత్రవహ్నీ కిం దోషభాగినౌ,

స్య తు గోశతం - అగ్రిమక్షణే మరిష్య తీతి మ్రియమాణః తస్య తు చిత్తవివర్జితదానానుసంధానరహితం దత్తం గోసహస్రం చ. ౬౩. మృతస్య మరణానంతరం చ గవాం లక్షం - ఏతత్సర్వం సమం తుల్యఫలదం భవతి అతః స్వస్థావస్థాయా మేవ దేయ మితి భావః. ఏక మపి ఏకగోదాన మన్యద్వా తీర్థయాత్రాభ్యాం సమ్యగుపేతం యుక్తం తత్ లక్షధా భవతీ త్యర్థః. ౬౪, ౬౫. అపాత్రదానేన తు మహతీ వినష్టి రిత్యాహ,

స్వస్థచిత్తుఁడై యున్నపుడు చేయఁబడిన ఒక గోదానమును, సన్నిహితమరణుఁడై యున్నపుడు చేయఁబడిన నూరుగోదానములును, ఉత్తరక్షణమున మృతిఁబొందునపుడు చేయఁబడిన వేయిగోదానములును, మృతిఁబొందిన పిమ్మట చేయఁబడిన లక్షగోదానములును సమాన ఫలమునే ఇచ్చును. గరుడుఁడా! స్థిరచిత్తము గలిగి స్వస్థతగా నున్నపుడు గోదానము చేయవలెను. దానము చేయునపుడు తత్ఫలాదుల నెవఁడు అనుసంధానము చేయునో వానికి ఫలవిశేషము కలుగును. పుణ్యతీర్థమున పుణ్యకాలమున సత్పాత్రునకు ఎవ్వరొక్క గోదానము చేయుదురో అట్టివారికి లక్షగోదానములు చేసిన ఫలము లభించును. తత్పాత్రునకు ఈయఁబడిన దానము లక్షగుణితము అగును. పాత్రభూతునకు దానము చేసిన దాతకు ఫల మనంత మగును. సత్పాత్రునకు ప్రతిగ్రహదోషము లేదు. అధీతవేదుఁడును, నిత్యాగ్నిహోత్రియు, పరపాకవివర్జితుఁడును అగు సత్పాత్రుఁడు రత్నపూర్ణ యగు భూమిని ప్రతిగ్రహించినను పాపమును బొందఁడు. విషము హరించు మంత్రములు, శీతమును బోఁగొట్టు వహ్నియు దోషయుక్తములు గావు.

అపాత్రే సా చ గౌర్దత్తా దాతారం నరకం నయేత్. ౬౬
కులైకశతసంయుక్తం గ్రహీతారం తు పాతయేత్,
నాఽపాత్రే విదుషా దేయా ఆత్మన శ్శ్రేయ ఇచ్ఛతా. ౬౭
ఏకా హ్యేకస్య దాతవ్యా బహూనాం న కదాచన,
సా విక్రీతా విభక్తా వా దహత్యాసప్తమం కులమ్. ౬౮
కథితా యా మయా పూర్వం తవ వైతరణీనదీ,
తస్యా ఉద్ధరణోపాయం గోదానం కథయామి తే. ౬౯
కృష్ణాం వా పాటలాం వాపి ధేనుం కుర్యా దలంకృతాం,
స్వర్ణశృంగీం రౌప్యఖురాం కాంస్యపాత్రోపదోహినీమ్. ౭౦
కృష్ణవస్త్రయుగచ్ఛన్నాం కంఠఘంటాసమన్వితాం,
కార్పాసోపరి సంస్థాప్య తామ్రపాత్రం సచైలకమ్. ౭౧
యమం హైమం న్యసేత్తత్ర లోహదండసమన్వితం,

అపాత్ర ఇతి స్వార్థేన. ౬౭. పాత్రాదా మపి బహూనా మేకా న దేయే త్యాహ బహూనా మితి. ౬౮, ౬౯. "దద్యా ద్వైతరణీం ధేనుం విశేషవిధినా ఖగ!" ఇతి

కాంస్యపాత్రే ఘృతం కృత్వా సర్వం తస్యోపరి న్యసేత్. ౭౨

అపాత్రునకు గోదానము ఇచ్చిన దాతకు నరకము సంభవించును. గోదానము స్వీకరించిన అపాత్రుఁడు నూరుతరములవారితోఁగూడ నరకమును బొందును. కాబట్టి శ్రేయోభిలాషియగునతఁడు అపాత్రునకు గోదానము చేయఁగూడదు. ఒకనికి ఒక గోవును ఈయవలెను; గాని అనేకులకు ఒక్క గోవును ఈయఁగూడదు. దానలబ్ధయగు గోవును అమ్మినను పంచుకొనినను ప్రతిగృహీత ఏడుతరములవారితో దహింపఁబడును. ఇఁక వైతరణీగోదానవిధిని జెప్పెదను.

నావ మిక్షుమయీంకృత్వా పట్టసూత్రేణ వేష్టయేత్,
గర్తం నిధాయ సజలం కృత్వా తస్మిన్ క్షిపే త్తరిమ్. ౭౩
తస్యోపరి స్థితాం కృత్వా సూర్యదేహసముద్భవాం,
ధేనుం సంకల్పయే త్తత్ర యథాశాస్త్రవిధానతః. ౭౪

చెరుకుగడలతో నావను చేసిన దానికి పట్టుదారము కట్టి ఒక గోతిని త్రవ్వి అందు జలము నిఁపి అందు నావనుంచి సూర్యదేహసముద్భవ యగు గోవును దానిమీఁద నుంచి యథాశాస్త్రముగా గోదాన సంకల్పము చేయవలెను.

సాలంకారాణి వస్త్రాణి బ్రాహ్మణాయ ప్రకల్పయేత్,
పూజం కుర్యా ద్విధానేన గంధపుష్పాక్షతాదిభిః. ౭౫
పుచ్ఛం సంగృహ్య ధేనో స్తు నావ మాశ్రిత్య పాదతః,
పురస్కృత్య తతో విప్ర మిమం మంత్ర ముదీరయేత్. ౭౬
భవసాగరమగ్నానాం శోకదాహోర్మి దుఃఖినాం,
త్రాతా త్వం హి జగన్నాథః శరణాగతవత్సలః. ౭౭
విష్ణురూప ద్విజ శ్రేష్ఠ! మా ముద్ధర మహీసుర!,
సదక్షిణా మయా దత్తా తుభ్యం వైతరణీం నమః. ౭౮
యమమార్గే మహాఘోరే తాం నదీం శతయోజనాం,
తర్తుకామో దదా మ్యేనాం తుభ్యం వైతరణీం నమః. ౭౯
ధేనుకే మాం ప్రదీక్షస్వ యమద్వారే మహాపథే,

పూర్వనూదితవిశేషవిధిమేవాహ. కృష్ణా మితి. ౭౦-౭౮. వైతరణీం వితరణం దానం తద్రూపిణీ మేనాం ధేనుమ్. ౭౯. మాం ప్రతీక్షస్వ వైతరణ్యా స్సకాశా దుత్తా

ఉత్తారణార్థం దేవేశి వైతరణ్యై నమోఽస్తు తే. ౮౦
గావో మే హ్యగ్రత స్సంతు గావో మే సంతు పృష్ఠతః,
గావో మే హృదయే సంతు గవాం మధ్యే వసామ్యహమ్. ౮౧
యా లక్ష్మీస్సర్వభూతానాం యా చ దేవే ప్రతిష్ఠితా,
ధేనురూపేణ సా దేవీ మమ పాపం వ్యపోహతు. ౮౨
ఇతి మంత్రైశ్చ సంప్రార్థ్య సాంజలి ర్ధేనుకాం యమం,
సర్వాం ప్రదక్షిణీకృత్య బ్రాహ్మణాయ నివేదయేత్. ౮౩

పిమ్మట బ్రాహ్మణుని గంధపుష్పాక్షతాదులచేతను, వస్త్రాద్యలంకారములచేతను అలంకరింపవలెను. తరువాత గోవు తోక పట్టుకొని కాలిని నావమీఁద నుంచుకొని బ్రాహ్మణుని యెదుట నుంచికొని "సంసారసాగరమున మునిఁగియున్నవారికిని, శోకతాపములచే దుఃఖితులైనవారికిని నీవు రక్షకత దాల్చియున్నావు. జగన్నాథా, శరణాగతవత్సలా, విష్ణుస్వరూపా, ద్విజశ్రేష్ఠా, ఓమహీసురా, నన్ను ఉద్ధరింపుము. ఇది సదక్షిణాకముగా నీయఁబడినది. మహాఘోర మగు యమమార్గమునఁ గలవైతరణీనదిని దాఁటుటకు నీకు దీనిని ఇచ్చుచున్నాను. నా ముందు ఆవు లుండుఁగాక. నాయెదుటఁగూడ ఆవు లుండుఁగాక. నాహృదయమునఁగూడ ఆవులు ఉండుఁగాక. నేను ఆవుల మధ్య నివసించెదను. ఏమె సర్వభూతములకు లక్ష్మియో, ఏమె ధేనురూపమున దేవునియందు అధిష్ఠింపఁబడినదో ఆ దేవి నాపాపములను పోఁగొట్టుగాక" అని గోవును యముని దోసిలి ఒగ్గి ప్రార్థించి ఆగోవునకు ప్రదక్షిణము గావించి బ్రాహ్మణున కీయవలెను.

ఏవం దద్యా ద్విధానేన యో గాం వైతరణీం ఖగ,
స యాతి ధర్మమార్గేణ ధర్మరాజసభాంతరే. ౮౪
స్వస్థావస్థశరీరే తు వైతరణ్యా వ్రతం చరేత్,
దేయా చ విదుషా ధేను స్తాం నదీం తర్తు మిచ్ఛతా. ౮౫

---

రణార్థం త్వం మాం ప్రతీక్షస్వ దృష్టిం కురుష్వ. ౮౦. యమమార్గభయభీతస్య వాక్య మిదం. గావో మే ఇతి. ౮౧. భూతానాం నరేంద్రాదీనాం దేవేంద్రాదిషు ప్రతిష్ఠితాయా లక్ష్మీః అస్తి సైవ త్వం ధేనురూపేణ అసి - అతో వ్యపోహతు దూరీకరోతు. ౮౨-౮౪. వ్రతం అవశ్యం ధేనుం దాస్యామీతి నియమం కుర్యాత్. ౮౫, ౮౬.

సా నాయాతి మహామార్గే గోదానేన నదీ ఖగ,
తస్మా దవశ్యం దాతవ్యం పుణ్యకాలేషు సర్వదా. ౮౬
గంగాదిసర్వతీర్థేషు బ్రాహ్మణావసథేషు చ,
చంద్రసూర్యోపరాగేషు సంక్రాంతౌ దర్శవాసరే ౮౭
అయనే విషువే చైవ వ్యతీపాతే యుగాదిషు,
అన్యేషు పుణ్యకాలేషు కుర్యా ద్గోదాన ముత్తమమ్. ౮౮
యదైవ జాయతే శ్రద్ధా పాత్రం సంప్రాప్యతే యదా,
స ఏవ పుణ్యకాల స్స్యా ద్యత స్సంపత్తి రస్థిరా. ౮౯

ఇట్లు శాస్త్రోక్తవిధానముగ ఎవరు వైతరణీగోదానమును చేయుదురో వారు ధర్మమార్గమునందుగా ధర్మరాజు సభకు పోవుదురు. శరీరమున ఎట్టి జబ్బును లేనపుడే స్వస్థావస్థగా నున్నపుడే వైతరణీగోదానము చేయవలెను. వైతరణీనదిని దాటఁ గోరువాఁడు స్వస్థతగానున్నపుడే వైతరణీగోదానము చేయవలెను. ఇట్లు చేసికొనినవారలకు యమమార్గమున వైతరణీనది కాన్పింపదు; కాఁబట్టి ఓగరుడుఁడా! పుణ్యకాలములయందును, పుణ్యతీర్థములయందును, బ్రాహ్మణగృహములయందును, దర్శయందును, ఉత్తరదక్షిణాయనములందును, వ్యతీపాత పుణ్యకాలమున యుగాదులయందును, ఇతరపుణ్యకాలములయందును గోదానము అవశ్యముగా చేయవలెను. ఎప్పుడు శ్రద్ధకలుగునో, ఎప్పుడు సత్పాత్రుఁడు లభించునో అదియే పుణ్యకాలము. అట్టి పుణ్యకాలమును ఎవరు విడిచెదరో వారు తెలివితక్కువవా రని తెలియవలెను. ఎందువలన ననఁగా సంపత్తి అనఁగా సత్పాత్రము లభించినపుడు శ్రద్ధ కలుగదు. శ్రద్ధ జనించినపుడు సత్పాత్రము లభింపదు. కావున కాలము గడువఁబెట్టక శ్రద్ధ కలిగినపుడును సత్పాత్రము లభించినపుడును. వెనుకముందు లారయక గోదానము చేయవలెను.

---

ఆవసథేషు గృహేషు. ౮౭. అయనే౽విషువే౽మకరకర్కటమేషతులాసంక్రాంతిదినే. యుగాదిషు అక్షయతృతీయాదిషు. ౮౮. స ఏవ శ్రద్ధాపాత్రయో స్సంయోగ ఏవ - అతః అన్య త్పుణ్యకాలాపేక్షా న కర్తవ్యే త్యర్థః. ౮౯. ఇదం ధేన్వాదిదానం స్వహస్తద త్తంసత్ స్వర్గసుఖప్రదం భవతి. అతో వైరాగ్యముత్పాదయన్ స్వహస్తదానే

అస్థిరాణి శరీరాణి విభవో నైవ శాశ్వతః,
నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యో ధర్మసంచయః. ౯౦
ఆత్మవిత్తానుసారేణ తత్ర దాన మనంతకం,
దేయంవిప్రాయ విదుషే స్వాత్మన శ్శ్రేయ ఇచ్ఛతా. ౯౧
అల్పేనాపి హి విత్తేన స్వహస్తే నాత్మనే కృతం,
త దక్షయం భవే ద్దానం తత్కాలం చోపతిష్ఠతి. ౯౨
గృహీతదానపాథేయ స్సుఖం యాతి మహాధ్వని,
అన్యథా క్లిశ్యతే జంతుః పాథేయరహితః పథి. ౯౩
యాని యాని చ దానాని దత్తాని భువి మానవైః,
యమలోకపథే తాని హ్యుపతిష్ఠంతి చాగ్రతః. ౯౪

శరీరములు స్థిరములు కావు. ఐశ్వర్యము బుద్బుదప్రాయము. మృత్యువు ఎప్పుడు సన్నిహితమై యుండును. గావున మనుష్యుఁడు ఎప్పుడును దానము చేయుచుండవలెను. తనశక్తికొలఁది దానముచేయవలెను. ఆదానము అనంతఫలము కలది యగును. తన యభివృద్ధిని గోరునతఁడు విద్వాంసు డగు బ్రాహ్మణునకు దానము చేయవలెను. తనచేతితోఁ జేసికొనినది స్వల్పదాన మైనను అక్షయ మయి యమ మార్గమున చాల ఉపయోగించును. దానధర్మములు చేసికొని స్వర్గ పాథేయము సంపాదించుకొనిన మనుజులు యమమార్గమున సుఖముగా వెళ్లెదరు. దానధర్మములు చేయనివారలకు స్వర్గపాథేయ ముండదు; గావున తినుటకు తిండిలేక యమమార్గమున మలమలమాడుచు ప్రయాణము చేయవలసివచ్చును. భూలోకమున చేసికొనిన దాన ధర్మములు యమమార్గమున ప్రయాణము చేయునపుడు సిద్ధముగా నుండును.

మహాపుణ్యప్రభావేన మానుషం జన్మ లభ్యతే,
య స్తత్ప్రాప్య చరే ద్ధర్మం స యాతి పరమాం గతిమ్. ౯౫

శ్రద్ధా ముత్పాదయతి. అస్థి రాణీత్యాది. ౯౦. తత్ర పాత్రే ఆత్మవిత్తానుసారేణ- బహువిత్తే సతి స్వల్పం న దేయ మితి భావః. ౯౧, ౯౨. గృహీతం దానపాథేయం పరలోకభోగ్యం యేనసః. అన్యథా పాథేయం వినా పథి అస్మిన్లోకమార్గే యథా అశక్తః క్లిశ్యతే తథైవాఽముత్రాపి. ౯౩-౯౫. అవిజ్ఞాయ అజ్ఞాత్వా అకృత్వా ఇత్యర్థః.

అవిజ్ఞాయ నరో ధర్మం దుఃఖ మాయాతి యాతి చ,
మనుష్యజన్మసాఫల్యం కేవలం ధర్మసేవనమ్. ౯౭
ధనపుత్రకళత్రాదిశరీర మపి బాంధవాః,
అనిత్యం సర్వమేవేదం తస్మా ద్ధర్మం సమాచరేత్. ౯౮

చాల పుణ్యము చేసికొనినఁగాని మనుష్యజన్మ లభింపదు. దుర్లభమగు మనుష్యజన్మము నెత్తి ఎవరు ధర్మము జేయుదురో వారు స్వర్గాదిపుణ్యలోకములం బొందుదురు. ధర్మము జేయనివారు దుఃఖములను నరకమును పొందుదురు. ధర్మము చేయుటవలన మానవజన్మము సఫల మగును. ధనము, పుత్రులు, కళత్రము, బంధువులు, శరీరము మొదలగునవి యెల్ల అనిత్యములు; గావున ధర్మము చేయవలెను.

తావ ద్బంధుః పితా తావ ద్యావ జ్జీవతి మానవః,
మృతానా మంతరం జ్ఞాత్వా క్షణా త్స్నేహో నివర్తతే. ౯౯
ఆత్మైవ హ్యాత్మనో బంధు రితి విద్యా న్మహు ర్ముహుః,
జీవన్నపీతి సంచింత్య మృతానాం కః ప్రదాస్యతి? ౯౯
ఏవం జాన న్నిదం సర్వం స్వహస్తే నైవ దాపయేత్,
అనిత్యం జీవితం యస్మా త్పశ్చా త్కోఽపి న దాస్యతి. ౧౦౦

మానవుఁడు జీవించియున్నంతవఱకే తండ్రియు బంధువులు మున్నగువా రుందురు. మరణానంతరము వారు బంధములను త్రెంచి వేసికొందురు. తనకు తానే బంధువు. జీవించియున్నవారలకు పెట్టువారు లేనపుడు ఇఁక మరణించిన తరువాత పెట్టువా రెవరు? ఇట్లు తెలిసికొని స్వహస్తములతో దానము చేసికోవలెను. బ్రతికియున్నపుడే తనచేతులతో దానము చేసికోవలెను; గాని చచ్చినతరువాత ఇచ్చెడు వారు ఉండరు.

మృతం శరీర ముత్సృజ్య కాష్ఠలోష్టసమం క్షితౌ,
విముఖా బాంధవా యాంతి ధర్మ స్త మనుగచ్ఛతి. ౧౦౧
గృహా ద్గత్వా నివర్తంతే శ్మశానా త్సర్వబాంధవాః,
శుభాశుభం కృతం కర్మ గచ్ఛంత మనుగచ్ఛతి. ౧౦౨

౯౮-౯౯. జీవన్నపి - ఆత్మైవ ఆత్మనః బంధుః స్వస్యహితకర్తా ఇతి విద్యాత్ జానీయాత్. జీవితానా మపి నోదత్తం తర్హి మృతానాం కః? నకోఽపి దాస్యతీత్యర్థః.

శరీరం వహ్నినా దగ్ధం కృతం కర్మ సహస్థితమ్,
పుణ్యం వా యది వా పాపం భుఙ్క్తే సర్వత్ర మానవః. ౧౦౩
న కోఽపి కస్యచి ద్బంధు స్సంసారే దుఃఖసాగరే,
ఆయాతి కర్మసంబంధా ద్యాతి కర్మక్షయే పునః. ౧౦౪
పితృ మాతృ సుత భ్రాతృ బంధు దారాదిసంగమః,
ప్రపాయా మివ జంతూనాం నద్యాం కాష్ఠౌఘవ చ్చలః. ౧౦౫
కస్య పుత్రా శ్చ పౌత్రా శ్చ కస్య భార్యా ధనం చ వా,
సంసారే నాస్తి కః కస్య స్వయం తస్మా త్ప్రదీయతామ్. ౧౦౬
ఆత్మాయత్తం ధనం యావత్తావ ద్విప్రే సమర్పయేత్,
పరాధీనే ధనే జాతే న కించి ద్వక్తు ముత్సహేత్. ౧౦౭

కాష్ఠలోష్ఠసమ మగు మృతదేహమును భూమిమీఁద విడిచిపెట్టి బంధువులు విముఖులై వెడలిపోవుదురు. ధర్మముమాత్రము జీవునితోఁ గూడఁ బోవును. ధనము గృహమున ఉండిపోవును. బంధువులు శ్మశానమునందు ఆగిపోవుదురు. పుణ్యమును పాపమునుమాత్రమే జీవునితోఁ గూడ వెళ్లును. స్థూలశరీరము ఇక్కడ అగ్నిచే దహింపఁబడును. చేసికొనినకర్మ తనతోఁ గూడ నుండును. పుణ్యపాపములను మనుజుఁడు అనుభవించును. దుఃఖసాగర మగు సంసారమున ఎవరికిని బంధువులు లేరు. కర్మసంబంధమువలన జీవి వచ్చి కర్మ ముగియుటతోడనే వెడలి పోవును. మాతాపితృభ్రాత్రాదిసంబంధము చలివెంద్రయందలి జనసంగమమురీతిని నదియందలి కాష్ఠసమాగమమువలెను చంచలమైనది. భార్యాపుత్రాదులు తనకుగల రనుకొనుట వట్టి భ్రమ. కాఁబట్టి స్వయముగా దానధర్మములు చేసికోవలెను. ధనము తనకు స్వాధీనముగా నున్నంతవఱకే దానధర్మములను జేసికోవలెను. ధనము పరాధీనమైనపుడు "ఆధనము నాది" అని చెప్పుట కైన అధికారము ఉండదు. అట్టి స్థితిలో దానము చేసికొనుట యెట్లు? అగుటచే తనకు స్వాతంత్ర్యమున్నంతవఱకే దానధర్మములు చేసికోవలెను.

---

అత ఏవం జానన్నితి ద్వితీయేన సంబంధః. ౯౯. సర్వ మిద మాతురదానమ్. ౧౦౧-౧౦౬. ధనం యావత్ ఆత్మాయత్తం ఆత్మనః స్వస్య ఆయత్త అధీనం భవతి. మహ్యం కించి ద్దేయ మరే? ఇతివక్తుమపినోత్సహతే. ఉత్సాహేత్ వక్తుమపి యోగ్యోన భవతి,

పూర్వజన్మకృతా ద్దానా దత్ర లబ్ధం ధనం బహు,
తస్మా దేవం పరిజ్ఞాయ ధర్మార్థం దీయతాం ధనమ్. ౧౦౮
ధర్మా త్సంజాయతేఽర్థ శ్చ ధర్మా త్కామోఽభిజాయతే,
ధర్మ ఏ వాపవర్గాయ తస్మా ద్ధర్మం సమాచరేత్. ౧౦౯
శ్రద్ధయా ధార్య తే ధర్మో బహుభి ర్నార్థరాశిభిః,
నిష్కించనా హి మునయ శ్శ్రద్ధావంతో దివం గతాః. ౧౧౦
పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
త దహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. ౧౧౧
తస్మా దవశ్యం దాతవ్యం తదా దానం విధానతః,
అల్పం వా బహు వేతీమాం గణనాం నైవకారయేత్. ౧౧౨

ఇప్పుడు ఉన్న విశేషమగు ధనము పూర్వజన్మమున దానధర్మములు చేయుటవలననే వచ్చిన వని తెలిసికోవలెను. ధర్మముకొఱకు ధనము ఈయవలెను. ధర్మమువలననే అర్థకామమోక్షములు లభించును. అట్లగుటవలన ధర్మము అవశ్యము చేయవలెను. శ్రద్ధతో చేసినధర్మము సద్గతి నిచ్చును. ధనము ఎంత యున్నను శ్రద్ధలేకుండ నిచ్చినచో దానివలన ప్రయోజనము కలుగదు. మహర్షులు ధనశూన్యులైనను శ్రద్ధకలవారు కావున స్వర్గమును బొందిరి. "శ్రద్ధాపవిత్రచిత్తుఁడగువాఁడు శ్రద్ధతో పత్రపుష్పాదికమును నిచ్చినను నేను ప్రేమతో స్వీకరింతును" అని శ్రీకృష్ణభగవానుఁడు చెప్పెను. అగుటచే విధివిహితముగా అవశ్యము దానము చేయవలెను అల్ప మనియు అధిక మనియు లెక్కపెట్టఁగూడదు. శక్తికి లోపము లేకుండ భక్తిశ్రద్ధలతోడను, చిత్తశుద్ధితోడను జేసిన దానము స్వల్ప మైనను అక్షయ ఫలమునిచ్చును. ఇందు ఆశ్చర్య మేమియు లేదు.

---

తర్హి దాతుం యోగ్యః కుతః? ఇత్యర్థః. ౧౦౭. నిదర్శన మాహ. పూర్వేతి. ధనం చ ధర్మైకఫల మితి ధర్మార్థమేవ దీయతామ్. ౧౦౮. చతుర్వర్గఫలదాత్రపి ధన మేవేత్యాహ-ధర్మాదితి. ౧౦౯. శ్రద్ధాపూతధర్మ ఏవ సద్గతిప్రదో భవతీ త్యాహ-శ్రద్ధయేతి, వ్యాఖ్యాతమ్. ౧౧౦. భక్త్యా ఉపహృతం సమర్పితం తత్ పత్రాది. ప్రయతాత్మనః శ్రద్ధా పూతచిత్తస్య-అహ మశ్నామి. ౧౧౧. స్వహ స్తదానం సంఖ్యాఖ్య పుత్రదత్తం పౌత్రతస్మా దితి. ౧౧౨. దేవానాం సమూహో దైవతం తైర్దేవసమూహైర తపి

ధర్మాత్మా చ స పుత్రో వై దైవతై రపి పూజ్యతే,
దాపయే ద్య స్తు దానాని పితరం హ్యాతురం భువి. ౧౧౩
పిత్రో ర్నిమిత్తం య ద్విత్తం పుత్రైః పాత్రే స్సమర్పితమ్,
ఆత్మాఽపి పావిత స్తేన పుత్రపౌత్రప్రపౌత్రకైః. ౧౧౪
పితు శ్శతగుణం పుణ్యం సహస్రం మాతు రేవ చ,
భగినీ దశసాహస్రం సోదరే దత్త మక్షయమ్. ౧౧౫
న చైవోపద్రవా దాతు ర్నవా నరకయాతనాః,
మృత్యుకాలే న చ భయం యమదూతసముద్భవమ్. ౧౧౬
యది లోభా న్న యచ్ఛంతి కాలే హ్యాతురసంజ్ఞకే,
మృతా శ్శోచంతి తే సర్వే కదర్యాః పాపినః ఖగ!. ౧౧౭
పుత్రాశ్చ పౌత్రా స్సహ భ్రాత్రా సగోత్రా స్సుహృద స్తు యే,
దదతే నాతురే దానం బ్రహ్మఘ్నా స్తే న సంశయః. ౧౧౭

మరణోన్ముఖుఁ డగు తండ్రిచేత భూదానము మున్నగు దానములు చేయించిన పుత్త్రుఁడు దేవతలచే పూజింపఁబడును. తల్లిదండ్రుల నిమిత్తమై పుత్త్రులు సత్పాత్త్రులకు దానములు చేసిన దానివలన పుత్త్ర పౌత్త్రప్రపౌత్త్రులతో పవిత్త్రు లగుదురు. తండ్రికిచ్చిన నూఱు రెట్లును, తల్లి కిచ్చిన వేయి రెట్లును, తోఁబుట్టువుల కిచ్చిన పదివేలు రెట్లును, పుణ్యము కలుగును. సోదరుల కిచ్చిన అక్షయ్యం బగు పుణ్యము కలుగును. దానశీలురకు ఇహమునను పరమునను గూడ ఉపద్రవములు

౧౧౩. తేనైవ విత్తేన పుత్రాదిభి స్సహ స్వయమపి నిష్పాపో భవతీ త్యర్థః. ౧౧౪. పిత్రోర్నిమిత్తమిత్యనువృత్త్యైవ అస్యార్థః "గర్భధారణపోషాభ్యాంపితుర్మాతా గరీయ" సీతి హేతోః సహస్రం 'దయాయా భగినీ మూర్తి' రితి హేతోః దశసాహస్రం 'న దయాసదృశం దాన' మితి వచనాచ్చేతి సోదరస్యాపి సమానోదరజన్మత్వా దాత్మతుల్యత్వమ్. అత స్తద్దత్త మక్షయం భవతి. 'తదక్షయం భవే ద్దానం స్వహ స్తేనాఽత్మ నేకృత' మితి పూర్వోక్తవచనా దితి. ౧౧౫. దానదాతుః పుత్రస్యాపి. ఇహ తు ఉప ద్రవాః మార్యాదయః న పరత్ర న చేత్యాది. అత్రాపి తేనైవ విత్తేనేతి పూర్వస్యైవానువృత్తిః. ౧౧౬. అదత్తే దోషమాహ-యదీతి ద్వాభ్యామ్. ౧౧౭, ౧౧౮. ఇతి శ్రీగరుడపురాణటీకాయాం షష్ఠోఽధ్యాయః.

గలుగవు. మరణకాలమున యమదూతలవలనఁగూడ భయము గలుగదు. ఆతురకాలమున లోభమువలన దానము చేయని కృపణులు మరణించిన పిమ్మట దుఃఖించెదరు. తండ్రి మొదలయినవారు మరణోన్ముఖు లైనపుడు ఆతురదానము చేయించని పుత్రాదులు బ్రహ్మఘ్నులనిపించుకొందురు. వారికి సద్గతి కలుగదు.

ఇతి శ్రీగరుడపురాణే-సారోద్ధారే ఆతురదాన
నిరూపణో నామాష్టమోఽధ్యాయః.

---

# నవమాధ్యాయము

గరుడ ఉవాచ:—

కథితం భవతా సమ్యగ్దాన మాతురకాలికమ్,
మ్రియమాణస్య య త్కృత్యం త దిదానీం వద ప్రభో!. ౧

శ్రీ భగవానువాచ:—

శృణు తార్క్ష్య! ప్రవక్ష్యామి దేహత్యాగస్య తం విధిమ్,
మృతో యేన విధానేన సద్గతిం యాతి మానవః. ౨

"శ్రీహరీ! మరణకాలమున చేయఁదగిన దానధర్మములను గుఱించి చెప్పితివి మరణకాలమున చేయవలసిన పనులు, చెప్పవే" యని గరుడుఁడు అడుగఁగా "వినుము" అని శ్రీహరి యిట్లు చెప్పఁ దొడఁగెను.

కర్మయోగా ద్యదా దేహీ ముంచ త్యత్ర నిజం వపుః,
తులసీసన్నిధౌ కుర్యా న్మండలం గోమయేన తు. ౩
తిలాం శ్చైవ వికీర్యాథ దర్భాం శ్చైవ వినిక్షిపేత్,
స్థాపయే దాసనే శుభ్రే సాలగ్రామశిలాం తదా. ౪
సాలగ్రామశిలా యత్ర పాపదోషభయాపహా,
తత్సన్నిధానమరణా న్ముక్తిర్జంతో స్సునిశ్చితా. ౫
తులసీవిటపిచ్ఛాయా యత్రా స్తిభవతాపహా,
తత్రైవ మరణా న్ముక్తి స్సర్వదా దానదుర్లభా. ౬
తులసీవిటపిస్థానం గృహే యస్యావతిష్ఠతే,
తద్గృహం తీర్థరూపం హి నాఽఽయాంతి యమకింకరాః. ౭

ప్రారబ్ధకర్మవశమున సంప్రాప్తమైన యీ దేహము నెప్పుడు విడువ వలసివచ్చునో, అపుడు మానవుఁడు తులసీసన్నిధానమున గోమయ

గరుడ ఉవాచ. కథిత మితి. అగ్రిమక్షణే మరిష్యతీతి మ్రియమాణ స్తస్య య త్కృత్యం త ద్వద. ౧. తులస్యాదికమాహాత్మ్యం సన్న్యాసవిధిపూర్వకం, ఉవాచ నవమేఽధ్యాయే మ్రియమాణవిధిం హరిః. శృణ్వితి. యేన మృతః సద్గతిం యాతి తం విధిం శృణు. ౨. కర్మయోగాత్ ప్రారబ్ధకర్మోదయాత్ - దేహీ జీవః నిజం

ముతో మండలము చేయవలెను. ఆమండలమున తిలలు చల్లి దర్భలను పఱచి శుభ్ర మగు నాసనమున సాలగ్రామశిల నుంచవలెను. ఎచ్చట సమస్తపాపభయాపహ మగు సాలగ్రామశిల యుండునో, ఎచ్చట భవతాపహరమగు తులసీచ్ఛాయ యుండునో అచ్చట మరణించినవారలకు సమస్తదానదుర్లభ మగు మోక్షము సంప్రాప్తించును. ఎవ్వనిగృహమున తులసీవృక్షము ఉండునో ఆగృహము పుణ్యతీర్థస్వరూపముగుటంజేసి అచ్చటికి వచ్చుటకు యమకింకరులు భీతిల్లెదరు.

తులసీమంజరీయుక్తో య స్తు ప్రాణా న్విముంచతి,
యమ స్తం నేక్షితుం శక్తో యుక్తం పాపశ తై రపి. ౮
తస్యా దళం ముఖే కృత్వా తిలదర్భాసనే మృతమ్,
నరో విష్ణుపురం యాతి పుత్రహీనోఽప్యసంశయః ౯

తులసీదళమును ధరించి యెవ్వఁడు మరణించునో వాఁడు మహాపాపాత్ముఁడైనను వానిని యముఁడు చూడనేరఁడు తులసీదళమును నోటియందుంచుకొని తిలదర్భాసనాసీనుఁడై మరణించిన యాతఁడు పుత్రహీనుఁడైనను విష్ణుపురమును బొందును. ఇవ్విషయమున సంశయము లేదు.

తిలాః పవిత్రా స్త్రివిధా దర్భాశ్చ తులసీ తథా,
నరం నివారయం త్యేతే దుర్గతిం యాంత మాతురమ్. ౧౦
మమ స్వేదసముద్భూతా యత స్తే పావనా స్తిలాః,
అసురా దానవా దైత్యా విద్రవంతి తిలై స్తతః. ౧౧
దర్భా విభాతి శ్మే తార్క్ష్య! మమ రోమసముద్భవాః,
అత స్తత్స్పర్శనా దేవ స్వర్గం గచ్ఛంతి మానవాః. ౧౨
కుశమూలే స్థితో బ్రహ్మా కుశమధ్యే జనార్దనః,

---

ఆత్మ త్వేన స్వీకృతం వపుః అత్ర యదా త్యజతి తదా మండలం కుర్యా దిత్యన్వయః. ౮-౯. నను 'అపుత్రస్యగతిర్నా' స్తీతి పూర్వోక్తవిరోధాత్ పుత్రహీనః కథం విష్ణుపురం యాతి, స తు దుర్గతి మేవ యాతీతి చే న్నత్రాహ. ఏతే తిలా దయో దుర్గతిం యాంతం నివారయంతి. ౧౦. నను తిలానా మీదృశో మహిమా కుత ఇతి చే త్తత్రాహ. మమేతి. ౧౧. దర్భేతి. 'కుశోఽస్మి తృణజాతీనామ్' రోమా ణ్యద్భిజ్జజాతీనాం ఉత్పత్తి స్థానాని, ఇతి భగవద్వచనా దితి,

కుశాగ్రే శంకరో దేవ స్త్రయో దేవాః కుశేస్థితాః. ౧౩
అతః కుశా వహ్ని మంత్ర తులసీ విప్ర ధేనవః,
నైతే నిర్మాల్యతాం యాంతి క్రియమాణాః పునఃపునః. ౧౪

పవిత్రము లగు తిలలు, దర్భలు, తులసి అను నీమూఁడు వస్తువులను నరకమునఁ బోవు మనుష్యులను స్వర్గమునకుఁ గొనిపోవును. తిలలు నాశరీరమునుండి పుట్టుటచేత పవిత్రము లయ్యె కావున తిలలను జూచుటతోడనే అసురులు, దానవులు, దైత్యులు పారిపోవుదురు. నారోమములవలన నుద్భవించిన దర్భలు నావిభూతి యని తెలిసికొనుము. వాని స్పర్శనమువలన మానవులు స్వర్గమును బొందుదురు. కుశమూలమున బ్రహ్మయు, కుశమధ్యమున విష్ణువును, కుశాగ్రమున శంకరుఁడును నివసించియుందురు, కావున కుశలును, అగ్నియు, మంత్రములును, తులసియు, బ్రాహ్మణులును, గోవులును మరల మరల ఉపయోగింపఁబడుచుండినను కర్మలయందు అయోగ్యములు గావు.

దర్భాః పిండేషు నిర్మాల్యా బ్రాహ్మణాః ప్రేతభోజనే,
మంత్రా గా స్తులసీ నీచే చితాయాం చ హుతాశనః. ౧౫
బ్రహ్మా విష్ణు శ్చ రుద్ర శ్చ సర్వే దేవా హుతాశనః,
మండలోపరి తిష్ఠంతి తస్మా త్కుర్వీత మండలమ్. ౧౬

పిండములయందు వినియుక్తము లగు దర్భలును ప్రేతశ్రాద్ధమునందు భుజించిన బ్రాహ్మణులును, నీచజాతిపతితమంత్రములును, తద్గృహవర్ధితము లగు తులసియు, గోవును కర్మల కర్హములు గావు. మఱియు చితాగ్నియు అర్హంబు గాదు. గోమయముచే ఉపలిప్తమును, దర్భాస్తృతమును అగు భూతలమున ఆతురుని పరుండఁబెట్టవలెను. మంచముమున్నగువానిమీఁద పరుండబెట్టరాదు. మఱియు బ్రహ్మయు, విష్ణుండును, రుద్రుండును సమస్తదేవతలును, అగ్నియు మండలము నధిష్ఠించియుందురు. కాఁబట్టి మండలమునందు ఆతురుని పరుండఁబెట్టుట మోక్షసాధన మని యెఱుంగుము.

---

౧౨. కుశస్యాపి పావనత్వమాహ. ౧౩. కుశేతి. క్రియమాణా, కర్మణి ప్రయుజ్యమానా అపి నిర్మాల్యతాం అయోగ్యతాం న యాంతి. ౧౪. సామాన్యశాస్త్రా ద్విశేషశాస్త్రస్య బలవత్త్వ మాహ. దర్భా ఇతి. నీచే నీచజాతిముఖే మంత్రాః గాః తులసీ చ తద్గృహే నిర్మాల్యాః అగ్రాహ్యాః. ౧౫. ప్రాసంగికం పరిసమాప్య ప్రకృత మనుసరతి.

సర్వత్ర వసుధాపూతా లేపో యత్ర న విద్యతే,
యత్ర లేపః కృత స్తత్ర పున ర్లేపేన శుధ్యతి. ౧౮
రాక్షసా శ్చ పిశాచా శ్చ భూతాః ప్రేతా యమానుగాః,
అలి ప్తదేశే ఖట్వాయా మంతరిక్షే విశంతి చ. ౧౯
అతోఽగ్నిహోత్రం శ్రాద్ధం చ బ్రహ్మభోజ్యం సురార్చనమ్,
మండలేన వినా భూమ్యా మాతురం నైవ కారయేత్. ౨౦
లిప్తభూమ్యా మతః కృత్వా స్వర్ణం రత్నం ముఖే క్షిపేత్,
విష్ణోః పాదోదకం దద్యా త్సాలగ్రామస్వరూపిణః. ౨౧
సాలగ్రామశిలాతోయం యః పిబే ద్బిందుమాత్రకమ్,
సర్వపాపవినిర్ముక్తో వైకుంఠభువనం వ్రజేత్. ౨౨

ఉపలిప్తము గాని భూమి యెల్లపుడు పవిత్రమై యుండును. ఒకమాఱు అలుకఁబడిన భూమి మరల అలుకువఱకు పవిత్రముకాదు. రాక్షసులును, పిశాచములును, భూతములును, యమానుగములగు ప్రేతములును, అలిప్తభూమిని ఖట్వ (మంచము)ను అంతరిక్షమును ఆశ్రయించుకొనియుందురు. కాఁబట్టి అగ్నిహోత్రమును, శ్రాద్ధమును, బ్రాహ్మణభోజనమును, దేవపూజను అలిప్తభూమిమీఁద చేయఁగూడదు. ఆతురుని పరుండఁబెట్టఁగూడదు. ఉపలిప్తమగు భూమిమీఁదఁ బరుండఁబెట్టి నోటియందు స్వర్ణమును, రత్నమును ఉంచవలెను. పిమ్మట సాలగ్రామతీర్థము నీయవలెను. సాలగ్రామతీర్థమును పానముచేసినవారు సమస్తపాపనిర్ముక్తులై వైకుంఠమును బొందుదురు.

తతో గంగాజలం దద్యా న్మహాపాతకనాశనమ్,
సర్వతీర్థకృతస్నానదానపుణ్యఫలప్రదమ్. ౨౩
చాంద్రాయణం చరే ద్య స్తు సహస్రం కాయశోధనమ్,
పిబేద్య శ్చైవ గంగాంభ స్సమౌ స్యాతా ముభా వపి. ౨౪
అగ్నిం ప్రాప్య యథా తార్క్ష్య! తూలరాశి ర్వినశ్యతి,
తథా గంగాంబుపానేన పాతకం భస్మసా ద్భవేత్. ౨౫
యస్తు సూర్యాంశుసంతప్తం గంగాయా స్సలిలం పిబేత్,
స సర్వయోనినిర్ముక్తః ప్రయాతి సదనం హరేః. ౨౬

---

గోమయే నేతి. ౧౬. ౧౭. ౧౮. ౧౯. సురార్చనం దేవపూజామ్. ౨౦. ౨౧. ౨౨. ౨౩. ౨౪. ౨౫. ౨౬. ఇతరాః అన్యా వద్యః అవగాహేన స్నానేన గంగా తు

నద్యో జలావగాహేన పావయంతీతరా జనాన్,
దర్శనా త్స్పర్శనా త్పానా త్తథా గంగేతి కీర్తనాత్. ౨౭
పునా త్యపుణ్యా న్పురుషా ఞ్ఛతశోఽథ సహస్రశః,
గంగా తస్మా త్పిబే త్తస్య జలం సంసారతారకమ్. ౨౮
గంగా గంగేతి యో బ్రూయా త్ప్రాణైః కంఠగతై రపి,
మృతో విష్ణుపురం యాతి న పున ర్జాయతే భువి. ౨౯
ఉత్క్రామద్భిశ్చ యః ప్రాణైః పురుష శ్శ్రద్ధయాఽన్వితః,
చింతయే న్మనసా గంగాం సోఽపి యాతి పరాం గతిమ్. ౩౦
అతో ధ్యాయే న్నమే ద్గంగాం సంస్మరే త్తజ్జలం పిబేత్,

పిమ్మట సమస్తమహాపాతకములను నాశనము చేయునదియు, సర్వతీర్థములయందును స్నానముచేసినను, ఆయాతీర్థములలో దానము చేసినను ఏపుణ్యము వచ్చునో ఆపుణ్యము నిచ్చునదియు నగు గంగోదకము నీయవలెను. శరీరశుద్ధికరములగు సహస్రచాంద్రాయణములను జేసినవాఁడును, గంగోదకము త్రావినవాఁడును, సమానులు అని గ్రహింపుము. అగ్నిస్పర్శవలన తూల (దూది) రాశి దహింపఁబడురీతిని గంగోదకము పుచ్చుకొనుటవలన సమస్తపాపములును నశించును. సూర్యకిరణములచే తప్త మయిన గంగోదకము నెవఁడు పానము చేయునో వాఁడు జన్మరహితుఁ డగును. యమున, కృష్ణవేణి, కావేరి మున్నగు మహానదులు స్నానము చేసినవారిని పునీతులనుగావించును. గంగానదియో, దర్శనమువలనను, స్పర్శనమువలనను, పానమువలనను, "గంగ గంగ" అని యెల్లపుడును కీర్తించుటవలనను, పునీతులను గావించును; కాఁబట్టి సంసారతారక మగు గంగోదకమును పానము చేయవలెను. ప్రాణములు కంఠగతములై యున్నపుడు ఎవఁడు "గంగా! గంగ!" యని స్మరించునో వాఁడు విష్ణుసాయుజ్యమును బడసి ఎన్నటికిని పృథివిమీఁద జన్మింపఁడు. ప్రాణములు పోవునపుడు ఎవఁడు శ్రద్ధతో గంగను స్మరించునో వాఁడు పరమగతిని బొందును; కాఁబట్టి

---

దర్శనాదిభి రేవ పునాతీతి ద్వితీయే నాన్వయః. ౨౭, ౨౮. జలపానమహిమా తు కిం వర్ణ్యతే. తత్స్మరణచింతనా దపి ముక్తో భవతీ త్యాహ-గంగేతి ద్వాభ్యామ్. ౨౯-

గంగను స్మరింపవలెను. నమస్కరింపవలెను. గంగోదకమును పానము చేయవలెను.

తతో భాగవతం కించి చ్ఛృణుయాన్మోక్షదాయకమ్. ౩౧
శ్లోకం శ్లోకార్ధపాదం వా యోఽంతే భాగవతం పఠేత్,
న తస్య పునరావృత్తి ర్బ్రహ్మలోకా త్కదాచన. ౩౨
వేదోపనిషదాం పాఠా చ్ఛివ విష్ణుస్తవా దపి,
బ్రాహ్మణ క్షత్రియ విశాం మరణం ముక్తిదాయకమ్. ౩౩
ప్రాణప్రయాణసమయే కుర్యా దనశనం బుధః,
దద్యా దాతురసన్న్యాసం విరక్తస్య ద్విజన్మనః. ౩౪
సంన్యస్త మపి యో బ్రూయా త్ప్రాణైః కంఠగతై రపి,
మృతో విష్ణుపురం యాతి న పున ర్జాయతే భువి. ౩౫

---

౩౨. అనశనం జలాన్నపరిత్యాగః. అనశనే కాశ్యపయాఽక్షయా గతి రితి హేతోః కుర్యా దితి. అథ ఆతురసన్న్యాసం నిర్ధారయతి. దద్యాదితి సార్ధేన అత్ర యద్యపి 'బ్రాహ్మణాః ప్రవ్రజంతి' ఇతి శ్రుతేః. "ముఖజానా మయం ధర్మో యద్విష్ణో ర్లింగ ధారణమ్, బాహుజాతోరుజాతానా మయంధర్మో న విద్యతే" ఇతి స్మృతినిషేధాత్ బ్రాహ్మణస్యైవ ప్రవ్రజ్యా-న తు క్షత్రియాదే రిత్యాహుః. తథాపి "యదహరేవ విరజే త్తదహరేవ ప్రవ్రజే" దిత్యాదిశ్రుతేః త్రైవర్ణికసాధారణత్వాత్ 'త్రయాణాం వర్ణానాం వేద మధీత్య ఆశ్రమాచరణ మితి సూత్రకారవచనాచ్చ "ముఖజానా మయం ధర్మో వైష్ణవం లింగధారణమ్, బాహుజాతోరుజాతానాం త్రిదండం విధీయతే" ఇతి దండవిషయే నిషేధదర్శనాచ్చ సోపవీతయో రధీతవేదయో ర్విరక్తయోః క్షత్రియవైశ్యయో రపిదండధారణ మంతరేణ కేవలం ప్రైషమంత్రోచ్చారణమాత్రఏవాతురసన్న్యాసాధికారః-న త్వనుపవీతయోః గృహారూఢమూఢయో రిత్యాహుః. కించ ద్విజన్మ ఇత్యుక్తవతా శ్రీభగవతాఽప్యయ మేవ పక్ష స్స్వీకృతః. క్షత్రియవైశ్య యోరపి ద్విజన్మత్వా దాతురసన్న్యాసాధికార స్సూచిత ఇతి ప్రతీమః. తథాఽపి విరక్తస్యైవ కిమర్థం? యది సన్న్యాసోత్తరం ప్రారబ్ధవశా జ్జీవతోఽపి పున ర్భోగ భుక్త్యావాతాశిత్వం పాత్, కింతు గృహాత్ప్రవ్రజేదే వేతి. తదుక్తం మనునా, "ఆత్మ న్యగ్నీం త్సమారోప్య బ్రాహ్మణః ప్రవ్రజేద్గృహాత్, బ్రాహ్మణః క్షత్రియో వాఽపి వైశ్యో వా ప్రవ్రజేద్గృహా" దితి. అత్రాయం విశేషః. బ్రాహ్మణస్తు దండధారణం కృత్వా క్షత్రియో వైశ్యశ్చ ఉపశమాదిసన్న్యాసధర్మాన్ స్వీకృత్య ప్రవ్రజే దితి, అలం ప్రాసంగికేన. ౩౪. తదేవ సూచయతి సన్న్యస్తమితి. ఓం భూః సన్న్యస్తం మయా,

అనంతరము మోక్షదాయక మగు శ్రీమహాభాగవతమును వినవలెను. అవసానకాలమున భాగవతమునందలి యొక శ్లోకమునైనను, శ్లోకార్థమునైనను, శ్లోకపాదమునైనను, ఎవ్వఁడు వినునో వాఁడు పునరావృత్తిలేని శాశ్వత బ్రహ్మలోకమును బొందును. వేదమునైనను, ఉపనిషత్తులనైనను, శివస్తోత్రములనైనను, విష్ణుస్తవములనైనను, ఎవ్వరు పఠింతురో వారు మోక్షము పొందుదురు. గరుడుఁడా! ప్రాణములు పోవునపుడు జలమును అన్నమును పుచ్చుకోఁగూడదు. విరక్తుఁడగు ద్విజుఁడు ఆతురసన్న్యాసమును స్వీకరింపవలెను. ప్రాణము పోవునపుడు ఎవఁడు ''సన్న్యసించినాను'' అని పలుకునో వాఁడు విష్ణులోకమును పొందును. వానికి ఇఁక జన్మ కలుగదు.

ఏవం జాత విధానస్య ధార్మికస్య తదా ఖగ!
ఊర్ధ్వచ్ఛిద్రేణ గచ్ఛంతి ప్రాణా స్తస్య సుఖేన హి. ౩౬
ముఖం చ చక్షుషీ నాసే కర్ణౌ ద్వారాణి సప్త చ,
ఏభ్య స్సుకృతినో యాంతి యోగిన స్తాలురంధ్రతః. ౩౭
అపానా న్మిళితప్రాణో యదా హి భవతి పృథక్,
సూక్ష్మీభూత్వా తదా వాయు ర్వినిష్క్రామతి పుత్తలాత్. ౩౮

ఓం భువః సన్న్యస్తం మయా, ఓం సువః సన్న్యస్తం మయా, ఓం భూర్భువస్సువః సన్న్యస్తం మయా స్వాహా గాయత్రీ-ఓం పుత్రైషణాయా విత్తైషణాయా లోకైష ణాయాశ్చ వ్యుత్థితోఽహం స్వాహా శిరశ్చ ఓం, అభయం సర్వభూతేభ్యో మత్త స్స్వాహా ఇత్యాదిప్రైషమంత్రానుచ్చార్య అహం బ్రహ్మాఽస్మీత్యనుభవవాక్యార్థవిచా రణేన బ్రహ్మపరో భూయాదిత్యాతురవిధిః. అత్ర దండధారణే తు దాహః తిలోదక పిండదానాదికం చ న స్యాత్-తస్య బహిస్సన్న్యస్తస్య తురీయాశ్రమత్వాత్. అస్య అహం బ్రహ్మాఽస్మీత్యంతః. సన్న్యస్తస్యతు పారలౌకిక మపి వక్ష్యమాణంకర్మ కుర్యా దితి విశేషః. కించ సాంప్రదాయికానాంతు ఇదమ ప్యనభిమతమేవ. తే తు ''బ్రాహ్మణ స్యాపి దండధారణం వినా ఆతురసన్న్యాసో నాస్తి క్షత్రియ వైశ్య యోశ్చ సర్వ థై వానధికార' ఇత్యేవం వదం తీతి. ౩౫. ఏవ ముక్తప్రకారేణ జాతం విధానం ఆతు రకృత్యం యస్య తస్య. ౩౬. ఊర్ధ్వచ్ఛిద్రాణ్యేవాహ. ముఖ మితి. ౩౭. ప్రాణోత్క్రమణేన శరీరత్యాగప్రకార మాహ. అపానా దితి. నాభిస్థానే మిళితయోః ప్రాణాపా నయోః యదా విశ్లేషో భవతి తదా సూక్ష్మీభూత్వా అతీంద్రియ స్సన్ వాయుః ప్రాణః పుత్తరాత్ శరీరాత్ నిస్సర తీతి. ౩౮. మరుతి ఊర్ధ్వరే శరీరాధారభూతే ప్రాణే,

శరీరం పత తే పశ్చా న్నిర్గ తే మరు తీశ్వ రే,
కాలాఽహతం పత త్యేవం నిరాధారో యథా ద్రుమః. ౩౯
నిర్విచేష్టం శరీరం తు ప్రాణైర్ము క్తం జుగుప్సితమ్,
అస్పృశ్యం జాయ తే సద్యో దుర్గంధం సర్వనిందితమ్. ౪౦

ఇట్లు విహితాతురకృత్యుండగు ధర్మాత్ముని ప్రాణవాయువులు ఊర్ధ్వచ్ఛిద్రము లగు ముఖాదులనుండి సుఖముగా వెడలిపోవును. ముఖము, నేత్రములు, ముక్కులు, చెవులు ఈయేడును ఊర్ధ్వచ్ఛిద్రములు. రోగుల ప్రాణవాయువులు తాలురంధ్రములనుండి వెడలిపోవును. నాభిదేశమున మిళితములగుప్రాణాపానము లెప్పుడు విడిచిపోవునో అప్పుడు ప్రాణవాయువు సూక్ష్మమై శరీరమునుండి వెడలిపోవును. పిమ్మట కాలహతమును, నిరాధారము నగు వృక్షమువలె శరీరము సైతము ప్రాణవాయువు వెడలినతోడనే క్రిందఁబడిపోవును. ప్రాణములు పోవుటతోడనే శరీరము నిర్విచేష్టమును, జుగుప్సితమును, స్పృశింపనయోగ్యమును, దుర్గంధభూయిష్ఠమును, సర్వనింద్యమును అగును.

త్రిధా వస్థా శరీరస్య క్రిమిఽవి ట్భస్మ రూపతః,
కిం గర్వః క్రియ తే దేహే క్షణవిధ్వంసిభి ర్నరైః. ౪౧
పృథివ్యాం లీయ తే పృథ్వీ ఆప శ్చైవ తథాఽప్సు చ,
తేజ స్తేజసి లీయేత సమీర స్తు సమీరణే. ౪౨
ఆకాశశ్చ తథాఽఽకాశే సర్వవ్యాపీ చ శంకరః,

క్రిమి వి ట్భస్మ రూపములచే శరీరమునకు మూఁడు అవస్థలు కలుగును. ఇట్టి దేహమును పొందియు మానవులు ఏలగర్వముపొందెదరు? స్థూలశరీరమున నున్న భూమి భూమియందును, ఉదకము ఉదకమునందును, తేజస్సు తేజస్సునందును, వాయువు వాయువునందును, ఆకాశము ఆకాశమునందును కలిసిపోవును.

నిత్యముక్తో జగత్సాక్షీ ఆత్మా దేహే వ్యవస్థితః. ౪౩

---

యథా నిరాధారో ద్రుమః పతతి ఏవం శరీరం పత తే. ౩౯. గతప్రాణస్య శరీర స్యావస్థా మాహ. నిర్విచేష్ట మితిద్వాభ్యామ్. ౪౦. ఈదృ శే దేహే. ౪౧. పృథివ్యాదీనాం స్వస్వరూపే అనుమాహ నపాదేన. ౪౨. ఆత్మాతు 'జాయ తే అ స్తి వర్ధ తే విపరిణమ తే అపక్షీయ తే నశ్యతి' ఇత్యేవం భావ్యకారాదిభి రుక్తషడ్భావవికారరహిత ఏ వా స్తి. ౪౩.

సర్వేంద్రియయుతో జీవ శ్శబ్దాదివిషయై ర్వృతః,
కామరాగాదిభి ర్యుక్తః కర్మకోశసమన్వితః. ౪౪
పుణ్యవాసనయా యుక్తో నిర్మితే స్వేన కర్మణా,
స ప్రవిశ్య నవే దేహే గృహే దగ్ధే యథా గృహీ. ౪౫
తదా విమాన మాదాయ కింకిణీజాలమాలి యత్,
ఆయాంతి దేవదూతాశ్చ లసచ్చామరశోభితాః. ౪౬
ధర్మతత్త్వవిదః ప్రాజ్ఞా స్సదా ధార్మికవల్లభాః,
తథైనం కృతకృత్యం స్వ ర్విమానేన నయంతి తే. ౪౭
సుదివ్య దేహో విరజాంబరస్ర క్సువర్ణరత్నాభరణై రుపేతః,
దానప్రభావాత్స మహానుభావః ప్రాప్నోతి నాకంసురపూజ్యమానః.

సర్వవ్యాపియు, నిత్యముక్తుఁడును, జగత్సాక్షియు, షడ్భావవికారరహితుఁడును, జ్ఞానాదసర్వేంద్రియసహితుఁడును, శబ్దాదివిషయసంయుతుఁడును, అరిషడ్వర్గయుక్తుఁడును, ప్రాక్తనకర్మసమన్వితుఁడును అగు జీవుఁడు పుణ్యవాసనాయుక్తుఁడై పూర్వజన్మకర్మానురూపమగు నూతనశరీరమున గృహస్థుఁడు గృహము దగ్ధము కాఁగా మఱియొక క్రొత్తగృహము ప్రవేశించినరీతిని ప్రవేశించి సుఖదుఃఖము లనుభవించును. అంతట కాల మాసన్నమయినతోడనే చామరశోభితులును, ధర్మతత్త్వవేత్తలును, ప్రాజ్ఞులును, ధర్మాత్ములకు ప్రియులును అగు దేవదూతలు కింకిణీమాలికాభిరామ మగు విమానమును దీసికొనివచ్చి ఆతురకృత్యములను జేసికొని సిద్ధముగా నున్న జీవుని స్వర్గమునకుఁ గొనిపోవుదురు. జీవుఁడును దివ్యదేహధారియు, శుక్లమాల్యాంబర

వను పృథివ్యాదయ స్తు స్వస్వమాత్మ స్వరూపే లీనా భవంతి. ఆత్మాచ నిత్యముక్తో జగత్సాక్షీ భవతి తర్హి కర్మఫలభోక్తా కః? ఇత్యాశంకాయాం జీవఏవ పుణ్యాపుణ్యవాసనానుసారేణ శుభాశుభకర్మఫలభోక్తాస్తి ఇతి వ్యావహారికం జీవస్వరూపం నిరూపయన్నాహ. సర్వేతి. ౪౪-౪౬. ధార్మికా వల్లభా యేషాం తే దేవదూతాః. కృతం ఆతురకృత్యం యేన తం ఏనం ధార్మికం స్వః స్వర్గలోకే నయంతి. ౪౭. సుష్ఠు శోభనః దివ్య స్తేజోమయో దేహో యస్య సః దేవరూప స్సన్ నాకం స్వర్గాదిలోకం తత్క్షణమేవ ప్రాప్నోతి. నహి సుకృతినాం వర్ష పర్యంతం యమమార్గగమనం భవతీతి. భావః. ౪౮. ఇతి శ్రీగరుడపురాణటీకాయాం నవమోఽధ్యాయః.

ధారియు, దివ్యాభరణశోభితుఁడును, అయి దానధర్మములు చేసి కొనుటవలన మహానుభావుఁడై దేవతలచేపూజింపఁబడుచు వెంటనే స్వర్గలోకమునకుఁ బోవును.

ఇతి శ్రీగరుడపురాణే-సారోద్ధారే-మ్రియమాణకృత్య
నిరూపణోనామ నవమోఽధ్యాయః.

---

# దశమాధ్యాయము.

---

గరుడ ఉవాచః—

దేహదాహవిధానం చ విభో! సుకృతినాం వద,
సతీ యది భవే త్పత్నీ తస్యా శ్చ మహిమాం వద. ౧

శ్రీ భగవా నువాచః—

శృణు తార్క్ష్య? ప్రవక్ష్యామి సర్వ మే వౌర్ధ్వదైహికమ్,
య త్కృత్వా పుత్రపౌత్రాశ్చ ముచ్యంతే పైతృకా దృణాత్. ౨
కిం దత్తై ర్బహుభి ర్దానైః పిత్రో రంత్యేష్టి మాచరేత్,
తేనాగ్నిష్టోమసదృశం పుత్రః ఫల మవాప్నుయాత్. ౩

"ప్రభూ! పుణ్యాత్ముల దేహదాహవిధానమును, పతివ్రతామహిమమును దెలుపవే" యని గరుడుఁడు అడుగఁగా శ్రీహరి "పుత్రులును పౌత్రులును ఔర్ధ్వదైహికము నాచరించినగాని పైతృక మగు ఋణమును తొలఁగించుకొనఁజాలరు. ఎన్నిదానములు చేసినను ఫలములేదు; గావున ముఖ్యముగా అంత్యేష్టి నాచరింపవలెను. అంత్యేష్టినిగావించిన పుత్రుఁడు అగ్నిష్టోమఫలమును పొందును" అని యింకను ఇట్లు చెప్పెను.

తదా శోకం పరిత్యజ్య కారయే న్ముండనం సుతః,
సమస్తబాంధవై ర్యుక్త స్సర్వపాపనుత్తయే. ౪

---

స్వర్గంగతస్య జీవస్య దేహదేహవిధిం ఖగః, సత్యావిధానం మహిమాం హరించ పరిపృచ్ఛతి. దేహ ఇతి. దాహతృతీయదినయోః పంచకస్య విధిం తథా, సతీ గంగాప్రభావంచ,దశమే ప్రాహ మాధవః. శృణ్వితి. ఔర్ధ్వ దైహికం లోకాంతరోపయోగి కర్మ. ౨. అంత్యేష్టిం దాహాదికర్మ. ౩. పాపానాం అపనుత్తి ర్నాశః

మాతాపిత్రోర్మృతౌ యేన కారితం ముండనం న హి,
ఆత్మజ స్స కథం జ్ఞేయ స్సంసారార్ణవతారకః. ౫
అతో ముండన మావశ్యం నఖకక్షవివర్జితమ్,
తత స్సబాంధవ స్స్నాత్వా ధౌతవస్త్రాణి ధారయేత్. ౬

తల్లిదండ్రులు మరణించినపుడు శోకమును విడిచి పుత్రుఁడు సమస్తబంధుసమేతుఁడై సర్వపాపమును తొలఁగిపోవుటకు క్షురకర్మను జేయించుకొనవలెను, అట్లు చేయించుకొననివాఁడు తల్లిదండ్రులను సంసారార్ణవమునుండి తరింపఁజేయఁజాలఁడు; గావున అవశ్యము ముండనము చేయించుకొని స్నానము చేసి ధౌతవస్త్రములను ధరింపవలెను.

సద్యో జలం సమానీయ తత స్తం స్నాపయే చ్ఛవమ్,
మండయే చ్చందనై స్స్రగ్భి ర్గంగామృత్తికయాఽథవా. ౭
నవీనవస్త్రై స్సంఛాద్య తదా పిండం సదక్షిణమ్,
నామగోత్రం సముచ్చార్య సంకల్పే నాపసవ్యతః ౮
మృత్యుస్థానే శవో నామ తస్య నామ్నా ప్రదాపయేత్,
తేన భూమి ర్భవే త్తుష్టా తదధిష్ఠాతృదేవతా. ౯
ద్వారదేశే భవే త్పాంథ స్తస్య నామ్నా ప్రదాపయేత్,
తేన నై వోపఘాతాయ భూతకోటిషు దుర్గతాః. ౧౦
తతః ప్రదక్షిణం కృత్వా పూజనీయ స్స్నుషాదిభిః,
స్కంధః పుత్రేణ దాతవ్య స్తదాఽన్యై ర్బాంధవై స్సహ. ౧౧
ధృత్వా స్కంధే స్వపితరం య శ్శ్మశానాయ గచ్ఛతి,
సోఽశ్వమేధఫలం పుత్రో లభతే చ పదే పదే. ౧౨

---

తదర్థ మితి హేతు రుక్తః. ౪. మృతౌ మరణేసతి. ౫, ౬. స్రగ్భిః పుష్పమాలాదిభి ర్మండయేత్ శవం భూషయేత్. తదుక్తం విష్ణుపురాణే "ప్రేతదేహం శుభై స్స్నానై స్స్నాపితం స్రగ్విభూషితం, దగ్ధ్వా గ్రామా ద్బహి స్స్నాతా" దితి. ౭. సంకల్పేన అముకగోత్రాయ అముకనామ్నే శవాయ బ్రహ్మదైవత్యస్థానపిండోఽయం మయా దీయతే, త వోపతిష్ఠతా మితి. ౮. ఏవం హి ద్వారి విశ్రామే పాంథః భూతనామ్నా విష్ణురుద్రదైవత్యం పిండం దద్యాదితి. తేన స్థానపిండేన తస్య శవస్య అధిష్ఠాతృదేవతా ఆధారభూతా భూమి స్తుష్టా భవే దితి కారణ ముక్తమ్. ౯. తేన ద్వారి పిండేన భూతకోటిషు భూతానాం గణనాసు యే దుర్గతాః దుష్టం అశుచిస్థానం ప్రాప్తా స్తే

నీత్వా స్కంధే స్వపృష్ఠేఽంకే సదా తాతేన లాలితః,
తదైవ తదృణా న్ముచ్యే న్మృతం స్వపితరం వహేత్. ౧౩

పిమ్మట అప్పుడు తెచ్చిన జలముతో శవమునుస్నానముచేయించి పువ్వులతోడను, గంధముతోడను, గంగామృత్తికతోనైనను అలంకరించి నూతనవస్త్రములు కప్పవలెను. అపసవ్యముగా సంకల్పము చేసి ప్రేతనామగోత్రములు నుచ్చరించి మరణస్థలమున సదక్షిణాకముగ పిండము నుంచవలెను. ఇట్లు చేసిన శవాధిష్ఠాత్ర్దేవత యగు భూమి తృప్తిఁ బొందును. తరువాత ద్వారదేశమునందును, భూతనామముతో పిండము నుంచవలెను. అట్లు చేసిన భూతకోటులయందలి దుర్గతులు విఘ్నములు కలిగింపఁజాలరు. అనంతరము శవమునకు ప్రదక్షిణము చేసి కోడలు మున్నగువారు పూజింపవలెను. పిమ్మట బంధుసహితుఁడై పుత్త్రుఁడు భుజము నీయవలెను. ఏపుత్త్రుఁడు భుజమునతండ్రినివహించి శ్మశానమునకుం జను నతనికి ప్రతిపదంబున అశ్వమేధఫలము లభించును. పుత్త్రుఁడు బాల్యావస్థయందు తండ్రిచే భుజములయందును, తొడలమీఁదను, వీఁపుమీఁదను ఎక్కించుకొని లాలింపఁబడును. అట్టి ఋణము తండ్రి శవమును భుజమున నుంచుకొని శ్మశానమునకుఁ గొని పోయినఁ గాని తొలఁగదు.

తతోఽర్ధమార్గే విశ్రామం సంమార్జ్యాభ్యుక్ష్య కారయేత్,
సంస్నాప్య భూతసంజ్ఞాయ తస్మై తేన ప్రదాపయేత్. ౧౪
పిశాచా రాక్షసా యక్షా యే చాన్యే దిక్షు సంస్థితాః,
తస్య హోతవ్యదేహస్య నై వాయోగ్యత్వకారకాః. ౧౫
తతో నీత్వా శ్మశానేషు స్థాపయే దుత్తరాముఖమ్,

---

ఉపఘాతాయ విఘ్నాయ న. విఘ్నోఽత్ర సద్గతి మవరుధ్య స్వసమానం కారణం తత్కర్తుం నైవ ప్రభవంతీతి. ౧౦-౧౩. తేన భూతనామ్నా తస్మై ప్రేతాయ పిండ ఇత్యనువర్తతే సమ్మార్జ్య భూమిం అభ్యుక్ష్య-జలేన సంస్నాప్య శవమ్. ౧౪. తస్య ప్రేతస్య హోతవ్యస్య హోతుం దగ్ధుం యోగ్యస్య అయోగ్యత్వకారకా న. అత్ర పిండదానం వినా తన్మాంసభక్షణ మయోగ్యత్వం యథోచ్ఛిష్టం హవిర్హవనాయోగ్యం భవతి తద్వద్దేహోఽపీత్యర్థః. అతః పిశాచాదయః పిండం భుక్త్వా తన్మాంసభక్షం న కుర్వంతీతి కారణ ముక్తమ్. ఇద మేవ చితాదౌ. ౧౫,౧౬. సంమార్జ్యభూమిం సంలిప్య

తత్ర దేహస్య దాహార్థం స్థలం సంశోధయే ద్యథా. ౧౬
సంమార్జ్య భూమిం సంలి ప్యోల్లి ఖ్యోద్ధృత్య చ వేదికామ్,
అభ్యు క్ష్యోపసమాధాయ వహ్నిం తత్ర విధానతః. ౧౭
పుష్పాక్షతై ర థాభ్యర్చ్య దేవం క్రవ్యాదసంజ్ఞకమ్,
'లోమభ్య' స్త్వనువాకేన హోమం కుర్యా ద్యథావిధి. ౧౮
త్వం భూతభృ జ్జగద్యోని స్త్వం భూతపరిపాలకః,
మృత స్సాంసారిక స్తస్మా దేనం త్వం స్వర్గతిం నయ. ౧౯
ఇతి సంప్రార్థయిత్వాఽగ్నిం చితాం తత్రైవ కారయేత్,
శ్రీఖండతులసీకాష్ఠైః పలాశాశ్వత్థదారుభిః. ౨౦

పిశాచములు, రాక్షసులు, యక్షులు మొదలగువారు ప్రేతశరీర మాంసమును భుజింతురు. అట్లు భుజించిన ఆశవము దహనముచేయుట కయోగ్య మగును; కావున తత్పిశాచాదులకొఱకు మార్గమధ్యమున భూమిని తుడిచి ప్రోక్షించి ప్రేతనామగోత్రాదుల నుచ్చరించి పిండ ప్రదానము చేయవలెను. తరువాత శవమును శ్మశానమునకు తీసికొని పోయి ఉత్తరాభిముఖముగా ప్రేతము నుంచి దహనమునకు ఉపయోగించు భూమిని బాగుచేయవలెను. అదెట్లనః ముందుగా భూమిని తుడిచి గోమయముతో నలికి దర్భలతో ఊర్ధ్వముగా నొక గీటు గీచి తర్వాత ఉదకము ప్రోక్షించి అచ్చట అగ్నిని యథావిధిగా నుంచి

---

గోమయేన వేదికాం లిప్తభూమి-ఉల్లిఖ్య తస్యాం దర్భేణోర్ధ్వరేఖాం కృత్వా రేఖా మధ్యే అనామికాంగుష్ఠేన ఉద్ధృత్య జలే నాభ్యుక్ష్య ఉపసమాధాయ తత్ర వహ్ని సంస్థాప్య క్రవ్యం మృతకస్య మాంసం అత్తి భక్షయతీతి క్రవ్యాదః తదేవ సంజ్ఞా నామ యస్య తం దేవం వహ్నింపుష్పాదిభి స్సంపూజ్య "లోమభ్యః స్వాహా త్వగ్భ్యః స్వాహా మాంసేభ్యః స్వాహా" ఇత్యాద్యనువాకేన వేదమంత్రేణ విధి మనతిక్రమ్యేతి యథావిధి హోమం కుర్యాత్. ౧౭, ౧౮. హే క్రవ్యాద! దేవ! త్వమేవ హాంతే భూతాని పంచభూతాత్మకశరీరాణి బిభర్షి స్వస్మిన్ధారయసీతి భూతభృ దసి. కించ త్వమేవ జగతాం యోనిః కారణం చాసి. పంచమహాభూతాంతర్గతత్వా త్త్వమేవ లోకస్య సర్వప్రాణిజాతస్య క్షుధాసందీపనేన భుక్తాన్న పరిపాకేన పరిపాలకోఽపి తస్మా ద్ధేతో స్సాంసారిక స్సంసారే భవః మృతో హ్యయం పురుష స్త మేనం స్వర్గతిం నయ ప్రాపయేతి ప్రార్థనా. ౧౯, ౨౦. చితాయాం మోక్షస్థాపనం తత్ప్రతికృతిక

క్రవ్యాదసంజ్ఞుఁ డగు వహ్నిని గంధపుష్పాక్షతాదులతో పూజించి "లోమభ్యస్స్వాహా" అను అనువాకముతో యథావిధిగా హోమము చేయవలెను. అనంతరము "త్వం భూతభృ జ్జగద్యోని స్త్వం భూత పరిపాలకః, మృత స్సాంసారిక స్తస్మా దేనం త్వం స్వర్గతిం నయ" యని ప్రార్థించి చందనము, తులసీ, మోదుగు, రావి మున్నగు కఱ్ఱలతో చితిని జేర్చవలెను.

చితా మారోప్య తం ప్రేతం పిండౌ దద్యా త్తత్ర దాపయేత్,
చితాయాం శవహ స్తే చ ప్రేతనామ్నా ఖగేశ్వర!,
చితామోక్షప్రభృతికం ప్రేతత్వ ముపజాయతే. ౨౧
కేఽపి తం సాధకం ప్రాహుః ప్రేతకల్పవిదో జనాః,
చితాయాం తేన నామ్నా వా ప్రేతనామ్నాఽథవా కరే. ౨౨
ఇత్యేవం పంచభిః పిండై శ్శవస్యాఽహుతియోగ్యతా,
అన్యథా చోపఘాతాయ పూర్వోక్తా స్తే భవంతి హి. ౨౩
ప్రేతో దత్వా పంచ పిండా న్హుత మాదాయ తం తృణైః,
అగ్నిం పుత్ర స్తదా దద్యా న్న భవే త్పంచకం యది. ౨౪

అనంతరము శవమును చితిమీఁద నారోపించి చితిమీఁదను శవ హస్తమునందును రెండు పిండములు ప్రేతనామముతో నీయవలెను. చితియందుంచినది మొదలు సపిండీకరణమువఱకును ప్రేతత్వముండును. ప్రేతకల్పవిదులు నగు కొందఱు ఆచితిని సాధక మని చెప్పుచున్నారు. కాఁబట్టి చితిమీఁద సాధకనామముచేతను, ప్రేతహస్తమున ప్రేత

తదారభ్య సపిండనా త్ప్రాక్ ప్రేతత్వం భవతి. అత శ్చితాయాం శవహ స్తేచ సపిండన పర్యంతం చ ప్రేతనామ్నైవ ప్రదాతవ్యమ్. స్థానాదిషు శవపాంథభూతనామభి రితి. ౨౧. పక్షాంతర మాహ. కేపీతి. ప్రేతకల్పం అంత్యేష్టివిధానం తద్విదః సాధక మ ప్యాహుః. అత స్తేన సాధక న్నామ్నా వా కరే ఏవ ప్రేతనామ్నేతి. ౨౨. యథా దిక్పాలాదిబలిభిః హవి రాహుతియోగ్యం భవతి తద్వ త్పంచపిండై శ్శవస్యాఽహుతి యోగ్యతేతి. అన్యథా పంచపిండదానం వినా తూపఘాతాయ స్వకులనాశాయ పూర్వోక్తభూతపిశాచాదయో భవం తీతి. ౨౩. పూర్వం లోమభ్య స్స్వాహేత్యను వాకేన హుతం త మే వాగ్నిం తృణై రాదాయ పుత్రో దద్యాత్. అగ్నిం నిరగ్నికా నామ్. సాగ్నికానాం తు అగ్నిహోత్రా దాదాయ దద్యా దితి విశేషః. ౨౪. యది పం

నామముచేతను పిండముల నుంచవలెను. ఇట్లు అయిదు పిండముల నిచ్చిన శవమునకు దహనయోగ్యత కలుగుచున్నది. ఇట్లు చేయని యెడల పూర్వోక్తములగు భూతపిశాచాదులు స్వకులనాశకరము లగుచున్నారు. కాఁబట్టి ప్రేతనామముతో నైదు పిండములను వేసి తృణములతో నగ్ని గ్రహించి కుమారుఁడు ఆచితియందు ఉంచవలెను. ధనిష్ఠాపంచకమున దహనము చేయఁగూడదు.

పంచకేషు మృతో యస్తు న గతిం లభతే నరః,
దాహ స్తత్ర న కర్తవ్యః కృతేఽన్యమరణం భవేత్. ౨౫
ఆదౌ కృత్వా ధనిష్ఠార్ధ మేత న్నక్షత్రపంచకమ్,
రేవత్యంతం న దాహోఽర్హ్వం దాహే చ నశుభం భవేత్. ౨౬
గృహే హాని ర్భవే త్తస్య ఋక్షే ష్వేషు మృతో హి యః,
పుత్రాణాం గోత్రిణాం చాపి కశ్చి ద్విఘ్నః ప్రజాయతే. ౨౭

ధనిష్ఠాపంచకమున మరణించినవానికి సుగతి గలుగదు. ఆధనిష్ఠా పంచకమున దహనము చేయరాదు. అట్లు చేసిన మఱియొక్కఁడుగూడ మరణించును. ధనిష్ఠ మొదలు రేవతివఱకునుగల అయిదు నక్షత్రములకు ధనిష్ఠాపంచక మని పేరు. ఈధనిష్ఠాపంచకమున మరణించినవాని గృహమున హాని కలుగును. పుత్రులకును జ్ఞాతులకును ఏదేనొక హానియుఁ గలుగును.

అథవా ఋక్షమధ్యే హి దాహ స్స్యా ద్విధిపూర్వకః,
తద్విధిం తే ప్రవక్ష్యామి సర్వదోషప్రశాంతయే. ౨౮
శవస్య నికటే తార్క్ష్య! నిక్షిపే త్పుత్తలాం స్తదా,
దర్భమయాం శ్చ చతుర ఋక్షమంత్రాభిమంత్రితాన్. ౨౯
తత్ర హోమ ప్రకర్తవ్యం వహ్నింతి ఋక్షనామభిః,
'ప్రేతా జయత' మంత్రేణ పున ర్హోమ స్తు సంపుటైః. 30

చకం స్యాత్తదా దాహోన. 'వాసవోత్తరదళాదిపంచకే ప్రేతదాహతృణకాష్ఠసంగ్రహం న కారయే' దితి నిషేధాత్. ౨౫. రేవతీ అంతే యస్య తదేత త్పంచకం దాహేఽర్హ్వం యోగ్యం న. ౨౬. దాహే సతి శుభాభావ ఏవాహ. గృహే ఇతి. ౨౭. విధినా తు పంచకేపి దాహ స్స్యా దిత్యాహ అథ వేతి. ౨౮. విధి మే వాహ. శవ స్యేతి. మంత్రాః సంహితాయాం జ్ఞాతవ్యాః. ౨౯. ప్రేతా జయతా నర ఇంద్రోవ శ్శర్మ యచ్ఛతు' ఇతి మంత్రేణ-సంపుటైః ఋక్షనామభిః హోమః కార్యః. 30-

తతో దాహః ప్రకర్తవ్య స్తైశ్చ పుత్తలకై స్సహ,
సపిండనదినే కుర్యా త్తస్య శాంతివిధిం సుతః. ౩౧
తిలపాత్రం హిరణ్యం చ రూప్యం రత్నం యథాక్రమమ్,
ఘృతపూర్ణం కాంస్యపాత్రం దద్యా ద్దోషప్రశాంతయే. ౩౨
ఏవం శాంతివిధానం తు కృత్వా దాహం కరోతి యః,
న తస్య విఘ్నో జాయేత ప్రేతో యాతి పరాం గతిమ్. ౩౩
ఏవం పంచకదాహస్య తద్వినా కేవలం దహేత్,
సతీయది భవే త్పత్నీ తయాసహ వినిర్దహేత్. ౩౪

అథవా ఈధనిష్ఠాపంచకమధ్యమే తటస్థించినచో అప్పుడు చేయవలసిన దహనమునకు ఒకవిధానము గలదు. దానిం జెప్పెద వినుము. సమస్తదోషములను బోగొట్టు నవ్విధియిది. శవసమీపమున దర్భమయములును నక్షత్రమంత్రాభిమంత్రితములును అగు నాలుగు ప్రతికృతుల నుంచవలెను. అత్ర "ప్రేతా జయత" అనుమంత్రముతో సంపుటితములగు నక్షత్రనామములతో హోమములు చేయవలెను. తరువాత ఆదర్భప్రతికృతులతో గూడ దహనము చేయవలెను. సపిండీకరణదినమున తచ్ఛాంతిని జేయవలెను. ఆశాంతి విధి యెట్లంటే! తిలపాత్రము, హిరణ్యము, రూప్యము, రత్నము, ఘృతపూర్ణ కాంస్యపాత్రము అనువానిని యథాక్రమముగా అయిదునక్షత్రములయందును మరణదోషనివృత్తికై దానము చేయవలెను. ఇట్లు శాంతి చేసి దహనము చేసినవారికి విఘ్నములు కలుగవు. ప్రేతలు సుగతిని పొందెదరు. మరణించిన యతనిపత్ని పతివ్రత యగునేని ఆమెనుగూడ భర్తచితిపైనుంచి దహనము చేయవలెను.

పతివ్రతా యదా నారీ భర్తుః ప్రియహితే రతా,
ఇచ్ఛే త్సహైవ గమనం తదా స్నానం సమాచరేత్. ౩౫
కుసుమాంజనసద్వస్త్రభూషణై ర్భూషితాం తనుమ్,
దానం దద్యా ద్ద్విజాతిభ్యో బంధువర్గేభ్య ఏవచ. ౩౬
గురుం నమస్కృత్య తదా నిర్గచ్ఛే న్మందిరా ద్బహిః,
తతో దేవాలయం గత్వా భక్త్యా తం ప్రణమే ద్ధరిమ్. ౩౭

---

౩౪. ప్రసంగా త్సతీకృత్యం తన్మహిమానం చాహ. పతివ్రతా ఇత్యేకోనవింశతిః.

సమర్ప్యాఽఽభరణం తత్ర శ్రీఫలం పరిగృహ్య చ,
లజ్జాం మోహం పరిత్యజ్య శ్మశానభవనం వ్రజేత్. ౩౮
తత్ర సూర్యం నమస్కృత్య పరిక్రమ్య చితాం తథా,
పుష్పశయ్యాం తదాఽఽరోహే న్నిజాంకే స్థాపయే త్పతిమ్. ౩౯
సఖిభ్య శ్శ్రీఫలం దద్యా ద్దాహ మాజ్ఞాపయే త్తతః,
గంగాస్నానఫలం జ్ఞాత్వా శరీరం పరిదాహయేత్. ౪౦

భర్తకు ప్రియము చేయునదియు పతివ్రతయు నగు స్త్రీ సహగమనము చేయ నిచ్ఛ కలది యగునెడల భర్త మృతిబొందిన వెంటనే స్నానము చేసి కుంకుమ, కాటుక, వస్త్రద్వయము, భూషణములు— వీనిచే శరీరము నలంకరించుకొని బంధువులకును బ్రాహ్మణులకును దానములు చేయవలెను. తరువాత గురువునకు నమస్కరించి గృహమునుండి బయలువెడలి దేవాలయమునకుఁబోయి శ్రీహరికి నమస్కరించి యొక యాభరణము నాదేవునకు సమర్పించి శ్రీఫలమును పరిగ్రహింపవలెను. లజ్జామోహములను విడిచి శ్మశానమునకు వెడలి సూర్యునకు నమస్కరించి చితికి ప్రదక్షిణము చేసి పుష్పశయ్య నధిష్ఠించి భర్తశిరమును తన తొడమీఁద నుండుకొని చెలికత్తెలకు శ్రీఫలము నిచ్చి దహనమున కాజ్ఞాపింపవలెను. ఇట్లు భర్త శరీరముతోఁగూడ తనశరీరమును దహించుకొనుట గంగాస్నానతుల్య మని తెలిసికొని శరీరమును దహించుకొనవలెను.

న దహే ద్గర్భిణీ నారీ శరీరం పతినా సహ,
జనయిత్వా ప్రసూతిం చ బాలం పోష్య సతీ భవేత్. ౪౧
నారీ భర్తార మాసాద్య శరీరం దహతే యది,
అగ్ని ర్దహతి గాత్రాణి నైవాత్మానం ప్రపీడయేత్. ౪౨
దహ్యతే ధ్మాయమానానాం ధాతూనాం చ యథా మలః,
తథా నారీ దహే త్పాపం హుతాశే హ్యమృతోపమే. ౪౩
దివ్యాదౌ సత్యయుక్త శ్చ శుద్ధో ధర్మయుతో నరః,
యథా న దహ్యతే తప్తలోహపిండేన కర్హిచిత్. ౪౪

౩౫-౪౨. ఆపీడన మేవ దృష్టాంతేన స్పష్టయతి. దహ్యతే ఇతి ద్వాభ్యామ్. ౪౩. దివ్యాదౌ వివాదౌ వివాదే శపథాదౌ. ౪౪. కిం చ అంతరాత్మా పరితః. మృతేన

తథా సా పతిసంయుక్తా దహ్యతే న కదాచన,
అంతరాత్మాత్మనా భర్త్రా మృతే నైకత్వ మాగతా. ౭౫
యావ చ్చాగ్నౌ మృతే పత్యౌ స్త్రీ నాత్మానం ప్రదాహయేత్,
తావ న్న ముచ్యతే సా హి స్త్రీశరీరా త్కథంచన. ౭౬

గర్భవతి సహగమనము చేయరాదు ప్రసవించి బాలుని పోషించినచో పతివ్రత యగును. స్త్రీ సహగమనము చేయుచున్నపుడు అగ్ని శరీరమును దహించుచున్నను, ఆత్మకు పీడ కలిగింపఁడు. లోహములను కరుగునపుడు ఆలోహములయందలి మాలిన్యము దహింపఁబడినటుల పతివ్రతయు తనపాపముల నగ్నియందు దహింపవలెను. వివాదము వచ్చినపుడు ప్రమాణము చేయునెడల ధర్మాత్ముఁడును సత్యసంధుఁడును అగునతఁడు తప్తలోహపిండము హస్తముతో గ్రహించినను అతని కేవిధమగు బాధయు ఎట్లు కలుగదో అటులే పతివ్రత యగు స్త్రీకి అగ్నిచే దహింపఁబడుచుండినను బాధ కలుగదు. మఱియు అవ్యయాత్మరూపుం డగు భర్తతో నైక్యము పొందిన ఆఁడుది మఱల స్త్రీదేహమును పొందదు. భర్త మృతిపొందినపుడు సహగమనము చేయని స్త్రీకి ఎన్నటికిని స్త్రీత్వము నశింపదు.

తస్మా త్సర్వప్రయత్నేన స్వపతిం సేవయే త్సదా,
కర్మణా మనసా వాచా మృతే జీవతి తద్గతా. ౭౭
మృతే భర్తరి యా నారీ సమారోహే ద్ధుతాశనమ్,
సాఽరుంధతీ సమా భూత్వా స్వర్గలోకే మహీయతే. ౭౮
తత్ర సా భర్తృపరమా స్తూయమానాఽప్సరోగణైః,
రమతే పతినా సార్ధం యావదింద్రా శ్చతుర్దశ. ౭౯

కావున గరుడుఁడా! ఆఁడుది భర్త జీవించియున్నపుడును, మరణించినపుడును మనోవాక్కాయకర్మములచే భర్తను సేవింపవలెను.

---

దేహరూపేణ తు మరణం గతేన-ఆత్మనా అవ్యయాత్మస్వరూపేణ చ భర్త్రాసహ ఏకతాం ప్రాప్తా. పున ర్నారీశరీరం న ప్రాప్నోతీ త్యర్థః. ౭౫. ఇమ మేవార్థం వ్యతిరేకముఖేన ద్రఢయతి యావ దితి. యావ త్సతీ న స్యాత్ తావత్ స్త్రీత్వా న్న ముచ్యతే కింతు సతీ ఏవ ముచ్యత ఇత్యర్థః. ౭౬. భర్తరి మృతే జీవతి చ సతి తద్గతా తదనుగతా భవేత్. ౭౭. మహీయతే పూజ్యా భవతి. ౭౮. భర్తృపరమా భర్తురపి శోభన

సహగమనము గావించిన యాఁడుది అరుంధతితో సమానురాలై, స్వర్గమున అప్సరసలచే స్తుతియింపఁబడుచు పదునలుగురు ఇంద్రులును స్వర్గమును పాలించినంతకాలమును భర్తతో స్వర్గమున సుఖించును.

మాతృకం పైతృకం చైవ యత్ర సా చ ప్రదీయతే,
కులత్రయం పునా త్యత్ర భర్తారం యాఽనుగచ్ఛతి. ౫౦
తిస్రః కోట్యోఽర్ధకోటీ చ యాని రోమాణి మానుషే,
తావత్కాలం వసే త్స్వర్గే పతినా సహ మోదతే. ౫౧
విమానే సూర్యసంకాశే క్రీడతే రమణేన సా,
యావ దాదిత్యచంద్రౌ చ భర్తృలోకే చిరం వసేత్. ౫౨
పున శ్చిరాయు స్సా భూత్వా జాయతే విమలే కులే,
పతివ్రతా తు యా నారీ తమేవ లభతే పతిమ్. ౫౩

భర్తతో సహగమనము గావించిన పతివ్రత పితృవంశమును, మాతృవంశమును, భర్తృవంశమును పవిత్రము చేయును. మానవశరీరమున మూఁడుకోట్ల ఏఁబదిలక్షల రోమములు కలవు. పతివ్రతయై సహగమనము గావించిన స్త్రీ అన్ని సంవత్సరములు భర్తతో స్వర్గలోకమున సుఖించును. మఱియు సూర్యునితో సమముగ ప్రకాశించు విమానమున భర్తతో సుఖించుచు రవిచంద్రు లుండునంతకాలము భర్తృలోకమున నుండును. పిదప దీర్ఘాయుర్దాయము కలదై నిర్మలమగు వంశమున పొడమి పూర్వపుపతినే పడయును.

టీకా. ౪౯. అత్ర తస్మి న్లోకే. ౫౦. తిస్రః కోట్య ఇతి అగణితాని 'యావత్య స్సికతా భూమే స్తావతీ రదదంష్ట్ర గా' ఇతివత్. ౫౧. రమణేన సహైకత్వం గతాపి తేన క్రీడతే ఇత్యత్ర 'అద్వైతే చ స్మితం స్ఫీతం న స్యా దన్యోఽన్య మీక్షణ' మితి వచనా దద్వైతానందా దపి స్నేహానందే అధికసుఖానుభావా త్పృథగ్భూత్వా రమతే. ఇతి భావః. భర్తృలోకే స్వర్గే. ౫౨. కించ ముక్తాపి లీలావిగ్రహం కృత్వా భజతే. అత్ర భజనానంద స్యాధిక్యమ్.తథా త్రాఽపి స్నేహానంద స్యాధికత్వా ద్రమణాయ స్వేచ్ఛయైవ విమలే కులేజాయతే. న తు కర్మణా ఇతి. అన్యథా సతీ ఏవ స్త్రీశరీరా న్ముచ్యతే నాన్య ఇతిపూర్వోక్తవచనవిరోధ స్స్యాత్ తం స్వపతి శ్చేవ లభతే. తదుక్తం మాఘే-'సతీవ యోషి త్ప్రకృతి స్సు నిశ్చలా పుమాంస మభ్యేతి

యాంక్షణం దాహదుఃఖేన సుఖ మేతాదృశం త్యజేత్,
సా మూఢా జన్మపర్యంతం దహ్యతే విరహాగ్నినా. ౫౪
తస్మా త్పతిం శివం జ్ఞాత్వా సహ తేన దహే త్తనుమ్,
యది న స్యా త్సతీ తార్క్ష్య తమేవం ప్రదహే త్తదా. ౫౫

సహగమనమునందలి క్షణిక మగు దుఃఖమునకు భయపడి ఇట్టి శాశ్వతసుఖమును విడచాడు మూఢురాలు బ్రతికియున్నంతకాలము విరహాగ్ని వలన దహింపఁబడుచుండును; కావున భర్త శివుఁడే యని భావించి అతని శవముతోఁగూడ తనశరీరమును దహించుకోవలెను. భార్య పతివ్రతయు, సహగమనశీలయు కానిచో పురుషుని ఒక్కనినే ఈక్రిందివిధమున దహనము చేయవలెను.

అర్ధే దగ్ధేఽథవా పూర్ణే స్ఫోటయే త్తస్య మస్తకమ్,
గృహస్థానాం తు కాష్ఠేన యతీనాం శ్రీఫలేన చ. ౫౬
ప్రాప్తయే పితృలోకానాం భిత్త్వా త ద్బ్రహ్మరంధ్రకమ్,
ఆజ్యాహుతిం తతో దద్యా న్మంత్రేణానేన తత్సుతః. ౫౭
అస్మా త్త్వ మధిజాతోఽసి త్వ దయం జాయతాం పునః,
అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా జ్వలతు పావకః. ౫౮
ఏవ మాజ్యాహుతిం దత్త్వా తిలమిశ్రాం సమంత్రకామ్,

---

భవాంతరే ప్యపి 'ఇతి. ౫౩. అనుతప్యామహ. యా ఇతి. ౫౪. ప్రాసంగికం పంచకసతీకృత్యం పరిసమాప్య ప్రస్తుతదాహ మే వానుసరతి. యదీతి. తం నరం ఏవం వక్ష్యమాణప్రకారేణ. ౫౫. స్ఫోటయేత్. అత్రాయ మభిప్రాయః. హఠయోగిన స్తు స్వేచ్ఛయా బ్రహ్మరంధ్రం భిత్త్వా బ్రహ్మలోకం యాంతి. కర్మయోగినాం తు పరతో వేదనేన పితృదేవలోకప్రాప్తి ర్భవతి. సన్న్యాసినాం తు పూర్వం భిత్త్వా పశ్చా ద్గంగాయాం తదలాభే భూమౌ వా నిక్షిపే దితి. ౫౬, ౫౭. మంత్ర మేవాహ అస్మాత్ అకారాత్ 'అకారో వాసుదేవ స్స్యా' దితి మంత్రకోశః. 'అక్షరాణా మకారోఽస్మీ' తి భగవద్వచనా చ్చ హే పావక త్వం శ్రీవాసుదేవా జ్జాతోఽసి 'వాచాం వహ్ని ర్ముఖం క్షేత్ర' మితి స్మృత్యుక్తేః. కించ త్వత్ త్వత్తః సకాశా దయం జనః స్వర్గాయ లోకాయ స్వర్గలోకం ప్రతి గంతు పున ర్జాయతాం తేజోమయదివ్యశరీరే ణోత్పన్నో భవేత్. కించ అసౌ అస్య స్థూలదేహః స్వాహా త్వయి హవి రస్తు కించిజ్జ్వాలాయా మేవ హవి ర్ధూయతే. అత స్త్వం జ్వల ప్రజ్వలితో భవేతి మంత్రార్థః. ౫౮. ఏవ మితి. అర్ధదగ్ధే తు మస్తకం స్ఫోటయేత్. పూర్ణదగ్ధే సతి ఆజ్యాహు

రోదితవ్యం తతో గాఢం తేన తస్య సుఖం భవేత్. ౫౯

శరీరము సగము కాలినపుడుగాని అంతయు కాలినపుడు గాని శవశిరస్సును బ్రద్దలుకొట్టవలెను. గృహస్థుని శిరస్సును కఱ్ఱతోను, యతిశిరస్సును శ్రీఫలముతోను బ్రద్దలుకొట్టవలెను. పిదప బ్రహ్మ రంధ్రమును భేదించి పితృలోకము దొరకుటనిమిత్తము "అస్మాత్త్వమధిజాతోసి త్వ దయం జాయతాం పునః, అసౌ స్వర్గాయ లోకాయ స్వాహా జ్వలతు పావకః" అను మంత్రముతో సుతుఁడు తిలమిశ్రమగు ఆజ్యాహుతి గావించి గట్టిగా ఏడ్వవలెను. అట్లు చేసినచో మృతిఁబొందిన వానికి సుఖము గలుగును.

దాహా దనంతరం కార్యం స్త్రీభి స్స్నానం తత స్సుతైః,
తిలోదకం తతో దద్యా న్నామగోత్రోపకల్పితమ్. ౬౦
ప్రాశయే న్నింబపత్రాణి మృతకస్యగుణా న్వదేత్,
స్త్రీజనోఽగ్రే గృహం గచ్ఛే త్పృష్ఠతో నరసంచయః. ౬౧
గృహే స్నానం తతః కృత్వా గోగ్రాసం చ ప్రదాపయేత్,
పత్త్రావళ్యాం చ భుంజీయా ద్గృహాన్నం వై న భక్షయేత్. ౬౨
మృతకస్థాన మాలిప్య దక్షిణాభిముఖం తతః,
ద్వాదశాహాకపర్యంతం దీపం కుర్యా దహర్నిశమ్. ౬౩
సూర్యేఽస్తమాగతే తార్క్ష్య! శ్మశానే వా చతుష్పథే,
దుగ్ధం చ మృణ్మయే పాత్రే తోయం దద్యా ద్దినత్రయమ్. ౬౪
అపక్వం మృణ్మయం పాత్రం క్షీరనీరప్రపూరితమ్,
కాష్ఠత్రయే గుణై ర్బద్ధే ధృత్వా మంత్రం పఠే దిమమ్. ౬౫
శ్మశానానలదగ్ధోఽసి పరిత్యక్తోఽసి బాంధవైః,

తిం దద్యా చ్చేతి. తేన రోదనేన. గూర్జరాణాం కులస్య వ్యవహారపర మేతత్. ౫౯. పూర్వం స్త్రీభిః-తత స్త్రీభ్యః పశ్చా త్సుతాదిభి రితి నామగోత్రాభ్యాం ఉపకల్పితమ్. సంకల్పితం అముకగోత్రా యాముకప్రేతా యేదం తిలోదకం మద్దత్తం త వోపతిష్ఠతా మితి. ౬౦. ప్రాశయేత్. చర్వయేత్. శోకదినే మిష్టభోజనపరిహారాయ పూర్వం కటుముఖం కుర్యాది త్యభిప్రాయః గుణాః కీర్తికరాః "యావ త్కీర్తి ర్మనుష్యస్య పుణ్యాలోకేషు గీయతే, తావత్కాలం వసే త్స్వర్గే పూజ్యమాన స్సురాసురై" రిత్యభిప్రాయః. ౬౧-౬౫. ఇదం నీరం-అత్ర స్నాహి. అత్ర అస్మిన్ పాత్రే మితం స్వల్పం

ఇదం నీర మిదం క్షీర మత్ర స్నాహి మిదం పిబ. ౧౬

దహన మైనతోడనే ముందుగా స్త్రీలును, తరువాత పురుషులును స్నానముచేసి మృతిబొందినవాని నామగోత్రముల నుచ్చరించి తిలోదకము నీయవలెను. తరువాత వేపాకులను భక్షించి మృతుని గుణగణముల నుగ్గడింపవలెను. తరువాత స్త్రీలు ముందుగను వారి వెనుక పురుషులును ఇంటికి జని మరల స్నానము చేసి గోవులకు గ్రాసము పెట్టి కుట్టిన విస్తరాకులలో భుజింపవలెను. గృహాన్నమును భుజింపఁగూడదు. తరువాత దక్షిణాభిముఖముగా మృతిస్థానమున అలికి పండ్రెండుదినములు అచ్చటరాత్రింబగళ్లు దీపమునుంచవలెను. సూర్యుఁడస్తమించినతరువాత శ్మశానమునఁగాని చతుష్పథమునఁగాని పాలును, నీళ్లును మూఁడుదినము లుంచవలెను. పిదప కాల్పఁబడని మట్టిమూకుటిలో పాలును నీళ్లును బోసి త్రాళ్లతో కట్టఁబడిన మూఁడుకఱ్ఱలతో గ్రహించి "శ్మశానానలదగ్ధోఽసి పరిత్యక్తోఽసి బాంధవైః, ఇదం నీర మిదం క్షీర మత్ర స్నాహి మిదం పిబ" అని చెప్పి దానిని శ్మశానమున నుంచవలెను.

చతుర్థే సంచయః కార్య స్సాగ్నికై శ్చ నిరగ్నికైః,
తృతీయేఽహ్ని ద్వితీయే వా కర్తవ్య శ్చావిరోధతః. ౧౭
గత్వా శ్మశానభూమిం చ స్నానం కృత్వా శుచి ర్భవేత్,
ఊర్ణసూత్రం వేష్టయిత్వా పవిత్రం పరిధాయ చ. ౧౮
దద్యా చ్ఛ్మశానవాసిభ్య స్తతో మాషబలిం సుతః,
యమాయ త్వేతి మంత్రేణ తిస్రః కుర్యా త్పరిక్రమాః. ౧౯
తతో దుగ్ధేన చాభ్యుక్ష్య చితాస్థానం ఖగేశ్వర,
జలేన సమయే పశ్చా దుద్ధరే దస్థిబృందకమ్. ౨౦
కృత్వా పలాశపాత్రేషు క్షాళయే ద్దుగ్ధవారిభిః,
సంస్థాప్య మృణ్మయే పాత్రే శ్రాద్ధం కుర్యా ద్యథావిధిః. ౨౧

ఇదం క్షీరంచ పిబ. ౧౬. చతుర్థే దినే తదుక్తం విష్ణుపురాణే. "చతుర్థేఽహ్నిచ కర్తవ్యం భస్మాస్థిచయనం నృప!" ఇతి. అవిరోధతః చతుర్థదినే పంచకశనివారాదియోగాత్. ౧౭. సంచయవిధాన మేవాహ-గత్వే త్యాద్యేకాదశభిః. ౧౮. పరిక్రమాః వామావర్తేన కుర్యాత్. ౧౯. అభ్యుక్ష్య పూర్వం తు కించి ద్దుగ్ధేన సంప్రోక్ష్య ఉద్ధరేత్ చితాస్థానా న్నిష్కాసయేత్. ౨౦. ౨౧. ఉపలేఽపి తక్షణ మేవ స్థండిలం

త్రికోణం స్థండిలం కృత్వా గోమయే నోపలేపితమ్,
దక్షిణాభిముఖోదిక్షు దద్యా త్పిండత్రయం త్రిషు. ౨౨
పుంజీకృత్య చితాభస్మ తత్ర ధృత్వా త్రిపాదుకామ్,
స్థాపయే త్తత్ర సజల మనాచ్ఛాద్యముఖం ఘటమ్. ౨౩
తత స్తండులపాకేన దధిఘృతసమన్వితమ్,
బలిం ప్రేతాయ సజలం దద్యా న్నిష్టం యథావిధి. ౨౪
పదాని దశ పంచైవ చోత్తరస్యాం దిశి వ్రజేత్,
గర్తం విధాయ తత్రాస్థి పాత్ర సంస్థాపయే త్ఖగ. ౨౫
తస్యోపరి తతో దద్యా త్పిండం దాహార్తినాశనమ్,
గర్తా దుద్ధృత్య తత్పాత్రం నీత్వా గచ్ఛే జ్జలాశయమ్. ౨౬
తత్ర ప్రక్షాళయే ద్దుగ్ధజలా దస్థి పునః పునః,
చర్చయే చ్చందనేనాథ కుంకుమేన విశేషతః. ౨౭
ధృత్వా సంపుటకే తాని కృత్వా చ హృదిమస్తకే,
పరిక్రమ్య నమస్కృత్య గంగామధ్యే వినిక్షిపేత్. ౨౮

చనిపోయినయాతఁడు ఆహితాగ్నియైనను, అనాహితాగ్నియైనను ద్వితీయదినమునఁగాని, తృతీయదినమునఁగాని, చతుర్థదినమునఁగాని ధనిష్ఠాపంచకాదులను విచారించి అస్థిసంచయనము చేయవలెను. అదెట్లనఁగ శ్మశానమునకుఁ బోయి, స్నానముచేసి, ఉన్నిత్రాటిని చుట్టి పవిత్రమునుధరించి శ్మశానమునందు భూతములను ''యమాయత్వా'' అను మంత్రముతో మాషబలి నిడి ముమ్మారు ప్రదక్షిణము చేయవలెను. అనంతరము క్షితిని పాలతో ప్రోక్షించి పిదప నీళ్లతోఁగూడ తడపి అస్థులను దీసి మోదుగాకులయం దుంచి, పాలతోడను, నీళ్లతోడను కడిగి, మృణ్మయపాత్రమున నుంచి, యథావిధిగా శ్రాద్ధము చేయవలెను. గోమయముతో నలికి త్రికోణాకృతిగా మండలము గావించి దక్షిణాభిముఖుఁడై దక్షిణపశ్చిమోత్తరదిశలను మూఁడుపిండముల నుంచవలెను. పిమ్మట చితి భస్మమును ప్రోవుచేసి సజలమును, మూతలేనిదియు నగు కుండయం దుంచవలెను. తరువాత పెరుగు,

భవతి. తత్ త్రికోణం కృత్వా తత్ర త్రిషు దక్షిణపశ్చిమోత్తరాసు దిక్షు. ౩౨-౩౫.
గర్తపిండా ద్దాహస్యార్తి ర్నశ్యతి. మలినషోడశ స్యాంగభూతో భవతి. ౩౬-౪౦.

నేయి వీనితోఁగూడిన యథావిధిగా ప్రేతకు బలియీయవలెను. పదపడి ఉత్తరముగా పదునైదు పదములు నడిచి అచ్చట గోతిని త్రవ్వి దానియం దస్థిపాత్రము నుంచి, దానిమీఁద దాహార్తినాశనం బగు పిండప్రదానము చేయవలెను. తరువాత గోతిలోనుండి ఆయస్థిపాత్రమును దీసి జలాశయమునకుఁ బోయి నీళ్లతోడను, పాలతోడను మరల మరల కడిగి కుంకుమచందనాదులతో విశేషముగా పూజచేయవలెను. కడకు వానిని ఒక సంపుటమున నుంచి, హృదయకుమీఁదను, శిరస్సుమీఁదను ఉంచికొని ప్రదక్షిణనమస్కారాదులు చేసి గంగామధ్యమున విడువవలెను.

అంతర్దశాహం యస్యాస్థి గంగాతోయే నిమజ్జతి,
న తస్య పునరావృత్తి ర్బ్రహ్మలోకాత్కదాచన. ౭౯
యావ దస్థి మనుష్యస్య గంగాతోయేషు తిష్ఠతి,
తావ ద్వర్షసహస్రాణి స్వర్గలోకే మహీయతే. ౮౦
గంగాజలోర్మి సంస్పృశ్య మృతకం పవనో యథా,
స్పృశతే పాతకం తస్య సద్యఏవ వినశ్యతి. ౮౧

ఎవ్వని అస్థులు దశాహమధ్యమున గంగాజలమున విడువఁబడునో, వానికి బ్రహ్మలోకమునుండి మరెన్నఁడును పునరావృత్తి కలుగదు. మనుష్యుని అస్థులు గంగయందు ఎంతకాలము ఉండునో అన్నివేలయేండ్లు అతఁడు స్వర్గమున సుఖించును గంగాతరంగములమీఁద నుండి వచ్చిన గాలి మరణించిన వానిమీఁద వీచినచో వాని పాపములన్నియు తొలఁగిపోవును.

ఆరాధ్య తపసోగ్రేణ గంగాదేవీం భగీరథః,
ఉద్ధారార్థం పూర్వజానా మానయ ద్బ్రహ్మలోకతః. ౮౨
త్రిషు లోకేషు విఖ్యాతం గంగాయాః పావనం యశః,

---

గంగాయాం అస్థిపతనస్య మహిమాన మాహ-అంతరితి త్ర్యమ్బకః. ౭౯. దశదినమధ్య ఏవ మహీయతే పూజ్యో భవతి. ౮౦. తస్యా మస్థిపతనప్రభావంతు కిం వర్ణ్యతే. తజ్జలస్పృతసంగపవనస్పర్శా దపి కృతార్థో భవతీ త్యాహ. గంగేతి.౮౧.గంగాయాః పావన కారణతా మాహ-ఆరాధ్యేతి. ౮౨. యశఏ వాహ. యేతి. ఏతాః షష్టిసహస్రాః

యాపుత్రా స్సగర స్యైతా న్భస్మాఖ్యా ననయ ద్దివమ్. ౪౩
పూర్వే వయసి పాపాని యే కృత్వా మానవా మృతాః,
గంగాయా మస్థిపతనా త్స్వర్గలోకే ప్రయాంతి తే. ౪౪
కశ్చిద్వ్యాధో మహారణ్యే సర్వప్రాణివిహింసకః,
సింహేన నిహతో యావ న్నిరయాతి నరకాలయే. ౪౫
తావ త్కాలేన తస్యాస్థి గంగాయాం పాతితం తదా,
దివ్యం విమాన మారుహ్య స గతో దేవమందిరమ్. ౪౬
అత స్స్వమేవ సత్పుత్రో గంగాయా మస్థి పాతయేత్,
అస్థిసంచయనా దూర్ధ్వం దశరాత్రం సమాచరేత్. ౪౭

తొల్లి భగీరథుఁడు తన పూర్వుల నుద్ధరించుటకై గొప్ప తపము గావించి బ్రహ్మలోకమునుండి గంగను భూలోకమునకు తీసికొనివచ్చెను. భస్మావశిష్టులును, షష్టిసహస్రసంఖ్యాకులును అగు సగరచక్రవర్తికుమారులను స్వర్గమును పొందించుటవలన గంగకు మూఁడులోకములయందును కీర్తి గలదు. పడుచుతినమున సకలపాపములను గావించి మృతి బొందినవారి అస్థులను గంగయందు ఉంచినచో వారిపాపము లన్నియు పోవును. ఇందుల కొక ఇతిహాసము గలదు. అదేమన? ఒక యరణ్యమున నొక కిరాతుఁడు ఉండెను. సకలప్రాణులను సర్వకాలసర్వావస్థలయందును హింసించుటయే వాని వ్రతము. ఇట్లు కొన్ని దినములకు ఒక సింహమువలన చంపఁబడి నరకమునకుఁ బోవుచుండెను. ఇంతలో ఎట్లో వాని యెముకలు గంగలో పడుట తటస్థించెను. వెంటనే వాఁడు దివ్యవిమాన మొకటి రాఁగా దాని నెక్కి స్వర్గమునకుఁ బోయెను. కావున సత్పుత్రుఁ డగు నాతఁడు తలిదండ్రుల యస్థులను స్వయముగ గంగలో విడువవలెను. అస్థిసంచయనానంతరము దశరాత్రవిధి నాచరింపవలెను.

---

భస్మాఖ్యా నపిభస్మ ఏవ ఆఖ్యా నామాని యేషాం. భస్మావశేషాని త్యర్థః. ౪౩. పతనా త్పతనమాత్రా దేవ. ౪౪. అత్ర ఇతిహాసం కథయతి. కశ్చి దితి ద్వాభ్యామ్. ౪౫. అయం భావః, అజామిళో యథా అవిదితహరినామమహిమాపి సుతగతహరినామోచ్చారణా న్ముక్తః తథై వాయ మపి తచ్చరణోదకా దితి. ౪౬. అతః గంగైవ ముక్తిప్రదేతి హేతోః. ౪౭. అథశబ్దో విధానాంతరే. అత్ర పునర్దాహికం సింహావలోకనే

అథ కశ్చి ద్విదేశే వా వనే చోరభయే మృతః,
న లబ్ధ స్తస్య దేహ శ్చే చ్ఛృణుయా ద్యద్దినే తదా. ౮౮
దర్భపుత్తలకం కృత్వా పూర్వవ త్కేవలం దహేత్,
తస్య భస్మ సమాదాయ గంగాతోయే వినిక్షిపేత్. ౮౯
దశరాత్రాదికం కర్మ తద్దినా దేవ కారయేత్,
స ఏవ దివసో గ్రాహ్య శ్శ్రాద్ధే సాంవత్సరాదికే. ౯౦

ఒకానొకఁడు విదేశమునఁగాని చోరభయాకులమగు అరణ్యమునఁగాని చనిపోవును. వాని కళేబరము దొరకదు. అట్టిచో వాఁడు చనిపోయె నని యెప్పుడు తెలియునో అప్పుడు దర్భలతో వాని ప్రతికృతిని గావించి దహనము గావించి ఆభస్మమును గంగయందు ఉంచవలెను. అంతమాత్రముననే వానికి సద్గతి కలుగును. వినినరోజు మొదలు కర్మ చేయవలెను. ఏదినమున వినునో యాదినముననే ప్రతిసంవత్సరము అబ్దికాదులను బెట్టవలెను.

పూర్ణే గర్భే మృతా నారీ విదార్య జఠరం తదా,
బాలం నిష్కాస్య నిక్షిప్య భూమౌ తా మేవ దాహయేత్. ౯౧
గంగాతీరే మృతం బాలం గంగాయా మేవ పాతయేత్,
అన్యదేశే క్షిపే ద్భూమౌ సప్తవింశతిమాసజమ్. ౯౨
అతఃపరం దహే త్తస్య గంగాయా మస్థి నిక్షిపేత్,

---

నాహ. యత్ యస్మిన్ దినే శృణుయాత్ తదా తస్మిన్నేవ దినే. ౮౮. పూర్వవత్ పూర్వోక్తవిధానేన పుత్తలం కేవల మేవ దహేత్. న తు కాష్ఠైః. సమాదాయ సమ్యగస్థిసంచయనవిధానే నాదాయ. క్వచిత్ 'పిష్టపుత్తలకం కృ' త్వేతిపాఠః. తత్రాయం విధిః. యవపిష్టస్య సాంగం హస్తమాత్రం పుత్తలం విధాయ తన్నాభౌ ప్రజ్వలితం దీపం నిధాయ ప్రాణప్రతిష్ఠాం కుర్యాత్. యథా అముకగోత్రస్య ప్రాణ ఇహ ప్రాణాః హంసః జీవ ఇహ స్థితో జీవః సర్వేంద్రియాణి వాఙ్మనస్త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణపాణిపాదపాయూపస్థాని ఇహాగత్య సుఖం తిష్ఠంతు స్వాహేతి లేలిహానముద్రయా తద్ధృదయే విన్యసేత్. తతో యావద్దీపః ప్రజ్వలతి తావత్పూర్వవత్ విష్ణుస్మరణం కుర్యాత్. అతు రదానం చదద్యాత్. తతో దీపనిర్వాణే సతితం కాష్ఠైః పూర్వవద్దహేదితి. ౮౯-౯౧. ప్రసంగాద్బాలాదీనాం కృత్యమాహ. గంగేతి. ౯౨. అతఃపరం సప్తవింశతిమాసా

జలకుంభ శ్చ దాతవ్యో బాలానా మేవ భోజనమ్. ౯౩

గర్భవతి మరణించినచో ఆగర్భము పూర్ణ మయిన దగునెడల దానిని చీల్చి శిశువు నీవలకుఁ దీసి భూమిలో పాతిపెట్టి ఆస్త్రీ నొక్కతెనే దహింపవలెను. మఱియు గంగాతీరముల మరణించిన శిశువులను గంగయందు పాతిపెట్టవలెను. రెండు సంవత్సరములు దాఁటిన పిదప శిశువులు మరణించినచో వారిని దహనము గావించి వారి యెముకలను గంగయందు విడువవలెను. ఉదకుంభదానముగూడ గావించి బాలురకు భోజనము పెట్టవలెను.

గర్భే నష్టే క్రియా నాస్తి దుగ్ధం దేయం మృతే శిశౌ,
ఘటం చ పాయసం భోజ్యం దద్యా ద్బాలవిపత్తిషు. ౯౪
కుమారే చ మృతే బాలా న్కుమారా నేవ భోజయేత్,
స బాలా న్భోజయే ద్విప్రా న్పౌగండే సవ్రతే మృతే. ౯౫
మృతశ్చ పంచమా దూర్ధ్వ మవ్రత స్సవ్రతోఽపి వా,
పాయసేన గుడే నాపి పిండా న్దద్యా ద్దశ క్రమాత్. ౯౬
ఏకాదశం ద్వాదశం చ వృషోత్సర్గవిధిం వినా,
మహాదానవిహీనం చ పౌగండే కృత్య మాచరేత్. ౯౭
జీవమానే చ పితరి న పౌగండే సపిండనమ్,
అత స్తస్య ద్వాదశాహ న్యేకోద్దిష్టం సమాచరేత్. ౯౮

శిశువు గర్భమున మృతిబొందినచో ఏమియు కర్మ చేయనక్కఱ లేదు. జన్మించిన తరువాత మరణించినచో పాలు ఈయవలెను.

త్వరమ్. ౯౩. గర్భఏవ నష్టే మృతే సతి క్రియా దుగ్ధదానాదికం నాస్తి. తస్య కించి దపి న దాతవ్య మిత్యర్థః 'శిశు రాదంతజననా' దితి స్మృతేః. దంతోత్పత్తిపర్యంతం శిశు రితి సంజ్ఞా. 'బాల స్స్యా ద్వాదశాశిఖమ్' ఆశిఖం చూడాకర్మ-తృతీ యవర్ష పర్యంతం బాల ఇతి సంజ్ఞా. విపత్తిషు మరణేషు ఘటాదికం దేయం 'బాలే వా తరుణే వృద్ధే ఘటో భవతి చాక్షయ' ఇతి వచనాత్. ౯౪. 'ఆపంచవర్షా త్కౌమారః పౌగండో దశహాయనః' అవ్రతే బాలాన్, సవ్రతే విప్రాన్. ౯౫. పంచమా ద్వర్షా దూర్ధ్వం పౌగండావస్థాయాం. అవ్రతః ఉపవీతసంస్కారరహితః. సవ్రత స్సోపవీతః. ౯౬. మహాదానం శయ్యాదికమ్. ౯౭. ఏకస్య తస్య ఉద్దేశేన కృతం ఏకోద్దిష్టమ్. ౯౮. వ్రత

లుఁడు అనఁగా దంతములు వచ్చినది మొదలు చౌలము అగులోపల మరణించినచో ఉదకుంభదానము చేసి పాయసము భోజనము పెట్టవలెను మూఁడుసంవత్సరములు దాఁటిన పిమ్మటను అయిదుసంవత్సరముల లోపునను మరణించినవారికి వారితో సమానులగు వారికి భోజనము పెట్టవలెను. ఉపనయనమునకు పూర్వము మరణించిన యెడల ఉపనయనము కానివారికిని, ఉపనయనమైన తరువాత మరణించినయెడల ఉపనయనమైనవారికిని భోజనము పెట్టవలెను. పౌగండుఁడు ఉపనయనమైనను కాకున్నను మృతిఁబొందినయెడల పాయసముతోగాని బెల్లముతో గాని పదిదినములు పిండప్రదానము చేయవలెను. పదునొక్క పండ్రెండవదినములయందు వృషోత్సర్గమును, మహాదానములను విడిచి తతిమ్మాకర్మ యంతయు గావింపవలెను. తండ్రి జీవించియుండఁగా పౌగండుఁడు మరణించినయెడల సపిండీకరణము చేయఁగూడదు, పండ్రెండవ దినమున ఏకోద్దిష్టము నాచరింపవలెను.

స్త్రీశూద్రాణాం వివాహ స్తు వ్రతస్థానే ప్రకీర్తితః,
వ్రతాత్ప్రాక్సర్వవర్ణానాం వయస్తుల్యా క్రియా భవేత్. ౯౯
స్వల్పా త్కర్మప్రసంగాచ్చ స్వల్పా ద్విషయబంధనాత్,
స్వల్పే వయసి దేహే చ క్రియాం స్వల్పా మపీచ్ఛతి. ౧౦౦
కిశోరే తరుణే కుర్యా చ్ఛయ్యా వృషముఖాదికమ్,
పదదానం మహాదానం గోదాన మపి దాపయేత్. ౧౦౧

స్త్రీశూద్రులకు ఉపనయనమునకు బదులు వివాహము చెప్పఁబడినది. సమస్తవర్ణములవారికిని ఉపనయనాత్పూర్వము వయస్సు ననుసరించి కర్మము చేయవలెను. చిన్న వయస్సునను, చిన్న దేహమునను స్వల్పకర్మ చేయవలెను కిశోరుఁడు (పదునాఱేండ్ల వయసుగలవాఁడు) మరణించినచో శయ్యాదానము, వృషోత్సర్జనము; మహాదానములు మొదలగు కర్మలను యథావిధిగా చేయవలెను.

---

స్థానే - వ్రతబంధస్థానే ఉపవీతసంస్కారస్యానధికారాత్. ౯౯. దేహేచాపి స్వల్పేసతి క్రియామపి స్వల్పాం కుర్యాత్. ౧౦౦. 'కిశోరతరుణావస్థాయాం తు మృతే సతి సర్వమేవ కృత్యం కరణీయమిత్యాహ. కిశోర ఇతి. కిశోరః షోడశసమస్తతో యావన మాదిశేత్',౧౦౧.సన్న్యాసినాంతు దాహాదికంకిమపికృత్యం న కరణీయమిత్యాహ.

యతీనాం చైవ సర్వేషాం న దాహో నోదకక్రియా,
దశరాత్రాదికం తేషాం న కర్తవ్యం సుతాదిభిః. ౧౦౨
దండగ్రహణమాత్రేణ నరో నారాయణో భవేత్,
త్రిదండగ్రహణా త్తేషాం ప్రేతత్వం నైవ జాయతే. ౧౦౩
జ్ఞానిన స్తు సదా ముక్తా స్స్వరూపానుభవేన హి,
అత స్తేతు ప్రదత్తానాం పిండానాం నైవ కాంక్షిణః ౧౦౪
తస్మా త్పిండాదికం తేషాం న తు నోదక మాచరేత్,
తీర్థశ్రాద్ధం గయాశ్రాద్ధం పితృభక్త్యా సమాచరేత్. ౧౦౫

---

యతీనా మితి సర్వేషాం హంసాదిచతుర్విధానాం తేషాం స్వపితౄణా మపి గృహస్థై రపి సుతాదిభి ర్దాహాదికం న కర్తవ్యం 'కుటీచకం తు ప్రదహే' దితి ప్రాచీనై ర్యదుక్తం త దయుక్త మిత్యాక్షిపన్నాహ న దాహ ఇతి. యైః ప్రైషమంత్రోచ్చారణపూర్వకం సంన్యస్తం తేషాం దాహాదికం సర్వశాస్త్రే ష్వవిహిత మేవ. ౧౦౨. నను దశరాత్రం వినా ప్రేతత్వం స్యా దితి చే న్నైవం దండగ్రహణమాత్రే ణేతి. జ్ఞానశూన్యానా మపి సన్న్యాసినాం ప్రేతత్వం నై వేతి. ౧౦౩. కించ జ్ఞానయుక్తేన సన్న్యాసేన తు జీవన్ముక్తవిదేహత్వ మేవ భవతీ త్యాహ-జ్ఞానిన ఇతి. ౧౦౪. అవశ్యకర్తవ్యతయా తు నాచరేత్. ౧౦౫. సన్న్యాసినాం కృత్య మాహ. సన్న్యాస స్తు స్వమిత్రపుత్రకళత్రబంధ్వాదిశిఖాయజ్ఞోపవీతస్వాధ్యాయగాయత్రీ జపాద్యశేషకర్మాణి సన్న్యస్య దండ మాచ్ఛాదనం కౌపీనం ప్రైషమంత్రోచ్చారణపూర్వకం పరిగ్రహే దితి. సన్న్యాసో యస్యా స్తీతి సన్న్యాసీ. అస్యావస్థాభేదేన చాతుర్విధ్యం దర్శయతి. హంస మితి. హంస స్తు యథా జాత స్తథా రూపధరో నిర్ద్వంద్వో నిష్పరిగ్రహో బ్రహ్మమార్గే సమ్య క్సంపన్న శ్శుద్ధమానసః ప్రాణసంధారణార్థం పరేచ్ఛయా భైక్ష్య మాచర న్నుదరమాత్రేణ లాభాలాభసమశ్శుక్లధ్యానపరోఽధ్యాత్మనిష్ఠ శ్చతుర్థభూమికారూఢ శ్శుభాశుభకర్మనిర్మూలనపరః, శూన్యాగారే దేవతాగారే తృణకూట వల్మీక వృక్షమూల కులాలశాలాఽగ్నిహోత్ర నదీపులిన గిరికుహర కందరకోటర నిర్ఝర స్థండిలే ష్వనికేతవాసప్రయత్నో నిర్మమస్స న్నివసతీతి హంసో నా మేతి. ౧. పరమహంస స్తు న దండం కౌపీనం న చాచ్ఛాదన మాచరతి. విధినిషేధాతీతో య ద్బ్రహ్మ వేదాంతేషు పూర్ణానందైకబోధః పరమాత్మేతి నిరూపితం తద్బ్రహ్మాఽహమస్మీ త్యేవం చతుర్థాదిభూమికాసు సర్వథా భవ న్నేవ సప్తభూమికారూఢః ధ్యాతృధ్యేయవిభాగరహితో బ్రహ్మానందవిలీనవృత్తిత్వా చ్ఛరీర మపి నాను

హంసం పరమహంసం చ కుటీచకబహూదకౌ,
ఏతాం త్సన్న్యాసినాం తార్క్ష్య! పృథివ్యాం స్థాపయేన్మృతాన్.౧౦౬

సంధత్తే. ఏతదేవోక్తం శ్రీభాగవతే "దేహం వినశ్వర మవస్థిత ముత్థితం వా సిద్ధో న పశ్యతి యతోఽధ్యగమ త్స్వరూపం, దైవా దపేత-మథ దైవవశా దుపేతం వాసో యథా పరికృతం మదిరామదాంధః" ఇత్యయం యోగీ శీతోష్ణసుఖదుఃఖమానావమాన షడూర్మ్యాదిభి ర్వివర్జితో భవతి. నిరుద్ధాశేష చిత్తవృత్తే ర్యోగినః శీతాదికం నాస్తి తత్ప్రత్యయాభావాత్. యథా లీలామాయాసక్తస్య బాలకస్యాఽచ్ఛాదనాదిరహితస్యాపి హేమంతశిశిరయోః ప్రాతఃకాలే శీతం నాస్తి తథా పరమాత్మన్యాసక్తస్య యోగిన శ్శీతాద్యభావః. అతః కృతకృత్యో భవతి, ఇతి చ స్మర్యతే, "జ్ఞానామృతేన తృప్తస్య కృతకృత్యస్య యోగినః. నైవాస్తి కించి త్కర్తవ్య మస్తి చే న్న స తత్త్వవిత్" ఇతి పరమహంసః. ౨. అథ కుటీచకబహూదకావిరక్తిభేదేన యథా, అత్ర విరక్తి స్త్రిధా తీవ్రా తీవ్రతరా మందా చేతి. తీవ్రా యథా, "అస్మిన్ జన్మని మాభూవ న్పుత్రదారాదయో మమే"తి యా సుస్థిరా బుద్ధి స్సా వైరాగ్యస్య తీవ్రతేతి. అస్మి న్వైరాగ్యే కుటీచక బహూదకసన్న్యాసాధికారః. తథా చోక్తం "యాత్రాద్యశక్తిశక్తిభ్యాం తీవ్రే న్యాసద్వయం భవేత్, కుటీచకో బహూద శ్చే దుభా వేతౌ త్రిదండినౌ", కుటీచకస్తు యాత్రాద్యశక్తః ఏకస్మి న్నేవ తీర్థే సంవసన్నిత్యం ద్వాదశసహస్రప్రణవజపం కుర్వ న్యథోక్తకాలభైక్ష్య మాహర న్మహావాక్యార్థ మవలోకయ న్నాత్మానుసంధానే చిత్తవృత్తి మవధారయ న్కుట్యాం పర్ణశాలాయాం చకాస్తి బ్రహ్మధ్యానేన ప్రకాశతే ఇతి కుటీచకః కుట్యా మేవ చరతి యాత్రాద్యశక్తతయా విచరతీతి. యద్వా చరగతిభక్షణయో రితి ధాతోః కుట్యాం చరతి భక్షయతి భిక్షాన్న మితి కుటీచకో వా. ౩. బహూదక శ్చ తీర్థయాత్రాసు శక్తో గ్రామే త్వేకరాత్రం నగరే త్రిరాత్రం తీర్థే సప్తరాత్రం నివస న్త్రికాలస్నానపరో మాధుకరీం వృత్తి మాశ్రితో నివాసస్థానాశక్తిరహితో నిజాశ్రమధర్మరతో ప్రణవ మనుస్మరన్ దండాదికం పరిగృహ్య పున స్తీర్థాంతరం వ్రజతీతి. బహూని ఉదకాని తీర్థజలాని యస్యేతి బహూదక ఇతి. ౪. తీవ్రతరవైరాగ్యే తు హంసపరమహంససన్న్యాసాధికారః. తీవ్రతరం యథా-"పునరావృత్తిసహితో లోకో మే మాఽస్తు కశ్చన, ఇతి తీవ్రతరత్వం స్యా న్మందే న్యాసో న కోపి హీ"తి. మందవైరాగ్యేతు సన్న్యాసాధికార ఏవ నాస్తి. మందా యథా-"పుత్రదారధనాదీనాం నాశే తాత్కాలికీ మతిః, ధిక్సంసార మితీదృక్సా ద్విరక్తే మందతా హి సా" ఇతి. ఏతేషాం విశేషలక్షణాని విశ్వేశ్వరీపద్ధతౌ పరమహంసోపనిషది జీవన్ముక్తేశ్చ విశేషతో నిరూపితాని. అత్ర

గంగాదీనా మభావేఽపి పృథివ్యాం స్థాపనం స్మృతమ్,
యత్ర సంతి మహానద్య స్తదా తా స్వేవ నిక్షిపేత్. ౧౦౮

సన్న్యాసి మరణించినచో దహనము ఉదకదానము, ఆశౌచము పట్టుట అక్కరలేదు. దండమును ధరించినంతమాత్రమున మనుజుఁడు నారాయణమూర్తి యగును. త్రిదండగ్రహణము చేసిన సన్న్యాసులకు ప్రేతత్త్వము లేదు. జ్ఞానులు స్వరూపానుసంధానము చేయువారగుటం జేసి నిత్యముక్తు లనఁబడుదురు; కావున వారు పుత్రులు మున్నగు వారిచే నీయఁబడు పిండాదులకు ఆశపడరు. తీర్థశ్రాద్ధమును, గయాశ్రాద్ధమును, పితృభక్తితో చేయవచ్చును. హంస, పరమహంస, కుటీచక, బహూదక–ఈనాలుగువిధముల సన్న్యాసులను దహింపఁగూడదు. భూమియందు పాతిపెట్టవలెను. గంగాదిమహానదులు లేని దేశమునందు ఖననము చేయవలెను గంగాదినదులు ఉన్నచోట వారిని వానియందు విడువవలెను.

ఇతి శ్రీగరుడపురాణే–సారోద్ధారే–దాహాస్థిసంచయనకర్మ
నిరూపణో నామ దశమోఽధ్యాయః.

---

తు విస్తరభయా న్న లిఖితాని. శ్లోకార్థస్తు స్పష్టఏవ. ౧౦౬, ౧౦౮. ఇతి శ్రీగరుడపురాణటీకాయాం దశమోఽధ్యాయః.

# ఏకాదశాధ్యాయము

గరుడ ఉవాచ:—

దశరాత్రవిధిం బ్రూహి కృతే కిం సుకృతం భవేత్,
పుత్త్రాభావే తు కః కుర్యా దితి మే వద కేశవ!. ౧

శ్రీ భగవానువాచ:—

శృణు తార్క్ష్య! ప్రవక్ష్యామి దశరాత్రవిధిం తవ,
యద్విధాయ చ సత్పుత్త్రో ముచ్యతే పైతృకాదృణాత్. ౨

"శ్రీహరీ! దశరాత్రవిధానముగూడ నెఱింగింపుము, పుత్త్రులు లేనపుడు కర్మ యెవరు చేయవలయునో అదిగూడఁ జెప్పుము" అని గరుడుఁడు అడుగఁగా శ్రీహరి "దశరాత్రవిధానము చేయుటవలన పుత్త్రుఁడు పైతృకఋణమునుండి విముక్తుఁ డగును. అది యంతయుఁ జెప్పెద విను" మని యిట్లు చెప్పఁదొడఁగెను.

పుత్త్ర శ్శోకం పరిత్యజ్య ధృతి మాస్థాయ సాత్వికీమ్,
పితుః పిండాదికం కుర్యా దశ్రుపాతం న కారయేత్. ౩
శ్లేష్మాశ్రు బాంధవై ర్ముక్తం ప్రేతో భుఙ్క్తే యతోఽవశః,
అతో న రోదితవ్యం హి తదా శోకా న్నిరర్థకాత్. ౪
యది వర్షసహస్రాణి శోచతే హర్నిశం నరః,
తథాఽపి నైవ నిధనం గతో దృశ్యేత కర్హిచిత్. ౫

పుత్త్రుఁడు శోకము మాని సాత్వికమగు ధైర్యము వహించి కన్నులనుండి నీరు రానీయక తల్లిదండ్రులకు పిండప్రదానము గావింబవలెను. బంధువుచే విడువఁబడిన కన్నీళ్లను మృతుఁడు అవశుఁడై పానము

---

అస్థిసంచయనా దూర్ధ్వం దశరాత్రం సమాచరేత్, ఇతి శ్రుత్వా ఖగః పూర్వం తదేవ పరిపృచ్ఛతి. దశేతి. ౧. ఏకాదశేఽస్మి న్నోప్రివాచ శోకాపనయనం వచః, అప్రజే పిండదాతారం దశరాత్రవిధిం హరిః. శృణ్వితి. ౨. సాత్వికీ ధృతిః గీతాయాం ప్రోక్తా "ధృత్యా యయా ధారయతే మనః ప్రాణేంద్రియక్రియాః, యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ! సాత్వికీ"తి. ౩. క్రియాయా మశ్రుపాతస్య నిషేధ మాహ-శ్లేష్మేతి. నిరర్థకాత్ వ్యర్థాత్. ౪. తదేవాహ యదీతి సప్తభిః. నిధనం

చేయును; గావున నిరర్థక మగు రోదనము మాని వేయవలెను. వేయి యేండ్లు దివారాత్రములు ఏడ్చినను మృతినొందినవాఁడు మరల బ్రతుకఁడు.

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ,
తస్మా దపరిహార్యేఽర్థే న శోకం కారయే ద్బుధః. ౬
న హి కశ్చి దుపాయోఽస్తి దైవో వా మానుషో పి వా,
యో హి మృత్యువశం ప్రాప్తో జంతుఃపున రిహావ్రజేత్. ౭
అవశ్యం భావిభావానాం ప్రతీకారో భవే ద్యది,
తదా దుఃఖై ర్నయుజ్యేర న్నలరామయుధిష్ఠిరాః ౮
నాఽయ మత్యంతసంవాదః కస్యచి త్కేనచి త్సహ,
అపి స్వేన శరీరేణ కిము తాన్యైః పృథగ్జనైః. ౯
యథా హి పథికః కశ్చి చ్ఛాయా మాశ్రిత్య విశ్రమేత్,
విశ్రమ్య చ పున ర్గచ్ఛే త్తద్వద్భూతసమాగమః. ౧౦

పుట్టినవానికి మరణమును, మరణించినవానికి పుట్టుకయు ధ్రువము. నివారించుట కశక్య మగు విషయమున బుధుఁడు శోకింపఁగూడదు. మరణించినవాఁడు మరల వచ్చుటకు దైవికమును మానుషమును అగుఉపాయ మేదియులేదు. అవశ్యము జరిగితీరవలసిన దుఃఖాదులకు ప్రతీకారము లేదు. అట్లున్న యెడల నలరామయుధిష్ఠిరాదు లేల దుఃఖమును బొందుదురు? ఒకనికొకనికిని చిరసంయోగము ఉండదు. తనకు తనశరీరముతో చిరసంయోగము ఉండనపుడు ఇతరులతో నెట్లుండును? బాటసారి మార్గాయాసము పోవుటకు చెట్టుక్రింద విశ్రమించును. విశ్రమించి మరల వెడలిపోవును. అట్లే భూతజాలమున్ను చచ్చుచు పుట్టుచు నుండును.

యత్ప్రాత స్సంస్కృతం భోజ్యం సాయం తచ్చ వినశ్యతి,

---

గతః మృత్యుం ప్రాప్తః. ౫, అపరిహార్యే దూరీకర్తు మశక్యే. ౬, ఉపాయాభావాదపి, శోకో నో చిత ఇత్యాహ-న హీతి. ౮. భావానాం దుఃఖాదీనాం ప్రతీకారః దూరీకరణోపాయః. 'సంయోగా విప్రయోగాంతా మరణాంతం హి జీవిత' మితి న్యాయ మాహ - నాయ మితి. ౯. ఉక్త మేవార్థం దృష్టాంతే ద్రఢయతి. యథేతి. ౧౦. యస్య కారణ కేవ వినాశ తదా తత్కార్యస్య కా కథే త్యాహ-య దితి. సంస్కృ

త దన్నరససంపుష్టే కాయే కా నామ నిత్యతా. ౧౧
భైషజ్య మేత ద్దుఃఖస్య విచారం పరిచింత్య చ,
అజ్ఞానప్రభవం శోకం త్యక్త్వాకుర్యాత్క్రియాం సుతః. ౧౨
పుత్రాభావే వధూః కుర్యా ద్భార్యాభావే చ సోదరః,
భ్రాతావా భ్రాతృపుత్రో వా సపిండ శ్శిష్యఏవ వా. ౧౩
జ్యేష్ఠస్య వా కనిష్ఠస్య భ్రాతుః పుత్త్రైశ్చ పౌత్త్రకైః,
దశరాత్రాదికం కార్యం పుత్రహీనేనరే ఖగ!. ౧౪
భ్రాతౄణా మేకజాతానా మేకశ్చే త్పుత్రవా న్భవేత్,
సర్వే తే తేన పుత్రేణ పుత్రిణో మనుర బ్రవీత్. ౧౫

సుగంధద్రవ్యములతో పాచిత మయ్యును ప్రాతఃకాలము చేసిన వంటకము సాయంతనమున గతరస మగును. అట్లు ఉండఁగా ఆయన్న రసమువలన పోషింపఁబడు శరీరముమాత్రము నిత్య మెట్లగును? దుఃఖరోగనివర్తకమును, అజ్ఞానమువలన పుట్టునదియు నగు శోకమును విడిచి పుత్త్రుఁడు కర్మ చేయవలెను. పుత్త్రుఁడు లేనియెడల భార్యయు, భార్యలేకున్న సోదరుఁడు, సోదరుఁడు లేకున్న శిష్యుఁడు సపిండులు శ్రాద్ధము జేయుట కధికారులు. జ్యేష్ఠసోదరుఁడు పుత్రహీనుఁ డగు నెడల కనిష్ఠుని పుత్త్రపౌత్త్రులు కర్మ చేయవలెను. కనిష్ఠుఁడు పుత్రహీనుఁ డగు నెడల జ్యేష్ఠుని పుత్రపౌత్త్రులు కర్మను జేయవలెను. సోదరులలో నొకఁడు పుత్త్రవంతుఁ డయినను అందఱును పుత్త్రవంతులే యని మనువు శాసించియున్నాఁడు.

పత్నీనాం చైవ సర్వాసా మేకస్య చైకా పుత్రవతీ భవేత్,
సర్వా స్తాః పుత్రవత్య స్స్యు స్తేనైకేన సుతేన హి. ౧౬
సర్వేషాం పుత్రహీనానాం మిత్త్రః పిండం ప్రదాపయేత్,
క్రియాలోపో న కర్తవ్య స్సర్వాభావే పురోహితః. ౧౭

తం సుగంధిద్రవ్యైః పాచిత మపి వినశ్యతి గతరసం భవతి. ౧౧. భైషజ్య మౌషధం దుఃఖరోగనివర్తక మిత్యర్థః. ౧౨. శోకాపనోదనోపాయం నిరూప్య 'పుత్రాభావేతు కః కుర్యా' దితి ప్రశ్న స్యోత్తర మాహ. పుత్రేతిపంచభిః. వధూః పత్నీ. పుత్రవ ధ్వభావే సోదరః కనిష్ఠభ్రాతా. ౧౩. భ్రాతుః పుత్రేణ సర్వభ్రాతౄణాం పుత్రవ త్త్వం స్యాది త్యాహ-జ్యేష్ఠస్యేతి. ౧౪. ఏకజాతానాం ఏకస్మా త్పితుస్సకాశా దుత్ప న్నానాం మధ్యే. ౧౫. సాపత్న్యపుత్రేణ స్త్రీణాం పుత్రితా స్యా దిత్యాహ-పత్నీ

స్త్రీ వాథ పురుషః కశ్చి దిష్టస్య కురుతే క్రియామ్,
అనాథప్రేతసంస్కారా త్కోటియజ్ఞఫలం లభేత్. ౧౮

ఒకనికి అనేకభార్య లుండురు. అందొకతె మాత్రమే పుత్రవతి యగును. ఆమెనుబట్టి అందఱును పుత్రవంతులే యని శాస్త్రము. పుత్రులు లేనివారికి మిత్రుఁడు పిండప్రదానము చేయవలెను. కర్మలోప మెప్పుడును చేయకూడదు. ఎవరును లేకున్న పురోహితుఁడు కర్మ చేయవలెను. స్త్రీయైనను పురుషుఁడైనను మిత్రునకు కర్మ చేయవలెను. అనాథప్రేతసంస్కారము చేసినవారికి కోటియజ్ఞముల ఫలము లభించును.

పితుః పుత్రేణ కర్తవ్యం దశరాత్రాదికం ఖగ!
మృతే జ్యేష్ఠే వ్యతిస్నేహా న్నకుర్వీత పితా సుతే. ౧౯
బహవోపి యదా పుత్రా విధి మేక స్సమాచరేత్,
దశరాత్రం సపిండత్వం శ్రాద్ధా న్యన్యాని షోడశ. ౨౦
ఏకే నైవ తు కార్యాణి సంవిభక్తధనే ష్వపి,
విభక్తై స్తు పృథ క్కార్యం శ్రాద్ధం సంవత్సరాదికమ్. ౨౧

తండ్రికి కుమారుఁడు కర్మ చేయవలెను. జ్యేష్ఠకుమారుఁడు మృతిబొందిన అతనికి తండ్రి కర్మ చేయఁగూడదు. పుత్రులు అనేకులు ఉండి వారు విభక్తులైనను అవిభక్తులైనను వారిలో నొకఁడే దహనాదిసపిండీకరణమువఱకును చేయవలెను. విభక్తులైనయెడల ప్రత్యాబ్దికాదులు వేఱువేఱుగా ఆచరింపవలెను గాని కలిపి చేయఁగూడదు.

తస్మా ద్యథావిధి జ్యేష్ఠో దశరాత్రం సమాచరేత్,
ఏకభోజీ భూమిశాయీ భూత్వా బ్రహ్మపర శ్శుచిః. ౨౨
సప్తవారం పరిక్రమ్య ధరణీం య త్ఫలం లభేత్,
క్రియాం కృత్వా పితు ర్మాతు స్త త్ఫలం లభతే సుతః. ౨౩
ఆరభ్య దశరాత్రం చ యావద్వైవార్షికం భవేత్,
తావ త్పుత్రః క్రియాం కుర్వ న్గయాశ్రాద్ధఫలం లభేత్. ౨౪

కాబట్టి పెద్దకుమారుఁడు భక్తితో దహనాదికమును ఆచరింప

---

ఇతి. ౧౬, ౧౭. ఇష్టస్య మిత్రస్య. ౧౮-౨౨. కృతే కిం సుకృతం భవే దితి ప్రశ్న స్యోత్తర మాహ-సప్తేతి ద్వాభ్యామ్. ౨౩, ౨౪. దశరాత్రవిధిం బ్రూహీతి ప్రశ్న

వలెను. కర్త చేయునతఁడు ఒంటిపూట భోజనము; భూశయనము, బ్రహ్మచరత చేయువలెను. ఏడుపర్యాయములు భూప్రదక్షిణము చేసిన నెట్టి ఫలము లభించునో అట్టి ఫలము తలిదండ్రులకు కర్మ చేసినవారికి కలుగును. దహనాదిప్రథమాబ్దికపర్యంతము, కర్మ చేసిన కుమారునకు గయాశ్రాద్ధఫలము కలుగును

కూపే తటాకే వారామే తీర్థే దేవాలయే పి వా,
గత్వా మధ్యమయామే తు స్నానం కుర్యా దమంత్రకమ్. ౨౫
శుచి ర్భూత్వా వృక్షమూలే దక్షిణాభిముఖ స్థ్సితః,
కుర్యా చ్ఛ వేదికాం తత్ర గోమయే నోపలిప్య తామ్. ౨౬
తస్యాం పర్ణే దర్భమయం స్థాపయే త్కౌశికం ద్విజమ్,
తం పాద్యాదిభి రభ్యర్చ్య ప్రణమే దతసీతి చ. ౨౭
తదగ్రే చ తతో దత్వా పిండార్థం కౌశ మాసనమ్,
తస్యోపరి తతః పిండం నామగోత్రోపకల్పితమ్. ౨౮
దద్యా త్తండులపాకేన యవపిష్టేన వా సుతః,
ఉశీరచందనం భృంగరాజపుష్పం నివేదయేత్. ౨౯
ధూపం దీపంచ నైవేద్యం ముఖవాసం చ దక్షిణామ్,
శాకాన్నం పయసః పాత్రే వర్ధమానజలాంజలిమ్. 30
ప్రేతాయాముకనామ్నే చ మద్దత్త ముపతిష్ఠతు,

రెండవజామున బొడ్డనబావికిఁగాని, నూతికిఁగాని, చెరువునకుఁగాని బోయి సంకల్పములేకుండ స్నానముగావించి, శుచియై, వృక్షమూలమున దక్షిణాభిముఖుఁడై యొకవేదిక వేసి గోమయముతో నలికి, దానిమీఁద నొకపర్ణమును, పర్ణముమీఁద దర్భమయుఁడగు ద్విజుని ఉనిచి ధ్యానావాహనాదులతో బూజించి "అతసీపుష్పసంకాశం పీతవాసస మచ్యుతం, యే నమస్యంతి గోవిందం నతేషాం విద్యతే భయమ్, అనాదినిధనో దేవ శ్శంఖచక్రగదాధరః, అక్షయ్యః పుండరీకాక్ష ప్రేత

స్యోత్తరమాహ-కూప ఇత్యాది యావదధ్యాయసమాప్తి మధ్యమయామేద్వితీయప్రహరే-ప్రథమయామమధ్యాహ్నయోర్దేవపితృసమయత్వాత్. అమంత్రకంసంకల్పరహితం. ౨౫,౨౬. పర్ణే పర్ణాసనే 'అతసీపుష్పసంకాశ' మితి మంత్రేణ ప్రణమేత్. ౨౭. కౌశం దర్భాసనమ్. ౨౮, ౨౯. పయ శ్చ పయ శ్చ పయసీ-తయోః నీరక్షీరయోః పాత్రే.

మాతృప్రదోభవ" అను శ్లోకము నుచ్చరించి, నమస్కరించి పిమ్మట తదగ్రభాగమున పిండప్రదానమునిమిత్తము దర్భ నాసనముగా వేసి ప్రేతనామాదులు ఉచ్చరించి దానిమీఁద అన్నముతోఁగాని యవ పిష్టముతోఁగాని పిండప్రదానము చేయవలెను. పిదప వట్టివేళ్లు, మంచి గంధపుపొట్టు, గుంటగలగరపూవులు నివేదించి, దూపదీపాదు లిచ్చి నైవేద్యము తాంబూలము దక్షిణ మున్నగువానిని సమర్పించవలెను. పిమ్మట ప్రేతనామగోత్రాదులతో కాకబలిని, క్షీరనీరములను జలాంజలులను ఈయవలెను.

అన్నం వస్త్రం జలం ద్రవ్య మన్యద్వా దీయతే చ యత్,
ప్రేతశబ్దేన య ద్దత్తం మృత స్యానంత్యదాయకమ్. ౩౧
తస్మా దాదిదినా దూర్ధ్వం ప్రాక్సపిండీవిధానతః,
యోషితః పురుషస్యాపి ప్రేతశబ్దం సముచ్చరేత్. ౩౨
ప్రథమేహని య త్పిండో దీయతే విధిపూర్వకమ్,
తేనైవ విధినాన్నేన నవ పిండా న్ప్రదాపయేత్. ౩౩
నవమే దివసే చైవ సపిండైః స్వకైర్జనైః,
తైలాభ్యంగః ప్రకర్తవ్యో మృతకస్వర్గకామ్యయా. ౩౪
బహిః స్నాత్వా గృహీత్వా చ దూర్వాలాజసమన్వితాః,
అగ్రతః ప్రమదాం కృత్వా సమాగచ్ఛే న్మృతాలయమ్. ౩౫
దూర్వావ త్కులవృద్ధి స్తే లాజా ఇవ వికాసతా,
ఏవ ముక్త్వా త్యజే ద్గేహే లాజా న్దూర్వాసమన్వితాః. ౩౬

అన్నము, వస్త్రము, జలము, ఇతరద్రవ్యములు మున్నగు వేనిని అయినను ప్రేతశబ్దమును ఉచ్చరించుచు ఇచ్చినచో అది అక్షయ్యమగును. కావున మొదటిదినములగాయతు సపిండీకరణమువరకు స్త్రీపురుషులలో నెవరు మృతిబొందినను ప్రేతశబ్దోచ్చారణముతో అన్నాదికము నీయవలెను. మొదటిదినమున పిండప్రదానము ఎట్లు చేయఁ

---

౩౦. అనంత్యదాయకం అనంతఫలదం భవతీ త్యర్థః. ౩౧. ఆదిదినాత్ ప్రథమదినాత్. ౩౨. తేనై వాన్నేన చరుపాయసాదినాచ నవదినేషు నవ పిండాః. ౩౩. నవమ దినస్య కృత్యం కథయతి. నవమే ఇతి త్రిభిః. ౩౪-౩౬. దశమదినే విశేష మాహ-

బడునో తొమ్మిదిదినములు ఏట్లే చేయవలెను. తొమ్మిదవదినమున సపిం డులు అందఱును మృతునకు స్వర్గము లభించుటకు తైలాభ్యంగము చేసికోవలెను. పిమ్మట బహిః ప్రదేశమున స్నానముగావించి దూర్వలను లాజలనుగైకొని స్త్రీలను ముందు నడిపించుచు మృతగృహమునకు వచ్చి "దూర్వలవలె కులవృద్ధియు, లాజలవలె కులవినాశమును అగును గాక" అని పలికి ఆలాజలను ఆదూర్వలను ఆగృహమున విడువవలెను.

దశమేఽహని మాంసేన పిండం దద్యాత్ఖగేశ్వర!,
మాషేణ తన్నిషేధా ద్వా కలౌ న ఫలపైతృకమ్. ౩౭
దశమే దివసే క్షౌరం బాంధవానాం ప్రకీర్తితమ్,
క్రియాకర్తు స్సుత స్యైవం సపిండీకరణాత్పరమ్. ౩౮
'దశమే దివసే క్షౌరం బాంధవానాం సముండనమ్,
క్రియాకర్తు స్సుతస్యాపి పున ర్ముండన మాచరేత్, ౩౯
మృష్టాన్నై ర్భోజయే దేకం దినేషు దశసు ద్విజమ్,
ప్రార్థయే త్ప్రీతిము క్తించ హరిం ధ్యాత్వా కృతాంజలిః. ౪౦
అతసీపుష్పసంకాశం పీతవాససమచ్యుతమ్,
యే నమస్యంతి గోవిందం న తేషాం విద్యతే భయమ్. ౪౧
అనాదినిధనో దేవ శ్శంఖచక్రగదాధరః,
అక్షయః పుండరీకాక్ష! ప్రేతమోక్షప్రదో భవ. ౪౨
ఇతి సంప్రార్థనామంత్రం శ్రాద్ధాంతే ప్రత్యహం పఠేత్,
స్నాత్వా గత్వా గృహే దత్వా గోగ్రాసం భోజనం చరేత్. ౪౩

దశాహమున మాంసముతో పిండప్రదానము చేయవలెను. అయితే కలియుగమున మాంసము నిషేధింపఁబడినది; గావున నిను

---

దశ మేతి. వా అథవా కలౌ కలియుగే ఫలేన మాంసేన పైతృకం పితృశ్రాద్ధం నభవతీతి తస్య మాంస పిండస్య నిషేధా న్మాషేణైవ దద్యాదిత్యర్థః. అత్ర 'అతో హ్యామిషవర్జ్యం స్యాత్షు ధాతస్యనశామ్యతి' ఇతి ప్రాచీనై స్త్వాశక్యకత్వేనైవో క్తం తదన్యయుగాభి ప్రాయేణేతి. ౩౮. 'దశమే దివసే క్షౌర' మితి ద్వితీయశ్లోకః స్మృత్యంతర దేశాంతర ధర్మానుసారేణ. ౩౯-౪౦. అతసీతి. సుస్నిగ్ధసుకోమలశ్యామసుందరమ్. ౪౧. హే పుండరీకాక్ష! దేవ! త్వం అనాదినిధనోఽసి అతో మోక్షప్రదో భవేతి. ౪౨, ౪౩.
ఇతి శ్రీగరుడపురాణటీకాయాం ఏకాదశోఽధ్యాయః.

ముతో పిండప్రదానము చేయవలెను. బంధువు లందఱును క్షౌరము చేయించుకొనవలెను. కర్త మరల క్షౌరము చేయించుకొనవలెను. మొదటి దినము మొదలు పదియవదినమువఱకు ప్రతిదినమును పంచభక్ష్యపరమాన్నములతో ఒక బ్రాహ్మణునకు భోజనము పెట్టవలెను. పిమ్మట ప్రేతవిముక్తికై శ్రీహరిని ప్రార్థించవలెను, ఇట్లు ప్రతిదినమున శ్రాద్ధాంతమున శ్రీహరిని ప్రార్థించి ఇంటికి వెళ్లి గోవునకు మేతవేసి భుజింపవలెను.

ఇతి శ్రీగరుడపురాణే - సారోద్ధారే - దశరాత్రవిధి
నిరూపణో నామ ఏకాదశోఽధ్యాయః.

---

# ద్వాదశాధ్యాయము.

గరుడ ఉవాచ:—

ఏకాదశదినస్యాపి విధిం బ్రూహి సురేశ్వర!,
వృషోత్సర్గవిధానం చ వద మే జగదీశ్వర!, ౧

శ్రీ భగవా నువాచ:—

ఏకాదశేఽహ్ని గంతవ్యం ప్రాతరేవ జలాశయే,
ఔర్ధ్వదైహిక్రియాః సర్వాః కరణీయాః ప్రయత్నతః. ౨
నిమంత్రయే ద్బ్రాహ్మణాం శ్చ వేదశాస్త్రపరాయణాన్,
ప్రార్థయే త్ప్రేతముక్తిం చ నమస్కృత్య కృతాంజలిః. ౩

"పదునొకండవ దినమున చేయవలసిన విధిని వృషోత్సర్గవిధిని నాకు చెప్పుము" అని గరుడుఁడు అడుగఁగా శ్రీహరి "పదునొకండవ దినమున జలాశయమున కేగి సమస్తౌర్ధ్వదేహక్రియలను జేయవలెను. వేదశాస్త్రపారంగతు లగు బ్రాహ్మణులను నిమంత్రించి వారికి నమస్కరించి కృతాంజలియై ప్రేతవిముక్తి యగునట్లు అనుగ్రహింపఁ బ్రార్థింపవలె" నని యింకను ఇట్లు చెప్పెను.

స్నానసంధ్యాదికం కృత్వా హ్యాచార్యోఽపి శుచి ర్భవేత్,
విధానం విధివ త్కుర్యా దేకాదశదినోచితమ్. ౪
అమంత్రం కారయే చ్ఛ్రాద్ధం దశాహం నామగోత్రతః,
ఏకాదశేహ్ని ప్రేతస్య దద్యా త్పిండం సమంత్రకమ్. ౫

పిమ్మట ఆచార్యుఁడును స్నానసంధ్యాదులను నిర్వర్తించుకొని శుచియై ఏకాదశదినోచిత మగు విధి నాచరింపవలెను. ప్రథమదినాదిదశాహపర్యంతము ప్రేతనామగోత్రాదులతో మంత్రరహితముగా శ్రాద్ధము నాచరింపవలెను. ఏకాదశదినమున సమంత్రకముగా పిండప్రదానము చేయవలెను.

సౌవర్ణం కారయే ద్విష్ణుం బ్రహ్మాణం రాజతం తథా,
రుద్రం తామ్రమయం కార్యం యమం లోహమయం ఖగ!' ౬

ఏకాదశేతి. ౧. కృత్య మేకాదశాహస్య లక్షణాని వృషస్య చ, తదుత్సర్గ ఫలం

పశ్చిమే విష్ణుకలశం గంగోదకసమన్వితమ్,
తస్యోపరి న్యసే ద్విష్ణుం పీతవస్త్రేణ వేష్టితమ్. ౭
పూర్వేతు బ్రహ్మకలశం క్షీరోదకసమన్వితమ్,
బ్రహ్మాణం స్థాపయే త్తత్ర శ్వేతవస్త్రేణ వేష్టితమ్. ౮
ఉత్తరస్యాం రుద్రకుంభం పూరితం మధుసర్పిషా,
శ్రీరుద్రం స్థాపయే త్తత్ర రక్తవస్త్రేణ వేష్టితమ్, ౯
దక్షిణస్యాం యమఘట మింద్రోదకసమన్వితమ్,
కృష్ణవస్త్రేణ సంవేష్ట్య తస్యోపరి యమం న్యసేత్. ౧౦

బంగారముతో శ్రీహరియొక్కయు, వెండితో బ్రహ్మయొక్కయు, రాగితో ఈశ్వరునియొక్కయు, లోహముతో యమునియొక్కయు ప్రతిమలు చేయింపవలెను. పశ్చిమదిగ్భాగమున గంగోదకము నింపిన విష్ణుకలశము నుంచి దానిమీఁద పచ్చని వస్త్రముతో చుట్టఁబడిన విష్ణు ప్రతిమ నుంపవలెను. పూర్వదిగ్భాగమున క్షీరోదకసమన్విత మగు బ్రహ్మకలశమును స్థాపించి దానిమీఁద తెల్లని వస్త్రముతో చుట్టఁబడిన బ్రహ్మప్రతిమను స్థాపింపవలెను. ఉత్తరదిగ్భాగమున తేనెతోడను నేతితోడను నింపఁబడిన రుద్రకలశమును ఉంచి దానిమీఁద ఎఱ్ఱని వస్త్రముతో చుట్టఁబడిన రుద్రప్రతిమను స్థాపింపవలెను. దక్షిణదిగ్భాగమున ఇంద్రోదకముతో నింపఁబడిన యమఘటమును ఉంచి దానిమీఁద నల్లని వస్త్రముతో చుట్టఁబడిన యమప్రతిమ నుంచవలెను.

మధ్యేతు మండలం కృత్వా స్థాపయే త్కౌశికం సుతః,
దక్షిణాభిముఖో భూత్వా ఉపసవ్యేన చ తర్పయేత్. ౧౧
విష్ణుం విధిం శివం ధర్మం వేదమంత్రై శ్చ తర్పయేత్,
హోమం కృత్వా చరే త్పశ్చా చ్ఛ్రాద్ధం దద్యా ద్ఘటాదికమ్. ౧౨
గోదానం చ తతో దద్యా త్పితౄణాం తారణాయ వై,
గా రేషా హి మయా దత్తా ప్రీతయే తేఽస్తు మాధవ!. ౧౩
ఉపభుక్తం తు తస్యాసీ ద్వస్త్రభూషణవాహనమ్,
ఘృతపూర్ణం కాంస్యపాత్రం సప్తధాన్యం తదీప్సితమ్. ౧౪
తిలాద్యష్టమహాదాన మంతకాలే న చే త్కృతమ్,

చైవ ద్వాదశే ప్రాహ మాధవః. ఏకాద శేతి. ౨-౧౩. ఉపభుక్తం తస్య శరీరలగ్నమ్. తదీప్సితం తస్యవాంఛితం చ. పీతవస్త్రాదిసర్వమ్. ౧౪, ౧౫. ప్రేతస్యశయ్యాయా

శయ్యాసమీపే ధృత్వైతద్దానం తస్యాః ప్రదాపయేత్. ౧౫
ప్రక్షాళ్య విప్రచరణౌ పూజయేదంబరాదిభిః,
సిద్ధాన్నం తస్య దాతవ్యం మోదకాపూపకాగ్నిపయః. ౧౬
స్థాపయేత్పురుషం హైమం శయ్యోపరి తదా సుతః,
పూజయిత్వా ప్రదాతవ్యా మృతశయ్యా యథోదితా. ౧౭
ప్రేతస్య ప్రతిమాయుక్తా సర్వోపకరణై ర్వృతా,
ప్రేతశయ్యా మయా హ్యేషా తుభ్యం విప్ర! నివేదితా, ౧౮
ఇత్యాచార్యాయ దాతవ్యా బ్రాహ్మణాయ కుటుంబినే,
తతః ప్రదక్షిణీకృత్య ప్రణిపత్య విసర్జయేత్. ౧౯
ఏవం శయ్యాప్రదానేన శ్రాద్ధేన నవకాదినా,
వృషోత్సర్గవిధానేన ప్రేతో యాతి పరాంగతిమ్. ౨౦

మధ్యభాగమున మండలముగావించి అచ్చట కలశమయద్విజాని ఉంచవలెను. దక్షిణాభిముఖుఁడై వేదమంత్రములతో అపసవ్యముగా విష్ణుబ్రహ్మరుద్రయములకు తర్పణమును హోమమునుచేసి పిమ్మట శ్రాద్ధము నాచరింపవలెను. అనంతరము పితరులు తరించుటకు గోదానము గావించి పిదప ప్రేతోపభుక్తమును, తదీప్సితమును అగు వస్త్రవాహన భూషణాదికమును, ఘృతపూర్ణకాంస్యపాత్రమును, తిలాద్యష్టమహాదానములును, శయ్యాదానమును చేయవలెను. శయ్యాదానవిధాన మెట్లనిన: బ్రాహ్మణుని పాదములు కడిగి వస్త్రాదికముతో నతనిని పూజించి మృష్టాన్నము పెట్టి తరువాత శయ్యమీఁద సువర్ణప్రతిమ నుంచి పూజించి మృతుని ప్రతిమతో కూడినదియు, సర్వోపకరణములతో నున్నదియు అగు మృతుని శయ్యను ఆచార్యునకు దానము చేసి నమస్కార ప్రదక్షిణాదులు గావించి అతనిని పంపివేయవలెను. ఇట్లు శయ్యాదానముచేతను, వృషోత్సర్గముచేతను మృతిబొందినవారు సద్గతిని బొందెదరు.

ఏకాదశేఽహ్ని విధినా వృషోత్సర్గం సమాచరేత్,
హీనాంగం రోగిణం బాలం త్యక్త్వా కుర్యాత్సలక్షణమ్. ౨౧

దానవిధి మాహ. ప్రక్షాళ్యేతి చతుర్భిః. ౧౬-౨౧. బ్రాహ్మణాదివర్ణానా మసాధారణ

రక్తాక్షః పింగళో యస్తు రక్తశ్శృంగే గళే ఖురే,
శ్వేతోదరః కృష్ణపృష్ఠో బ్రాహ్మణస్య విధీయతే. ౨౨
సుస్నిగ్ధవర్ణో యో రక్తః క్షత్రియస్య విధీయతే,
పీతవర్ణశ్చ వైశ్యస్య కృష్ణశ్శూద్రస్య శస్యతే. ౨౩

పదునొకండవ దినమున యథావిధిగా వృషోత్సర్గము గావింప వలెను. అంగహీనత గలదియు, రోగములు కలదియు, లేఁగటియగు వృషభము పనికిరాదు. ఎఱ్ఱనికండ్లు కలదియు, ఎఱ్ఱని కొమ్ములు కలదియు, ఎఱ్ఱని డెక్కలుగలదియు, ఎఱ్ఱని కంఠము కలదియు, తెల్లని కడుపుకలదియు, నల్లని పృష్ఠభాగము కలదియు, పింగళవర్ణము గలదియు నగు వృషభము బ్రాహ్మణులకును, స్నిగ్ధవర్ణము కలదియు, ఎఱ్ఱని రంగుకలదియు నగు వృషభము రాజులకును, పీతవర్ణమగు వృషభము వైశ్యులకును, కృష్ణవర్ణ మగు వృషభము శూద్రులకును యోగ్యమైనవి.

యస్తు సర్వాంగపింగస్స్యాచ్ఛ్వేతః పుచ్ఛే పదేషు చ,
స పింగో వృషఇత్యాహుః పితౄణాం ప్రీతివర్ధనః.
చరణాస్తుముఖం పుచ్ఛం యస్య శ్వేతాని గోపతేః.
లాక్షారససవర్ణో యస్స నీల ఇతి కీర్తితః. ౨౪
లోహితో యస్తు వర్ణేన ముఖే పుచ్ఛే చ పాండురః,
పింగః ఖురవిషాణాభ్యాం రక్తనీలో నిగద్యతే. ౨౫
సర్వాంగే హ్యేకవర్ణో యః పింగః పుచ్ఛే ఖురేషు యః,
తం నీలపింగ మిత్యాహుః పూర్వజోద్ధారకారకమ్. ౨౬
పారావతసవర్ణస్తు లలాటే తిలకాన్వితః,
తం బభ్రునీల మిత్యాహుః పూర్ణం సర్వాంగశోభనమ్. ౨౭
నీలస్సర్వశరీరేషు రక్తశ్చ నయనద్వయే,
త మప్యాహు ర్మహానీలం నీలః పంచవిధస్స్మృతః. ౨౮

---

వృషస్య లక్షణ మాహ. రక్తాక్ష ఇతి ద్వాభ్యామ్. ౨౨. శస్యతే విహితో భవతి. ౨౩. సర్వవర్ణసాధారణవృషం కథయతి. య ఇత్యాదిషడ్భిః. ౨౪. పంచప్రకారం నీలవృషభం దర్శయతి. కిం తూత్తమలక్షణస్యైవేత్యాహ. చరణా ఇతి. గోపతేః వృషస్య. ౨౫-౨౮. ఉక్తలక్షణో వృషః గృహే న ధార్యః. తం భారవాహకం న

తోఁకను పాదములను తెల్లని వర్ణము గలిగి సర్వశరీరమునను పింగళవర్ణము గల వృషభము పింగళవృషభ మని చెప్పఁబడును. అది పితృదేవతలకు సంతోషకర మైనది. పాదములయందు ముఖముమీఁద తోఁకను తెల్లనై శరీరమంతయు లత్తుకరంగుగల వృషభము నీలమని చెప్పఁబడును. శరీరమందు ఎఱుపురంగు గలిగి ముఖముమీఁద తోఁకను పాండురవర్ణము గలిగి డెక్కలను, కొమ్ములను పింగళవర్ణమును గలిగిన వృషభము రక్తనీల మని చెప్పఁబడును. సర్వావయవములను ఒకటే రంగుగలిగి తోఁకను, డెక్కలను పింగళవర్ణముగల వృషభము నీలపింగ మని చెప్పఁబడును. అది పితృదేవతల నుద్ధరించును. పావురపురంగు గలదియు, నుదుట తిలకము గలదియు, సర్వాంగసుందరమును అగు వృషభము బభ్రునీల మనఁబడును. సర్వావయవములను నల్లనిరంగు కలదియు, నేత్రములను రక్తవర్ణము కలదియు అగు వృషభము మహానీల మని చెప్పఁబడును. ఇట్లు నీలవృషభము నీల మనియు, రక్తనీల మనియు, నీలపింగ మనియు, బభ్రునీల మనియు, మహానీల మనియు అయిదువిధముల నలరారుచున్నది.

అవశ్యమేవ మోక్తవ్యో న స ధార్యో గృహే భవేత్,
తదర్థ మేషా చరతి లోకే గాథా పురాతనీ. ౩౦
ఏష్టవ్యా బహవః పుత్రా యద్యేకోఽపి గయాం వ్రజేత్,
గౌరీం వివాహయే త్కన్యాం నీలం వా వృషముత్సృజేత్. ౩౧
స ఏవ పుత్రో మంతవ్యో వృషోత్సర్గం తు యశ్చరేత్,
గయాయాం శ్రాద్ధదాతా న యో ఽన్యో విష్ఠాసమః కిల. ౩౨

---

తుర్యాది త్యర్థః. యథా కపిలా గౌః బ్రాహ్మణాతిరిక్తవర్ణై ర్గృహే ధార్యా న భవతి కింతు దాతవ్యైవ, తథై వాయమ ప్యవశ్యం మోక్తవ్య ఏ వేతి. తదర్థం ఏతస్మి న్నే వార్థే పురాతనీ సర్వశాస్త్రప్రసిద్ధా గాథా స్మృతి శ్చరతి లోకే విఖ్యాతిం యాతి.౩౦. తా మేవాహ ఏష్టవ్యాః వాంఛితవ్యాః. మమ బహవః పుత్రా స్సంత్వితీచ్ఛా కర్తవ్యేత్యర్థః తత్కిమర్థ మితి చే త్తత్రాహ. యదీతి. బహుష్వేకోఽపి గయాం గచ్ఛేత్ ఏకః గౌరీ మష్టవర్షాం కన్యాం వివాహయే చ్చ, నీలం ఉక్తలక్షణం మోచయే దితి హేతోః ఏకఏవచే త్తదా గృహకార్య ఏవ వ్యగ్రో భవేత్, తస్య గయాది పితృముక్తికృత్యే అవసరాభావా దితి భావః.౩౧. అన్యః వృషోత్సర్గా ద్యకర్తా ఇత్యకరణే అపమానోక్తిః. ౩౨, కరణేతు కేవలం పితురేవ ముక్తి ర్న, కింతు సర్వపితౄణాం

పూర్వోక్తలక్షణములతో నొప్పు వృషభమును విడువవలెను; గాని ఇంటియందుంచుకొనఁగూడదు. ఇందుల కొక ప్రాచీన మగు ఇతిహాసము గలదు. పుత్రులు చాలమంది కలుగవలె నని కోరుకోవ లెను. ఏల ననఁగా వారిలో నొకఁడైనను గయను చని శ్రాద్ధము పెట్టును. లేకున్న గౌరీవివాహమును గాని అంతకును గాకున్న వృషో త్సర్గము నైనఁ గావించును. వృషోత్సర్గము చేసినయతఁడును, గయా శ్రాద్ధము నాచరించిన యతఁడును పుత్రుఁ డనఁబడును; గాని తద్వ్యతి రిక్తుఁ డగువాఁడు పుత్రుఁడు కాఁజాలఁడు. విష్ఠాసముఁ డగును.

రౌరవాదిషు యే కేచి త్పచ్యంతే యస్య పూర్వికాః,
వృషోత్సర్గేణ తాం త్సర్వాం స్తారయే దేకవింశతిః. 33
వృషోత్సర్గం కి లేచ్ఛంతి పితర స్స్వర్గతా అపి,
అస్మద్వంశే సుతః కోఽపి వృషోత్సర్గం కరిష్యతి. 34
తదుత్సర్గాద్వయం సర్వే యాస్యామః పరమాం గతిమ్,
సర్వయజ్ఞేషు చాస్మాకం వృషయజ్ఞో హి ముక్తిదః. 35
తస్మా త్పితృవిముక్త్యర్థం వృషయజ్ఞం సమాచరేత్,
యథోక్తేన విధానేన కుర్యా త్సర్వప్రయత్నతః. 36

వృషోత్సర్గము చేయుటవలన రౌరవాదినరకములయందు బాధ పడు ఇరువదియొక్క తరములవారు తరించి పరమగతిని బొందుదురు. "మావంశములోఁ బుట్టినవాఁ డొక్కఁడైనను వృషోత్సర్గము గావిం పక మానఁడు. దానివలన మేము పరమగతినిఁ బొందెదము. యజ్ఞము లన్నిటియందును మాకు వృషయజ్ఞమే మోక్షదాయకము" అని పితృ దేవతలు ఎదురుచూచుచుందురు; గావున సర్వప్రయత్నముల వలనను వృషోత్సర్గము చేయవలెను.

గ్రహాణాం స్థాపనం కృత్వా త త్తన్మంత్రైశ్చ పూజనమ్,
హోమం కుర్యా ద్యథాశాస్త్రం పూజయే ద్వృష మాతురః. 37
వత్సం వత్సీం సమానాయ్య బధ్నీయా త్కంకణం తయోః,
వైవాహ్యేన విధానేన స్తంభ మారోపయే త్తదా. 38

---

మే వేశ్యాహా రౌరవాది ష్విలి. 33. స్వర్గతాః స్వర్గే స్థితా అపీచ్ఛంతి పరమగతి ప్రాప్త్యర్థం. 34, 35. సర్వప్రయత్నతః యదిదేశే నాస్తి తదా దేశాంతరా దప్యా

స్నాపయేచ్చ వృషంవత్సీం రుద్రైం కుంభోదకేన చ,
గంధమాల్యైశ్చ సంపూజ్య కారయేచ్చ ప్రదక్షిణమ్. ౩౯
త్రిశూలం దక్షిణే పార్శ్వే వామే చక్రం ప్రదాపయేత్,
తం విము చ్యాంజలిం బద్ధ్వా పఠే న్మంత్ర మిమం సుతః. ౪౦
ధర్మ స్త్వం వృషరూపేణ బ్రహ్మణా నిర్మితః పురా,
తదోత్సర్గ ప్రదానేన తారయస్వ భవార్ణవాత్. ౪౧
ఇతి మంత్రా న్నమస్కృత్య వత్సం వత్సీం సముత్సృజేత్,
వరదోఽహం సదా తస్య ప్రేతమోక్షం దదామి చ. ౪౨
తస్మాదేవః ప్రకర్తవ్య స్తత్ఫలం జీవతో భవేత్,
అపుత్రస్తు స్వయం కృత్వా సుఖం యాతి పరాం గతిమ్. ౪౩

ఇంక వృషోత్సర్గ విధానము నెఱింగించెద నాలింపుము. ముందుగా గ్రహమంటపము గావించి తత్తన్మంత్రములతో తత్తద్గ్రహముల నావాహనము చేసి యథాశాస్త్రముగ హోమము గావించి పిమ్మట వృషభమును బూజింపవలెను. తరువాత వృషభమును, ఆవును తీసికొని వచ్చి కంకణము గట్టి వివాహవిధానము జరిపి రుద్రకలశోదకముతో ఆరెంటిని స్నానము చేయించి గంధపుష్పాక్షతులతో పూజించి ప్రదక్షిణము చేయవలెను. తరువాత వృషభమునకు కుడిభాగమున త్రిశూలమును, ఎడమభాగమున చక్రమును అంకనము చేసి దోసిలి ఒగ్గి "నీవు ధర్మదేవతవు. బ్రహ్మ నిన్ను వృషభరూపమున పుట్టించెను. నిన్నిపుడు విడుచుచున్నాను. భవసాగరమునుండి నన్ను దాటింపుము" అని ప్రార్థించి నమస్కరించి గోమిథునమును విడువవలెను. ఇట్లు ఎవ్వరు వృషోత్సర్గము నాచరింతురో వారికి నే నెప్పుడును మోక్షమునిచ్చుటకు సిద్ధముగా నుందును. కావున తండ్రి మృతిపొందినపుడు అవశ్యము వృషోత్సర్గము చేయవలెను. జీవించియున్నపుడు స్వయముగా నాచరించినను ఆఫల

నీయ కర్తవ్య ఏవేత్యర్థః. ౩౬. విధానమాహ-గ్రహాణా మితి సప్తభిః. ౩౭-౪౦. ధర్మ ఇతి. చతుష్పాద్ధర్మో వృషరూపో హి భవ తీతి. ఉత్సర్గ స్త్యాగ ఏవ ప్రదానం మయా దత్తం తవాభయదానం తేన తారయస్వ. మమ పితౄ నితి శేషః. ౪౧, ౪౨. మృతస్య పుత్రహస్తేన యత్ఫలం భవతి తదేవ జీవితస్య స్వహస్తకృతే నాప్యస్తి.

మును పొందును. అపుత్రకుఁడు స్వయముగా వృషోత్సర్గము నాచరించి సద్గతినిఁ బొందును.

కార్తికాదౌ శుభేమాసే చోత్తరాయణగే రవౌ,
శుక్లపక్షేథవా కృష్ణే ద్వాదశ్యాదితిథౌ తథా. ౪౪
గ్రహణద్వితయే చైవ పుణ్యతీర్థేఽయనద్వయే,
విషువద్వితయే చాపి వృషోత్సర్గం సమాచరేత్. ౪౫
శుభలగ్నే ముహూర్తే చ శుచౌ దేశే సమాహితః,
బ్రాహ్మణం తు సమాహూయ విధిజ్ఞం శుభలక్షణమ్. ౪౬
జపై ర్హోమై స్తథా దానైః ప్రకుర్యా ద్దేహశోధనమ్,
పూర్వవ త్సకలం కృత్యం కుర్యా ద్ధోమాదిలక్షణమ్. ౪౭

అపుత్రకుఁడు స్వయముగా వృషోత్సర్గము చేయుటకు విధానము చెప్పెద వినుము. కార్తికాదిశుభమాసమునందు గాని ఉత్తరాయణము నందు గాని శుక్లపక్షమునఁగాని కృష్ణపక్షమునగాని ద్వాదశి మున్నగు తిథులయందు సూర్యచంద్రగ్రహణముల సమయములయందును మకర కర్కాటకాయనములయందును, శుభముహూర్తమున శుభదేశమున వృషోత్సర్గము గావింపవలెను. విద్వాంసుఁడగు బ్రాహ్మణుని పిలిపించి జపహోమదానములు చేసి దేహశోధనము గావించుకొని పూర్వోక్త ప్రకారముగా వృషోత్సర్గకృత్యము నాచరించి హోమముకూడ గావింపవలెను.

సాలగ్రామం చ సంస్థాప్య వైష్ణవం శ్రాద్ధ మాచరేత్,
ఆత్మశ్రాద్ధం తతః కుర్యా ద్దద్యా ద్దానం ద్విజన్మనే. ౪౮
ఏవం యః కురుతే పక్షి! న్నపుత్ర శ్చాపి పుత్రవాన్,
సర్వకామఫలం తస్య వృషోత్సర్గా త్ప్రజాయతే. ౪౯
అగ్నిహోత్రాదిభి ర్యజ్ఞై ర్దానైశ్చ వివిధై రపి,
న తాం గతిమవాప్నోతి వృషోత్సర్గేణ యాం లభేత్. ౫౦

అనంతరము సాలగ్రామమును స్థాపించి వైష్ణవశ్రాద్ధము నాచరించి పిమ్మట ఆత్మశ్రాద్ధము గావించుకొని బ్రాహ్మణునకు దానము చేయ

౪౩. అత స్తద్విధాన మప్యాహ కార్తికాదా వితి పంచభిః. ౪౪. విషువద్వితయే మేషతులాసంక్రాంతిదినే. ౪౫-౫౦. సర్వపాపానాం ప్రాయశ్చిత్తరూపమప్యేతత్.

వలెను. ఇట్లు ఏ పుత్రవంతుఁడు ఒక పుత్రహీనునకు వృషోత్సర్గము గావించునో అతని సకలకామములను లభించును. అగ్నిహోత్రాదుల నాచరించుటవలనను వివిధదానములను జేయుటవలనను సంభవించు ఫలము వృషోత్సర్గమువలన లభించు ఫలమునకు సాటిరావు.

బాల్యే కౌమారే పౌగండే యౌవనే వార్ధకే కృతమ్,
యత్పాపం తద్వినశ్యేత వృషోత్సర్గాన్న సంశయః. ౫౧
మిత్రద్రోహీ కృతఘ్నశ్చ సురాపో గురుతల్పగః,
బ్రహ్మహా హేమహారీ చ వృషోత్సర్గా త్ప్రముచ్యతే. ౫౨
తస్మా త్సర్వప్రయత్నేన వృషయజ్ఞం సమాచరేత్,
వృషోత్సర్గసమం పుణ్యం నాస్తి తార్క్ష్య! జగత్రయే. ౫౩
పతిపుత్రవతీ నారీ ద్వయో రగ్రే మృతా యది,
వృషోత్సర్గం నైవ కుర్యా ద్దద్యా ద్గాంచ పయస్వినీమ్. ౫౪

బాల్యమునను, కౌమారమునను, పౌగండవయస్సునను, యౌవనమునను, వార్ధకమునను చేసిన సమస్తపాపములు వృషోత్సర్గము చేసిన నశించును. మిత్రద్రోహియు, కృతఘ్నుఁడును, సురాపానము చేసినవాఁడును, గురుతల్పగుఁడును, బ్రహ్మహంతయు, బంగారమును హరించినవాఁడును, ఇంక నిట్టి మహాపాతకులు వృషోత్సర్జనము గావించిన పరిశుద్ధు లగుదురు; కావున సర్వప్రయత్నములచేతను వృషోత్సర్జనము గావింపవలెను. వృషోత్సర్గనముతో సమమైనది ముల్లోకములయందును లేదు. కుమారులును భర్తయు గల స్త్రీ పతిపుత్రులకంటె ముందుగా మరణించినయెడల వృషోత్సర్గనము చేయఁగూడదు. పాలు ఇచ్చుచున్న గోదానము గావింపవలెను.

వృషభం వాహయే ద్య స్తు స్కంధే పృష్ఠేచ ఖేచర!,
నిపతే న్నరకే ఘోరే యావదాభూతసంప్లవమ్. ౫౫

---

త్యాహ-బాల్య ఇతి ద్వాభ్యామ్. ౫౧-౫౩. బహుతరసుకృతశ్రవణోత్సుకతయా సౌభాగ్యవత్యాః సపుత్రాయాః స్త్రియా శ్చ న కుర్యా దిత్యాహ. పతీతి. కించ పతిపుత్రవతీ త్యనేనైవ విధవాయా శ్చ కుర్యా దిత్యవగమ్యతే. తథాఽపి వృషయజ్ఞం సమాచరే దిత్యాదివచనా ద్వృషోత్సర్గస్యాపి యజ్ఞమయత్వా త్తస్మిన్ స్త్రీశూద్రాణా ముధికారఏవ నేతి క్వచిత్, అతోఽత్ర దేశకులపరంపరాగతధర్మానుసరణం కర్తవ్యం. ౫౪-

వృభషం తాడయే ద్యస్తు నిర్దయం ముష్టియష్టిభిః,
స నరః కల్పపర్యంతం భుఙ్క్తే చ యమయాతనామ్. ౫౬

ఎద్దుయొక్క వీపుమీఁదగాని మెడమీఁదగాని ఎవఁడు ఎక్కునో వాఁడు ఘోరనరకములయందు భూతప్రళయమువఱకు బడియుండును. మఱియు నెవ్వఁడు వృషభమును పిడికిళ్లతోగాని కఱ్ఱలతోగాని కొట్టునో వాఁడును కల్పాంతము వఱకు యమయాతనల ననుభవించుచుండును,

ఏవం కృత్వా వృషోత్సర్గం కుర్యాచ్ఛ్రాద్ధాని షోడశ,
సపిండీకరణాదర్వాక్తదహం కథయామి తే. ౫౭
స్థానే ద్వారేఽర్ధమార్గే చ చితాయాం శవహస్తకే,
అస్థిసంచయనే షష్ఠో దశపిండా దశాహ్నికాః. ౫౮
మలినం షోడశం చైతత్ప్రథమం పరికీర్తితమ్,
అన్యచ్చ షోడశం మధ్యే ద్వితీయం కథయామి తే. ౫౯
ప్రథమం విష్ణవే దద్యా ద్ద్వితీయం శ్రీశివాయ చ,
యామ్యాయ పరివారాయ తృతీయం పిండ ముత్సృజేత్. ౬౦
చతుర్థం సోమరాజాయ హవ్యవాహాయ పంచమమ్,
కవ్యవాహాయ షష్ఠం చ దద్యా త్కాలాయ సప్తమమ్. ౬౧
రుద్రాయ చాష్టమం దద్యా న్నవమం పురుషాయ చ,
ప్రేతాయ దశమం చైవైకాదశం విష్ణవే నమః. ౬౨
ద్వాదశం బ్రహ్మణే దద్యా ద్విష్ణవే చ త్రయోదశమ్,
చతుర్దశం శివాయైవ యమాయ దశ పంచకమ్. ౬౩
దద్యాత్తత్పురుషాయైవ పిండం షోడశకం ఖగ,
మధ్యం షోడశకం ప్రాహు రేత త్తత్త్వవిదో జనాః. ౬౪
ద్వాదశ ప్రతిమాసేషు పాక్షికం చ త్రిపాక్షికమ్,
న్యూనషాణ్మాసికం పిండం దద్యా న్న్యూనాబ్దికం తథా, ౬౫
ఉత్తమం షోడశం చైత న్మయా తే పరికీర్తితమ్,
శ్రపయిత్వా చరుం తార్క్ష్య! కుర్యా ద్దేవాన శేషాని. ౬౬

౫౪. ఏవం వృషోత్సర్గం నిరూప్య ఊనాదిషోడశత్రయ మాహ-స్థానఇత్యాది యావ

ఇట్లు వృషోత్సర్జనము గావించి సాపిండ్యమునకు పూర్వము షోడశశ్రాద్ధముల నాచరింపవలెను. తద్విధానము చెప్పెద వినుము. షోడశము మలిన మనియు, మధ్యమ మనియు, ఉత్తమ మనియు మూఁడు విధములు. మలినషోడశశ్రాద్ధము లెవ్వి యనగా మృతి స్థానమునందును, ద్వారమునను, మధ్యమార్గమునను, చితియందును, శవహస్తమునను, అస్థిసంచయన మందును, దశాహ్నికములయందును చేయఁబడు శ్రాద్ధములు మలినషోడశము అనియు, ప్రథమషోడశ మనియు చెప్పఁబడును. ద్వితీయ షోడశము చెప్పెద వినుము. విష్ణువునకు ప్రథమపిండమును, శివునకు రెండవదియు; యమపరివారమునకు మూఁడవదియు, సోమరాజునకు నాల్గవదియు, హవ్యవాహనునకు అయిదవదియు, కవ్యవాహనునకు ఆఱవదియు, యమునకు ఏడవదియు, రుద్రునకు ఎనిమిదవదియు, పురుషునకు తొమ్మిదవదియు, ప్రేతమునకు పదవదియు, విష్ణువునకు పదునొకండవదియు, బ్రహ్మకు పండ్రెండవదియు, మరల విష్ణువునకు పదుమూఁడవదియు, శివునకు పదునాల్గవదియు, యమునకు పదునైదవదియు, పురుషునకు పదునాఱవదియు పిండప్రదానము చేయవలెను. ఇది మధ్యమషోడశ మని చెప్పఁబడును. ఉత్తమషోడశ మెద్ది యనగా పండ్రెండుమాసికములును, త్రైపక్షికమును, ఊనమాసికోనషాణ్మాసికములును, ఊనాబ్దికమును గలిసి షోడశశ్రాద్ధము లగును. వీనిని ఉత్తమషోడశ మని తత్త్వవిదులు చెప్పెదరు. పదునొకండవదినమున అన్నమువండి ఈయుత్తమ షోడశము నాచరింపవలెను.

చత్వారింశత్తథా వాష్టౌ శ్రాద్ధ ప్రేతత్వనాశనమ్,
యస్య జాతం విధానేన స భవే త్పితృపఙ్క్తిభాక్. ౬౭
పితృపఙ్క్తిప్రవేశార్థం కారయేత్ షోడశత్రయమ్,
ఏతచ్ఛ్రాద్ధవిహీనశ్చే త్ప్రేతో భవతి సుస్థిరమ్ ౬౮
యావ న్న దీయతే శ్రాద్ధం షోడశత్రయసంజ్ఞికమ్,
స్వదత్తం పరదత్తం చ తావ న్నైవోపతిష్ఠతి. ౬౯
తస్మా త్పుత్రేణ కర్తవ్యం విధినా షోడశత్రయమ్,

దధ్యాయసమాప్తి. ౫౮-౬౦. సంపరేతస్య మృత స్యోర్ధ్వదైహికం లోకాంతరోప

ఇట్లు ఎవనికి. ప్రేతత్వమును తొలఁగించు ఈనలుబదియొనిమిది శ్రాద్ధములును యథావిధిగా చేయఁబడునో వాఁడు పితృదేవతలలోఁ జేరును. పితృదేవతలలో చేరుటకు షోడశవ్రతము చేయవలెను. ఎవనికి ఈషోడశవ్రతము చేయఁబడదో వాఁడు శాశ్వతముగ ప్రేతయై యుండును. షోడశవ్రతము చేయునంతవఱకు స్వదత్తము గాని పరదత్తము గాని మృతునకు ముట్టదు. అందుచే కుమారుఁడు షోడశవ్రతము అవశ్యము చేయవలెను.

భర్తుర్యా కురుతే పత్నీ తస్య శ్రేయో హ్యనంతకమ్. ౨౦
సంపరేతస్య యా పత్యుః కురుతే చౌర్ధ్వదైహికమ్,
క్షయాహం పాక్షికశ్రాద్ధం సా సతీ హ్యుచ్యతే మయా. ౨౧
ఉపకారాయ సా భర్తుర్జీవత్యేషా పతివ్రతా,
జీవితం సఫలం తస్యాః యా మృతం స్వామినం భజేత్. ౨౨

భర్త మృతిఁబొందిన తరువాత ఔర్ధ్వదైహికమును, ప్రత్యాబ్దికమును, మహాలయశ్రాద్ధమును ఆచరించిన భార్య పతివ్రత యని చెప్పఁబడును. భర్తకు ఉపకారము చేయుటకు భార్య బ్రతికియుండును. మృతిఁబొందిన భర్తను శ్రాద్ధాదులతో సేవించు భార్య బ్రతుకు సఫలమయినది.

అథ కశ్చిత్ప్రమాదేన మ్రియతే వహ్నివారిభిః,
సంస్కారప్రముఖం కర్మ సర్వం కుర్యాద్యథావిధి. ౨౩
ప్రమాదాదిచ్ఛయా వాపి నాగాద్వా మ్రియతే యది,

---

యోగి పిండదానాదికం. క్షయాహం వార్షికం. తథా చ స్మృతిః "మాసపక్షతిథిస్పృష్టే యో యస్మిన్మ్రియతేఽహని, ప్రత్యబ్దం తు తథాభూతం క్షయాహం తస్య తం విదుః" పాక్షికం తు "ఆశ్వినే మాసి కన్యాస్థం గతే వా న గతే రవౌ, కృష్ణపక్షకృతం శ్రాద్ధం పాక్షికం తద్విధీయతే" ఇతి. యా పత్నీ కురుతే సాఽపి సతీ ఏవ ౨౧-౨౨. న తు ప్రారబ్ధవశేన వహ్న్యాదిభిర్మృతానాం నారాయణబలివిధిక్రియా మోక్షదా భవతి. అతస్తమేవ కుర్యాత్. సర్వాన్మృతానాం చ సర్వపూజనం కర్తవ్యమిత్యాహ-అథేత్యాది షడ్భిః. అథశబ్దో విధానాంతరే. ప్రమాదే నానవధానేన సంస్కారప్రముఖం దాహాదికం సర్వం పూర్వోక్తం కర్మ. ౨౩-౨౮. ఏవమితి.

పతతో రథతో ర్నాగం పంచమీషు ప్రపూజయేత్. ౭౪
కుర్యా త్పిష్టమయీం లేఖాం నాగభోగాకృతిం భువి,
అర్చయే త్తాం సితైః పుష్పై స్సుగంధై శ్చందనేన చ. ౭౫
ప్రదద్యా ద్ధూపదీపౌ చ తండులాంశ్చ తిలా న్క్షిపేత్,
ఆమపిష్టం చ నైవేద్యం క్షీరం చ వినివేదయేత్. ౭౬
సౌవర్ణం శక్తితో నాగం గాం చ దద్యా ద్ద్విజన్మనే,
కృతాంజలి స్తతో బ్రూయా త్ప్రీయతాం నాగరాడితి. ౭౭
పున స్తేషాం ప్రకుర్వీత నారాయణబలిక్రియామ్.
తయా లభంతే స్వర్వాసం ముచ్యంతే సర్వపాతకైః. ౭౮

ఎవఁ డయిన ప్రమాదవశమున అగ్నిలోఁ బడిగాని నీళ్లలోఁ బడిగాని మృతిఁబొందినయెడల వానికి దహనాదికము లగు సర్వకర్మలును యథాశాస్త్రముగాఁ జేయవలెను. ప్రమాదమువలనఁగాని కోరిగాని ఎవఁడయిన పాముకఱచి చచ్చిపోయినయెడల ప్రతిమాసమున శుద్ధపంచమినాఁడును, బహుళపంచమినాఁడును నాగపూజను గావింపవలెను. పిండితో భూమిమీఁద పాముపడగను దీర్చి దానిని తెల్లని పూవులతోడను, ధూపదీపాదులతోడను పూజించి బియ్యమును, నువ్వులను వేసి పచ్చిపిండిని పాలను నివేదన చేయవలెను. బంగారముతో సర్పమును చేయించి దానిని, ఒకయావును బ్రాహ్మణున కీయవలెను. తర్వాత దోసిలి ఒగ్గి "ప్రీతి బొందుము" అని నాగరాజును ప్రార్థించవలెను. తరువాత మృతిబొందినవారికి నారాయణబలి ఈయవలెను. దీనివలన వారికి పాపములన్నియుఁ బోవుటయు, స్వర్గమున వసించుటయు సంభవించును.

---

అబ్దం అ అబ్ద మితి ఛేదః. అబ్దపర్యంతమిత్యర్థః. ప్రత్యహం ఘటం దద్యాదితి వా. అథవా యథా సంఖ్యాకా మష్య్య కృతశతత్రయసంఖ్యాకాః జలాంజలిసహితాః క్రమా త్పాక్షికస్య పంచదశమాసికస్య త్రింశత్, పున స్సార్ధమాసికస్యపంచదశ ఇత్యా

ఏవం సర్వక్రియాం కృత్వా ఘటం సాన్నం జలాన్వితమ్,
దద్యా దాబ్దం యథా సంఖ్యా న్పిండా న్వా సజలా న్క్రమాత్.
ఏవ మేకాదశే కృత్వా కుర్యా త్సాపిండనం తతః,
శయ్యాపదానాం దానం చ కారయేత్సూతకే గతే. ౮౦

ఇట్లు కర్మ అంతయు చేసి సంవత్సరమువఱకు ఉదకుంభ దానము చేయవలెను. యథాసంఖ్యముగా పిండప్రదానము నైన చేయవలెను. అట్లు ఏకాదశదినమున షోడశశ్రాద్ధాదుల నాచరించి ద్వాదశాహమున సాపిండ్యమును, శయ్యాదానమును, పదదానమును చేయవలెను.

ఇతి శ్రీగరుడపురాణే-సారోద్ధారే-ఏకాదశవిధి
నిరూపణో నామ ద్వాదశో౽ధ్యాయః.

---

దిక్రమేణైవ ఏకాదశే౽హ్ని పిండానేవ దద్యాదిత్యర్థః. ౭౯,౮౦. ఇతి శ్రీగరుడ పురాణటీకాయాం ద్వాదశో౽ధ్యాయః.

# త్రయోదశాధ్యాయము

గరుడ ఉవాచ:—

సపిండనవిధిం బ్రూహి సూతకస్య చ నిర్ణయమ్,
శయ్యాపదానాం సామగ్రీం తేషాం చ మహిమానం ప్రభో. ౧

శ్రీ భగవా నువాచ:—

శృణు తార్క్ష్య ప్రవక్ష్యామి సాపిండ్యా ద్యఖిలాం క్రియామ్,
ప్రేతనామ పరిత్యజ్య యయా పితృగణే విశేత్. ౨

"భగవంతుఁడా! సపిండీకరణవిధిని, అశౌచనిర్ణయమును, శయ్యాపదదానసామగ్రిని, వానిఫలమును తెలియఁజెప్పు" మని గరుఁడుఁడు అడుగఁగా శ్రీహరి "వినుము" అని యిట్లు చెప్పెను.

న పిండో మిళితో యేషాం పితామహశివాదిషు,
నోపతిష్ఠంతి దానాని పుత్త్రై ర్దత్తా న్యనేకధా. ౩
అశుద్ధ స్స్యా త్సదా పుత్త్రో న శుధ్యతి కదాచన,
సూతకం న నివర్తేత సపిండీకరణం వినా. ౪
తస్మా త్పుత్త్రేణ కర్తవ్యం సూతకాంతే సపిండనమ్,

వసురుద్రాదిత్యరూపు లగు పితామహాదుల పిండములయం దెవ్వని పిండము మిళితము చేయఁబడదో వానికి పుత్త్రులచే నీయఁబడు నేదానములును ముట్టవు. సపిండీకరణము చేయనిచో పుత్త్రుని కెన్నటికి శుద్ధి కలుగదు; గావున అవశ్యము సపిండీకరణము చేయవలెను.

సూతకంతే ప్రవక్ష్యామి సర్వేషాం చ యథోచితమ్. ౫
బ్రాహ్మణ స్తు దశాహేన క్షత్త్రియో ద్వాదశేఽహని,
వైశ్యః పంచదశాహేన శూద్రో మాసేన శుధ్యతి. ౬

---

సపిండీముఖశయ్యాయాః పదానాం దానమేవ చ, తత్సామగ్రీఫలం తేషాం హరిః ప్రాహ త్రయోదశే. తేషాం శయ్యాదీనాం మహిమానం దానఫలం బ్రూహీతి. సపిండనేతి. ౧. యయా సపిండనాదిక్రియయా. ౨. పితామహా ఏవ శివాదయః వసురుద్రాదిత్యస్వరూపా స్తేషు. ౩-౫. "విప్రస్యైత ద్ద్వాదశాహం రాజన్యస్యాప్యశౌచక"మితి విష్ణుపురాణవచనా ద్బ్రాహ్మణస్యాపి ద్వాదశాహం సూతకమ్. ౬. సపిండాః

దశాహేన సపిండాస్తు శుధ్యంతి ప్రేతసూతకే,
త్రిరాత్రేణ సకుల్యా స్తు స్నాత్వా శుధ్యంతి గోత్రజాః. ౭
చతుర్థే దశరాత్రం స్యా త్షణ్ణిశాః పుంసి పంచమే,
షష్ఠే చతురహః ప్రోక్తం సప్తమే చ దినత్రయమ్. ౮
అష్టమే దిన మేకం తు నవమే ప్రహరద్వయమ్,
దశమే స్నానమాత్రం హి మృతకం జన్మసూతకమ్. ౯

గరుడుడా ! ఆశౌచనిర్ణయమును చెప్పెద వినుము. బ్రాహ్మణుడు పదిదినములును, క్షత్రియుడు పండ్రెండు దినములును, వైశ్యుడు పదునైదుదినములును, శూద్రుడు ముప్పదిదినములును ఆశౌచము పట్టవలెను. మఱియు సపిండులు పదిరోజులును, సమానోదకులు మూడు దినములను ఆశౌచము పట్టవలెను. సగోత్రులు స్నానముతో పొందెదరు. చతుర్థపురుషుడు మృతి పొందిన పదిదినములు ఆశౌచము పట్టవలెను. పంచమపురుషుడు మరణించిన ఆఱురోజులును, ఆఱవపురుషుడు మరణించిన నాలుగుదినములును, ఏడవపురుషుడు మృతిబొందిన మూడుదినములును, ఎనిమిదవ పురుషుడు మృతిబొందిన ఒకదినమును, తొమ్మిదవ పురుషుడు చనిపోయిన రెండు యామములును ఆశౌచము పట్టవలెను. దశమపురుషుడు మృతిపొందిన స్నానముతో శుద్ధియగును. పురుడుగూడ ఇట్లే పట్టవలెను.

దేశాంతరగతః కశ్చి చ్ఛృణుయా ద్యో హ్యహార్నిశమ్,
య చ్ఛేషం దశరాత్రస్య తావ దేవాశుచి ర్భవేత్. ౧౦
అతిక్రాంతే దశాహే తు త్రిరాత్ర మశుచి ర్భవేత్,
సంవత్సరే వ్యతీతే తు స్నానమాత్రా ద్విశుద్ధ్యతి. ౧౧

చతుఃపురుషావధయః. సకుల్యాః సప్తపురుషావధయః. గోత్రజాః దశపురుషావధయః. ౭. ఏత దేవ విశేషేణ నిరూపయతి. చతుర్థే పుంసి వృద్ధప్రపితామహాదూర్ధ్వస్నే సపిండే పురుషే దశరాత్రం సూతకం పుంసి సూతకం చేతి. సర్వత్రైవ యోజ్యమ్. ౮, ౯. అహార్నిశం దశదినమధ్య ఏవ. ౧౦. దశాహే అతిక్రాంతే వ్యతీతే సతి సంవత్సరాత్ప్రాక్త్రిరాత్రం సూతకమ్. దశాహ మితి సపిండీపర్యంతం జ్ఞాతవ్యమ్. తాం వినా సంఖ్యాకందనాదినా మనసికాకారాత్. ౧౧. నను ప్రథమ

దేశాంతరమున నున్నవాఁడు పదిరోజులలోఁపున వినినయెడల దశరాత్రములలో మిగిలియున్న దినములు ఆశౌచము పట్టవలెను. పది రాత్రులు గతించిన పిమ్మట వినినయెడల మూఁడుదినము లాశౌచము పట్టవలెను. సంవత్సరము దాఁటిన తరువాత నైనచో స్నానముతో శుద్ధి.

ఆద్యభాగద్వయం యావ న్మృతకస్య చ సూతకే,
ద్వితీయే పతితే చాద్యా త్సూతకా చ్ఛుద్ధి రిష్యతే. ౧౨
ఆదంతజననా త్సద్య ఆచౌలా న్నైషికీ స్మృతా,
త్రిరాత్ర మావతా దేశా ద్దశ రాత్ర మతఃపరమ్. ౧౩
అజన్మన స్తు చౌలాంతం యత్ర కన్యా విపద్యతే,
సద్య శ్శౌచం భవే త్తత్ర సర్వవర్ణేషు నిత్యశః. ౧౪
తతో వాగ్దానపర్యంతం యావ దేకాహ మేవ హి,
అతఃపరం ప్రవృద్ధానాం త్రిరాత్ర మితి నిశ్చయః. ౧౫
వాక్ప్రదానే కృతే త్వత్ర జ్ఞేయం చోభయత స్త్ర్యహమ్,
పితు ర్వరస్య చ తతో దత్తానాం భర్తు రేవ హి. ౧౬

మొదట నొక యాశౌచము పట్టుచుండ దాని ఆఱవదినమున

---

సూతకే చైవా ద్వితీయే అగతే సతి కిం కర్తవ్య మిత్యత ఆహ - ఆద్యేతి చతుర్భాగస్య త్రిభిర్భిన్నై రేకో విభాగః షడ్భి శ్చాద్యభాగద్వయమ్. తత్ర ప్రాప్తమృతస్య షడ్దినమధ్యే ద్వితీయే మృతే సతి ఆద్యేన సహైవ ద్వితీయస్యాపి దశరాత్రాదికం సపిండనం చ కర్తవ్యమ్. షడ్దినా దూర్ధ్వం మృతేన సహ ఆద్యస్య సపిండనాదిక మితి తాత్పర్యార్థః. ౧౨. ఆదంతజననాత్ దంతోద్భవా త్ప్రాక్ సద్యః. స్నానమాత్రా చ్ఛుద్ధిః. ఆచౌలాత్, ఆచూడాకరణాత్. ఆచూడా త్ప్రాక్ నైశికీ ఏకరాత్రేణశుద్ధిః. ఆవ్రతాదేశా ద్వ్రతబంధనా త్ప్రాక్ త్రిరాత్రం సూతకమ్ అతఃపరం ఉపవీత సంస్కారా దనంతరమ్. ౧౩. కన్యానాం సూతక మాహ. చౌలాంతం సప్తవింశతి మాసపర్యంతం యత్ర యదా విపద్యతే మ్రియతే. ౧౪. వాగ్దానా త్ప్రాక్ ఏకదినం సూతకమ్. అతఃపరం వాక్ప్రదానా దనంతరం ప్రవృద్ధా నాం వయసాఽధికానాం చ త్రిరాత్రంచేతి. వాక్ప్రదానం నామ (భాషయాం 'నగాతు' త్యుచ్యతే). ౧౫. ఏతదేవ వివృణోతి-వాగితి. ఉభయతః పితు ర్వరస్యాపి త్రిదినం దత్తానాం వివాహితానాం భర్తుర్గృహఏవ న తు పితుః. ౧౬. తాసాం మాతృవా దేవ యూతస్నాన

మఱియొక ఆశౌచము తెలిసినచో ప్రథమాశౌచముతో శుద్ధి యగును. ప్రథమాశౌచమున ఆఱుదినములు గతించినపిమ్మట తెలిసినచో ద్వితీయా శౌచముతో శుద్ధి యగును గాని ప్రథమాశౌచముతో శుద్ధి కాదు. పుట్టినదిమొదలు దంతోత్పత్తి అగులోపున (ఆఱుమాసములు దాటకుండ) మగపిల్లవాఁడు మృతిపొందినచో జ్ఞాతులకు స్నానముతో శుద్ధి. చౌలము అగువఱకు (మూఁడేండ్లు నిండువఱకు) ఒక రాత్రింబగలాశౌచము. అదిమొదలు ఉపనయనము అగులోపల (ఎనిమిదేండ్లు నిండువఱకు) మూఁడురాత్రు లాశౌచము. ఎనిమిది సంవత్సరములు నిండిన తరువాత ఉపనయన మైనను కాకున్నను పూర్ణాశౌచము పట్టవలెను ఇక కన్యాశౌచము చెప్పెదవినుము. పుట్టినది మొదలు చౌలము అగులోపున కన్యక మరణించినయెడల అన్ని వర్ణములవారికిని స్నానముతో శుద్ధి. అది మొదలు వివాహము నిమిత్తము వాగ్దానము అగువఱకు ఒకదినము ఆశౌచము, వాక్ప్రదాన మైనపిమ్మట భర్తృవంశమువారికిని, పితృవంశమువారికిని మూఁడుదినము లాశౌచము. వివాహ మైనతరువాత భర్తృవంశమువారికే ఆశౌచ ముండును.

షణ్మాసాభ్యంతరే యావ ద్గర్భస్రావో భవే ద్యది,
తదా మాసస్సై స్తాసాం దివసై శ్శుద్ధి రిష్యతే. ౧౭
అత ఊర్ధ్వం స్వజాత్యుక్త మాశౌచం తాసు విద్యతే,
సద్య శ్శౌచం సపిండానాం గర్భస్య పతనే సతి. ౧౮

మఱియు ఆఱుమాసముల లోపున గర్భస్రావ మైనయెడల ఎన్నవమాసమున గర్భస్రావ మగునో అన్నిదినములు తల్లికి జననాశౌచము. ఆఱుమాసములు గతించిన పిదప గర్భస్రావ మైన యెడల తల్లి స్వజాత్యుక్తపూర్ణాశౌచము పట్టవలెను. జ్ఞాతులకు పాతాశౌచము స్నానముతో శుద్ధి యగును.

సర్వేషా మేవ వర్ణానాం సూతకే మృతకేఽపి వా,
దశాహా చ్ఛుద్ధి రి త్యేవః కలౌ శాస్త్రస్య నిశ్చయః. ౧౯

కలియుగమున సర్వవర్ణములకును జననమరణాదులయందు పది

---

స్థితా గర్భా స్త్రావద్దినాని సూతకే'మితి వచనాత్, ౧౭. తాసు మాతృష్వేవ, న తు పిత్రాదిషు. ౧౮. సామాన్య ముక్త్వా విశేషశాస్త్ర మాహ-సర్వేషా మితి. 'సామాన్యశాస్త్రతో

రాత్రులాశౌచము పట్టవలెను. అని శాస్త్రములయందు నిర్ణయింపఁ బడినది.

ఆశీర్వాదం దేవపూజాం ప్రత్యుత్థానాభివందనమ్,
పర్యంకే శయనం స్పర్శం న కుర్యా న్మృతసూతకే. ౨౦
సంధ్యాం దానం జపం హోమం స్వాధ్యాయం పితృతర్పణమ్,
బ్రహ్మభోజ్యం వ్రతం నైవ కర్తవ్యం మృతసూతకే. ౨౧
నిత్యం నైమిత్తికం కామ్యం సూతకే యస్సమాచరేత్,
తస్య పూర్వాకృతం నిత్యాదికం కర్మ వినశ్యతి. ౨౨

ఆశౌచనియమములను వినుము. ఆశీర్వాదము, దేవపూజ, ప్రత్యుత్థానము, అభివందనము, మంచముమీఁద శయనించుట, ఇతరులను స్పృశించుట, సంధ్యావందనము, దానము, జపము, హోమము, స్వాధ్యాయము, పితృతర్పణము, బ్రాహ్మణభోజనము, వ్రతము, నిత్యకర్మలు, కామ్యకర్మలు ఆశౌచమున చేయఁగూడదు. సూతకసమయమున నిత్యనైమిత్తికకామ్యకర్మలు చేసినయెడల పూర్వము చేసిననిత్యనైమిత్తికకర్మాదికములు నశించును.

వ్రతినో మంత్రపూతస్య సాగ్నికస్య ద్విజస్య చ,
బ్రహ్మనిష్ఠస్య యతినో న హి రాజ్ఞాం చ సూతకమ్. ౨౩

బ్రహ్మచారికిని, మంత్రపూతునకును, ఆహితాగ్నికిని, బ్రహ్మనిష్ఠుఁడగు యతికిని, రాజునకును ఆశౌచము లేదు.

---

మానం విశేష బలకా న్యపే'దితి విశేషస్యైవ ప్రామాణ్యాత్. ౧౯, ౨౦. సూతక ప్రయోజన మాహ-సంధ్యా మితి త్రిభిః. ౨౧, ౨౨. వ్రతినః బ్రహ్మచారిణః తేన గురుశుశ్రూషా న త్యాజ్యేతి. యద్వా చాంద్రాయణాదిమహావ్రతయుక్తస్య. తేనాపి వ్రతభంగో న కర్తవ్య శ్చేతి భావః. మంత్రపూతస్య మహామంత్రజపై స్సదా పవిత్రస్య - జపత్యాగో నోచిత ఇతి. సాగ్నికస్య హవనస్యావశ్యకత్వాత్. బ్రహ్మనిష్ఠస్య గృహస్థస్యాపి తస్య అతివర్ణాశ్రమిత్వాత్ - వర్ణాశ్రమోచితం సూతకం నాస్త్యేవ - జన్మమరణయో రవాస్తవత్వా చ్చేతి యతినః సన్న్యాసినః-తస్యాపి లోకేషణాయా వ్యుత్థితత్వాత్. రాజ్ఞాం మూర్ధాభిషిక్తానాం - దానం గ్రాహ్య మేవేతి భావః. ౨౩. తస్య సూతకస్య ప్రాక్పూర్వం కృతం

వివాహోత్సవయజ్ఞేషు జాతే చ మృతసూచకే,
తస్య పూర్వకృతం చాన్నం భోజ్యం తన్మనురబ్రవీత్. ౨౮
సూతకే యస్తు గృహ్ణాతి తదజ్ఞానాన్న దోషభాక్,
దాతా దోష మవాప్నోతి యాచకాయ దదన్నపి. ౨౯
ప్రచ్ఛాద్య సూతకం యస్తు దదాత్యన్నం ద్విజాయ చ,
జ్ఞాత్వా గృహ్ణంతి యే విప్రాః దోషభాజ స్తఏవ హి. ౩౦

వివాహోత్సవయజ్ఞములయందు జననమరణాశౌచములు సంభవించినయెడల ఆయాశౌచమునకు పూర్వము సిద్ధము చేయఁబడిన అన్నాదికము భుజింపవచ్చునని మనువు చెప్పియున్నాఁడు. అజ్ఞానము వలన సూతకాన్నము భుజించినవానికి దోషము లేదు. ఆశౌచము వచ్చినపుడు ఇతరులకు అన్నము పెట్టినయెడల దోషము సంభవించును; గావున ఆశౌచము ఉన్నపుడు ఇతరులకు అన్నము పెట్టఁగూడదు. మఱియు ఆశౌచమును కప్పిపుచ్చి బ్రాహ్మణునకు అన్నము పెట్టినయాతఁడును, ఆశౌచము ఉన్నదని యెఱిఁగియు వారి అన్నమును భుజించిన యాతఁడు దోషము పొందును.

తస్మాత్సూతకశుద్ధ్యర్థం పితుః కుర్యాత్సపిండనమ్,
తతః పితృగణైస్సార్ధం పితృలోకం స గచ్ఛతి. ౩౧
ద్వాదశాహే త్రిపక్షే వా షణ్మాసే వత్సరేఽపి వా,
సపిండీకరణం ప్రోక్తం మునిభిస్తత్త్వదర్శిభిః. ౩౨
మయా తు ప్రోచ్యతే తార్క్ష్య! శాస్త్రధర్మానుసారతః,
చతుర్ణామేవ వర్ణానాం ద్వాదశాహే సపిండనమ్. ౩౩

సిద్ధాన్నం పక్వాన్నం తు భోజ్యం భోజనార్హమేవ. పశ్చాత్కృతం నేతి. ౨౮. తదజ్ఞానాత్ తస్య సూతకస్యాజ్ఞానాత్ గృహ్ణాతి. సూతకే కథితేఽపి యో యాచతే తస్మై తద్దదత్సన్ దాతా దోషభాగ్భవతీత్యర్థః. ౨౯. దాతా దోష మవాప్నోతీత్యేవ వివృణోతి. ప్రచ్ఛాద్య సంగోప్య. ౩౦. తస్మాత్సూతకం సపిండనం వినా నాపయాతి, తదపసరణం వినా చ దానాదానయో రనధికారాదితి హేతోః సపిండనం కుర్యాదితి. సపిండనాత్ సః ప్రేతః పితా. ౩౧. మునిమతోక్తసపిండనకాలం ప్రదర్శయతి-ద్వాదశాహే ఇతి. ౩౨. మునిమతం నిరాకృత్య యుగానురూపం స్వమతం కథయతి-మయేతి. ౩౩. మునిమతే బహూన్దోషాన్ ప్రదర్శ్య స్వమతం ద్రఢయతి - అని

అనిత్యాత్కలిధర్మాణాం పుంసాం చైవాయుషః క్షయాత్,
అస్థిరత్వా చ్ఛరీరస్య ద్వాదశాహే ప్రశస్యతే ౩౦

కాఁబట్టి అశౌచశుద్ధికై తండ్రి మరణించినపుడు సపిండీకరణము జేయవలెను. అట్లు సపిండీకరణము నాచరించినయెడల మృతిబొందిన యతఁడు పితృగణములతోఁ బితృలోకమును బొందును. ద్వాదశాహమునను త్రిపక్షంబునను షణ్మాసంబునను సంవత్సరాంతమునను సపిండీకరణము జేయవచ్చు నని తత్త్వవేత్త లగు మునులు చెప్పియున్నారు. శాస్త్రధర్మముల నాలోచించిన యెడల నా నాలుగు వర్ణములవారికిని ద్వాదశాహంబున సపిండీకరణము జేయుట ఉత్తమమని నా యభిప్రాయము. కారణ మేమంటే! కలిధర్మము లనంతములగుటవలనను, పురుషులకు ఆయుర్దాయము క్షీణించుచుండుటవలనను, శరీరము లస్థిరము లగుటవలనను పండ్రెండవదినంబున సపిండీకరణము జేయుట అత్యుత్తమ మని యెఱుంగుము.

వ్రతబంధోత్సవాదీని వ్రతస్యోద్యాపనాని చ,
వివాహాది భవేన్నైవ మృతే చ గృహమేధిని. ౩౧

భిక్షు ర్భిక్షాం న గృహ్ణాతి హంతకారో న గృహ్యతే,
నిత్యం నైమిత్తికం లుప్యే ద్యావ త్పిండం న మేళితమ్. ౩౨

కర్మలోపా త్ప్రత్యవాయీ భవే త్తస్మా త్సపిండనమ్,
నిరగ్నిక స్సాగ్నికో వా ద్వాదశాహే సమాచరేత్. ౩౩

యత్ఫలం సర్వతీర్థేషు సర్వయజ్ఞేషు యత్ఫలమ్,
తత్ఫలం సమవాప్నోతి ద్వాదశాహే సపిండనాత్. ౩౪

ఉపనయనము, యజ్ఞాద్యుత్సవములు, వ్రతోద్యాపనములు, వివాహాదిశుభకర్మలు తండ్రిమరణించినపుడు చేయఁగూడదు. సపిండీకరణము జేయువఱకు సన్న్యాసులు భిక్షను గ్రహింపరు. వైశ్వదేవము

త్యా దితి పంచభిః కలిధర్మాణా మనిత్యత్వ మేవాహ. పుంసా మిత్యాది. ౩౦. వ్రతబంధః ఉపవీతసంస్కారః-ఉత్సవః యజ్ఞాదీనాం-ఆదిశబ్దేన హోళికాదీనామపి వ్రతస్య కార్తికాదే ర్వ్రతమాత్రస్య ఆదీని ద్విరాగమనాదీ న్యపి గృహమేధిని వృద్ధేసతి. ౩౧. భిక్షుః సన్న్యాసీ. హంతకారః వైశ్వదేవ ముకుర్వతాం పంచమాసా నివర్తకాన్న విభాగః. ౩౨. ప్రత్యవాయీ దోషభాగ్భవేత్. ౩౩, ౩౪. అతః ద్వాదశాహ

చేయకూడదు. నిత్యనైమిత్తికములు లోపించును. కర్మలోపంబువలన ప్రత్యవాయము కలుగును; కాబట్టి నిరగ్నికుఁడైనను సాగ్నికుఁడైనను ద్వాదశాహంబున సపిండీకరణము చేయఁదగును. ద్వాదశాహంబున సపిండీకరణము చేయుటవలన సర్వతీర్థస్నానఫలమును సర్వయజ్ఞఫలమును బొందును.

అతః స్నాత్వా మృతస్థానే గోమయే నోపలేపితే,
శాస్త్రోక్తేన విధానేన సపిండీం కారయేత్సుతః. ౩౫
పాద్యార్ఘ్యాచమనీయాద్యైర్విశ్వేదేవాంశ్చ పూజయేత్,
కౌ పిత్రే వికిరం దత్త్వా హ్యపః పున రుపస్పృశేత్. ౩౬
దద్యాత్పితామహాదీనాం త్రీన్పిండాంశ్చ యథాక్రమమ్,
వసురుద్రార్కరూపాణాం చతుర్థం మృతకస్య చ. ౩౭
చందనైస్తులసీపత్రైర్ధూపైర్దీపైస్సుభోజనైః,
ముఖవాసైస్సువస్త్రైశ్చ దక్షిణాభిశ్చ పూజయేత్. ౩౮
ప్రేతపిండం త్రిధా కృత్వా సువర్ణస్య శలాకయా,
పితామహాదిపిండేషు మేళయేత్తం పృథక్పృథక్. ౩౯
పితామహ్యా సమం మాతుః పితామహాసమం పితుః,
సపిండీకరణం కుర్యా దితి తార్క్ష్య! మతం మమ. ౪౦

సపిండీకరణవిధాన మెట్లంటే? స్నానము జేసి మృతస్థానంబున నలికి శాస్త్రోక్తవిధానముగా సపిండీకరణము జేయవలెను. పాద్యార్ఘ్యంబులచేతను ఆచమనముచేతను విశ్వేదేవులను పూజించి భూమిని వికిరంబిడి ఆచమనము జేయవలెను. తరువాత వసురుద్రాదిత్యస్వరూపులగు పితృపితామహప్రపితామహులకును మృతునకును పిండప్రదానము జేయవలెను. చందనముచేతను తులసీపత్రంబులచేతను ధూపదీపవస్త్రదక్షిణంబులచేతను బూజించిన పిమ్మట ప్రేతపిండమును సువర్ణశలాకచే మూడుముక్కలుగా జేసి పితామహాది పిండంబులయందు

---

స్యాచ్ఛక్యతశ్చార్ధతో. మృతస్థానం గోమయే నోపలిప్య సపిండనం కారయేత్. ౩౫. అపః ఉపస్పృశేత్ హస్తౌ ప్రక్షాళ్య ఆచామేత్. ౩౬-౩౯. పితుః పిండస్య పితామహాదిపిండైస్సహైకీకరణం సపిండీకరణ మితి. ౪౦. అథ శబ్దో విధానాంతరే.

వేఱువేఱుగా కలుపవలెను. తల్లి మృతి బొందిన పితామహితోను తండ్రి మరణించిన పితామహునితోను సపిండీకరణము జేయవలెను.

మృతే పితరి యస్యాథ విద్యతే చ పితామహః,
తేన దేయాస్త్రయః పిండాః ప్రపితామహపూర్వకాః. ౪౧
తేభ్యశ్చ పైతృకం పిండం మేళయేత్తం త్రిధాకృతమ్,
మాతర్యగ్రే ప్రశాంతాయాం విద్యతే చ పితామహీ. ౪౨
తదా మాతృకశ్రాద్ధేఽపి కుర్యాత్పైతృకవద్విధిః,
యద్వా మయి మహాలక్ష్మ్యాం తయోః పిండం చ మేళయేత్. ౪౩

పితామహుఁడు జీవించియుండఁ దండ్రి మరణించినయెడల సపిండీకరణ మెట్లన, ప్రపితామహాదు లగు మువ్వురకు పిండప్రదానము జేసి వారిపిండములతోఁ దండ్రిపిండమును కలుపవలెను. ఇట్లే పితామహి జీవించియుండఁ దల్లి మరణించినయెడల ప్రపితామహి మొదలు ముగ్గురకు పిండప్రదానము జేసి వారిపిండములతోఁ దల్లిపిండమును కలుపవలెను. పితామహీపితామహరూపు లగు లక్ష్మీనారాయణులయందు మాతాపితరులపిండములను కలుపవలెను. అని మతాంతరము కలదు.

అపుత్రాయాః స్త్రియాః కుర్యాత్పతిస్సాపిండనాదికమ్,
శ్వశ్ర్వాదిభి స్సహైవాస్యాస్సపిండీకరణం భవేత్. ౪౪
భర్త్రాదిభిః స్త్రిభిః కార్యం సపిండీకరణం స్త్రియాః
నైతన్మమ మతం తార్క్ష్య! పత్యా సాపిండ్యమర్హతి. ౪౫

అపుత్ర యగు భార్య మృతిబొందినయెడల భర్త తన తల్లి మొదలగువారితో సపిండీకరణము జేయవలెను. స్త్రీకి భర్తతో సపిండీ

---

౪౧. పూర్వం సువర్ణశలాకయా త్రిధా కృతం పైతృకం పితుః. పిండం తేభ్యః ప్రపితామహాదిత్రిభిః పిండై స్సహ మేళయే దితి. అగ్రే పితామహ్యాః పూర్వం మాతరి ప్రశాంతాయాంసత్యాం పైతృకవత్ప్రపితామహ్యాదీనాం త్రీన్పిండాన్ దత్వాతైస్సహ మాతుః పిండం మేళయే దితి. ౪౨. పక్షాంతర మాహ- యద్వేతి. తయోః మాతాపిత్రోః పితామహరూపే మయి పితుః పిండం-లక్ష్మ్యాంమాతుశ్చేతి. ౪౩. స్త్రియాః క్రియాకరణే పత్యురధికారోఽస్తీ త్యాహ-అపుత్రాయా ఇతి. ౪౪. మతాంతరం నిరాకరోతి- భర్త్రేతి భర్త్రా స్వకాం తేన సహ న తు సపిండనం యోగ్యం భవతి- అర్ధాంగిత్వాత్. ౪౫. దయితా చ పతిశ్చ దంపతీ 'జాయాదయితయో ర్జందంభావా

కరణము జేయవలయునని యున్నది. గాని అయ్యది నాకు సమ్మతము కాదు.

ఏకాం చితాం సమారూఢా దంపతీ యది కాశ్యప!,
తృణ మంతరతః కృత్వా శ్వశురాదే స్తదా చరేత్. ౪౬
ఏక ఏవ సుతః కుర్యా దాదా పిండాదికం పితుః,
తదూర్ధ్వం చ ప్రకుర్వీత సత్యా స్స్నానం పున శ్చరేత్. ౪౭
మృతాశం యా సమారూఢా దశాహాభ్యంతరే సతీ,
తస్యా భర్తు ర్దినే కార్యం శయ్యాదానం సపిండనమ్. ౪౮

భార్యాభర్తలేక కాలంబున మృతిబొందినయెడల వారల సపిండీకరణము భర్త పితృపితామహ ప్రపితామహులతోఁ జేయవలసియుండును. కాబట్టి శ్వశురాదుల మధ్యను దృణమునుంచి సపిండీకరణము జేయవలెను. తండ్రి మృతిబొందినపుడు ఒకకుమారుఁడే సపిండీకరణము జేయవలెను. అట్లే తల్లికిని జేయవలెను. భర్త మృతిబొందినపుడు అతని దశరాత్రులమధ్యను భార్య సహగమనము జేసినయెడల దానికి భర్తృసాపిండ్యదినంబుననే సపిండీకరణము మొదలగునవి జేయవలెను.

కృత్వా సపిండనం తార్క్ష్య! ప్రకుర్యాత్పితృతర్పణమ్,
ఉదాహరేత్స్వధాకారం వేదమంత్రైస్సమన్వితమ్. ౪౯
అతిథిం భోజయే త్పశ్చా ద్ధంతకారం చ సర్వదా,
తేన తృప్యంతి పితరో మునయో దేవదానవాః. ౫౦
గ్రాసమాత్రా భవేద్భిక్షా చతుర్గ్రాసం తు పుష్కలమ్,
పుష్కలాని చ చత్వారి హంతకారో విధీయతే. ౫౧

ఇట్లు సపిండీకరణము జేసి పితృతర్పణము జేయవలెను. అనంతరము వేదమంత్రములతోఁ గూడిన స్వధాకారము నుచ్చరింపవలెను.

---

భవతః' శ్వశురాదేః-అంతరతః మధ్యే తృణం కృత్వా తత్సత్యా స్సపిండనం కుర్యా దిత్యన్వయః. ౪౬. సత్యా స్సపిండనాదిక మప్యేక ఏవ సుతః కుర్యాత్, న తు ద్వితీయః. ౪౮. యదికే దశాహమధ్యే జ్ఞాత్వా మృతాయా స్సత్యా శ్శ్రవణాదిదినా దవశేష దినేషు దశరాత్రం విధాయ భర్తు స్సపిండదినే సపిండనాదికం కార్యమ్. దశాహాదనంతరం జ్ఞాత్వా మృతాయాస్తు శ్రవణదినాద్ద్వాదశేఽహనీతి. ౪౯-౫౦. హంత

తరువాత అతిథికి భోజనం బిడి హంతకారమునిచ్చిన పితరులు మునులు దేవదానవులు తృప్తిం బొందుదురు. హంతకారప్రమాణ మే దనగా ఒక గ్రాసము భిక్ష యనంబడును. నాలుగు గ్రాసములు పుష్కల మనంబడును. నాలుగు పుష్కలములు హంతకారమని చెప్పంబడును.

సపిండ్యాం విప్రచరణౌ పూజయేచ్చందనాక్షతైః,
దానం తస్మై ప్రదాతవ్య మక్షయ్యతృప్తిహేతవే.　　౫౨
వర్షవృత్తిం ఘృతం చాన్నం సువర్ణం రజతం సుగామ్,
అశ్వం గజం రథం భూమి మాచార్యాయ ప్రదాపయేత్.　　౫౩
తతశ్చ పూజయేన్మంత్రైస్స్వస్తివాచనపూర్వకమ్,
కుంకుమాక్షతసై వేద్యైర్గ్రహాన్ దేవీం వినాయకమ్.　　౫౪
ఆచార్యస్తు తతః కుర్యా దభిషేకం సమంత్రకమ్,
బధ్వా సూత్రం కరే దద్యాన్మంత్రపూతాం స్తథాఽక్షతాన్.　　౫౫
తతశ్చ భోజయేద్విప్రా న్మృష్టాన్నై ర్వివిధైశ్శుభైః,
దద్యాత్సదక్షిణాం స్తేభ్యస్సజలాన్నాన్ ద్విషడ్ఘటాన్.　　౫౬
వార్యాయుధప్రతోదస్తు దండస్తు ద్విజభోజనాత్,
స్ప్రష్టవ్యోఽనంతరం వర్ణైశ్శుధ్యేరం స్తే తతః క్రమాత్.　　౫౭

సపిండీకరణమునందు బ్రాహ్మణచరణములను గంధాక్షతలచేం బూజింపవలెను. అక్షయ్యతృప్తికొఱకై వానికి దాన మీయవలెను. సంవత్సరమునకు సరిపడు అన్నమును, ఘృతమును, సువర్ణమును, వెండిని, గోవును, అశ్వమును, గజమును, రథమును, భూమిని ఆచార్యుని కివ్వవలెను. పుణ్యాహవాచన మైనపిమ్మట నవగ్రహములను, సరస్వతిని, వినాయకుని మంత్రములచేం బూజింపవలెను. పిమ్మట నాచార్యుండు

కారప్రమాణ మాహ. చత్వారి పుష్కలాని షోడశగ్రాసమాత్రమ్. ౫౧,౫౨. సుగాం సుశీలాం గామ్. ౫౩,౫౪. సూత్రం రక్షాసూత్రమ్. ౫౫. శుభైః సరసైః బహుశర్కరాయుక్తై రిత్యర్థః. సజలాన్నాన్ జలపూర్ణాన్నోదకదక్షిణాసహితాన్ ద్విషట్ ద్వాదశ ఘటాన్ ద్వాదశవిప్రాది న్భోజయిత్వా తేభ్యో దద్యాదితి. ౫౬. ద్విజభోజనానంతరం వర్ణై ర్విప్రాదిభి ర్వార్యాద్యాః క్రమాత్ స్ప్రష్టవ్యాః తతస్తే శుధ్యేర న్నిత్యన్వయః. బ్రాహ్మణాదిభి శ్చతుర్భి ర్వర్ణై శ్చత్వారః క్రమాత్స్ప్రష్టవ్యా ఇత్యర్థః.

యజమానునకు అభిషేకము జేసి హస్తమున రక్షాబంధనము గట్టి మంత్రపూతంబు లగు నక్షతల నీయవలెను. అనంతరము పండ్రెండు గురు బ్రాహ్మణులకు మృష్టాన్నమిడి దక్షిణాసమన్వితంబులగు పండ్రెండు ఉదకుంభదానంబులఁ జేయవలెను. తర్వాత బ్రాహ్మణు లుదకమును క్షత్రియు లాయుధమును వైశ్యులు ప్రతోదమును శూద్రులు దండమును స్పృశింపఁ బరిశుద్ధు లగుదురు.

ఏవం సపిండనం కృత్వా క్రియా వస్త్రాణి సంత్యజేత్,
శుక్లాంబరధరో భూత్వా శయ్యాదానం ప్రదాపయేత్. ౫౮
శయ్యాదానం ప్రశంసంతి సర్వే దేవాస్సవాసవాః,
తస్మాచ్ఛయ్యా ప్రదాతవ్యా మరణే జీవితేఽపి వా. ౫౯
సారదారుమయీం రమ్యాం సుచిత్రైశ్చిత్రితాం దృఢామ్,
పట్టసూత్రైర్వితనితాం హేమపత్రైరలంకృతామ్. ౬౦
హంసతూలీప్రతిచ్ఛన్నాం శుభశీర్షోపధానికామ్,
ప్రచ్ఛాదనపటీయుక్తాం పుష్పగంధైస్సువాసితామ్. ౬౧
దివ్యబంధైస్సుబంధాం చ సువిశాలాం సుఖప్రదామ్,
శయ్యామేవంవిధాం కృత్వా హ్యాస్తృతాయాం న్యసేద్భువి. ౬౨

ఇట్లు సపిండనము జేసి కర్మవస్త్రములను విడనాడి శుక్లాంబరధరుఁడై శయ్యాదానము జేయవలెను. దేవేంద్రాది దేవత లీ శయ్యాదానమును ప్రశంస జేయుదురు. కాఁబట్టి మరణించినపుడేని జీవించినపుడేని శయ్యాదానము జేయవలెను. సారంబులగు దారువులచే నిర్మింపఁ

౫౭. అథ సపిండనానంతరం-శయ్యాదానం నిరూపయతి-ఏవ మిత్యాది. ౫౮, ౫౯. శయ్యాం ఆస్తృతాం విచిత్రవస్త్రేణాఽచ్ఛాదితాయాం భువి న్యసేత్ స్థాపయేత్ ఇతి తృతీయేనాన్వయః. కథంభూతాం సారదారుమయీం భారసంవహనక్షమ్వరచితాం యద్వా సారరూపో దారు ర్విద్రుమ స్తన్మయీం వా రమ్యా మితి విశేషేణ ఉక్త రమ్యతా మేవాహ-సచిత్రైరితి వితనితాం సంగ్రథితామ్. లోహపత్రస్థానే హేమపత్రైరితి. ౬౦. హంసవ దుజ్జ్వలా మృదులా చ యా తూలీఅధః ప్రస్తరణికా (భాషాయాం 'తులాఈ' చేతి.) తయా ప్రతిచ్ఛన్నాంఆచ్ఛాదితాం శుభానిసుంద రాణిశీర్షోపధానికాని యస్యాం (భాషాయాం 'తకియా' ఇతి) ప్రచ్ఛాదనపటీ తదాచ్ఛాదనిక ముపరితనవస్త్రం దివ్యబంధైః (భాషాయాం 'కసణా' ఇతి). ౬౨. ఛత్రం చతుశ్చరణసంలగ్నం రథస్థ

బడినదియు, చిత్రవిచిత్రంబులచే చిత్రింపఁబడినదియు, దృఢమైనదియు, పట్టుసూత్రంబులచే కట్టఁబడిన వితానము కలదియు, బంగారుపువ్వంబులచే నలంకరింపఁబడినదియు, హంసతూలికాతల్పముతోఁ గూడినదియు, చక్కని తలగడలు శాలీనులతోను గూడినదియు, దుప్పటితోఁ గూడినదియు, పుష్పగంధసువాసితంబును దివ్యంబులగు బంధంబులతోఁ గూడినదియు విశాలమైనదియు నగు శయ్యను నాస్తృతంబగు భూమిపై నుంచవలెను.

ఛత్రం దీపాలయం రౌప్యం చామరాసనభాజనమ్,
భృంగారకరకాఽఽదర్శం పంచవర్ణవితానకమ్. ౬౩
శయనస్య భవేత్కించిద్యచ్చాన్య దుపకారకమ్,
తత్సర్వం పరితస్తస్యాస్స్వే స్వే స్థానే నియోజయేత్. ౬౪
తస్యాం సంస్థాపయేద్దైమం హరిం లక్ష్మీసమన్వితమ్,
సర్వాభరణసంయుక్త మాయుధాంబరసంయుతమ్. ౬౫
స్త్రీణాం చ శయనే దృశ్యా కజ్జలాలక్తకుంకుమమ్,
వస్త్రం భూషాదికం యచ్చ సర్వమేవ ప్రదాపయేత్. ౬౬

ఛత్రమును వెండి మొదలగు లోహములచే నిర్మితంబగు దీపపు శమ్మను వింజామరములను పీటను జలపానపాత్రమును జారీని స్వల్పపాత్రను అద్దమును పంచవర్ణముల చాందినీవస్త్రమును మరియు తాంబూలపళ్ళెరము మొదలగు శయనోపస్కరములను ఆశయ్యకు అంతటను వానివానిస్థలంబుల నుంచవలెను. పిమ్మట నాశయ్యను బంగారముచేఁ జేయింపఁబడిన లక్ష్మీనారాయణులను సర్వాభరణవస్త్రాదులచే

వత్. రౌప్యం రూప్యాదిధాతుమయం దీపాలయం('దివటీ'ఇతిభాషాయాం)చామరం వ్యజనం ఆసనం కాష్ఠమయం ('చౌకీ'ఇతి భాషాయాం) భాజనం జలపానపాత్రం, భృంగారం గడూశా ('గడశీఝూ'రితి భాషాయాం) కరకా అల్పఘటాః, కలశ మితి కమండలుర్వా. ఆదర్శం దర్పణమ్. ౬౩. అన్యత్ తాంబూలపాత్రాద్యుపశౌగకపామ త్రీం స్వే స్వే స్థానే ఇతి-ఛత్రం పాదేషు-దీపాలయం వామే-చామరం శయ్యోపరి-ఆసనం దక్షిణే భాజనం తదుపరి-వితానం ఛత్రస్యోపరి నియోజయే దితి. ౬౪, ౬౫. స్త్రీణాం సౌభాగ్యవతీనామ్. ౬౬. కర్ణాంగులీయాదిభిః దంపత్యోరాభరణాని తైశ్చ

నలంకరించియుంచవలెను. సౌభాగ్యవతులగు స్త్రీల నుద్దేశించి శయ్యా దానము జేయునపుడు కాటుకను లత్తుకను కుంకుమను వస్త్రమును అలంకారములను పూర్వోక్తంబు లగు వస్తువులను ఉంచి దానము జేయవలెను.

తతో విప్రం సపత్నీకం గంధపుష్పై రలంకృతమ్,
కర్ణాంగులీయాభరణైః కంఠసూత్రైశ్చ కాంచనైః. ౧౭
ఉష్ణీష ముత్తరీయం చ చోళకం పరిధాయ చ,
స్థాపయేత్సుఖశయ్యాయాం లక్ష్మీనారాయణాగ్రతః. ౧౮

అనంతరము సపత్నీకుఁడగు బ్రాహ్మణుని గంధపుష్పాదులచేతను మకరకుండలాంగుళీయకకంఠసూత్రములచేతను నలంకరించి తలపాగాను బెట్టి ఉత్తరీయము నిచ్చి కంచుకము దొడిగి ఆశయ్యమీఁదను లక్ష్మీనారాయణాగ్రభాగంబున గూర్చుండఁబెట్టవలెను.

కుంకుమైర్గ పుష్పమాలాభిర్హరిం లక్ష్మీం సమర్చయేత్,
పూజయేల్లోకపాలాంశ్చ గ్రహాన్దేవం వినాయకమ్. ౧౯
ఉత్తరాభిముఖో భూత్వా గృహీత్వా కుసుమాంజలిమ్,
ఉచ్చారయే దిమం మంత్రం విప్రస్య పురతస్స్థితః. ౨౦
యథా కృష్ణ! త్వదీయాస్తి శయ్యా క్షీరోదసాగరే,
తథా భూయా దశూన్యేయం మమ జన్మని జన్మని. ౨౧
ఏవం పుష్పాంజలిం విప్రే ప్రతిమాయాం హరేః క్షిపేత్,
తతస్సోపస్కరాం శయ్యాం దానసంకల్పపూర్వకమ్. ౨౨
దద్యాద్ద్విజోపదేష్ట్రే చ గురవే బ్రహ్మవాదినే,
గృహాణ బ్రాహ్మణైనాం త్వం కో దదాతీతి కీర్తయేత్. ౨౩
ఆందోళయే ద్ద్విజం లక్ష్మీం హరిం చ శయనస్థితమ్,
తతః ప్రదక్షిణీకృత్య ప్రణిపత్య విసర్జయేత్. ౨౪
సర్వోపస్కరణై ర్యుక్తం ప్రదద్యాదతిసుందరమ్,
శయ్యాయాం సుఖసుప్త్యర్థం గృహం చ విభవే సతి. ౨౫

అలంకృతం విప్రం-స్థాపయే దిత్యుత్తరే ణాన్వయః. ౧౭-౨౦. మమేయ మితి జీవత్సే-మరణే మమ పితు రితి విశేషః, ఇయం శయ్యా అశూన్యా-మయా మమ పిత్రా వా సహైవ భూయా దిత్యర్థః. ౨౧, ౨౨. కో దదాతీతి దానాభిమానం న కుర్యా దితి.

అనంతరము కుంకుమచేతను పుష్పమాలికలచేతను లక్ష్మీనారాయణులను ఇంద్రాదిలోకపాలకులను నవగ్రహములను సరస్వతిని వినాయకుని బూజించి ఉత్తరాభిముఖుఁడై దోసిలియందు పుష్పముల నునిచికొని "యథా కృష్ణ! త్వదీయాస్తి శయ్యా క్షీరోదసాగరే, తథా భూయా దశూన్యేయం మమ జన్మని జన్మని." అను మంత్రమును బ్రాహ్మణున కెదురుగా నిలిచి పఠించి బ్రాహ్మణులమీఁదను లక్ష్మీనారాయణుల ప్రతిమలమీఁదను జల్లవలెను. తర్వాతను సంకల్పించి సోపస్కరంబగు శయ్యను వ్రతోపదేష్టయు బ్రహ్మవాదియు నగు గురువునకు "హే బ్రాహ్మణ ఏనాం త్వం గృహాణేతి దదాతి" యని కీర్తించుచు దానము చేయవలెను. అనంతరము శయ్యమీఁద నున్న బ్రాహ్మణుని లక్ష్మీనారాయణులను నూరేగించి, ప్రదక్షిణము జేసి నమస్కరించి విసర్జింపవలెను. ఇట్లు శయ్యాదానము జేసి సామర్థ్యమున్నయెడల శయ్యమీఁద సుఖముగ శయనించుటకై సర్వోపకరణసంయుక్తంబగు గృహమును గూడ దానము జేయవలెను.

జీవమానస్స్వహస్తేన యది శయ్యాం దదాతి యః,
తజ్జీవతా వృషోత్సర్గం పర్వణీషు సమాచరేత్. ౨౬
ఇయమేకస్య దాతవ్యా బహూనాం న కదాచన,
సా విభక్తా చ విక్రీతా దాతారాం పాతయత్యధః, ౨౭
పాత్రే ప్రదాయ శయనం వాంఛితం ఫలమాప్నుయాత్,
పితా చ దాతా తనయః పరత్రేహ చ మోదతే. ౨౮

శయ్యాదానమును వృషోత్సర్గమును జీవించియున్నపుడు జేయ దలఁచినయెడల పర్వములయందు నాచరింపవలెను. శయ్య నంతయు నొకనికే ఇవ్వవలెను గాని విడదీసి అనేకులకు ఇవ్వకూడదు. శయ్యను విభాగించి ఇచ్చినను అమ్మినను దాత అధోలోకమును బొందును. పాత్రభూతుండగు వానికి శయ్యాదానము జేసిన వాంఛితమనోరథములు లభించును. తండ్రి ఇచ్చినను పుత్రుఁ డిచ్చినను ఇహపరసుఖంబులు బొందును.

---

౨౩,౨౪. సర్వోపస్కరణై ర్గృహోచితసర్వవస్తుభిః సహితం సుఖసుప్త్యర్థం సుఖేన నిద్రాసుప్తిః తదర్థం గృహం చ దద్యాదితి. ౨౫-౨౯. అభూతసంప్లవం మహాప్రళ

పురందరగృహే దివ్యే సూర్యపుత్రాలయేఽపి చ,
ఉపతిష్ఠే న్న సందేహ శ్శయ్యాదానప్రభావతః. ౭౯
విమానవర మారూఢస్సేవ్యమానోఽప్సరోగణైః,
ఆభూతసంప్లవం యావ త్తిష్ఠత్యాతంకవర్జితః. ౮౦
సర్వతీర్థేషు య త్పుణ్యం సర్వపర్వాదినేషు చ,
తేభ్యశ్చాప్యధికం పుణ్యం శయ్యాదానోద్భవం భవేత్. ౮౧

శయ్యాదానప్రభావంబువలన దివ్యంబగు స్వర్గంబునను యమాలయంబునను శ్రేష్ఠంబగు విమానము నధిష్ఠించి అప్సరస్సేవ్యమానుఁడై ఏవిధంబు లగు పీడలు లేక మహాప్రళయమువఱకు సంచరించుచుండును. సందేహములేదు తీర్థయాత్రాదిసమస్తపుణ్యంబులకంటెను శయ్యాదానోద్భవం బగు పుణ్యం బధికం బని తెలిసికొనుము.

ఏవం దత్వా సుతశ్శయ్యాం పదదానం ప్రదాపయేత్,
తచ్ఛృణుష్వ మయాఽఽఖ్యాతం యథావత్కథయామి తే. ౮౨
ఛత్రోపానహవస్త్రాణి ముద్రికా చ కమండలుః,
ఆసనం పంచపాత్రాణి పదం సప్తవిధం స్మృతమ్. ౮౩
దండేన తామ్రపాత్రేణ హ్యామాన్నై ర్భోజనైరపి,
అర్ఘ్యయజ్ఞోపవీతైశ్చ పదం సంపూర్ణతాం వ్రజేత్. ౮౪
త్రయోదశపదానీత్థం యథాశక్త్యా విధాయ చ,
త్రయోదశేభ్యో విప్రేభ్యః ప్రదద్యాద్ద్వాదశేఽహని. ౮౫
అనేన పదదానేన ధార్మికా యాంతి సద్గతిమ్,
యమమార్గగతానాం చ పదదానం సుఖప్రదమ్. ౮౬

ఇట్లు శయ్యాదానము జేసి పదదానము జేయవలెను. ఆపదదానవిధిని యథాశాస్త్రముగాఁ దెలియఁజెప్పెద వినుము. ఛత్రోపానహవస్త్రములు ముద్రిక కమండలువు ఆసనము పంచపాత్రములు పద మని పిలువఁబడును. పదము ఐదు విధములు. మఱియు పదము పదుమూఁడు విధము లనికూడ చెప్పఁబడుచున్నది. ఆపదుమూఁడును ఎవ్వియనఁ

---

యపర్యంతం ప్రళయే లీనోఽపి పునస్సృష్టిసమయే తత్రైవోత్పద్య ఆతంకవర్జితః పీడారహితః స్వర్గే తిష్ఠతీతి పూర్వవద్ జ్ఞాతవ్యమ్. ౮౦-౮౨. శయ్యాదానోత్తరం పదదానం ప్రదద్యాదిత్యాహ. ఛత్రేతి. ౮౩-౮౪. పథి యమమార్గే సుఖం నిస్తరతే

దండము, రాగిచెంబు, ఆమాన్నము, భోజనము, అర్ఘ్యము, యజ్ఞోప వీతము పూర్వోక్తపంచవిధపదాంతర్గతంబులగు వస్తువులు ఏనును కలిసి పదము పదుమూఁడువిధము లైనది. ఇట్లు పదుమూఁడువిధంబు లగు పదములను యథాశక్తిగా త్రయోదశసంఖ్యాకు లగు బ్రాహ్మణులకు పండ్రెండవ దినంబున నివ్వవలెను. ఇట్లు పదదానము జేయుటవలన ధార్మికులు సద్గతిని బొందుదురు. పాపాత్ములు సుఖము బొందుదురు.

ఆతప స్తత్ర వై రౌద్రో దహ్యతే యేన మానవః,
ఛత్రదానేన సుచ్ఛాయా జాయతే తస్య మూర్ధని. ౮౭
అతికంటకసంకీర్ణే యమలోకస్య వర్త్మని,
అశ్వారూఢాశ్చ తే యాంతి దదతే యే హ్యుపానహౌ. ౮౮
శీతోష్ణవాతదుఃఖాని తత్ర ఘోరాణి ఖేచర!
వస్త్రదానప్రభావేణ సుఖం నిస్తరతే పథి. ౮౯
యమదూతా మహారౌద్రాః కరాళాః కృష్ణపింగళాః,
న పీడయంతి తం మార్గే ముద్రికాయాః ప్రదానతః. ౯౦
బహుఘర్మసమాకీర్ణే నిర్వాతే తోయవర్జితే,
కమండలుప్రదానేన తృషితః పిబతే జలమ్. ౯౧
మృతోద్దేశేన యో దద్యాదుదపాత్రం చ తామ్రజమ్,
ప్రపాదానసహస్రస్య యత్ఫలం సోఽశ్నుతే ధ్రువమ్. ౯౨
ఆసనే భోజనే చైవ దత్తే సమ్యగ్ద్విజాతయే,
సుఖేన భుక్త్వా పాథేయం పథి గచ్ఛత్యనై శ్శనైః. ౯౩
ఏవం సపిండనదినే దత్వా దానం విధానతః,
బహూంత్సంభోజయేద్విప్రా న్యః శ్వపాకాదికానపి. ౯౪

యమమార్గంబున నెండ యతిరౌద్రంబుగా నుండును. కాఁబట్టి ఛత్రదానము జేసినయెడల నెండవలన బాధ నొందక శీతలచ్ఛాయను వెళ్లును. ఉపానహ (చెప్పులు) దానము జేయుటవలన నతిసంకటసంకీర్ణం బగు యమమార్గంబున నశ్వారూఢులై సుఖంబుగా వెళ్లుదురు. వస్త్ర దానము జేయుటవలన యమమార్గంబున వర్ష వాతాతపబాధలనొందక సుఖముగా వెళ్లుదురు. ముద్రికాదానము జేయుటచే మహారౌద్రులు

భుక్త్వా. ౮౮-౯౨. పాథేయం పరలోకభోగ్యమ్. ౯౩-౯౪. వను "ఉత్తమం

కరాళురు కృష్ణపింగళులు అగుయమదూతలవలన బాధనొందరు. కమండులుదానమువలన నతిఘర్మ (గాడ్పు) సమాకీర్ణంబును నిర్వాతంబును ఉదకశూన్యంబును నగు యమమార్గంబున జలమును ద్రావుచు సుఖముగా వెళ్లుదురు. తామ్రపాత్రను మృతోద్దేశ్యముగా నిచ్చిన యతఁడు సహస్రప్రపా (చలివేంద్ర) దానఫలము నొందును. పీటను పంచపాత్రలను దానము జేసినయెడల యమమార్గంబున బడి మెల్ల మెల్లగా నడచుచు పాథేయమును సుఖముగా భుజించును. ఇట్లు సపిండీకరణదినంబున దానములను యథావిధిగాఁ జేసి బ్రాహ్మణులకు విశేషముగా భోజనము బెట్టవలెను.

తతస్సపిండనా దూర్ధ్వ మర్వాక్సంవత్సరాదపి,
ప్రతిమాసం ప్రదాతవ్యో జలకుంభ స్సపిండకః. ౯౫
కృతస్య కరణం నాస్తి ప్రేతకార్యా దృతే ఖగ,
ప్రేతార్థం తు పునః కుర్యా దక్షయ్యతృప్తిహేతవే. ౯౬

సపిండీకరణానంతరము సంవత్సరమువఱకును ప్రతిమాసంబునను ఉదకుంభదానమును మాసికశ్రాద్ధమును జేయుచుండవలెను. వ్రతోద్యాపనాదుల నొకపర్యాయము ఆచరించిన మరలఁ జేయఁగూడదు. ప్రేతకార్యము మాత్రము మరలమరలఁ జేయుటవలన ప్రేతలకు అక్షయతృప్తి కలుగును. కాఁబట్టి తిరిగిదిరిగి చేయవచ్చును.

అతో విశేషం వక్ష్యామి మాసికస్యాబ్దికస్య చ,
పాక్షికస్య విశేషం చ విశేషతిథిషు మృతే. ౯౭
పౌర్ణమాస్యాం మృతో యస్తు చతుర్థీ తస్య ఊనికా,
చతుర్థ్యాం తు మృతో యస్తు నవమీ తస్య ఊనికా. ౯౮

షోడశం ప్రేతశ్రాద్ధం మయా తే కథితం ఖగ! శ్రపయిత్వా చరుం తార్క్ష్య! కుర్యాదేకాదశేఽహని" ఇతి ప్రాగుక్తత్వా దేకాదశాహే కృతాయామ ప్యుత్తమషోడశ్యాం పునః ప్రతిమాసం ఘటం పిండదానం చ కిమర్థ మితి చేత్తత్రాహ. కృతస్యేతి. అత్ర కృతస్య కరణం నాస్తీతి నిషేధస్తు ప్రేతకార్యం వినా వ్రతోద్యాపనాదిష్వేవ. ప్రేతార్థంతు పునఃకరణేన తస్యాక్షయతృప్తి ర్భవతీతి హేతోః పునరపి కుర్యాదిత్యర్థః. ౯౬. అతః మాసికాదీనా మావశ్యకత్వా దితి హేతోః విశేషాసు పౌర్ణమాస్యాదితిథిషు పురుషే మృతే సతి ప్రథమం పాక్షికవిశేషం వక్ష్యామీతి. ౯౭. తథే

నవమ్యాం తు మృతో య స్తు రిక్తా తస్య చతుర్దశీ,
ఇత్యేవం పాక్షికం శ్రాద్ధం కుర్యా ద్వింశతిమే దినే. ౯౯

మాసికాబ్దికములు ఆవశ్యకములు గనుక పౌర్ణమాస్యాదివిశేష తిథులయందు మరణించినయెడల పాక్షికశ్రాద్ధమును జెప్పెద వినుము. పూర్ణిమనాడు మరణించినయతనికి చవుతియందును, చవుతియందు మరణించిన యతనికి నవమియందును, నవమియందు మరణించినయతనికి చతుర్దశియందును మరణించిన రోజున కిరువదవ రోజున పాక్షిక శ్రాద్ధము నాచరింపవలసియుండును.

ఏక ఏవ యదా మాసస్సంక్రాంతిద్వయసంయుతః,
మాసద్వయగతం శ్రాద్ధం మలమాసే హి శస్యతే. ౧౦౦
ఏకస్మిన్మాసి మాసౌ ద్వౌ యది స్యాతాం తయోర్ద్వయోః,
తావేవ పక్షౌ తా ఏవ తిథయ స్త్రింశదేవ హి. ౧౦౧
తిథ్యర్ధే ప్రథమే పూర్వో ద్వితీయేఽర్ధే తదుత్తరః,
మాసా వితి బుధై శ్చింత్యౌ మలమాసస్య మధ్యగౌ. ౧౦౨
అసంక్రాంతే చ కర్తవ్యం సపిండీకరణం ఖగ!,
తథైవ మాసికం శ్రాద్ధం వార్షికం ప్రథమం తథా. ౧౦౩
సంవత్సరస్య మధ్యే తు యది స్యా దధిమాసికః,
తదా త్రయోదశే మాసి క్రియాప్రేతస్య వార్షికీ. ౧౦౪

---

వాహ-పౌర్ణమాస్య మితి ద్వాభ్యాం తిథిషు రిక్తాఖ్యా చతుర్థీ తస్య ప్రేతస్య ఈవాహ-పౌర్ణమాస్య మితి ద్వాభ్యాం తిథిషు రిక్తాఖ్యా చతుర్థీ తస్య ప్రేతస్య ఈ నికా పాక్షిక శ్రాద్ధవిధిః. ౯౮,౯౯. మాసికస్య విశేషమాహ-ఏక ఏవేతి త్రిభిః మల మాసే క్షయమాసే "రవిసంక్రమహీనో యో మలమాసోఽభిధీయతే, స ఏవ తు ద్విసంక్రాంతః క్షయమాసోఽప్యుదీరిత. ఇతి". యది కార్తికమార్గశీర్షయోః క్షయమాసాంతపాతే సతి కార్తికసంబంధీని మార్గశీర్ష సంబంధీని యాని శ్రాద్ధవ్రతాదీని చ యస్మిన్పక్షే యస్యాంతిథౌ యస్మిన్నపరాహ్ణాదికాలే విహితాని తాని క్షయమాసే తత్రతత్రైవ కర్తవ్యా నీతి. ౧౦౦. ఏకస్మిన్నాసే మాసద్వయం నిర్ధారయతి. తాః పంచదశ ఏవ తిథయః ఉభౌ పక్షౌ జ్ఞేయౌ. తాః పంచదశ ఏవ త్రింశత్తిథయో జ్ఞాతవ్యాః. ౧౦౧. అసంక్రాంతే అధికమాసే యది ద్వాదశఏవసతి తదాతు తస్మిన్నేవ ప్రథమాబ్దికం కర్తవ్యమ్. ౧౦౨, ౧౦౩. వార్షికీ ప్రథమాబ్దికీ. ౧౦౪. ప్రతిసంవత్సరం ద్వితీయాబ్దికా

పిండవర్జ్య మసంక్రాంతే సంక్రాంతే పిండసంయుతమ్,
ప్రతిసంవత్సరం శ్రాద్ధమేవం మాసద్వయేఽపి చ. ౧౦౫

మాసికమునకు విశేషమును చెప్పెద వినుము. ఎప్పుడైన నొక మాసమునందు రెండుసంక్రమణములు సంభవించినయెడల (అనఁగా క్షయమాసము వచ్చినయెడల) మాసద్వయగతంబు లగు మాసికములు క్షయమాసమునందు జరిగింపవలెను. ఎట్లన: తిథిపూర్వార్ధమునందు ప్రథమమాసగత మాసికాదిశ్రాద్ధమును ఉత్తరార్ధమునందు ద్వితీయమాసగతమాసికాదిశ్రాద్ధమును నాచరింపవలెను. మఱియు సపిండీకరణమును మాసికమును ప్రథమాబ్దికమును అధికమాసమునందు జరిగింపవచ్చును. మఱియు సంవత్సరమధ్యంబున నధికమాసము సంభవించినయెడల త్రయోదశమాసంబున ప్రథమాబ్దికము జరిగింపవలెను. ద్వితీయాది ప్రత్యాబ్దికశ్రాద్ధములు అధికమాసమునందు పిండహీనముగాను నిజమాసమునందు పిండసహితముగాను జరిగింపవలెను.

ఏవం సంవత్సరే పూర్ణే వార్షికం శ్రాద్ధమాచరేత్,
తస్మిన్నపి విశేషేణ భోజనీయా ద్విజాతయః. ౧౦౬
కుర్యాత్సంవత్సరాదూర్ధ్వం శ్రాద్ధపిండత్రయం సదా,
ఏకోద్దిష్టం న కర్తవ్యం తేన స్యాత్పితృఘాతకః. ౧౦౭

ఇట్లు సంవత్సరము పూర్తియైనతోడనే ప్రథమాబ్దికము జరిగించి విశేషముగా బ్రాహ్మణులకు భోజనము బెట్టవలెను. సంవత్సరమైన పిమ్మట ప్రత్యాబ్దికాదిశ్రాద్ధము పిండత్రయసహితముగా నాచరింపవలెను, ఏకోద్దిష్టవిధానముగా సంవత్సరానంతరము శ్రాద్ధము నాచరింపఁగూడదు. అట్లాచరించినయెడల పితృఘాతుకుఁ డగును.

---

దికం తు మలమాసే శ్రాద్ధదినస్య వంధ్యత్వనిరాసార్థం పితు రుద్దేశేన బ్రాహ్మణా న్భోజయిత్వా శుద్ధమాసే సంపిండకం శ్రాద్ధం కుర్యా దితి. ౧౦౫. ఏవం ఉక్తప్రకారేణ. ౧౦౬, ౧౦౭. గజచ్ఛాయాయోగే కృతం శ్రాద్ధం గజచ్ఛాయం - గజచ్ఛాయా "కృష్ణపక్షే త్రయోదశ్యాం మఘా స్విందుః కరే రవిః, యదా తదా గజచ్ఛాయా శ్రాద్ధైః పుణ్య మవాప్యతే" ఇతి. యద్వా పూర్వాభిముఖస్థితస్య గజస్య ఛాయాయాం దక్షిణాభిముఖో భూత్వా శ్రాద్ధం కుర్యా దిత్యపి కేచిత్. యుగాది-యుగాదితిథయో

తీర్థశ్రాద్ధం గయాశ్రాద్ధం గజచ్ఛాయం చ పైతృకమ్,
అబ్దమధ్యే న కుర్వీత గ్రహణే న యుగాదిషు. ౧౦౮
యదా పుత్రేణ వై కార్యం గయాశ్రాద్ధం ఖగేశ్వర,
తదా సంవత్సరా దూర్ధ్వం కర్తవ్యం పితృభక్తితః. ౧౦౯

తీర్థశ్రాద్ధము గయాశ్రాద్ధము గజచ్ఛాయాశ్రాద్ధము గ్రహణ శ్రాద్ధము యుగాదిశ్రాద్ధము సంవత్సరమధ్యంబున నాచరింపఁగూడదు. పితృభక్తి గలిగి గయాశ్రాద్ధము నాచరింపవలె నని కోరిక యున్నచో సంవత్సరానంతరము గయకు వెళ్లి గయాశ్రాద్ధము నాచరింపవలెను. గాని సంవత్సరమధ్యంబున నాచరింపఁగూడదు.

గయాశ్రాద్ధాత్ప్రముచ్యంతే పితరో భవసాగరాత్,
గదాధరానుగ్రహేణ తే యాంతి పరమాం గతిమ్. ౧౧౦
తులసీమంజరీభిశ్చ పూజయేద్విష్ణుపాదుకామ్,
తస్యాఽలవాలతీర్థేషు పిండా న్దద్యా ద్యథాక్రమమ్, ౧౧౧
ఉద్ధరేత్స ప్తగోత్రాణి కులమేకోత్తరం శతమ్,
శమీపత్రప్రమాణేన పిండం దద్యా ద్గయాశిరే. ౧౧౨
గయాముపేత్య యశ్శ్రాద్ధం కరోతి కులనందనః,
సఫలం తస్య తజ్జన్మ జాయతే పితృతుష్టిదమ్. ౧౧౩

---

యథా "మాఘే పంచదశీ కృష్ణా నభస్యే చ త్రయోదశీ, తృతీయా మాధవే శుక్లా నవమ్యూర్జే యుగాదయః" ఇతి. క్రమోత్ర న వివక్షితః. తద్యథా కార్తికశుక్ల నవమీ సత్యయుగస్యాఽద్యా తిథిః. వైశాఖే అక్షయ్యతృతీయా త్రేతాయుగస్య మాఘే అమా ద్వాపరస్య- భాద్రే కృష్ణా త్రయోదశీ కలియుగస్యేతి. అత్రాబ్ద మధ్యే నేతి కేషాంచిన్మతమ్. కేచి ద్దాక్షిణాత్యాదయ స్తు వర్షమధ్యేఽపి కుర్వంతి కిమితి పాపినా మేవ వర్షగమ్యో యమమార్గో భవతి- అత స్తస్యాతిక్రమణానంతరం గయాదిశ్రాద్ధం కర్తవ్య మితి అబ్దమధ్యే నేతి నిషేధః - కించ సుకృతిన స్తు తత్క్షణమేవ ధర్మసభాం ప్రవిశంతి అతోఽబ్దమధ్యేఽపి కుర్యా దిత్యభిప్రాయః. ౧౦౮. గయామాహాత్మ్య మాహ. యదేతి. ౧౦౯-౧౧౧. శమీపత్రప్రమాణం అతిసూక్ష్మ మపి పిండం గయాశిరే గయదైత్యస్య అగమంతా చ్ఛిరో భాగే ఇతి గయామాహాత్మ్యోక్తం జ్ఞాతవ్యమ్. ౧౧౨,౧౧౩. కలాపః హేతుక

పుత్రులు గయకుం జని గయాశ్రాద్ధము నాచరించినయెడల వతని పితరులు గదాధరానుగ్రహవంశంబున పరమగతిని బొందుదురు. గయ యందలి విష్ణుపాదమును తులసీమంజరులచేఁ బూజించి యథాక్రమముగాఁ బిండప్రదానము నాచరించిన ఏడుగోత్రములను నూటఒక్క కులములను తరింపఁజేయును. గయాశిరమందు మిక్కిలి చిన్నవగు పిండములను నుంచవలెను. ఏ పుత్రుఁడు గయకుం జని గయాశ్రాద్ధము జేయు నతని జన్మము పితృతృప్తి నిచ్చునది యగును.

శ్రూయతే చాపి పితృభిర్గీతా గాథా ఖగేశ్వర!,
ఇక్ష్వాకోర్మనుపుత్రస్య కలాపోపవనే సురైః. ౧౧౪
అపి న స్తే భవిష్యంతి కులే సన్మార్గశీలినః,
గయాముపేత్య యే పిండాన్దాస్యంత్యస్మాకమాదరాత్ ౧౧౫

ఓగరుడుఁడా! హిమవత్పర్వత ప్రాంతమందలి కలాపనామకగ్రామమున నున్న యుపవనమున మనుపుత్రుం డగు నిక్ష్వాకు నుద్దేశించి పితృదేవత లొక గీతను బాడిరి. ఆగీతను నీకు వినిపించెదను. గయకుం జని మాయం దాదరము కలిగి గయాశ్రాద్ధము నాచరించెడి సన్మార్గ వర్తనులు మావంశంబున బుట్టుదురా? యని పితృదేవతలు ఒక గీతను బాడిరి.

ఏవమాముష్మికీం తార్క్ష్య! యః కరోతి క్రియాం సుతః,
సస్యాత్సుఖీ భవేన్ముక్తో కౌశికస్యాత్మజా యథా. ౧౧౬
భరద్వాజాత్మజాస్సప్త భుక్త్వా జన్మపరంపరామ్,
కృత్వాఽపి గోవధం తార్క్ష్య! ముక్తాః పితృప్రసాదతః. ౧౧౭
సప్తవ్యాధా దశార్ణేషు మృగాః కాలాంజనే గిరౌ,
చక్రవాకా శ్శరద్వీపే హంసాస్సరసి మానసే. ౧౧౮
తేఽపి జాతాః కురుక్షేత్రే బ్రాహ్మణా వేదపారగాః,
పితృభక్త్యా చ తే సర్వే గతా ముక్తిం ద్విజాత్మజాః. ౧౧౯

ఓగరుడుఁడా! ఇట్లాముష్మికక్రియలు జేసిన పుత్రుండు కౌశికాత్మజులంబోలె సుఖవంతుఁడును ముక్తికలవాఁడును అగును. మఱియు

---

శ్వార్యన్వత ర్తీగ్రామవిశేష ఒకస్య ఉపవనే ఇక్ష్వాకుం ప్రతిగీతా. ౧౧౪. కౌశిక ఏవ భర

నో గరుడుఁడా! తొల్లి భరద్వాజుని పుత్రు లేడుగురు గోవధను జేసి పితృప్రసాదంబున జన్మంబుల నెత్తి క్రమముగా మోక్షంబును బొందిరి. మొదట కిరాతులై దశార్ణదేశంబుల జనియించి పిదప కాలాంజనగిరిపై మృగంబులై పుట్టియుఁ దర్వాత శరద్వీపంబున చక్రవాకంబులై యుద్భవిల్లి యనంతరము మానససరోవరంబున హంసలై జనించి కురుక్షేత్రంబున మరల వేదపారగు లగు బ్రాహ్మణులై పుట్టి పితృభక్తిచే నందఱు మోక్షంబును బొందిరి.

తస్మాత్సర్వప్రయత్నేన పితృభక్తో భవేన్నరః,
ఇహలోకే పరే వాపి పితృభక్త్యా సుఖీ భవేత్. ౧౨౦
ఏతత్తార్క్ష్య! మయాఽఽఖ్యాతం సర్వమేవౌర్ధ్వదైహికమ్,
పుత్రవాంఛాప్రదం పుణ్యం పితృముక్తిప్రదాయకమ్. ౧౨౧

కాఁబట్టి సర్వవిధంబులను మనుజుఁడు పితృభక్తి గలిగి యుండవలెను. పితృభక్తిచే నిహపరలోకసుఖంబులను మనుజుఁడు పొందును. ఓగరుడుఁడా! పుత్రప్రదంబును పితృముక్తిప్రదాయకమును పుణ్యంబును అగు నౌర్ధ్వదైహికము నంతను నీకుఁ జెప్పితిని.

నిర్ధనోఽపి నరః కశ్చిద్యశ్శృణోతి కథామిమామ్,
సోఽపి పాపవినిర్ముక్తో దానస్య ఫలమాప్నుయాత్. ౧౨౨
విధినా కురుతే యస్తు శ్రాద్ధం దానం మయోదితమ్;
శృణుయాద్గారుడం చాపి శృణు తస్యాపి యత్ఫలమ్. ౧౨౩
పితా దదాతి సత్పుత్రాన్ గోధనాని పితామహః,
ధనదాతా భవేత్సోఽపి యస్తస్య ప్రపితామహః. ౧౨౪
దద్యాద్విపులమన్నాద్యం వృద్ధస్తు ప్రపితామహః,
తృప్తాశ్శ్రాద్ధేన తే సర్వే దత్వా పుత్రస్య వాంఛితమ్. ౧౨౫
గచ్ఛంతి ధర్మమార్గైశ్చ ధర్మరాజస్య మందిరమ్,
తత్ర ధర్మసభాయాం తే తిష్ఠంతి పరమాదరాత్. ౧౨౬

ఓగరుడుఁడా! మనుజుఁడు ధనరహితుఁడైనను ఈకథను వినినయెడల పాపవినిర్ముక్తుఁడై దానఫలమును బొందును. ఎవ్వఁడు మదు

---

ద్వాజపుత్రాణాం చరిత్రం విశేషతయా హరితంకే జ్ఞాతవ్య మితి. ౧౧౫-౧౨౪.
ఇతి శ్రీగరుడపురాణటీకాయాం త్రయోదశోఽధ్యాయః.

క్తం బగు శ్రాద్ధమును దానమును యథాశాస్త్రముగా నాచరించునో గరుడపురాణము వినునో అతనికి తండ్రి సత్పుత్రులను పితామహుండు గోధనంబులను ప్రపితామహుండు ధనంబును వృద్ధప్రపితామహుండు విపులం బగు నన్నంబును ఇచ్చెదరు. మఱియు వారలు శ్రాద్ధముచేఁ దృప్తులై కుమారునికి వాంఛితంబుల నిచ్చి ధర్మమార్గంబుల ధర్మరాజ మందిరంబునకుంజని యాతనిసభను పరమాదరముగాఁ జూడఁబడుచు చిరకాలము ఉందురు.

శ్రీసూత ఉవాచ:—

ఏవం శ్రీవిష్ణునా ప్రోక్తమౌర్ధ్వదానసముద్భవమ్,
శ్రుత్వా మాహాత్మ్యమతులం గరుడో హర్షమాగతః. ౧౨౭

ఓమహర్షులారా! ఇట్లు శ్రీవిష్ణుభగవానునిచేఁ జెప్పఁబడిన ఔర్ధ్వదైహికకృత్యమును తన్మహిమను విని గరుడుండు అతులం బగు సంతోషము నొందెను.

ఇతి శ్రీగరుడపురాణే-సారోద్ధారే-సపిండనాదిసర్వకర్మ

నిరూపణో నామ త్రయోదశోఽధ్యాయః.

# చతుర్దశాధ్యాయము

శ్రీహరి గరుడునకు ధర్మరాజునగరవృత్తాంతము చెప్పుట.

గరుడ ఉవాచ:—

యమలోకః కియాన్మార్గః కీదృశః కేన నిర్మితః,
సభా చ కీదృశీ తస్యాం ధర్మ ఆస్తే చ కైస్సహ. ౧
యే ధర్మమార్గైర్గచ్ఛంతి ధార్మికా ధర్మమందిరమ్,
తాన్ధర్మానపి మార్గాంశ్చ మమాఽఽఖ్యాహి దయానిధే!. ౨

ఓభగవానుఁడా! యమలోకప్రమాణ మెంత? ఎట్లుండును? ఎవనిచే నిర్మింపఁబడినది? యముని సభ ఎట్లుండును? ఎవ్వరు ఆసభల నాసీను లగుదురు? ఎట్టి ధర్మముల నాచరించి ధర్మాత్ములు ధర్మమార్గములద్వారా యమపురంబునకుఁ జనెదరు? ఈవృత్తాంతంబులను దయతో నానతియ్యవే యని గరుడుఁడు శ్రీభగవానుని అడిగెను.

శ్రీ భగవా నువాచ:—

శృణు తార్క్ష్య! ప్రవక్ష్యామి యద్గమ్యం నారదాదిభిః,
తద్ధర్మనగరం దివ్యం మహాపుణ్యై రవాప్యతే. ౩
యామ్యనైరృతయోర్మధ్యే పురం వైవస్వతస్య తు,
సర్వం వజ్రమయం దివ్యమభేద్యం తత్సురాసురైః. ౪
చతురస్రం చతుర్ద్వారముచ్చప్రాకారవేష్టితమ్,
యోజనానాం సహస్రం హి ప్రమాణేన తదుచ్యతే. ౫

ఇట్లడిగిన గరుడునింజూచి భగవానుఁడు చెప్పుచున్నాఁడు. "ఓ గరుడుఁడా! నారదాదిమహర్షి గమ్యం బగు ధర్మనగరవృత్తాంతమును చెప్పెద వినుము. మహాపుణ్యములు జేసిన గాని అయ్యది లభింపదు. దక్షిణనైరృతదిఙ్మధ్యంబున యమపురంబు గలదు. సర్వవజ్రమయ

ధర్మరాజపురం ధర్మసభాం ధర్మసభాసదః, ధర్మమార్గాంశ్చ ధర్మాంశ్చ హరిః ప్రాహ చతుర్దశే, చతుర్దశాధ్యాయార్థస్తు స్పష్టఏవ విజ్ఞాతవ్యః. ౧-౪.

మై సురాసురుల కభేద్యమై చతురస్రమై చతుర్ద్వారమై ఉన్నతప్రాకార శోభితమై సహస్రయోజనప్రమాణమై అయ్యమపురంబు విరాజిల్లు చుండును.

తస్మిన్పురేఽస్తి సుభగం చిత్రగుప్తస్య మందిరమ్,
పంచవింశతిసంఖ్యాకైర్యోజనైర్విస్తృతాయతమ్. ౬
దశోచ్ఛ్రితం మహాదివ్యం లోహప్రాకారవేష్టితమ్,
ప్రతోళీశతసంచారం పతాకాధ్వజభూషితమ్. ౭
విమానగణసంకీర్ణం గీతవాదిత్రనాదితమ్,
చిత్రితం చిత్రకుశలైర్నిర్మితం దేవశిల్పిభిః. ౮
ఉద్యానోపవనై రమ్యం నానావిహగకూజితమ్,
గంధర్వైరప్సరోభిశ్చ సమంతాత్పరివారితమ్. ౯

ఆయమపురంబున సుందరం బగు చిత్రగుప్తమందిరంబు గలదు. ఇరువదియైదుఆమడల వెడల్పును అంతియ పొడవును గలిగి పదామడల ఎత్తు గలిగి లోహప్రాకారవేష్టితంబును ప్రతోళీశతసంచారసమాకులంబును పతాకాధ్వజభూషితంబును ఏడంతస్తుల మేడలతో సంకీర్ణంబును గీతవాదిత్రనాదితంబును చిత్రకుశలు లగు దేవశిల్పులచే చిత్రింపఁబడినదియు ఉద్యానవనంబులతోడను ఉపవనంబులతోడను సుందరంబైనదియు అనేకపక్షికూజితంబును గంధర్వులతోడను అప్సరస్త్రీలతోడను సంకులంబును అగు నామందిరము ప్రకాశించుచుండును.

తత్సభాయాం చిత్రగుప్తస్త్వాసనే పరమాద్భుతే,
సంస్థితో గణయేదాయుర్మానుషాణాం యథాతథమ్. ౧౦
న ముహ్యతి కథంచిత్స సుకృతే దుష్కృతేఽపి వా,
యద్యేనోపార్జితం కర్మ శుభం వా యది వాఽశుభమ్. ౧౧
తత్సర్వం భుంజతే యత్ర చిత్రగుప్తస్య శాసనాత్,

అట్టి సభకు చిత్రగుప్తుఁడు పరమాశ్చర్యకరం బగు సింహాసనంబున నాసీనుఁడై మనుష్యుల యాయుర్దాయమును యథార్థముగా లెక్కించుచుండును. అట్లు లెక్కవేయుచు వారివారి పుణ్యపాపములను పరిగణించునపుడు స్వల్పమైన తేడా లేకుండునటుల లెక్కవే

యును. మనుజులుచేసికొనిన పుణ్యపాపము లచ్చటనే చిత్రగుప్తుని శాసనానుసారముగా ననుభవింపఁబడుచుండును.

చిత్రగుప్తాలయాత్ప్రాచ్యాం జ్వరస్యాస్తి మహాగృహమ్. ౧౨
దక్షిణస్యాం చ శూలస్య లూతావిస్ఫోటయోస్తథా,
పశ్చిమే కాలపాశస్స్యా దజీర్ణస్యారుచేస్తథా. ౧౩
ఉదీచ్యాం రాజరోగోఽస్తి పాండురోగస్తథైవ చ,
ఐశాన్యాం తు శిరోర్తిస్స్యాదాగ్నేయ్యామస్తి మూర్ఛనా. ౧౪
అతిసారో నైరృతే తు వాయవ్యాం శీతదాహకౌ,
ఏవమాదిభిరన్యైశ్చ వ్యాధిభిః పరివారితః. ౧౫
లిఖతే చిత్రగుప్తస్తు మానుషాణాం శుభాశుభమ్,

చిత్రగుప్తాలయంబునకుఁ దూర్పుభాగంబున జ్వరగృహంబును దక్షిణదిగ్భాగంబున శూలరోగగృహంబును లూతావిస్ఫోటగృహంబులును పశ్చిమంబున యమపాశగృహంబును. అజీర్ణారుచులగృహంబులును ఉత్తరంబున రాజయక్ష్మపాండురోగుల గృహంబులును ఈశాన్యదేశంబున శిరోరోగగృహంబును ఆగ్నేయంబున మూర్ఛనాగృహంబును నైరృతదిగ్భాగంబున అతిసారగృహంబును వాయవ్యంబున శీతదాహంబుల గృహంబులును గలవు. ఈ మొదలగు వ్యాధులచేఁ బరివారితుఁడై చిత్రగుప్తుఁడు మనుజుల శుభాశుభములను వ్రాయుచుండును.

చిత్రగుప్తాలయాదగ్రే యోజనానాం చ వింశతిః. ౧౬
పురమధ్యే మహాదివ్యం ధర్మరాజస్య మందిరమ్,
అస్తి రత్నమయం దివ్యం విద్యుజ్జ్వాలార్కవర్చసమ్. ౧౭
ద్విశతం యోజనానాం చ విస్తారాయామతస్స్ఫుటమ్,
పంచాశచ్చ ప్రమాణేన యోజనానాం సముచ్ఛ్రితమ్. ౧౮
ధృతం స్తంభసహస్రైశ్చ వైడూర్యమణిమండితమ్,
కాంచనాలంకృతం నానాహర్మ్యప్రాసాదసంకులమ్. ౧౯
శారదాభ్రనిభం రుక్మకలశైస్సుమనోహరమ్,
చిత్రస్ఫటికసోపానం వజ్రకుట్టిమశోభితమ్. ౨౦

ముక్తాజాలగవాక్షం చ పతాకాధ్వజభూషితమ్,
ఘంటానేకనినాదాఢ్యం హేమతోరణమండితమ్. ౨౧
నానాశ్చర్యమయం స్వర్ణకవాటశతసంకులమ్,
నానాద్రుమలతాగుల్మైర్నిష్కంపైస్సువిరాజితమ్. ౨౨
ఏవమాదిభిరన్యైశ్చ భూషణైర్భూషితం సదా,
ఆత్మయోగప్రభావైశ్చ నిర్మితం విశ్వకర్మణా. ౨౩

ఆ చిత్రగుప్తాలయంబున కిరువదియోజనంబుల మీఁదను పుర మధ్యంబున ధర్మరాజమందిరము రాజిల్లుచుండును. రత్నమయంబును విద్యుజ్జ్వాలార్కసమానకాంతియుతంబును రెండువందల యోజనముల పొడవును అంతియ వెడల్పును గలదియుఁ బదియోజనము లుచ్ఛ్రితంబును సహస్రస్తంభమండితంబును వైడూర్యరత్నశోభితంబును నానాహర్మ్యప్రాసాదసంకులంబును శరదభ్రసిభంబును స్వర్ణకలశోపశోభితంబును విచిత్రస్ఫటికమణినిర్మితసోపానరాజితంబును వజ్రమణి కుట్టిమశోభితంబును ముక్తాజాలాసమావృత గవాక్షంబును పతాకాధ్వజశోభితంబును మృదంగభేరీఘంటానినాదయుతంబును సువర్ణతోరణ మండితంబును స్వర్ణకవాటసంకులంబును నానాద్రుమలతాగుల్మపరిశోభితంబును నగు నయ్యమమందిరము విశ్వకర్మచే యోగప్రభావము వలన నిర్మింపఁబడినది.

తస్మిన్నస్తి సభా దివ్యా శతయోజనమాయతా,
అర్కప్రకాశాభ్రాజిష్ణుస్సర్వతః కామరూపిణీ. ౨౪
నాతిశీతా న చాత్యుష్ణా మనసోఽత్యంతహర్షిణీ,
న శోకో న జరా తస్యాం క్షుత్పిపాసే న చాప్రియమ్. ౨౫
సర్వే కామాః స్థితా యస్యాం యే దివ్యా యే చ మానుషాః.
రసవచ్చ ప్రభూతం చ భక్ష్యం భోజ్యం చ సర్వశః. ౨౬
రసవంతి చ తోయాని శీతాన్యుష్ణాని చైవ హి,
పుణ్యాశ్శబ్దాదయస్తస్యాం నిత్యం కామఫలా ద్రుమాః. ౨౭
అసంబాధా చ సా తార్క్ష్య! రమ్యా కామగమా సభా,
దీర్ఘకాలం తపస్తప్త్వా నిర్మితా విశ్వకర్మణా. ౨౮

నూరు యోజనములు పొడవు గలదియు సూర్యప్రకాశమాన
మైనదియు కామరూపిణియు నాతిశీతం బైనదియు నాత్యుష్ణం బైన
దియు మనోహ్లాదకారిణియు నగు దివ్యం బగు సభ ఆమందిరంబున
గలదు. శోకములు ముదిమి క్షుత్పిపాసలును అప్రియంబును ఆసభను
కలుగవు. దివ్యంబులును మానుషంబులును అగు సమస్తకామంబులును
అచ్చట గలవు. రసవంతంబు లగు భక్ష్యభోజ్యాదు లాసభను విస్తార
ముగా నుండును. శీతంబులును ఉష్ణంబులును అగు ఉదకంబులును
గలవు. ఎచ్చట జూచినను పుణ్యశబ్దంబులు వినంబడుచుండును వృక్షం
బులు సర్వర్తుఫలకుసుమంబులచే విరాజిల్లుచుండును. ఇరుకు లేనిదై
రమ్యం బగు నాసభ కామగమ్మై యులరారుచుండును. అట్టి సభను
విశ్వకర్మ పెద్దకాలము తపంబు చేసి నిర్మించెను.

తాముగ్రతపసో యాంతి సువ్రతాస్సత్యవాదినః,
శాంతాస్సన్న్యాసినస్సిద్ధాః పూతాః పూర్వేణకర్మణా. ౨౯
సర్వే భాస్వరదేహాః స్తేఽలంకృతా విరజాంబరాః,
స్వకృతైః కర్మభిః పుణ్యై స్తత్ర తిష్ఠంతి భూషితాః. ౩౦

ఉగ్రతపంబు నాచరించినవారలును సువ్రతులును సత్యవాదు
లును సర్వకర్మసన్న్యాసము నాచరించినవారలును సిద్ధులును పుణ్యకర్మల
నాచరించి పునీతు లైనవారలును అగు పుణ్యాత్ములు ప్రకాశమాన
దేహులును దివ్యాంబరధారులును దివ్యాభరణభూషితులును అయి
యాయమసభకుం జని యచ్చట నుందురు.

తస్యాం స ధర్మో భగవానాసనేఽనుపమే శుభే,
దశయోజనవిస్తీర్ణే సర్వరత్నైస్సుమండితే. ౩౧
ఉపవిష్టస్సతాం శ్రేష్ఠశ్ఛత్రశోభితమస్తకః,
కుండలాలంకృతశ్శ్రీమాన్మహామకుటమండితః. ౩౨
సర్వాలంకారసంయుక్తో నీలమేఘసమప్రభః,
వాలవ్యజనహస్తాభిరప్సరోభిశ్చ వీజితః. ౩౩

ఛత్రశోభితమస్తకుండును మకరకుండలాలంకృతుండును కిరీట
మండితుండును సర్వాభరణభూషితుండును నీలమేఘసమప్రభుండును

అగుధర్మరాజు ఆసభను నధిష్ఠించి దశయోజనవిస్తీర్ణం బగు రత్న సింహాసనమున నాసీనుఁడై వింజామరహస్తలగు అప్సరస్త్రీలచే వీచితుఁడగుచు నుండును.

గంధర్వాణాం సమూహాశ్చ సంఘశశ్చాప్సరోగణాః,
గీతవాదిత్రనృత్యాద్యైః పరితస్సేవయంతి తమ్. 34
మృత్యునా పాశహస్తేన కాలేన చ బలీయసా,
చిత్రగుప్తేన చిత్రేణ కృతాంతేన నిషేవితః. 35
పాశదండధరై రుగ్రై ర్నిదేశవశవర్తిభిః,
ఆత్మతుల్యబలై ర్నానాసుభటైః పరివారితః. 36

గంధర్వసమూహంబులును అప్సరోగణంబులును సంగీతములఁ బాడుచు నృత్యములఁ జేయుచు నతనిని సేవించుచుందురు. మఱియు మృత్యువును పాశహస్తుఁడగు కాలుఁడును చిత్రగుప్తుఁడును కృతాంతుఁడును ఆయముని సేవించెదరు. మఱియు పాశదండధరులును నిదేశవర్తులును ఆత్మతుల్యబలులును అగు యమభటులు సైతము నతనికిఁ జుట్టు నుందురు.

అగ్నిష్వాత్తాశ్చ పితరః సోమపాశ్చోష్మపాశ్చ యే,
స్వధావంతో బర్హిషదో మూర్తామూర్తాశ్చ యే ఖగ!. 37
అర్యమాద్యాః పితృగణా మూర్తిమంతస్తథా పరే,
సర్వే తే మునిభిస్సార్ధం ధర్మరాజముపాసతే. 38
అత్రిర్వశిష్ఠః పులహో దక్షః క్రతురథాంగిరాః,
జామదగ్న్యోభృగుశ్చైవ పులస్త్యోఽగస్త్యనారదాః. 39
ఏతే చాన్యే చ బహవః పితృరాజసభాసదః,
న శక్యాః పరిసంఖ్యాతుం నామభిః కర్మభిస్తథా. 40

మఱియు అగ్నిష్వాత్తులును సోమపులును ఉష్మపులును అగు పితరులును అర్యమాద్యాదిపితృగణంబులు మునిసహితులై ధర్మరాజు నుపాసించుచుందురు. అత్రియు వసిష్ఠుఁడును పులహుఁడును దక్షుఁడును క్రతువును అంగిరుఁడును జామదగ్న్యుఁడును భృగుమహర్షియు పులస్త్యుఁడును అగస్త్యుఁడును నారదుఁడును మొదలగు మహర్షు లందఱు

ధర్మసభను నాసీనులై ధర్మరాజును సేవించుచుందురు. ధర్మసభ నున్న వారిని లెక్కించుటకు ఎవ్వరికి శక్యంబు గాదు.

వ్యాఖ్యాభిర్ధర్మశాస్త్రాణాం నిర్ణేతారో యథాతథమ్,
సేవంతే ధర్మరాజం తే శాసనాత్పరమేష్ఠినః. ४०

ధర్మనిర్ణేతలు ధర్మశాస్త్రములకు యథార్థం బగు వ్యాఖ్యను జేయుచు బ్రహ్మశాసనంబున నతనిని సేవింపుదురు.

రాజానస్సూర్యవంశీయాస్సోమవంశ్యాస్తథాపరే,
సభాయాం ధర్మరాజం తే ధర్మజ్ఞాః పర్యుపాసతే. ४१
మనుర్దిలీపో మాంధాతా సగరశ్చ భగీరథః,
అంబరీషోఽనరణ్యశ్చ ముచుకుందో నిమిః పృథుః. ४३
యయాతిర్నహుషః పూరుర్దుష్యంతశ్చ శిబిర్నలః,
భరతశ్శంతనుః పాండుస్సహస్రార్జున ఏవ చ. ४४
ఏతే రాజర్షయః పుణ్యాః కీర్తిమంతో బహుశ్రుతాః,
ఇష్ట్వాఽశ్వమేధై ర్బహుభి ర్జాతా ధర్మసభాసదః. ४५

మఱియు మనువు దిలీపుఁడును మాంధాతయు సగరుఁడును భగీరథుఁడును అంబరీషుఁడును అనరణ్యుఁడును ముచికుందుఁడును నిమియు పృథుచక్రవర్తియు యయాతియు నహుషుఁడును పూరువును దుష్యంతుఁడును శిబియు నలుఁడును భరతుఁడును శంతనుఁడును పాండురాజును కార్తవీర్యార్జునుఁడును మొదలగు సూర్యవంశ్యులును చంద్రవంశ్యులును అగు మహారాజులు అనేకాశ్వమేధంబుల నాచరించుటంజేసి ధర్మసభాసదులై ధర్మరాజును సేవించెదరు.

సభాయాం ధర్మరాజస్య ధర్మ ఏవ ప్రవర్తతే,
న తత్ర పక్షపాతోఽస్తి నానృతం చ న మత్సరః. ४६
సభ్యాస్సర్వే శాస్త్రవిదస్సర్వే ధర్మపరాయణాః,
తస్యాం సభాయాం సతతం వైవస్వతముపాసతే. ४७

ఆధర్మసభను ధర్మ మెల్లపుడు నుండును. పక్షపాతము అనృతము మత్సరము నచ్చట లేవు సభ్యు లందఱు శాస్త్రవిదులును ధర్మపరాయణులును అయి యముని నుపాసించుచుందురు.

ఈదృశీ సా సభా తార్క్ష్య! ధర్మరాజ్ఞో మహాత్మనః,
న తాం పశ్యంతి యే పాపాః దక్షిణేన పథా గతాః. ౪౮

ఓగరుడుఁడా! ధర్మసభ ఇట్లుండును. ఆసభను దక్షిణమార్గము ద్వారా వెళ్లెడి పాపులు చూడరు.

ధర్మరాజపురే గంతుం చతుర్ద్వారా భవంతి చ,
పాపినాం గమనే పూర్వం స తు తే పరికీర్తితః. ౪౯
పూర్వాదిభి స్త్రిభి ర్మార్గై ర్యే గతా ధర్మమందిరే,
తే వై సుకృతినః పుణ్యా స్తస్యాం గచ్ఛంతి తాఞ్ఛృణు. ౫౦

ఓగరుడుఁడా! ధర్మరాజపురంబును బ్రవేశించుటకు నాలుగు ద్వారంబులు గలవు. పాపాత్ములు జనుదెంచు దక్షిణమార్గవృత్తాంతము నిదివరకే నీకుఁ జెప్పియున్నాను. పూర్వాదిమార్గముల ద్వారా యమపురంబునకు పుణ్యాత్ములు జనుదెంచెదరు. వారల వృత్తాంతమును జెప్పెద వినుము.

పూర్వో మార్గ స్తు తత్రైకస్సర్వభోగసమన్వితః,
పారిజాతతరుచ్ఛాయాఽఽచ్ఛాదితో రత్నమండితః. ౫౧
విమానగణసంకీర్ణో హంసావళివిరాజితః,
విద్రుమారామసంకీర్ణః పీయూషద్రవసంయుతః. ౫౨

తూర్పుద్వారపు వృత్తాంతమును జెప్పెద వినుము. ఆమార్గము సర్వభోగసమన్వితమై కల్పవృక్షపునీడలచే సలరారునదై రత్నమండితంబై విమానగణసంకీర్ణమై హంసరాజివిరాజితంబై విద్రుమారామంబులచే నొప్పారుచు అమృతద్రవసంయుతమై యుండును.

తేన బ్రహ్మర్షయో యాంతి పుణ్యా రాజర్షయోఽమలాః,
అప్సరోగణ గంధర్వ విద్యాధర మహోరగాః. ౫౩
దేవతారాధకాశ్చాన్యే శివభక్తిపరాయణాః,
గ్రీష్మే ప్రపాదానరతాః మాఘే కాష్ఠప్రదాయినః. ౫౪
విశ్రామయంతి వర్షాసు విరక్తాన్ దానమానతః,
దుఃఖితస్యామృతం బ్రూతే దదతే హ్యాశ్రమం తు యే. ౫౫

సత్యధర్మరతా యే చ క్రోధలోభవివర్జితాః,
పితృమాతృషు యే భక్తా గురుశుశ్రూషణే రతాః. ౫౬
భూమిదా గృహదా గోదా విద్యాదానప్రదాయకాః,
పురాణవక్తృశ్రోతారః పారాయణపరాయణాః. ౫౭
ఏతే సుకృతినశ్చాన్యే పూర్వద్వారే విశంతి చ,
యాంతి ధర్మసభాయాం తే సుశీలాశ్శుద్ధబుద్ధయః. ౫౮

పుణ్యాత్ము లగు బ్రహ్మర్షులును నిర్మలు లగు రాజర్షులును అప్సరోగణంబులును గంధర్వులును విద్యాధరులును ఉరగులును దేవతారాధకులును శివభక్తిపరాయణులును గ్రీష్మకాలంబున చలివేంద్ర పెట్టించువారలును శీతకాలంబున శీతనాశనార్థమై కాష్ఠప్రదాతలును వర్షాకాలంబున వర్షంబులచే బాధితు లగు పథికులను దానమానములచే బూజించువారలును దుఃఖార్తులను నోదార్చువారలు నాశ్రమదాతలును సత్యధర్మరతులును క్రోధలోభవివర్జితులును పితృమాతృభక్తులును గురుశుశ్రూషణారతులును భూమిదాతలును గృహదాతలును గోదాతలును విద్యాదాతలును పురోవక్తలును పురాణశ్రోతలును పారాయణపరులును మొదలగుపుణ్యాత్ములు పూర్వద్వారమున యమపురంబును బ్రవేశించి ధర్మసభకుఁ జనెదరు.

ద్వితీయస్తూత్తరో మార్గో మహారథశతైర్వృతః,
నరయానసమాయుక్తో హరిచందనమండితః. ౫౯
హంససారససంకీర్ణశ్చక్రవాకోపశోభితః,
అమృతద్రవసంపూర్ణస్తత్ర భాతి సరోవరః. ౬౦

రెండవదియుత్తరమార్గము. అయ్యది అనేకమహారథవృతంబును నరయానసమాయుతంబును హరిచందనభూషితంబును అయి యలరారుచుండును. హంససారససంకీర్ణంబును చక్రవాకపరిశోభితంబును అమృతరసోదకసంపూర్ణంబును అగు సరోవర మాయుత్తరమార్గంబున బ్రకాశించుచున్నది.

అనేన వైదికా యాంతి తథాఽభ్యాగతపూజకాః,
దుర్గాభానోశ్చ యే భక్తాస్తీర్థస్నాతాశ్చ పర్వసు, ౬౧
యే మృతా ధర్మసంగ్రామే ఽనశనేన మృతాశ్చ యే,

వారాణస్యాం గోగ్రహే చ తీర్థతోయే మృతా పిథేః. ౬౨
బ్రాహ్మణార్థే స్వామికార్యే తీర్థక్షేత్రేషు యే మృతాః,
యే మృతా దేవవిధ్వంసే యోగాభ్యాసేన యే మృతాః. ౬౩
సత్పాత్రపూజకా నిత్యం మహాదానరతాశ్చ యే,
ప్రవిశంత్యుత్తరే ద్వారే యాంతి ధర్మసభాం చ తే. ౬౪

వేదచోదితకర్మాచరణతత్పరులు అభ్యాగతపూజలు దుర్గాభక్తులు భాస్కరభక్తులు పుణ్యకాలంబుల బుణ్యతీర్థయాత్రాపథుల ధర్మయుద్ధంబున మృతి బొందినవారలు అనశనవ్రతమును స్వీకరించి మృతి బొందినవారలు కాశీక్షేత్రంబున బ్రహ్మతీర్థంబున మృతి బొందినవారలు దేవబ్రాహ్మణకార్యంబుల మరణించినవారలు పుణ్యతీర్థంబుల మరణించినవారలు దేవవిధ్వంసమునందు మరణించినవారలు యోగముచే శరీరమును విడచినవారలు సత్పాత్రపూజకులు మహాదానపరాయణులు ఈ ఉత్తరద్వారమున యమపురమును బ్రవేశించి ధర్మసభను బ్రవేశించెదరు.

తృతీయః పశ్చిమో మార్గో రత్నమందిరమండితః,
సుధారససదాపూర్ణదీర్ఘికాభిర్విరాజితః. ౬౫
ఐరావతకులోద్భూతమత్తమాతంగసంకులః,
ఉచ్చైశ్శ్రవస్సముత్పన్నహయరత్నసమున్నతః. ౬౬
ఏతేనాఽఽత్మపరా యాంతి సచ్ఛాస్త్రపరిచింతకాః,
అనన్యవిష్ణుభక్తాశ్చ గాయత్రీమంత్రజాపకాః. ౬౭
పరహింసాపరద్రవ్యపరదారపరాఙ్ముఖాః,
స్వదారనిరతాస్సంతస్సాగ్నికా వేదపాఠకాః. ౬౮
బ్రహ్మచర్యవ్రతధరా వానప్రస్థాస్తపస్వినః,
శ్రీపాదసన్న్యాసపరాస్సమలోష్టాశ్మకాంచనాః. ౬౯
జ్ఞానవైరాగ్యసంపన్నాస్సర్వభూతహితే రతాః,
శివవిష్ణువ్రతకరాః కర్మబ్రహ్మసమర్పకాః. ౭౦
ఋణైస్త్రిభిర్వినిర్ముక్తాః పంచయజ్ఞరతాస్సదా,
పితౄణాం శ్రాద్ధదాతారః కాలే సంధ్యాముపాసకాః. ౭౧
నీచసంగవినిర్ముక్తాః సత్సంగతిపరాయణాః,

ఏతేఽప్సరోగణైర్యుక్తా విమానవరసంస్థితాః. ౨౨
సుధాపానం ప్రకుర్వంతో యాంతి తే ధర్మమందిరమ్,
విశంతి పశ్చిమద్వారే యాంతి ధర్మసభాంతరే. ౨౩

మూఁడవదగుపశ్చిమద్వారము అయ్యది రత్నమంటపమండితంబును అమృతోపమానజలపూర్ణదీర్ఘికావిరాజితంబును ఐరావతకులోత్పన్నమత్తమాతంగసంకులంబును ఉచ్చైశ్శ్రవఃకులీనహయరత్నసంయుతంబును నై ప్రకాశించుచున్నది ఆత్మపరులు శాస్త్రపరిచింతనపరులు అనన్యవిష్ణుభక్తులు గాయత్రీజపతత్పరులు పరహింసాపరద్రవ్యపరదారపరాఙ్ముఖులు స్వదారనిరతులు నిత్యాగ్నిహోత్రులు వేదపాఠకులు బ్రహ్మచర్యరతులు వానప్రస్థాశ్రమపరాయణులు తపస్వులు సన్న్యాసపరాయణులు సమలోష్టాశ్మకాంచనులు జ్ఞానవైరాగ్యసంపన్నులు సర్వభూతహితులు శివవిష్ణువ్రతాచరణపరాయణులు కర్మలను బ్రహ్మార్పణము చేయువారలు పితృదేవర్షిఋణవిముక్తులు పంచమహాయజ్ఞపరులు పితరులకు శ్రాద్ధంబులచేఁ దృప్తి బొందించువారలు సకాలంబున సంధ్యోపాసకులు నీచులతోఁ జెలిమి చేయనివారలు సత్సంగపరాయణులు అగువారలు అప్సరోగణయుక్తులై విమానారూఢులై అమృతపానంబు జేయుచు పశ్చిమద్వారమున యమపురమును ప్రవేశించి ధర్మసభకు వెళ్లెదరు.

యమస్తానాగతాన్దృష్ట్వా స్వాగతం వదతే ముహుః,
సముత్థానం చ కురుతే తేషాం గచ్ఛతి సమ్ముఖమ్. ౨౪
తదా చతుర్భుజో భూత్వా శంఖచక్రగదాసిభృత్,
పుణ్యకర్మరతానాం చ స్నేహాన్మిత్రవదాచరేత్, ౨౫
సింహాసనం దదత్యాశు నమస్కారం కరోతి చ,
పాద్యార్ఘ్యం కురుతే పశ్చాత్పూజతే చందనాదిభిః. ౨౬

ఇట్లు చనుదెంచిన పుణ్యాత్ములఁ జూచి యముండు మాటిమాటికి స్వాగతవాక్యంబులఁ బలుకును. లేచి వారలకు సమ్ముఖముగా వెళ్లును. అప్పుడు చతుర్భుజుండై శంఖచక్రగదానందకంబుల ధరించి పుణ్యాత్ములగు వారలకు మిత్రునివలె ఉపచారముల నాచరించి సింహాసన మిచ్చి నమస్కారము జేసి అర్ఘ్యపాద్యాదులచేఁ బూజించును.

సమస్కుర్వంతు భోసభ్యా! జ్ఞానినం పరమాదరాత్,
ఏష మే మండలం భిత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి. ౨౭

యముం డిట్లు స్వయముగాఁ బూజించి సభ్యులం జూచి ఓసభ్యులారా! మీరలు ఈపుణ్యాత్మునికి నమస్కరింపుఁడు. ఈతఁడు నామండలమును భేదించికొని బ్రహ్మలోకమునకు వెళ్లును. కాఁబట్టి మీరలందఱు ఈతనికి నమస్కరింపుఁడని సభ్యులతోఁ జెప్పెను.

భో భో బుద్ధిమతాం శ్రేష్ఠా! నరకక్లేశభీరవః,
భవద్భిస్సాధితం పుణ్యైర్దేవత్వం సుఖదాయకమ్. ౨౮
మానుషం దుర్లభం ప్రాప్య నిత్యం యస్తు న సాధయేత్,
స యాతి నరకం ఘోరం కోఽన్యస్తస్మాదచేతనః. ౨౯
అస్థిరేణ శరీరేణ యోఽస్థిరైశ్చ ధనాదిభిః,
సంచినోతి స్థిరం ధర్మం స ఏకో బుద్ధిమాన్నరః. ౩౦
తస్మాత్సర్వప్రయత్నేన కర్తవ్యో ధర్మసంచయః,
గచ్ఛధ్వం పుణ్యవత్ స్థానం సర్వభోగసమన్వితమ్. ౩౧
ఇతి ధర్మవచశ్శ్రుత్వా తం ప్రణమ్య సభాం చ తామ్,
అమరైః పూజ్యమానాస్తే స్తూయమానా మునీశ్వరైః. ౩౨
విమానగణసంకీర్ణాః ప్రయాంతి పరమం పదమ్,

పిదప పుణ్యాత్ములం జూచి "ఓ బుద్ధిమద్వరిష్ఠులారా! నారకక్లేశభీరువులారా! సుఖదాయకం బగు దేవత్వమును సంపాదించికొన్నారు. దుర్లభం బగు మానుషజన్మము నెత్తి ఎవ్వరు సత్యం బగు ధర్మమును సాధింప రట్టివారలు ఘోరంబగు నరకమును బొందుదురు. వారికంటె నచేతనుఁడు మఱియొకఁ డుండఁబోఁడు. అస్థిరముగ మానుషశరీరముచే స్థిర మగు ధర్మము నుపార్జించిన యతఁడు బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడు. కాఁబట్టి సర్వవిధములచే ధర్మమును సంపాదింపవలెను. సర్వభోగసమన్వితం బగు పుణ్యస్థానమునకుఁ బొందు" అను యముని పలుకులను విని యతనికి యతని సభకును నమస్కరించి దేవతలచేఁ బూజింపఁబడుచు మునీశ్వరులచే స్తోత్రములు జేయఁబడుచు విమానగణసంకీర్ణులై పరమపదమును బొందుదురు.

కేచి ద్ధర్మసభాయాం హి తిష్ఠంతి పరమాఽఽదరాత్. ౩౩

ఉషిత్వా తత్ర కల్పాంతం భుక్త్వా భోగానమానుషాన్,
ప్రాప్నోతి పుణ్యశేషేణ మానుష్యం పుణ్యదర్శనమ్. ౮౪
మహాధనీ చ సర్వజ్ఞస్సర్వశాస్త్రవిశారదః,
పునస్స్వాత్మవిచారేణ తతో యాతి పరాం గతిమ్. ౮౫
ఏతత్తే కథితం సర్వం త్వయా పృష్టం యమాలయమ్,
ఇదం శృణ్వన్నరో భక్త్యా ధర్మరాజసభాం వ్రజేత్. ౮౬

కొందఱు ఆధర్మసభయందే పరమాదరంబున నుందురు. అచ్చట కల్పాంతమువఱకునుండి దివ్యభోగములననుభవించి పుణ్యశేషముచే మరల పుణ్యంబగు మానుషజన్మ నెత్తి మహాధనుఁడును సర్వశాస్త్రవిశారదుఁడును అయి మరల ఆత్మవిచారముచే పరమపదమును బొందును. ఓగరుఁడుడా! యమాలయవృత్తాంతమును జెప్పినాను. దీనిని భక్తితో వినువారలు ధర్మరాజసభకు నేగుదురు.

ఇతి శ్రీగరుడపురాణే-సారోద్ధారే-ధర్మరాజనగర
నిరూపణో నామ చతుర్దశోఽధ్యాయః

---

# పంచదశాధ్యాయము.

---

శ్రీమహావిష్ణువు గరుడునకు విశ్వాత్ముల జన్మకర్మల
నిరూపించి చెప్పుట.

గరుడ ఉవాచ:—

ధర్మాత్మా స్వర్గతిం భుక్త్వా జాయతే విమలే కులే,
అతస్తస్య సముత్పత్తిం జననీజఠరే వద. ౧
యథా విచారం కురుతే దేహేఽస్మింత్సుకృతీ జనః,
తథాహం శ్రోతుమిచ్ఛామి వద మే కరుణానిధే! ౨

ఓభగవానుఁడా! పుణ్యాత్ముఁడు స్వర్గాదిపుణ్యలోకంబులకుం జని యచ్చట దివ్యభోగంబుల ననుభవించి పుణ్యశేషముతో భూలోకంబునకుం జని శుద్ధవంశంబునఁ బుట్టి యాత్మవిచారముచే మరల స్వర్గతిని బొందు నని యానతిచ్చితివిగదా! కాఁబట్టి పుణ్యాత్ముఁడు తల్లిగర్భమును బ్రవేశించినది మొదలు ఎట్లు సంచరించునదియు ఎట్టెట్టి విచారము జేయునదియు నాకుఁ దెలియఁజెప్పుమా యని గరుడుం డడిగెను.

శ్రీభగవానువాచ:—

సాధు పృష్టం త్వయా తార్క్ష్య! పరం గోప్యం వదామి తే,
యస్య విజ్ఞానమాత్రేణ సర్వజ్ఞత్వం ప్రజాయతే. ౩
వక్ష్యామి చ శరీరస్య స్వరూపం పారమార్థికమ్,
బ్రహ్మాండగుణసంపన్నం యోగినాం ధారణాస్పదమ్. ౪
షట్చక్రచింతనం యస్మిన్యథా కుర్వంతి యోగినః,

---

అస్మిన్ సుకృతినాం జన్మ దేహే వైరాజధారణమ్. షట్చక్రచింతనం చైవ హరిః పంచదశేఽబ్రవీత్. పూర్వాధ్యాయాంతే "ఉషిత్వా తత్ర కల్పాంతం భుక్త్వా భోగా నమానుషాన్, ప్రాప్నోతి పుణ్యశేషేణ మానుష్యం పుణ్యదర్శనం, పున స్స్వాత్మవిచారేణ తతో యాతి పరాం గతి" మిత్యుక్తమ్. ఇదానీం గరుడ స్తదనువాదపూర్వకం సుకృతిన స్సముత్పత్తిం పృచ్ఛతి. ధర్మాత్మేతి ద్వాభ్యామ్. ౧, ౨. అతోఽత్తరం శ్రీభగవానువాచ. యావ దధ్యాయసమాప్తి. ౩, ౪. ధ్యానం యథా కుర్వంతి త చ్ఛృ

బ్రహ్మరంధ్రే చిదానందరూపధ్యానం తథా శృణు.

ఓగరుడుఁడా! బాగుగ నడిగితివి. నీవు ప్రశ్నించిన ప్రశ్నము గోప్య మైనను జెప్పెదను. దేనిని తెలిసికొనుటవలన సర్వజ్ఞత్వము కలుగునో ఏది బ్రహ్మాండగుణసంపన్నమై యోగులకు ధారణాస్పదమై వెలయుచుండునో యోగులు దేనియందు షట్చక్రచింతనమును జేయుచుందురో బ్రహ్మరంధ్రంబున చిదానందరూపధ్యానము జేయుదురో అట్టి పారమార్థికం బగు శరీరస్వరూపమును జెప్పెద వినుము అని భగవానుఁడు పలికెను.

శుచీనాం శ్రీమతాం గేహే జాయతే సుకృతీ యథా,
తథా విధానం నియమం తత్పిత్రోః కథయామి తే. ౬

పుణ్యాత్ముఁడు శుచు లగు శ్రీమంతుల గృహంబులం దెట్లు జనించును? తత్పితరుల కెట్టి నియమము లున్నవి? వానిని జెప్పెద వినుము.

ఋతుకాలే తు నారీణాం త్యజేద్దినచతుష్టయమ్,
తావన్నాలోకయే ద్వక్త్రం పాపం వపుషి సంభవేత్. ౭
స్నాత్వా సచేలం సా నారీ చతుర్థేఽహని శుధ్యతి,
సప్తాహాత్పితృదేవానాం భవేద్యోగ్యా వ్రతార్చనే. ౮

స్త్రీలు రజస్వల లైనపుడు మొదటి నాలుగుదినములయందు తన్ముఖము జూచిన పాపము లభించును. కాఁబట్టి మొదటి నాలుగురోజులు విడువవలెను. నాలవదినంబున సచేలస్నానము జేసినతోడనే పరిశుద్ధురా లగును. ఏడవదినము మొదలు పితృకర్మలం దర్హురా లగును.

సప్తాహమధ్యే యో గర్భస్స భవేన్మలినాశయః,
ప్రాయశస్సంభవంత్యత్ర పుత్రాస్సప్తాహమధ్యతః. ౯
యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు,
పూర్వసప్తకముత్సృజ్య తస్మాద్యుగ్మాసు సంవిశేత్. ౧౦

ఏడుదినములలో సంభవించు గర్భము పాపచిత్తము కలదగును. ఎనిమిదవదినంబులలోఁ బరుచుగాఁ బుత్రులు సంభవింతురు సరిదినంబులఁ

జ్యతి. ౫. యథా యేన విధానేన తత్పిత్రోః తస్య మాతాపిత్రోః. ౬. పాపం యావ దింద్రస్య బ్రహ్మహత్యా సంభవతి. ౭-౧౦. సామాన్యాః గర్భధారణేసాధారణా ఏవ.

పుత్రులును బేసిదినంబులఁ బుత్రికలును జన్మించెదరు. కాఁబట్టి మొదటి ఏడురోజులను విడచి అనంతరదినంబులలో యుగ్మదినంబులందు స్త్రీలతో భోగింపవలెను.

షోడశర్తు ర్నిశా స్త్రీణాం సామాన్యాస్సముదాహృతాః,
యా వై చతుర్దశీ రాత్రి ర్గర్భ స్తిష్ఠతి తత్ర వై. ౧౧
గుణభాగ్యనిధిః పుత్ర స్తదా జాయేత ధార్మికః,
సా నిశా ప్రాకృతై ర్జీవై ర్న లభ్యేత కదాచన. ౧౨

ఋతుదినంబు లగు పదియాఱుదినంబులలో సాధారణముగా స్త్రీలకు గర్భోత్పత్తి యగుచుండును. ఆషోడశదినంబులలో పదునాలవ రాత్రి గర్భోత్పత్తికి మిగులఁ బ్రశస్తమైనది. ఆ పదునాల్గవరాత్రి యందు గర్భోత్పత్తియైన శిశువు సకలగుణములకు భాగ్యమునకు నిధియు ధార్మికుఁడును అగును. సామాన్యమానవుల కారాత్రి ఎప్పుడును లభింపదు.

పంచమేఽహని నారీణాం కార్యం మధురభోజనమ్,
కటు క్షారం చ తీక్ష్ణం చ త్యాజ్య ముష్ణం చ దూరతః. ౧౩
తత్ క్షేత్ర మోషధీపాత్రం బీజం చా ప్యమృతాయితమ్,
తస్మిన్నుప్త్వా నరస్స్వామీ సమ్యక్ఫలమవాప్నుయాత్. ౧౪

పంచమదినము మొదలు స్త్రీలకు మధురభోజనము బెట్టవలెను. కటువులైనదియు క్షారమైనట్టియు తీక్ష్ణమైనట్టియు వేడియైనట్టియు భోజనము బెట్టగూడదు. ధాన్యాదుల కుత్పత్తిస్థానం బగుక్షేత్రంబును

---

౧౧. గుణాః విచారాదయః భాగ్య మైశ్వర్యం తేషాం నిధిః నిదానస్థానం - ప్రాకృతైః నిర్భాగ్యైః. ౧౨. పంచమేఽహనీత్యుపలక్షణం పంచమదినా దారభ్య షోడశర్తునిశాపర్యంతమ్. ౧౩. తత్ క్షేత్ర మోషధీపాత్రమితి. ఓషధీనాం ఏలాదిధాన్యానాం పాత్రం ఉత్పత్తిస్థానం తత్ ప్రసిద్ధం క్షేత్రం యథా కంటకగుల్మాదినిరసనేన తదుపయోగి ద్రవ్యాంతరమేళనేన జలసేచనేన కృషియోగ్యం విధాయ తస్మిన్నుప్త్వా బీజం వాపయిత్వా స్వామీ కర్షకః స్థూలాన్నరూపం ఫలం ప్రాప్నోతి. తథాఽత్రాపి ఓషధీపాత్రం పుత్రోత్పత్తిస్థానం తత్ గర్భరూపం క్షేత్రం కటుక్షారాది భోజనం పరిత్యజ్య మాధుర్యభోజనం కారయిత్వా వీర్యసేచనం చ కృత్వా తస్మిన్నుప్త్వా స్వామీ పితా సమ్యక్ ధార్మికపుత్రరూపం ఫలం ప్రాప్నుయా దిత్యర్థః. ౧౪.

శుభ్రపరచి బీజములు చల్లిన యెడల ధాన్యాదులు బాగుగ ఫలించిన రీతి పుత్రోత్పత్తి హేతుభూతం బగు గర్భక్షేత్రమును మధురభోజనముచే బాగుపరచి బీజమునుంచినయెడల ధర్మాత్ములగు బుత్రులు జన్మించుదురు.

తాంబూలపుష్పశ్రీఖండైస్సంయుక్తశ్శుచివస్త్రభృత్,
ధర్మమాదాయ మనసి సుతల్పం సంవిశేత్పుమాన్. ౧౫

పురుషుఁడును తాంబూలము వేసికొని పువ్వులను మెడను శిఖను ధరించి గంధ మలందికొని శుక్లవస్త్రముల ధరించి మనంబున ధర్మమును జింతింపుచు శయ్యను నధిష్ఠించి భార్యతో భోగింపవలెను.

నిషేకసమయే యాదృక్ నరచిత్తవికల్పనా,
తాదృక్స్వభావసంభూతిర్జంతుర్విశతి కుక్షిగః. ౧౬
చైతన్యం బీజభూతం హి నిత్యం శుక్లే వ్యవస్థితమ్,
కామశ్చిత్తం చ శుక్రంచ యదా హ్యేకత్వమాప్నుయాత్. ౧౭
తదా ద్రావ మవాప్నోతి యోషిద్గర్భాశయే నరః,
శుక్రశోణితసంయోగాత్పిండోత్పత్తిః ప్రజాయతే. ౧౮
పరమానందదః పుత్రో భవే ద్గర్భగతః కృతీ,
భవంతి తస్య నిఖిలాః క్రియాః పుంసవనాదికాః. ౧౯
జన్మ ప్రాప్నోతి పుణ్యాత్మా గ్రహేషూచ్చగతేషు చ,
తజ్జన్మసమయే విప్రాః ప్రాప్నువంతి ధనం బహు. ౨౦
విద్యావినయసంపన్నో వర్ధతే పితృవేశ్మని,
సతాం సంగేన స భవేత్సర్వాగమవిశారదః. ౨౧
దివ్యాంగనాదిభోక్తా స్యాత్తారుణ్యే దానవాన్ధనీ,

---

మాధుర్యభోజనాదిభిః స్త్రీణాం విధానం నియమముక్త్వా పురుషాణా మాహ-తాంబూలేతి. సుతల్పం 'పారదారుమయీ'మిత్యాద్యుక్తప్రకారాం శయ్యాం సంవిశేత్, స్థితో భూయాత్. ౧౫. నిషేకసమయే రతికాలే యాదృశీ వికల్పనా శుభాశుభవాసనా భవతి తాదృశ్యేవ స్వభావస్య ఉత్పత్తి ర్యస్య స జంతుః విశతి గర్భే ప్రవిష్టోభవతి, ౧౬. చైతన్యం జీవః-కామః అభిలాషపూర్తిః. ౧౭, ౧౮. కృతీ పుణ్యాత్మా. ౧౯,౨౦. పూర్వ మితి పూర్వజన్మని కృతానాం తపఆదీనాం ఫల స్యోదయాత్ భోక్తాఽపి భవేత్. తథాచ స్మృతిః. "భోజ్యం భోజ్యనశక్తిశ్చ రతిశక్తి ర్వరస్త్రియః,

పూర్వం కృతతపస్తీర్థమహాపుణ్యఫలోదయాత్. ౨౨
తతశ్చ యతతే నిత్య మాత్మానాత్మవిచారణే,
అధ్యారోపాపవాదాభ్యాం కురుతే బ్రహ్మచింతనమ్. ౨౩

సంభోగసమయంబున నెట్టి చింత యుండునో అట్లు చింతించు మనంబు గలిగియుండునట్టి జంతువు గర్భంబును ప్రవేశించును. బీజ భూతుండగు జీవుండు ఎల్లపుడును శుక్రమునందుండును. అభిలాష పూర్తియు చిత్తంబును శుక్రమును ఏకత్వము బొందినపుడు నరుఁడు స్త్రీగర్భంబున ద్రవత్వము బొందును. అప్పుడు శుక్లశోణితసంయోగం బువలన పిండోత్పత్తి యగును. పరమానందప్రదుఁడగు పుత్త్రుఁడు గర్భ మును ప్రవేశించును. అట్టి పుణ్యాత్ముని పుంసవనసీమంతాదికర్మలు క్రమంబున జరుగును గ్రహంబు లుచ్చాదులయం దున్నపుడు పుణ్యా త్ముఁడు జన్మించును. ఆతని జన్మకాలమున బ్రాహ్మణులకు విశేషధనము లభించు. పిమ్మట విద్యావినయములు కలిగి తండ్రిగృహంబున వర్ధిల్లు చుండును. అనంతరము సత్సహవాసంబున సర్వశాస్త్రవిశారదుఁ డగును. యౌవనావస్థను దివ్యాంగనాభోక్తయు దానముఁ జేయువాఁడును ధనియునగును. పూర్వజన్మసుకృతవిశేషంబును జేసి ఆత్మానాత్మవిచా రణయందు ప్రవృత్తుఁడయి అధ్యారోపాపవాదంబుల బ్రహ్మచింతనము జేయును.

అస్యాసంగావబోధాయ బ్రహ్మణోఽన్వయకారిణః,
తీర్త్యాద్యనాత్మవర్గస్య గుణాంస్తే కథయామ్యహమ్. ౨౪

విభవో దానశక్తిశ్చ నాల్పస్య తపసః ఫల"మితి. ౨౨. యతతే యత్నవాన్భవతి. అసద్భూతాయాం రజ్జౌ సర్పారోపవ ద్వస్తున ఆరోపోఽధ్యారోపః. వస్తు సచ్చిదా నందాద్వయం బ్రహ్మ. తీర్త్యాద్యజ్ఞానాంతసకలజడసమూహో ఽవస్తు-అపవాదో నామ రజ్జువివర్తస్య రజ్జుమాత్రవ ద్వస్తువివర్త స్యావస్తునో జ్ఞానాదేః ప్రపంచస్య వస్తుమా త్రత్వం-ఆభ్యాం అధ్యారోపాపవాదాభ్యాం త్వంపదార్థం సంశోధ్య 'సర్వం ఖల్విదం బ్రహ్మ నేహ నానాస్తి కించన'ఇత్యాది శ్రుత్యుక్తం బ్రహ్మచింతనం కురుతే. ౨౩. అస్యేతి. తీర్త్యాదిషు అన్వయం కరోతీ త్యన్వయకారిణోఽప్యస్య బ్రహ్మణః అసం గావబోధాయ 'అసంగో హ్యయం పురుష'ఇతి శ్రుత్యుక్త జ్ఞానార్థం కథయామీత్య న్వయః. ౨౪. అనాత్మవిచారణ మాహ-తీర్తిరిత్యాదిభిః. స్థూలభూతాః. అప్రపంచీ

క్షితిర్వారి హవిర్భోక్తా వాయురాకాశ ఏవ చ,
స్థూలభూతా ఇమే ప్రోక్తాః పిండోఽయం పాంచభౌతికః. ౨౫

భూమ్యాదులయం దన్వయకారి యగు బ్రహ్మయొక్క అసంగ జ్ఞానార్థమై భూమ్యాద్యనాత్మవర్గ మందలి గుణములను నీకుఁ జెప్పెదను. పృథివ్యప్తేజోవాయురాకాశము లని స్థూలభూతము లైదు. మానవ శరీర మీపంచభూతంబులవలన నుత్పత్తి యగుటచే పాంచభౌతిక మనఁ బడుచున్నది.

త్వగస్థినాడ్యో రోమ మాంసం చైవ ఖగేశ్వర!,
ఏతే పంచమయా భూమేర్గుణాస్తే పరికీర్తితాః. ౨౬
లాలా మూత్రం తథా శుక్రం మజ్జా రక్తం చ పంచమమ్,
అపాం పంచగుణాః ప్రోక్తా స్తేజసోఽపి నిశామయ. ౨౭
క్షుధా తృషా తథాఽఽలస్యం నిద్రా కాంతి స్తథైవ చ,
తేజఃపంచగుణం తార్క్ష్య! ప్రోక్తం సర్వత్ర యోగిభిః. ౨౮
ఆకుంచనం ధావనం చ లంఘనం చ ప్రసారణమ్,
చేష్టితం చేతి పంచైవ గుణా వాయోః ప్రకీర్తితాః. ౨౯
ఘోషశ్చింతా చ శూన్యత్వం తథా మోహశ్చ సంశయః,
ఆకాశస్య గుణాః పంచ జ్ఞాతవ్యా స్తే ప్రయత్నతః. ౩౦

చర్మము ఎముకలు నాడులు రోమములు మాంసము అని భూమిగుణము లైదు. లాల మూత్రము శుక్రము మజ్జా రక్తము అని ఉదకమున కైదు గుణములు కలవు ఆకలి దాహము ఆలస్యము నిద్రా కాంతి అని అగ్నిగుణము లైదు. ఆకుంచన ధావన లంబన ప్రసారణ చేష్టితంబులని వాయుగుణంబు లైదు. ఘోష చింతా శూన్యత్వ మోహచింత లని ఆకాశగుణము లైదు.

మనో బుద్ధి రహంకార శ్చిత్తం చేతి చతుష్టయమ్,
అంతఃకరణ ముద్దిష్టం పూర్వకర్మాధివాసితమ్. ౩౧

కృతాః. పాంచభౌతికః పంచీకృతపంచభూతోత్పన్నః. ౨౫. క్షిత్యాదిపంచభూతానాం గుణా నాహ-త్వగితి పంచభిః. ౨౬-౩౦. పూర్వకర్మాధివాసితం పూర్వజన్మకృతై శ్శుభాశుభకర్మభిః. అధివాసితం శుభాశుభవాసనాయుక్తం భవతి. 'బుద్ధిః కర్మానుసారిణీ' తి వచనాత్ బుద్ధి రిత్యుపలక్షణం. అంతఃకరణచతుష్టయమేవేత్యర్థః

శ్రోత్రం త్వక్చక్షుషీ జిహ్వాఘ్రాణంజ్ఞానేంద్రియాణి చ,
వాక్పాణిపాదపాయూపస్థాని కర్మేంద్రియాణి చ. 32
దిగ్వాతార్కప్రచేతోఽశ్వివహ్నీంద్రోపేంద్రమిత్రకాః,
జ్ఞానకర్మేంద్రియాణాం చ దేవతాః పరికీర్తితాః. 33

మనసు బుద్ధి అహంకారము చిత్తము అని పూర్వజన్మకర్మవాసనలతో కూడియున్న అంతఃకరణము నాలుగువిధములుగ నుండును. శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణము లని జ్ఞానేంద్రియము లైదు. వాక్పాణిపాదపాయూపస్థలని కర్మేంద్రియము లైదు.. జ్ఞానేంద్రియములలో శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబుల కైదింటికిఁ గ్రమంబుగా దిగ్వాతార్కప్రచేతాశ్వినులును కర్మేంద్రియంబు లగు వాక్పాణిపాదపాయూపస్థలకు వహ్నీంద్రోపేంద్రమిత్రకులును అధిదేవతలు.

ఇడా చ పింగళా చైవ సుషుమ్నాఖ్యా తృతీయకా,
గాంధారీ గజజిహ్వా చ పూషా చైవ యశస్వినీ. 34
అలంబుషా కుహూశ్చాపి శంఖినీ దశమీ తథా,
పిండమధ్యే స్థితా హ్యేతాః ప్రధానా దశ నాడికాః. 35

ఇడ, పింగళ, సుషుమ్న, గాంధారి, హస్తిజిహ్వ, పూష, యశస్విని, అలంబుష, కుహువు, శంఖిని యని పాంచభౌతికశరీరంబున ప్రధానంబు లగు నాడులు పది గలవు.

ప్రాణాపానసమానాఖ్యా ఉదానో వ్యాన ఏవ చ,
నాగః కూర్మశ్చ కృకరో దేవదత్తో ధనంజయః. 36
హృది ప్రాణో గుదేఽపానస్సమానో నాభిమండలే,
ఉదానః కంఠదేశే స్యా ద్వ్యానస్సర్వశరీరగః. 37
ఉద్గారే నాగ ఆఖ్యాతః కూర్మ ఉన్మీలనే స్మృతః,
కృకరః క్షుత్కరో జ్ఞేయో దేవదత్తో విజృంభణే. 38
న జహాతి మృతం వాఽపి సర్వవ్యాపీ ధనంజయః,

31. ఉభయేంద్రియాణ్యాహ-శ్రోత్రమితి. 32. దిగాదయః పంచశ్రోత్రాదీనాం యథాక్రమం దేవతాః. వహ్న్యాదయశ్చ వాగాదీనామితి. 33-35. అథ దశ ప్రాణాన్ స్థానకర్మసహితానాహ-ప్రాణ ఇతి సార్ధత్రిభిః. 36, 37. క్షుత్కరః క్షుధాకర్తా. 38. మృతశోభాకారిత్వం ధనంజయస్య కర్మ. 39. వ్యానకో వాయుః

ప్రాణాపానసమానోదానవ్యానములని ప్రధానవాయువు లైదు. నాగకూర్మకృకరదేవదత్తధనంజయము లని ఉపవాయువు లైదు. ప్రాణము హృదిస్థానంబునను అపానము గుదస్థానంబునను సమానము నాభిస్థానంబునను ఉదానము కంఠస్థానంబునను వ్యానము సర్వశరీరంబునను నుండును. నాగము వాంతిని కూర్మము నేత్రోన్మీలనంబులను కృకరము తుమ్మును దేవదత్తము ఆవులింతను కలుగఁజేయును. సర్వవ్యాపియగు ధనంజయము మృతుఁడైనను వదలక శరీరమునంటియుండును.

కబళైర్భుక్తమన్నం హి పుష్టిదం సర్వదేహినామ్. ౩౯
నయతే వ్యానకో వాయుస్సారాంశం సర్వనాడిషు,
ఆహారో భుక్తమాత్రో హి వాయునా క్రియతే ద్విధా. ౪౦
సంప్రవిశ్య గుదే సమ్యక్పృథగన్నం పృథగ్జలమ్,
ఊర్ధ్వమగ్నేర్జలం కృత్వా కృత్వాన్నం చ జలోపరి. ౪౧
అగ్నేశ్చాధస్స్వయం ప్రాణస్థిత్వాఽగ్నిం ధమతే శనైః,
వాయునా ధ్మాయమానోఽగ్నిః పృథక్కిట్టం పృథగ్రసమ్. ౪౨
కురుతే వ్యానకో వాయుర్విష్వక్సం ప్రాపయేద్రసమ్,

సమస్తజీవులు పుష్టిదం బగు నన్నమును భుజింప నందలి సారమును వ్యానవాయువు సర్వనాడులకు ప్రసరింపఁజేయును. అదెట్లనః వాయువు గుదస్థానమునఁబ్రవేశించి భుజింపఁబడిన యాహారమునందలి జలమును అన్నమును విభజించి అగ్నికి నూర్ధ్వభాగంబున నుదకమును దానికి మీఁదను అన్నము నుంచి అగ్నికిఁ గ్రిందిభాగంబున తానుండి మెల్లగా నగ్నిని ప్రజ్వాలింపఁజేయును ఇట్లు ప్రజ్వాలింపఁజేయఁబడిన యగ్నియు అన్నమునందలి రసమును మలమును విభజించును. అంతట వ్యానవాయువు ఆ రసమును సర్వనాడులయందు ప్రసరింపఁజేయును

ద్వారైర్ద్వాదశభిర్భిన్నం కిట్టం దేహాద్బహిస్స్రవేత్. ౪౩
కర్ణాక్షి నాసికా జిహ్వా దంతా నాభిర్నఖా గుదమ్,

సర్వశరీరవ్యాపకత్వాత్ సారాంశం రసం నయతే ప్రాపయతి. రసప్రాపణప్రకార మేవాహ - ఆహార ఇతి త్రిభిః. ౪౦-౪౨. భిన్నం రసాత్పృథగ్భూతం కిట్టం మలం.

గుహ్యం శిరో వపుర్లోమ మలస్థానాని చక్షతే. ౪౪
ఏవం సర్వే ప్రవర్తంతే స్వస్వకర్మణి వాయవః,
ఉపలభ్యాఽఽత్మనస్సత్తాం సూర్యాఽఽలోకం యథా జనాః. ౪౫

పిదప కర్ణములు నేత్రములు నాసికము జిహ్వా దంతములు నాభి నఖములు గుదస్థానము గుహ్యము (శిశ్నము, యోని) శిరము శరీరము లోమములు అనఁబడు ద్వాదశమార్గములద్వారా అగ్నిచే పృథగ్భూతం బగు మలము శరీరమునుండి బయటికి వచ్చును. ఇట్లు సమస్తవాయువులు ఆత్మసత్తను బొంది సూర్యప్రకాశమును బొందిన మనుజులవలె తమతమ కర్మలయందు ప్రవర్తించుచుండును.

ఇదానీం నరదేహస్య శృణు రూపద్వయం ఖగ!,
వ్యావహారిక మేకం చ ద్వితీయం పారమార్థికమ్. ౪౬
తిస్రః కోట్యోఽర్ధకోటీ చ రోమాణి వ్యావహారికే,
సప్తలక్షాణి కేశాస్స్యుర్నఖాః ప్రోక్తాస్తు వింశతిః. ౪౭
ద్వాత్రింశద్దశనాః ప్రోక్తాస్సామాన్యాద్వినతాసుత!,
మాంసం పలసహస్రం తు రక్తం పలశతం స్మృతమ్. ౪౮
పలాని దశ మేదస్తు త్వక్పలాని చ సప్తతిః,
పలద్వాదశకం మజ్జా మహారక్తం పలత్రయమ్. ౪౯
శుక్లం ద్వికుడపం జ్ఞేయం కుడపం శోణితం స్మృతమ్,
షష్ట్యుత్తరం చ త్రిశతమస్థ్నాం దేహే ప్రకీర్తితమ్. ౫౦
నాడ్యస్స్థూలాశ్చ సూక్ష్మాశ్చ కోటిశః పరికీర్తితాః,
పిత్తం పలాని పంచాశత్తదర్ధం శ్లేష్మణస్తథా. ౫౧

---

౪౩. మలస్య నిర్గమస్థానాన్యాహ - కర్ణేతి. ౪౪. సర్వే ప్రాణాదివాయవః ఆత్మసత్తయైవ చేష్టంతీత్యాహ - ఏవమితి సూర్యస్యాఽఽలోకం ప్రకాశం ఉపలభ్య ప్రాప్య జనాః యథా స్వస్వకర్మణి ప్రవర్తంతే, తథైవాఽఽత్మసత్తాం ప్రాప్య వాయవోఽపీత్యర్థః. అయం భావః సూర్యో యథా కర్మణి జనాన్ప్రవర్త్య స్వయం సాక్షితయాఽసంగత్వేన స్థితో భవతి, తద్వదాత్మాఽపీతి - అనేనాఽఽత్మవిచారణ ముపయుక్తం భవతి. ౪౫. వ్యావహారికం అగమ్యం. పారమార్థికం యోగిజనజ్ఞేయమ్. ౪౬. తత్రాఽఽద్యం తావదాహ-తిస్ర ఇతి షడ్భిః తిస్రః కోట్యః సప్తలక్షా ఇత్యగణితాని. ౪౭,౪౮. స్థూలమానేన ధాతుప్రమాణ మాహ, మహారక్త ప్రాణాధారభూతమ్. ౪౯.

సతతం జాయమానం తు విణ్మూత్రం చాప్రమాణతః,
ఏతద్గుణసమాయుక్తం శరీరం వ్యావహారికమ్. ౫౨

ఓయిగరుడుడా! వ్యావహారిక మనియు పారమార్థిక మనియు మానవశరీరము రెండు దెరంగులై వర్తిల్లుచుండును. అందు ముందుగా వ్యావహారికశరీరలక్షణములను వివరించెద వినుము. మూఁడుకోట్ల యేఁబది లక్షల రోమములును ఏడులక్షల కేశములును ఇరువది నఖంబులును ముప్పదిరెండు దంతములును సహస్రపలముల ఎత్తు మాంసమును నూరుపలముల రక్తమును పదిపలముల మెదడును డెబ్బది పలముల చర్మమును పండ్రెండుపలముల మజ్జయును ప్రాణాధారం బగు రక్తము మూఁడుపలములును ఇరువదిమాషముల రేతస్సును పదిమాష ములశోణితమును మూఁడువందల యఱువది మాషముల ఎముకలును స్థూలంబులును సూక్ష్మంబులును అగు నాడులు కోటియును ఏఁబదిపల ముల పిత్తమును ఇరువదైదు పలముల శ్లేష్మమును వ్యావహారిక దేహం బున నున్నవి. విణ్మూత్రము లెప్పటి కప్పుడు పుట్టుచుండుటం జేసి వాని ప్రమాణ మింత యని చెప్పుటకు వలనుపడదు. ఇట్లు వ్యావహారికశరీర స్వరూపము జెప్పినాను.

భువనాని చ సర్వాణి పర్వతద్వీపసాగరాః,
ఆదిత్యాద్యా గ్రహాస్సంతి శరీరే పారమార్థికే. ౫౩
పారమార్థికదేహే హి షట్చక్రాణి భవంతి చ,
బ్రహ్మాండే యే గుణాః ప్రోక్తాస్తేఽప్యస్మిన్నేవ సంస్థితాః. ౫౪

ఇఁక పారమార్థికశరీరస్వరూపమును జెప్పెద వినుము. చతుర్దశ భువనములు పర్వతద్వీపసాగరములు ఆదిత్యాదిగ్రహములు మూలా

---

తుడపం దశమాషకమ్-శోణితం బుకూద్భవం గర్భాధానభూతమ్. ౫౦-౫౨. ఏవం వ్యావహారికంనిరూప్య ఇదానీం పారమార్థికస్వరూపనిరూపణేన సూక్ష్మస్వరూపీమనః ప్రవేశాయ స్వదేహే తావద్విరాడ్రూపస్థూలధారణా మాహ-పారమార్థికదేహే హీ త్యారభ్య తావదధ్యాయసమాప్తి, గుణాః భువనాదయః,తానీ వాహ-భువనానీత్యా ది, పారమార్థికే పారమార్థికస్వరూపప్రకాశకే. ౫౩, ౫౪ వైరాజరూపభాక్ 'వైరా

ధారాది షట్చక్రములు. వేయేల! బ్రహ్మాండము నందలి సమస్తగుణములు ఈపిండాండంబున గలవు.

తానహం తే ప్రవక్ష్యామి యోగినాం ధారణాస్పదాన్,
యేషాం భావనయా జంతుర్భవేద్వైరాజరూపభాక్. ౫౫
పాదాధస్తాత్తలం జ్ఞేయం పాదోర్ధ్వం వితలం తథా,
జానునోస్సుతలం విద్ధి సక్థిదేశే మహాతలమ్. ౫౬
తలాతలం సక్థిమూలే గుహ్యదేశే రసాతలమ్,
పాతాళం కటిసంస్థం చ సప్తలోకాః ప్రకీర్తితాః. ౫౭

ఆగుణంబుల నన్నిటిని నీకుఁ జెప్పెద వినుము. వానిని భావించుటవలన జంతువు విరాడ్రూపమును బొందును. పాదముల క్రింద తలమును పాదోర్ధ్వంబున వితలంబును జానువుల సుతలంబును సక్థిదేశంబున మహాతలంబును సక్థిమూలంబున తలాతలంబును గుహ్యదేశంబున రసాతలంబును కటిప్రదేశంబున పాతాలంబును గలవు. ఇట్లు సప్తపాతాలలోకములు చెప్పఁబడినది.

భూర్లోకం నాభిమధ్యే తు భువర్లోకం తదూర్ధ్వకే,
స్వర్లోకం హృదయే విద్యాత్కంఠదేశే మహస్తథా. ౫౮
జనలోకం వక్త్రదేశే తపోలోకం లలాటకే,
సత్యలోకం బ్రహ్మరంధ్రే భువనాని చతుర్దశ. ౫౯

నాభిమధ్యంబున భూర్లోకంబును ఉదరంబున భువర్లోకంబును హృదయంబున స్వర్లోకంబును కంఠంబున మహర్లోకంబును ముఖంబున జనలోకంబును లలాటంబున తపోలోకంబును బ్రహ్మరంధ్రంబున సత్యలోకంబును గలవు. ఇట్లు చతుర్దశభువనములు మానవశరీరంబున గలవు.

త్రికోణే సంస్థితో మేరు రధఃకోణే చ మందరః,
దక్షకోణే చ కైలాసో వామకోణే హిమాచలః. ౬౦

---

౫౪ పురుషో యో హి భగవాన్నారాయణాశ్రయ' ఇతి భాగవతోక్తః-స్వయం స్యాదిత్యర్థః. ౫౫. పూర్వశ్లోకోక్తక్రమేణైవ సర్వేషాం ధారణా మాహ..పాదేతి. ౫౬, ౫౭. తదూర్ధ్వకే ఉదరే. ౫౮, ౫౯. త్రికోణే హృత్పీఠకమలాంతర్గతే. తదుక్తం బ్రహ్మపురాణే "హృది రత్నమయే శ్రీమత్సింహాసనగతాంబుజే, త్రికోణాంతస్సమాసీనం శివం

నిషధశ్చోర్ధ్వరేఖాయాం దక్షాయాం గంధమాదనః,
రమణో వామరేఖాయాం సప్తైతే కులపర్వతాః. ౬౧

హృత్పీఠకమలాంతర్గతం బగు త్రికోణంబున మేరువును, అధఃకోణంబున మందరపర్వతంబును, దక్షిణకోణంబున కైలాసంబును, వామకోణంబున హిమాచలంబును, ఊర్ధ్వరేఖను నిషధంబును, దక్షిణరేఖను గంధమాదనంబును, వామరేఖను రమణంబును గలవు.

అస్థిస్థానే భవేజ్జంబూః శాకో మజ్జాసు సంస్థితః,
కుశద్వీపస్థ్సితో మాంసే క్రౌంచద్వీపస్సిరాసు చ. ౬౨
త్వచాయాం శాల్మలీద్వీపో గోమేదో రోమసంచయే,
నఖస్థం పుష్కరం విద్యాత్సాగరాస్తదనంతరమ్. ౬౩
క్షారోదో హి భవేన్మూత్రే క్షీరే క్షీరోదసాగరః,
సురోదధిః శ్లేష్మసంస్థః మజ్జాయాం ఘృతసాగరః. ౬౪
రసోదధిం రసే విద్యాచ్ఛోణితే దధిసాగరః,
స్వాదూదో లంబికాస్థానే జానీయాద్వీనతానుతః. ౬౫
నాదచక్రే స్థితస్సూర్యో బిందుచక్రే చ చంద్రమాః,
లోచనస్థః కుజో జ్ఞేయో హృదయజ్ఞః ప్రకీర్తితః. ౬౬
విష్ణుస్థానే గురుం విద్యాచ్చక్రే శుక్రోవ్యవస్థితః,
నాభిస్థానే స్థితో మందో ముఖే రాహుః ప్రకీర్తితః. ౬౭
వాయుస్థానే స్థితః కేతుశ్శరీరే గ్రహమండలమ్,
ఏవం సర్వస్వరూపేణ చింతయేదాత్మనస్తనుమ్. ౬౮

---

ధ్యాయేదుమాధవ" మితి తస్య మధ్యే త్రికోణే పూర్ధ్వదక్షిణవామరేఖాసు చ మేర్వాదయస్సప్త కులపర్వతాః భవంతీతి. ౬౦, ౬౧. సిరాసు నాడీషు. ౬౨. గోమేదః ప్లక్షః. ౬౩, ౬౪. రసే అన్నస్య లంబికా కంఠాంతర్గతా. ౬౫. నాదబిందుచక్రే బ్రహ్మరంధ్రాదేకైకాంగుళ్యధోఽధస్తః, తదుక్తం యోగశాస్త్రే "ఏకైకాంగుళ్యధోఽధోఽస్తి రంధ్రం నాదం చ బిందుకమ్, విద్రుమస్ఫటికాకారం సూర్యచంద్రసమప్రభ" మితి, జ్ఞః బుధః. ౬౬. విష్ణుస్థానే నాభ్యంతర్గతమణిపూరకచక్రే నాభిస్థానే నాభిగోళకే మందః శనిః. ౬౭. వాయుస్థానే హృదయాదాకంఠం వాయుస్థానం తస్మిన్. ఏవముక్తప్రకారేణ సర్వస్వరూపేణ సర్వాత్మకవిరాట్స్వరూపేణ స్వదేహం చింతయేత్ ఇతి మూలధారణా. ౬౮. ప్రథమషట్చక్రచింతనాత్మకసూక్ష్మధా

అస్థులయందు జంబూద్వీపమును, మజ్జయందు శాకద్వీపమును, మాంసమున కుశద్వీపమును, శిరలయందు క్రౌంచద్వీపమును, చర్మమున శాల్మలీద్వీపమును, రోమములయందు ప్లక్షద్వీపమును, నఖములలో పుష్కరద్వీపమును ఇట్లు సప్తద్వీపములును శరీరమునందే యున్నవి. మఱియు మూత్రమున ఉప్పునీటిసముద్రమును, పాలయందు క్షీరసాగరమును, శ్లేష్మమున సురాసముద్రమును, మజ్జయందు ఘృతసముద్రమును రసమున రససముద్రమును, శోణితమున దధి (పెరుగు) సముద్రమును, లంబికాస్థానమున తియ్యనీటిసముద్రమును ఇట్లు సప్తసముద్రములును గూడ శరీరమునందే యున్నవి. ఓవినతాకుమారుఁడా! నాదచక్రమున సూర్యుఁడును, బిందుచక్రమున చంద్రుఁడును, కన్నులయందు కుజుఁడును, హృదయమున బుధుఁడును, విష్ణుస్థానమున (నాభ్యంతర్గతమణిపూరచక్రమున) గురుఁడును, శుక్రమున శుక్రుఁడును, బొడ్డున శనియు, ముఖమున రాహువును, వాయుస్థానమున (హృదయము మొదలు కంఠమువఱకును వాయుస్థానము) కేతువును. ఇట్లు నవగ్రహములును గూడ శరీరమునందే యున్నవి. ఇట్లు శరీరమే విరాడ్రూపమై యున్నది.

సదా ప్రభాతసమయే బద్ధపద్మాసనస్థితః,
షట్చక్రచిన్తనం కుర్యాద్యథోక్తమజపాక్రమమ్. ౧౯
అజపా నామ గాయత్రీ మునీనాం మోక్షదాయినీ,
అస్యాస్సంకల్పమాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే. ౨౦
శృణు తార్క్ష్య! ప్రవక్ష్యేఽహమజపాక్రమముత్తమమ్,
యం కృత్వా సర్వదా జీవో జీవభావం విముంచతి. ౨౧
మూలాధారస్స్వాధిష్ఠానం మణిపూరక మేవ చ,
అనాహతం విశుద్ధ్యాఖ్య మాజ్ఞాషట్చక్రముచ్యతే. ౨౨

పిదప యథాక్రమముగ షట్చక్రచింతనము అజపాక్రమమును గావింపవలెను. అజపయనఁగా మునులకు మోక్షదాయినియగు గాయత్రి. దానిని సంకల్పించినంతమాత్రముననే సకలపాపముల వలనను మాన

---

రజా మాహ. సదేత్యాది. ౧౯. జపానుష్ఠానం వినా సహజశ్వాసరూపా జప్తా భవతీత్య జపా! మునీనాం మననశీలానాం సంకల్ప్య గాయత్రీం చ గురుముఖాత్ జ్ఞాతవ్యమ్. ౨౦. సర్వదా కృత్వా ఏతదాచరణం నిత్యకర్మత్వేన భవతి న తు నైమిత్తిక మితి. జీవభావం

వుఁడు విడువఁబడును. గరుడుఁడా! గాయత్రీక్రమము చెప్పెద వినుము. దానిని జేసి-చో జీవుఁడు మోక్షమును బడయును. మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ వీఁకి షట్చక్ర మని పేరు.

మూలాధారే లింగదేశే నాభ్యాం హృది చ కంఠగే,
భ్రువోర్మధ్యే బ్రహ్మరంధ్రే క్రమాచ్చక్రాణి చిన్తయేత్. 23
ఆధారం తు చతుర్దళానలసమం వాసాన్తవర్ణాశ్రయమ్
స్వాధిష్ఠానమపి ప్రభాకరసమం బాలాన్తషట్పత్రకమ్,
రక్తాభం మణిపూరకం దశదళం డాద్యం ఫకారాంతకమ్
పత్రైర్ద్వాదశభిస్త్వనాహతపురం హైమం కఠాంతావృతమ్. 24
పత్రైస్సస్వరషోడశైశ్శశధరజ్యోతిర్విశుద్ధాంబుజమ్
హంసేత్యక్షరయుగ్మకం ద్వయదళం రక్తాభమాత్రాంబుజమ్,
తస్మాదూర్ధ్వగతం ప్రభాసితమిదం పద్మం సహస్రచ్ఛదమ్
సత్యానందమయం సదా శివమయం జ్యోతిర్మయం శాశ్వతమ్. 25

మూలాధారమున, లింగదేశమున, నాభియందు, హృదయమున, కంఠమున, భ్రూలతల నడుమ, బ్రహ్మరంధ్రమున ఈస్థలముల యందు చక్రములను చింతన చేయవలెను. ఆధారము చతుర్దళము. అగ్నిసమము వకారాదియు, సకారాంతమును స్వాధిష్ఠానము సూర్యతుల్యము బకారాదియు, లకారాంతమును అది షట్పత్రకము మణిపూరకము, రక్తసదృశము దశదళము డకారాది ఫకారాంతము అనాహతము. ద్వాదశదళము. బంగారముతో సమమైనది. కఠాంతావృతము విశుద్ధము షోడశదళము చంద్రతుల్యము. హంసాంత్యవర్ణాశ్రయము ఆజ్ఞ. ద్విదళము రక్తతుల్యము. వీని యన్నిటికిని పైని ప్రభాసిత మను సహస్రదళపద్మము కలదు. అది సత్యానందమయము. ఎప్పుడును శివమయము. జ్యోతిర్మయము శాశ్వతమును.

గణేశం చ విధిం విష్ణుం శివం జీవం గురుం తతః,
వ్యాపకం చ పరంబ్రహ్మ క్రమాచ్చక్రేషు చింతయేత్. 26

---

వియుంచతి-బ్రహ్మస్వరూపో భవతి ఇత్యర్థః. 1౧-౨౦. అత్ర పకారాదారం ప్రతి

ఏకవింశత్సహస్రాణి షట్ఛతాన్యధికాని చ,
అహోరాత్రేణ శ్వాసస్య గతిస్సూక్ష్మాస్మృతాబుధైః. ౨౭
హకారేణ బహిర్యాతి సకారేణ విశేత్పునః,
హంసో హంసేతి మంత్రేణ జీవో జపతి తత్త్వతః. ౨౮
షట్ఛతం గణనాథాయ షట్సహస్రం తు వేధసే,
షట్సహస్రం తు హరయే షట్సహస్రం హరాయ చ. ౨౯
జీవాత్మనే సహస్రం చ సహస్రం గురవేతథా,
చిదాత్మనే సహస్రం చ జపసంఖ్యాం నివేదయేత్. ౩౦
ఏతాంశ్చక్రగతాన్బ్రహ్మమయూఖాన్ మునయోఽమరాన్,
సత్సంప్రదాయవేత్తారశ్చింతయంత్యారుణాదయః. ౩౧
శుకాదయోఽపి మునయశ్శిష్యానుపదిశంతి చ,
అతః ప్రవృత్తిం మహతాం ధ్యాత్వాధ్యాయేత్సదా బుధః. ౩౨

చక్రములయందు వరుసగా గణేశుని, బ్రహ్మను, విష్ణువును, శివుని, జీవుని, గురుని, సర్వవ్యాపకుఁ డగు పరబ్రహ్మను చింతన చేయవలెను. అహోరాత్రమునకు శ్వాసముయొక్క గతి ఇరువదివేల ఆఱువందలు అని చెప్పఁబడినది. అది హకారముతో పైకివెడలును. సకారముతో మరల లోపలకుఁబోవును. అగుటచే జీవుఁడు ఎల్లపుడును 'హంస, హంస' అని జపించును. గణనాథునకు ఆఱువందలును, బ్రహ్మకు ఆఱువేలును,

---

యతి ఏతా నితి. బ్రహ్మమయూఖాన్ సర్వవేదమయస్య బ్రహ్మణః కిరణరూపాన్ తదభిన్నా నిత్యర్థః. చక్రగతాన్ అమరాన్ షట్చక్రస్థితాన్ శ్రీగణేశాదిదేవాన్ ఋషీణాం సంప్రదాయమార్గేషు యే ఆరుణాదయో మునయః తేఽపి చింతయంతి ఉపాసతే. తదుక్తం వేదస్తుతౌ "ఉదరముపాసతే య ఋషివర్త్మసు కూర్పదృశః, పరిసరపద్ధతిం హృదయమారుణయో దహర"మితి. ౩౧. శిష్యాన్ పరీక్షితాదీన్ తదుక్తం ద్వితీయే సద్యోముక్తిస్థలే "స్వపార్ష్ణినాఽఽపీడ్య గుదం తతోఽనిలం స్థానేషు షట్సూన్నమయేజ్జితక్లమః, నాభ్యాం స్థితం హృద్యధిరోప్య తస్మాదుదానగత్యోరసి తం నయేన్మునిః, తతోఽనుసంధాయ ధియా మనస్వీ స్వతాలుమూలం శనకైర్నయేత, తస్మాద్భ్రువోరంతరమున్నయేత నిర్భిద్య మూర్ధన్విసృజేత్పరం గత" ఇతి. ఏతద్వ్యాఖ్యానం శ్రీధరస్వామిభిః కృతం జ్ఞాతవ్యమ్. ౩౨. అనన్యధీః ఏకా

హారికి ఆఱువేలును, శివునకు ఆఱువేలును, జీవాత్మకు వేయి, గురునకు వేయి, చిదాత్మకు వేయి. ఇట్లు జపసంఖ్యను నివేదింపవలెను. చక్రమునందలి ఈ దేవతలను, సకలదేవతలను, అరుణామలగువారిని సత్సంప్రదాయవేత్తలు చింతించెదరు. శిష్యులకు ఉపదేశముగూడ చేయుదురు. అగుటచే గొప్పవారి ప్రవృత్తిని ధ్యానించి యెప్పుడు ఇట్లు చేయవలెను.

కృత్వా చ మానసీం పూజాం సర్వచక్రేష్వనన్యధీః,
తతో గురూపదేశేన గాయత్రీ మజపాం జపేత్. ౮౩
అధోముఖే తతో రంధ్రే సహస్రదళపంకజే,
హంసగం శ్రీగురుం ధ్యాయేద్వరాభయకరాంబుజమ్. ౮౪
క్షాళితం చింతయేద్దేహం తత్పాదామృతధారయా,
పంచోపచారైస్సంపూజ్య ప్రణమేత్తత్ స్తవేన చ. ౮౫
తతః కుండలినీం ధ్యాయే దారోహా దవరోహతః,
షట్చక్రకృతసంచారాం సార్ధత్రివలయాం స్థితామ్. ౮౬

---

ప్రచిత్తస్సన్. ౮౩. రంధ్రే బ్రహ్మరంధ్రాంతర్గతే అధోముఖపంకజే శ్రీగురుం ధ్యాయేత్-తదుక్తం రుద్రయామళే "సహస్రదళపంకజే సకలశీతరశ్మిప్రభే వరాభయకరాంబుజం విమలగంధపుష్పాంబరం, ప్రసన్నవదనేక్షణం సకలదేవతారూపిణం స్మరేచ్ఛిరసి హంసగం జననవ్యాధివైద్యం గురు"మితి. ౮౪. పంచోపచారైర్మనసా కల్పితైః పంచభూతాత్మకగంధపుష్పధూపదీపనైవేద్యైః. తద్యథా. లం పృథివ్యాత్మనే గంధం సమర్పయామి. హం ఆకాశాత్మనే పుష్పం. యం వాయ్వాత్మనే ధూపం. రం తేజ ఆత్మనే దీపం. వం అమృతాత్మనే అమృతనైవేద్యం సమర్పయామీ"తి తత్ స్తవేన "గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురు ర్దేవో మహేశ్వరః, గురు స్సాక్షా త్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః." ఇతి గురుస్తోత్రేణ. ౮౫. పరాత్పర బ్రహ్మకళాం కుండలినీం ఆరోహేతు ప్రకాశమానాం అవరోహే చ అమృతం స్రవంతీం ధ్యాయేత్, తదుక్తం యోగశాస్త్రే "ప్రకాశమానాం ప్రథమే ప్రయాణే ప్రతిప్రయాణేఽప్యమృతాయమానాం, అతఃపరం వ్యోమని సంచరంతీం ధ్యాయేత్సదా కుండలినీం పరాఖ్యా"మితి-ఆరోహావరోహాశ్చ శ్రీశంకరస్వామిచరణైర ప్యుక్తోఽస్తి సౌందర్యలహర్యాం తద్యథా 'మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహ' మితి. ఆరోహః అవరోహస్తు 'సుధాధారాసారైశ్చరణయుగళాంతర్విగళితై.' రితి. ఏతదేవాహ.వదితి. మూలాధారాదిషు షట్చక్రేషు కృతః సంచారః ఆరోహావరోహక్రమేణ గమనం యయా సార్ధత్రివలయాం ప్రసుప్తభుజగాకారాం మూలాధారే స్థితామ్. ౮౬. ధామ మత్స్వాధిష్ఠానం రంధ్రాద్బహిర్గతం బ్రహ్మరంధ్రాత్ బ్రహ్మలోకాంతం ప్రాప్తం

సర్వచక్రములయందు శ్రద్ధగలవాఁడై మానసికపూజను గావించి తరువాత గురూపదేశమువలన గాయత్రిని జపింపవలెను. అధోముఖమును సరంధ్రమును సహస్రదళము నగు పంకజమున హంస గుఁడును, వరాభయుకరాంబుజుఁడును అగు శ్రీగురుని ధ్యానింపవలెను. పిదప తత్పదామృతధారచే దేహమును క్షాళితము గావించుకొని, పంచోపచారములతో పూజించి నమస్కరింపవలెను. తరువాత ఆరోహా వరోహక్రమమున షట్చక్రకృతసంచారియు, సార్ధత్రివలయయు నగు కుండలిని ధ్యానింపవలెను.

తతో ధ్యాయేత్సుషుమ్నాఖ్యం ధామ రంధ్రాద్బహిర్గతమ్,
తథా తేన గతా యాంతి తద్విష్ణోః పరమం పదమ్. ౮౭
తతో మచ్చింతితం రూపం స్వయంజ్యోతిస్సనాతనమ్,
సదానందం సదా ధ్యాయేన్ముహూర్తే బ్రాహ్మసంజ్ఞకే. ౮౮
ఏవం గురూపదేశేన మనో నిశ్చలతాం నయేత్,
న తు స్వేన ప్రయత్నేన తద్వినా పతనం భవేత్. ౮౯
అంతర్యాగం విధాయైవం బహిర్యాగం సమాచరేత్,
స్నానసంధ్యాదికం కృత్వా కుర్యాద్ధరిహరార్చనమ్. ౯౦

తేన పథా సుషుమ్నామార్గేణ గతా యోగినః విష్ణోః పదం మమ స్వరూపమేవ యాంతి-పునః మృత్యుముఖే సంసారే న పతంతీత్యర్థః. తదుక్తం వేదస్తుతౌ "తత ఉదగాదనంత! తవ ధామ శిరః పరమం పున రిహ య త్సమేత్య న పతంతి కృతాంతముఖ" ఇతి. ౮౮. మచ్చింతితం మయా శ్రీకృష్ణరూపేణ ధ్యాతం-తదుక్తం దశమే సప్తతితమేఽధ్యాయే "బ్రాహ్మే ముహూర్త ఉత్థాయ వార్యుపస్పృశ్య మాధవః, దధ్యౌ ప్రసన్నకరణ ఆత్మానం తమసః పరమ్. ఏకం స్వయం జ్యోతిరనన్య మవ్యయం స్వసంస్థయా నిత్యనిరస్తకల్మషం, బ్రహ్మాఖ్యమస్యోద్భవనాశ హేతుభిస్స్వశక్తిభిర్లక్షిత భావనిర్వృతి' మితి. ౮౯. తద్వినా తద్గురూపదేశం వినా పతనం సంసారే జన్మమరణమేవ భవేన్న తు మోక్షః తదుక్తం శ్రీశుకేన "విజితహృషీకవాయుభి రదాంత మనస్తురగం య ఇహ యతంతి యంతు మతిలోల ముపాయఖిదః, వ్యసనశతాన్వితా స్సమవహాయ గురోశ్చరణం వణిజ ఇవాజ సంత్యకృతకర్ణధరా జలధౌ." ౯౦. అంతర్యాగమ్ మానసోపచారైః పూర్వోక్తచక్రేషు శ్రీగణేశాదిపూజనమ్. బహిర్యాగం యథా లబ్ధోపచారైః శ్రీహరిహరపూజనమ్. ౯౧. దేహాభిమానినాం తు నిత్యం ప్రత

దేహాభిమానినామంతర్ముఖీ వృత్తిర్న జాయతే,
అతస్తేషాం తు మద్భక్తిస్సరళా మోక్షదాయినీ. ౯౧
తపో యోగాదయో మోక్షమార్గాస్సంతి తథాఽపి చ,
సమీచీనస్తు మద్భక్తిమార్గస్సంతరతామిహ. ౯౨
బ్రహ్మాదిభిశ్చ సర్వజ్ఞైరయమేవ వినిశ్చితః,
త్రివారం వేదశాస్త్రాణి విచార్య చ పునః పునః. ౯౩
యజ్ఞాదయోఽపి సద్ధర్మాశ్చిత్తశోధనకారకాః,
ఫలరూపా చ మద్భక్తిస్తాం లబ్ధ్వా నావసీదతి. ౯౪
ఏవమాచరణం తార్క్ష్య! కరోతి సుకృతీ నరః,
స యోగేన చ మద్భక్త్యా మోక్షం యాతి సనాతనమ్. ౯౫

పిదప సుషుమ్న యను స్థానమును ధ్యానింపవలెను. అట్లు చేసిన వారు విష్ణుసాయుజ్యమును బడసెదరు. తరువాత స్వయంజ్యోతియు, సనాతనమును, సందానందమును అగు సచ్చింతిత మగు రూపమును బ్రాహ్మముహూర్తమున ఎల్లప్పుడును ధ్యానింపవలెను. గురూపదేశమున మనస్సు నిశ్చల మగును. స్వప్రయత్నమువలన ఎప్పుడును గాదు. దాని వలన పతనము సంభవించును. ఇట్లు అంతర్యాగమును గావించి పిదప బహిర్యాగమును ఆచరింపవలెను. స్నానసంధ్యాదికము లయిన తరువాత హరిహరార్చనముగూడఁ గావింపవలెను. దేహాభిమానముగలవా

---

ణత్వాస్య దుర్ఘటత్వాద్దుర్లభో మోక్షః మద్భక్తానాం తు మత్ప్రసాదాదనాయాసత ఏవ ముక్తిర్భవతీత్యాహ. దేహేతి చతుర్భిః. ౯౧. సమీచీనః శ్రేష్ఠతరః. ౯౨. బ్రహ్మాదిభి ర్నిశ్చితత్వాత్ తదుక్తం ద్వితీయే "న హ్యతోఽన్యశ్శివః పంథా విశత స్సంసృతా విహ, వాసుదేవే భగవతి భక్తియోగో యతో భవేత్. భగవాన్ బ్రహ్మ కార్త్స్న్యేన త్రిరన్వీక్ష్య మనీషయా, తదధ్యవస్య త్కూటస్థో రతి రాత్మన్యతో భవేత్." ౯౩. నావసీదతి పునర్జన్మాదిదుఃఖం న ప్రాప్నోతి కింతు ముక్తో భవతీత్యర్థః. ౯౪. యథా విచారం కురుతే దేహేఽస్మిన్ సుకృతీన' ఇతి ప్రశ్నస్యోత్తరం సమాధాయోపసంహరతి ఏవమితి. సనాతనం విదేహకైవల్యమ్. ౯౫. ఇతి శ్రీగరుడపురాణ టీకాయాం పంచదశోఽధ్యాయః.

రికి అంతర్ముఖత్వము సాధ్యము గాదు. అగుటచే వారికి నాయందలి భక్తియే సులభ మగు మోక్షసాధనము. తపస్సు యోగము మున్నగు మోక్షసాధనము లనేకము లున్నవి; గాని సంసారనిర్మగ్నులకు మద్భక్తియే చాల మంచిది. వేదశాస్త్రములను మున్మారు పరిశీలించి బ్రహ్మాదు లిదియే నిశ్చయించిరి. యజ్ఞాదులు చిత్తశోధనకారకములు. నాయందలి భక్తి ఫలరూపము. దానిని బడసినవారు చెడరు. సుకృతి యగువాఁడు ఇట్లు ప్రవర్తించి నాయందుఁ గల భక్తివలన తుదకు మోక్షమును బడయును.

ఇతి శ్రీగరుడపురాణే-సారోద్ధారే-సుకృతజనజన్మాచరణ
నిరూపణోనామ పంచదశోఽధ్యాయః.

---

# షోడశాధ్యాయము

గరుడ ఉవాచః—

శ్రుతా మయా దయాసింధో! హ్యజ్ఞానాజ్జీవసంసృతిః,
అధునా శ్రోతుమిచ్ఛామి మోక్షోపాయం సనాతనమ్. ౧
భగవన్! దేవ! దేవేశ! శరణాగతవత్సల!,
అసారే ఘోరసంసారే సర్వదుఃఖమలీమసే. ౨
నానావిధశరీరస్థా అనంతా జీవరాశయః,
జాయంతే చ మ్రియంతే చ తేషామంతో న విద్యతే. ౩
సదా దుఃఖాతురా ఏవ న సుఖీ విద్యతే క్వచిత్,
కేనోపాయేన మోక్షేశ! ముచ్యంతే వద మే ప్రభో!. ౪

"ఓదయాసింధూ! జీవసంసృతి యంతయు విన్నాను. ఇప్పుడు మోక్షోపాయమును వినఁగోరెదను. దేవదేవా! శరణాగతవత్సలా! దుఃఖపూరితమును, అసారము నగు ఈఘోరసంసారమున జీవరాసులు అనేకవిధములగు శరీరములను ధరించి పుట్టుచు గిట్టుచు నున్నారు. వారికి అంతము గానవచ్చుట లేదు. ఎప్పుడును దుఃఖించువాఁడే గాని సుఖవంతుఁ డెందును గాన్పింపఁడు. వారు ఏయుపాయమున మోక్షము పొందెదరో దయతో తెలుపుము" అని గరుడుఁడు అడుగఁగా శ్రీహరి యిట్లు చెప్పఁదొడఁగెను.

శ్రీ భగవానువాచః—

శృణు తార్క్ష్య! ప్రవక్ష్యామి యన్మాం త్వం పరిపృచ్ఛసి,
యస్య శ్రవణమాత్రేణ సంసారాన్ముచ్యతే నరః. ౫

ప్రోక్తా పంచదశాధ్యాయైః పాపపుణ్యాత్మికా గతిః, షోడశేఽస్మిన్ హరిః ప్రాహ మోక్షోపాయం సతాం మతమ్. పూర్వాధ్యాయాంతే 'మోక్షం యాతి సనాతన'మిత్యుక్తమ్. ఇదానీం మోక్షోపాయమేవ పృచ్ఛతి—శ్రుతేతి చతుర్భిః. ౧. హే భగవన్! ఇహ అసారసంసారే జననమరణానామనంతత్వాత్సదా దుఃఖాతురాణాం మోక్షోపాయమజానతాం జీవానాం కేనోపాయేన మోక్షస్స్యాదితి మే వదేతి సముచ్చయార్థః. ౨-౪. అత్రోత్తరం శ్రీభగవానువాచ-హేగరుడ! పరబ్రహ్మస్వరూపి

అస్తి దేవః పరబ్రహ్మస్వరూపీ నిష్కళశ్శివః,
సర్వజ్ఞస్సర్వకర్తా చ సర్వేశో నిర్మలోఽద్వయః. ౬
స్వయంజ్యోతిరనాద్యంతో నిర్వికారః పరాత్పరః,
నిర్గుణస్సచ్చిదానందస్తదంశాజ్జీవసంజ్ఞకః. ౭
అనాద్యవిద్యోపహితాద్యథాఽగ్నే విస్ఫులింగకాః,
దేహాద్యుపాధిసంభిన్నాస్తే కర్మభిరనాదిభిః. ౮
సుఖదుఃఖప్రదైః పుణ్యపాపరూపైర్నియన్త్రితాః,
తత్తజ్జాతియుతం దేహమాయుర్భోగం చ కర్మజమ్. ౯

గరుడుఁడా! దేనిని తెలుపుమని నీవు నన్నడుగుచున్నావో, దేనిని విన్నంతమాత్రముననే నరుఁడు సంసారబంధమునుండి విముక్తుఁడగునో దానిని చెప్పెద వినుము. పరబ్రహ్మస్వరూపి యగు శివుఁడు కలఁడు గదా? అతఁడు సర్వజ్ఞుఁడు. సర్వకర్త. సర్వేశ్వరుఁడు. నిర్మలుఁడు. అద్వితీయుఁడు. నిర్గుణుఁడు. సచ్చిదానందుఁడు స్వయంజ్యోతి. ఆదిమధ్యాంతరహితుఁడు. నిర్వికారుఁడు. పరముకంటెను పరుఁడు. అతనినుండి అగ్నినుండి విస్ఫులింగములవలె దేహాద్యుపాధులచే భిన్నులై జీవులు సుఖదుఃఖప్రదములును, పుణ్యపాపరూపములు నగు అనాదికర్మచేతను నియంత్రితులై ఆయాజాతుల కుచితములగు శరీరములును, ఆయుస్సును, భోగభాగ్యాదికమును పొందుదురు.

---

కశ్చిద్దేవోఽస్తి. ౫, ౬. తస్య అనాద్యవిద్యోపహితాత్ అవిద్యాయాం ప్రతిబింబాత్ అంశ ఇవ అంశస్తస్మాత్ జీవ ఇతి సంజ్ఞో భవతి. అభేదే దృష్టాంతః. ౭. యథాఽగ్నే విస్ఫులింగకా ఇతి. యది అసౌ జీవో నిజానందస్వరూపం విస్మృత్య దేహధర్మానాత్మన్యారోపయతి తదా అస్య అనేకయోనిషు మోక్షగంధోఽపి నాస్తి యదా మానవో భూత్వా జ్ఞానీ భవేత్. జ్ఞానం నామ "బ్రహ్మైవాహం సమశ్శాంత స్సచ్చిదానంద లక్షణః, నాహం దేహో హ్యసద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః" ఇత్యుక్తలక్షణస్స్యాచ్చేత్తదా మోక్షం ప్రాప్నోతీతి సప్తమేన సంబంధః. తత్రాయం వేదాంతసిద్ధాంతః. యథా అంధకారాదౌ వికారరహితే రజ్వాదౌ సర్పాద్యారోపణం కృత్వా భయకంపాదికం వహేత్, ఏవమాత్మాఽపి స్వస్మిన్ జీవత్వమారోప్య స్వద్వితీయం పరిచ్ఛిన్నం జ్ఞాత్వా దుఃఖసాగరే మగ్నో భవతి యదా శాస్త్రాచార్యప్రసాదేన వాక్యార్థ

ప్రతిజన్మ ప్రపద్యంతే తేషా మపి పరం పునః,
నసూక్ష్మలింగశారీర మామోక్షా దక్షరం ఖగ!. ౧౦
స్థావరాః క్రిమయశ్చాబ్జాః పక్షిణః పశవో నరాః,
ధార్మికా స్త్రిదశా స్తద్వ న్మోక్షిణశ్చ యథాక్రమమ్. ౧౧
చతుర్విధశరీరాణి ధృత్వా ముక్త్వా సహస్రశః,
సుకృతా న్మానవో భూత్వా జ్ఞానీ చే న్మోక్ష మాప్నుయాత్. ౧౨
చతురశీతిలక్షేషు శరీరేషు శరీరిణామ్,
న మానుషం వినాఽన్యత్ర తత్త్వజ్ఞానం తు లభ్యతే. ౧౩
అత్ర జన్మసహస్రాణాం సహస్రై రపి కోటిభిః,
కదాచి ల్లభతే జంతు ర్మానుష్యం పుణ్యసంచయాత్. ౧౪
సోపానభూతం మోక్షస్య మానుష్యం ప్రాప్య దుర్లభమ్,
య స్తారయతి నాఽఽత్మానం తస్మా త్పాపతరోఽత్ర కః!. ౧౫

జీవులు ఆయాజన్మములను మరల మరల పొందుదురు.

---

జ్ఞాన ముత్పన్నం తదా వివేకచక్షుషా స్వాత్మాన ముఖండానందజ్ఞానైకరూపం సంపశ్యన్ తతో నాహం జీవః పరమాత్మాఽహ మితి జ్ఞాత్వా భయదుఃఖాదిరహితస్సన్ సుఖీ భవేత్. యథా చ జలస్థసూర్యాంశః జలస్య నిమిత్తస్య అపాయే సూర్య మేవ గత్వా తేనైవ రూపేణ పున ర్నాఽఽగచ్ఛతి, యథా చ బాహ్యఘటాద్యుపాధిపరిచ్ఛిన్నో ఘటాకాశో ముఖ్యాకాశాంశస్సన్ ఘటాదే ర్నిమిత్తస్య అపాయే ముఖ్యాకాశం ప్రాప్య పున ర్న నివర్తతే, ఏవం లింగశరీరావచ్ఛిన్నః పరమాత్మనోఽంశః మాయికలింగశరీరాపాయే పరమాత్మానం ప్రాప్య న నివర్తతే. కింతు తత్త్వజ్ఞానాన్మోక్షో భవతీతి. తథా చోక్తం శ్రీభాగవత ద్వాదశస్కంధే "ఘటేభిన్నే యథాఽఽకాశ ఆకాశస్స్యా ద్యథా పురా. ఏవం దేహే మృతే జీవో బ్రహ్మ సమ్పద్యతే పునః" ఇత్యధ్యాయార్థః. ౧-౧౨. అస్మి న్నధ్యాయే ప్రథమజ్ఞానహేతుం నరత్వం స్తుత్వా తతో జ్ఞానజనకం వైరాగ్యం నిరూప్య తతో జ్ఞానవైరాగ్యరహితాన్ దాంభికా న్విగర్హ్య తతస్తత్త్వజ్ఞానా న్మోక్షో భవతీతి ప్రతిపాద్య అన్తే జ్ఞానినా మాతురకృత్యం నిరూపయతి. అనేనైవ క్రమేణాఽహ. శరీరిణాం జీవానాం అన్యత్ర పశ్వాదిశరీరేషు జ్ఞానలాభో న భవే దిత్యర్థః. ౧౩. జ్ఞానహేతో ర్మానుషశరీరస్య దుర్లభతా మాహ-అత్రేతి. ౧౪. దుర్లభం ప్రాప్యాపి యః మోక్షోపాయం న కరోతి స తు మహాపాతకీ త్యాహ. సోపానభూతం మోక్షస్య సాధనరూపమ్. ౧౫. ఉత్తమం సర్వోత్తమం బ్రాహ్మణాది

జీవులు ముందు స్థావరము లగుదురు. పిదప పురుగులు అగుదురు. పిమ్మట అజము లగుదురు. పదపడి పక్షులును, అనంతరము పశువులు నగుదురు. పిమ్మట నరులు, అందును ధార్మికులు, దేవతలు నై మోక్షు ౦గుదురు. వేలకొలఁది చతుర్విధశరీరములను ధరించి విడిచి సుకృతము వలన మానవుఁడై జ్ఞానవంతుఁ డయినచో మోక్షమును పొందును. ఎనుబదిలక్షల శరీరములయందును జీవులకు మనుష్యజన్మమున తక్క-ఇతరజన్మలలో తత్త్వజ్ఞానములభింపదు. ఈయెనుబదిలక్షలజన్మములలో పుణ్యసంచయమువలనఁగాని మానవజన్మ లభింపదు. మోక్షమునకు సోపానభూతమును, దుర్లభము నగు మనుష్యజన్మమును పొందియు ఎవఁడు ఆత్మకు తరణోపాయమును జూచుకొనఁడో వానికంటె పాపుఁడు ఎవఁడు!

నరః ప్రాప్యోత్తమం జన్మ లబ్ధ్వా చేంద్రియసౌష్ఠవమ్,
న వేత్త్యాత్మహితం యస్తు స భవే దాత్మఘాతకః. ౧౬
వినా దేహేన కస్యాపి పురుషార్థో న విద్యతే,
తస్మా ద్దేహం ధనం రక్షే త్పుణ్యకర్మాణి సాధయేత్. ౧౭
రక్షయే త్సర్వదాఽఽత్మాన మాత్మా సర్వస్య భాజనమ్,
రక్షణే యత్న మాతిష్ఠే జ్జీవ న్భద్రాణి పశ్యతి. ౧౮
పున ర్గ్రామః పునః క్షేత్రం పున ర్విత్తం పున ర్గృహమ్,
పున శ్శుభాశుభం కర్మ న శరీరం పునః పునః. ౧౯

జన్మ-సౌష్ఠవం ఇంద్రియాణా మప్రతిహతశక్తిత్వం లబ్ధ్వాఽపి యః ఆత్మహితం మోక్షోపాయం న జానాతి స త్వాత్మఘాతకః - స్వస్యైవ నాశకర్తే త్యర్థః. ౧౬. వినా దేహేన నరశరీరసంయోగం వినా కస్యాపి దేవాదిజీవస్యాపి పురుషార్థో మోక్షో నాస్తీతి వ్యవహారమార్గేఽపి ధనం వినా సబలశరీరం వినా చ తీర్థాటనాదిపురుషార్థో నాస్తి. తస్మా ద్దేహో ద్వయం రక్షేత్ - అసత్కార్మసు న నియోజయే దిత్యర్థః, కింతు పుణ్యకర్మాణి సాధయే దితి. ౧౭. ఆత్మా నరదేహః సర్వస్య మోక్షాదేః పాత్రం భవతి - అత స్తస్య రక్షణే యత్నం యోగాభ్యాస మాచరేత్. భద్రాణి సత్సంగాత్మ ధ్యానాని బహుకల్యాణాని. ౧౮. గతా అపి గ్రామాదయ స్తు పున రప్యాయాంతి-నరశరీరం తు పునః పునః నాయాతి-అతో రక్షే దితి పూర్వేణైవ సంబంధః. ౧౯. ఉ పాయాః మృత్యో ర్వంచనాయ సమాధ్యాదయః. రోగిణోఽపిత్యాగంతు నేచ్ఛంతి-

శరీరరక్షణోపాయాః క్రియంతే సర్వదా బుధైః,
నేచ్ఛంతి చ పున స్త్యాగ మపి కుష్ఠాదిరోగిణః. ౨౦
త ద్గోపితం స్యా ద్ధర్మార్థం ధర్మో జ్ఞానార్థ మేవచ,
జ్ఞానం తు ధ్యానయోగార్థ మచిరా త్ప్రవిముచ్యతే. ౨౧
ఆత్మైవ యది నాత్మాన మహితేభ్యో నివారయేత్,
కోఽన్యో హితకర స్తస్మా దాత్మానం తారయిష్యతి, ౨౨
ఇహైవ నరకవ్యాధే శ్చికిత్సాం న కరోతి యః,
గత్వా నిరౌషధం దేశం వ్యాధిస్థః కిం కరిష్యతి. ౨౩
వ్యాఘ్రీ వాఽస్తే జరా చాయు ర్యాతి భిన్నఘటాంబువత్,
నిఘ్నంతి రిపువ ద్రోగా స్తస్మా చ్ఛ్రేయ స్సమభ్యసేత్. ౨౪
యావ న్నాశ్రయతే దుఃఖం యావ న్నాయాంతి చాపదః,
యావ న్నేంద్రియవైకల్యం తావ చ్ఛ్రేయ స్సమభ్యసేత్. ౨౫
యావ త్తిష్ఠతి దేహోఽయం తావ త్తత్త్వం సమభ్యసేత్,
సందీప్తే కోణభవనే కూపం ఖనతి దుర్మతిః. ౨౬

ఉత్తమ మగు నరజన్మమును బడసి దృఢశరీరియునై ఎవఁడు ఆత్మహితమును చూచికొనఁడో వాఁడు బ్రహ్మహంత యనిపించుకొనును. దేహము లేనిదే యెవఁడును పురుషార్థములను సాధించుకొనఁజాలఁడు. అగుటచే దేహమును ధనమును రక్షించుకొని పుణ్యకర్మలను సాధింపవలెను. ఆత్మయే అన్నిటికి నాధారము. గావున దానిని శ్రద్ధతో రక్షింపవలెను. రక్షణమున నెప్పుడును మహోత్సాహియై యుండవలెను. ఏమన? బ్రతికియుండిన శుభములు పడయవచ్చును. గ్రామము పోతే

జ్ఞానహేతో ర్నరశరీరస్య పునః ప్రాప్తేః దుర్లభత్వాదితి భావః. ౨౦. నను, అనిత్యస్య రక్షణం కిమర్థ మితి చే త్తత్రాహ-త దితి. ౨౧. "ఆత్మైవ హ్యాత్మనో బంధు రితి విద్యాన్మహా ర్మహాన్" ఇతి వచనాత్ స్వయ మే వాత్మానం తారయే దిత్యాహ-ఆత్మైవేతి. అహితేభ్యః అసత్కర్మదుస్సంగాదిభ్యః. ౨౨. ఇహైవ నరశరీర ఏవ-చికిత్సాం దూరీకరణోపాయం-నిరౌషధం పశ్వాదిదేహమ్. ౨౩. అతోఽస్మి న్నేవ సబలనరశరీరే తత్త్వాభ్యాసం కుర్యాదిత్యాహ-వ్యాఘ్రీవేతి త్రిభిః. యావ జ్జరాదయో నాయాంతి యావ దయం దేహ శ్చతిష్ఠతి స్వస్థో భవతి-తావ త్తత్త్వం సమభ్యసే దితి త్రయాణాం సంబంధః. ౨౪, ౨౫. యది తారుణ్యే విషయా న్భుక్త్వా వార్ధకే తత్త్వాభ్యాసం

మరల రావచ్చును. మాన్యములు పోయినను మరల రావచ్చును. ధనము పోయినను, ఇల్లు పోయినను శుభాశుభకర్మలుగూడ మరల రావచ్చును; గాని శరీరమును మరల పొందుట కవకాశములు లేవు. పండితులు ఎప్పుడును శరీరరక్షణోపాయములు చూచుకొందురు. కుష్ఠాది క్రూరవ్యాధులచే చెడియున్న శరీరములనుగూడ ఎవరును విడువఁజాలుట లేదు. కావున శరీరము ధర్మమే ప్రయోజనముగాఁగలది. ధర్మము జ్ఞానార్థము. జ్ఞానము ధ్యానయోగార్థము, ధ్యానయోగి శీఘ్రముగా మోక్షమును బడయును. ఎవఁడు అహితమునుండి తన్నుతా సేరక్షించుకొనఁడో వానిని మఱియెవఁడు రక్షించును? ఎవఁడు తరింపఁచేయును? నరక మను వ్యాధికి ఇక్కడనే యెవఁడు చికిత్స చేయఁడో ఔషధములు లేని ఆలోకమునకుఁ బోయి ఆరోగి యేమి చేయఁగలఁడు? ముసలితనము పెద్దపులివలె ఎదుట పీఁటపెట్టుకొనియున్నది. పగిలి పోయిన కుండలోని నీటివలె ఆయుర్దాయము గడచిపోవుచున్నది. రోగములు శత్రువులవలె కొట్టుచున్నవి. ఆకారణమువలన శ్రేయమును చూచుకోవలెను. ఎంతవఱకు దుఃఖములు సంప్రాప్తములు కావో, ఎంతవఱకు ఆపదలు రావో, ఎంతవఱకు ఇంద్రియవికలత్వము రాదో అంతవఱకును శ్రేయస్సును చూచుకొనవలెను. ఈదేహము ఎంతవఱకు ఉండునో అంతవఱకును తత్త్వజ్ఞానమును గడించుకొనవలెను. ఇంటి ముంగిలి నిప్పంటుకొనిన తరువాత (జలార్థము) నూయి త్రవ్వువాఁడు మూఢుఁడు గదా?

కాలో న జ్ఞాయతే నానాకార్యైస్సంసారసంభవైః,
సుఖం దుఃఖం జనో హంత న వేత్తి హిత మాత్మనః. ౨౭

కరిష్యామీతి విచారస్తు త్యాజ్య ఏవేత్యాహ సందీప్తేతి. యథా సందీప్తభవనస్య శమనం నవఖనితకూపోదకేన న సంభవతి, తథా జరాదిషు తత్త్వాభ్యాసం హరిస్మరణం చ న స్యాత్ - అతః స్వస్థావస్థాయామేవ శ్రేయస్సమభ్యసేదిత్యర్థః. తదుక్తం భర్తృహరిణా 'యావత్స్వస్థ మిదం శరీర మరుజం యావజ్జరా దూరతో యావచ్చేంద్రియశక్తిరప్రతిహతా యావత్క్షయో నాయుషః, ఆత్మశ్రేయసి తావదేవ విదుషా కార్యః ప్రయత్నో మహాన్ సందీప్తే భవనే తు కూపఖననే ప్రత్యుద్యమః కీదృశః" ఇతి. ఉక్తం చ గౌతమేనాపి "కృష్ణత్వదీయపదపంకజపంజరాంతే హ్యద్యైవ

జాతా న్నార్తా న్మృతా నాపద్గ్రస్తా న్దృష్ట్వా చ దుఃఖితాన్,
లోకో మోహసురాం పీత్వా న బిభేతి కదాచన. ౨౮
సంపద స్స్వప్నసంకాశా యౌవనం కుసుమోపమమ్,
తటిచ్చపల మాయుష్యం కస్య స్యా జ్జానతో ధృతిః. ౨౯
శతం జీవిత మత్యల్పం నిద్రాలస్యై స్తదర్ధకమ్,
బాల్యరోగజరాదుఃఖై రల్పం తదపి నిష్ఫలమ్. ౩౦
ప్రారబ్ధవ్యే నిరుద్యోగో జాగర్తవ్యే ప్రసుప్తకః,
విశ్వ స్తవ్యే భయస్థానే హా నరః కో న హన్యతే. ౩౧

సాంసారికములగు అనేకజటిలప్రవృత్తులవలన కాలము ఎఱుకఁబడదు. సుఖదుఃఖముల నెఱింగియు, మోక్షోపాయ మెఱింగియు జనుఁడు తన హితమును చూచుకొనుటలేదు. ఆర్తులయినవారిని, మర

---

మే విశతు మానసరాజహంసః, ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః కంఠావరోధనవిధౌ స్మరణం కుత స్తే" ఇతి. ౨౬. వైరాగ్యోత్పాదకవచనా న్యాహ. కాలఇత్యాదినా. హితం మోక్షోపాయం శక్యమపీతి వ. హంతేతి ఖేదే. ప్రత్యుత అహితమేవాఽఽచరతీతి. ౨౭. జాతా నితి. తదుక్తం భర్తృహరిణా వ్యాఘ్రీవేతి పంచశ్లోకాదయః "వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయంతీ రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహమ్, ఆయుశ్చ సంస్రవతి భిన్నఘటాదివాంభో లోక స్తథా ప్యహితమాచరతీతి చిత్రమ్. ఆదిత్యస్య గతాగతై రహరహ స్సంక్షీయతే జీవనం వ్యాపారై ర్బహుభారకార్యగురుభిః కాలో న విజ్ఞాయతే, దృష్ట్వా జన్మజరావిపత్తి మరణం త్రాస శ్చ నోత్పద్యతే పీత్వా మోహమయీం ప్రమాదమదిరా మున్మత్తభూతం జగత్. ౨౮. సంపదాదయః స్వప్నాదివ జ్ఞానతః కస్య వివేకినః ధృతిః స్యాత్ - న కస్యాపీత్యర్థః. ౨౯. శతమితి. తదుక్తం భాగవతే బాలా న్ప్రతి ప్రహ్లాదేన "పుంసో వర్షశతం హ్యాయు స్తదర్ధం చాఽజితాత్మనః, నిష్ఫలం య దసౌ రాత్ర్యాం శేతేఽంధం ప్రాపిత స్తమః, ముగ్ధస్య బాల్యే కౌమారే క్రీడతో యాతి వింశతిః, జరయా గ్రస్తదేహస్య యాత్యకల్పస్య వింశతిః. దురాపూరేణ కామేన మోహేన చ బలీయసా, శేషం గృహేషు సక్తస్య ప్రమత్తస్యాపయాతి హి" ఇతి. ౩౦. ప్రారబ్ధవ్యే ప్రారబ్ధుం యోగ్యే మోక్షోపాయే జాగర్తవ్యే పరబ్రహ్మచింతనే భయస్థానే సంసారే విశ్వ స్తవ్యః విశ్వాసార్హో నరః కః న హన్యతే యమేన - అపితు సర్వ ఏవేత్యర్థః. హా ఇతి కరుణయా అనుతాపః. ౩౧. ఆక్రమ్య జీవం వశీకృత్య స్థితే దేహే జీవేన సహైవ జలబుద్బుద

ణించినవారిని, ఆపద్గ్రస్తులను, దుఃఖితులను జూచియు ఈజనసమూహము మోహము అను కల్లుద్రావి (మత్తుపొందుటవలన) ఎప్పుడును భయపడుటలేదు. ఆయుర్దాయము మెఱపువలె క్షణమాత్రము సంపదలు. కలలోని ముచ్చటలు. యౌవనము పూవువంటిది. ఇది తెలిసినచో ఎవనికి ధైర్యముండును? ఆయుర్దాయము నూఱేండ్లు. అదియే అల్పము. అందు నిద్రవలనను, ఆలస్యమువలనను సగము గడచిపోవును. బాల్యము, రోగములు, ముసలితనము, దుఃఖములు–వీనివలన మఱింత గడచిపోఁగా ఇఁక మిగులునది అత్యల్పము. అదికూడ నిష్ఫల మగును. ప్రారంభింపఁదగిన మోక్షోపాయమున నిరుద్యోగుఁడై యుండును. మేలుకొనియుండఁదగిన అనఁగా బ్రహ్మచింతనమున నిద్రాముద్రితుఁడై యుండును. భయస్థానము అగు సంసారమున నమ్మియుండును. కట్టా ఏనరుఁడు యమునిచే హతుఁడు కాకుండును?

తోయఫేనసమే దేహే జీవేనాఽఽక్రమ్య సంస్థితే,
అనిత్యే ప్రియసంవాసే కథం తిష్ఠతి నిర్భయః. ౩౨
అహితే హితసంజ్ఞ స్స్యా దధ్రువే ధ్రువసంజ్ఞకః,
అనర్థే చార్థవిజ్ఞానః స్వ మర్థం యో న వేత్తి సః. ౩౩
పశ్య న్నపి ప్రస్ఖలతి శృణ్వ న్నపి న బుధ్యతి,
పఠ న్నపి న జానాతి దేవమాయావిమోహితః. ౩౪
త న్నిమజ్జ జ్జగ దిదం గంభీరే కాలసాగరే,
మృత్యురోగజరాగ్రాహై ర్న కశ్చి దపి బుధ్యతే. ౩౫
ప్రతిక్షణ మయం కాలః క్షీయమాణో న లక్ష్యతే,

---

సమే సనిర్భయః కథం తిష్ఠతి. ౩౨. అహితే పరిణామే విషోపమే విషయే హితమభీష్టలాభ మితి సంజ్ఞా యస్యేతి–అధ్రువే దేహాదౌ అనర్థే దంభానృతాదిపంచదశానర్థమూలే ధనే అర్థః మమ ప్రయోజనం సిద్ధం ఇతి విజ్ఞానం యస్య ఈదృశో యో నరః స్యాత్, సః స్వం అర్థం ముక్తిప్రదం ఆత్మజ్ఞానరూపం స్వప్రయోజనం నైవ వేత్తి. ౩౩. అహో దేవమాయాబల మిత్యాహ–పశ్య న్నపి ఆత్మజ్ఞానాన్మోక్షో భవతీతి జాన న్నపి ప్రస్ఖలతి మోక్షమార్గా ద్భ్రష్టో భవతి–తదాచరణం న కరోతీత్యర్థః. ౩౪. ఇదం జగత్ మరణాదిగ్రాహైః కారణభూతైః కాలసాగరే నిమజ్జత్ నిమగ్నం భవతి త దపి న బుధ్యతే ఇత్యహో. ౩౫. విశీర్ణః గళితః యథా న జ్ఞాయతే తథా

ఆమకుంభ ఇవాంభస్థో విశీర్ణో న విభావ్యతే. ౩౬
యుజ్యతే వేష్టనం వాయో రాకాశస్య చ ఖండనమ్,
గ్రథనం చ తరంగాణా మాస్థా నాయుషి యుజ్యతే. ౩౭

తరంగములమీఁది నురుగుతో సమానమును నిత్యమును అప్రియసన్నిహితమును అగు ఈశరీరమున జీవుఁడు నిర్భయుఁడై యెట్లుండును! అహితమును హిత మనుకొని, ధ్రువము కాని దానిని ధ్రువమనుకొని, అనర్థమున అర్థము నూహించుకొని ఎవఁడు తన గతిని తెలంచుకొనఁడో వాఁడు దేవమాయామోహితుఁడై చూచుచును గూడ తప్పిపోవుచున్నాఁడు. వినుచున్నను గూడ బోధపఱుచుకొనలేకున్నాఁడు. చదువుచు సైతము తెలిసికొనలేకపోవుచున్నాఁడు. మృత్యువు, రోగములు, ముసలితనము మున్నగు మొసళ్లచే గంభీర మగు కాలసాగరమున ఈజగత్తు మునిఁగిపోవుటగూడ ఎవఁడును తెలిసికొనఁజాలకున్నాఁడు. పచ్చికుండ నీటిలోఁ గరఁగిపోవునట్లు ఈకాలము క్షణక్షణము క్షీణించిపోవుచున్నది. దీని నెవఁడును చూచుట లేదు. వాయువును గూడ అరికట్టవచ్చును. ఆకాశమును గూడ ఖండింపవచ్చును. తరంగములను ప్రోవుచేయవచ్చును గాని ఆయుర్దాయమును మాత్రము స్థిరముగా నిలుపుట కేయుపాయమును లేదు.

పృథివీ దహ్యతే యేన మేరు శ్చాపి విశీర్యతే,
శుష్యతే సాగరజలం శరీరస్య చ కా కథా. ౩౮
అపత్యం మే కళత్రం మే ధనం మే బాంధవా శ్చ మే,
జల్పంతమితి మర్త్యాజం హంతి కాలవృకో బలాత్. ౩౯
ఇదం కృత మిదం కార్య మిద మన్య త్కృతాకృతమ్,

---

కాలోఽపి సూక్ష్మగతిత్వాత్. ౩౬. ఆయు రపి కాలతః క్షీయమాణం న లక్ష్యత ఇత్యాహ-వేష్టనం రోధనం యుజ్యతే కుడ్యాదిభిః కర్తుం శక్యతే. ఏవమఘటనాఘటనా తు ఘటనాదపి పరంతు ఆయుషి ఆయుర్గమనే ఆస్థా స్థిరతా నయుజ్యత ఇత్యర్థః. ౩౭. యేన కాలేనాపరిమితాః పృథివ్యాదయోఽపి నశ్యంతి తదా క్షుద్రవితస్తికస్య కా వార్తేత్యాహ-పృథివీతి. ౩౮. స్వభక్షణావసరే కాలస్య దయాలేశోఽపి నాస్తీత్యాహ- అపత్య మితి. మే మే ఇత్యజవచనానుకరణం మర్త్యో నరః స ఏవాజస్తమ్ ౩౯.

ఏవ మీహాసమాయుక్తం కృతాంతః కురుతే వశమ్. ౪౦
శ్వః కార్య మద్య కుర్వీత పూర్వాహ్ణే చాపరాహ్ణికమ్,
న హి మృత్యుః ప్రతీక్షేత కృతం వా ప్యథవాఽకృతమ్. ౪౧
జరాదర్శితపంథానం ప్రచండవ్యాధిసైనికమ్,
మృత్యుశత్రు మధిష్ఠోఽసి త్రాతారం కిం న పశ్యసి. ౪౨
తృష్ణాసూచీవినిర్భిన్నం సిక్తం విషయసర్పిషా,
రాగద్వేషానలే పక్వం మృత్యు రశ్నాతి మానవమ్. ౪౩
బాలాంశ్చ యౌవనస్థాంశ్చ వృద్ధా న్గర్భగతా నపి,
సర్వా నావిశతే మృత్యు రేవం భూత మిదం జగత్. ౪౪
స్వదేహ మపి జీవోఽయం ముక్త్వా యాతి యమాలయమ్,
స్త్రీమాతృపితృపుత్రాదిసంబంధః కేన హేతునా. ౪౫

భూమి తగులబడిపోవుచున్నది. మేరువు కరఁగిపోవుచున్నది. సముద్ర మింకిపోవుచున్నది. ఇఁక శరీరముసంగతి చెప్పనేల? ''వీఁడు నాకొడుకు. ఇది నాభార్య. ఇది నా ధనము. వీరు నాబాంధవులు'' అని అఱచు మనుష్యుఁడు అను మేఁకను కాల మను తోడేలు బలవంతముగ పట్టుకొనుచున్నది. ఇది చేయఁబడినది. ఇది యింకను చేయవలెను. వాఁడది చేసెను. అది యింకను చేయలేదు. ఇట్లు యోచించుకొనుచుండువానిని యముఁడు తనవశము చేసికొనుచున్నాఁడు. రేపు చేయవలసినదానిని నేఁడే చేయవలెను. మధ్యాహ్నము చేయవలసినదాని ప్రొద్దుటనే చేయవలెను. చేసినను చేయకున్నను మృత్యువుమాత్రము కనిపెట్టుకొనియుండదు. ముసలితనము మార్గము చూపఁగా

కాలః కృతాకృత మపి న ప్రతీక్షత ఇత్యాహ - ఇద మితి. ౪౦. అతో మోక్షకార్యే విలంబో న కార్య ఇత్యాహ - శ్వ ఇతి. ౪౧. సామంత ఇవాగతం మృత్యుశత్రుం ప్రత్యధిష్ఠోఽసి స్థితోఽసి అత త్రాతారం పరమేశ్వరమ్. ౪౨. పరిపక్వమాం సపిండవ న్మృత్యు ర్మానవ మశ్నాతీ త్యాహ-తృష్ణేతి. ౪౩. మృత్యో స్సర్వత్ర తుల్యతా మాహ బాలా నితి. ఆవిశతే అపశ్య మాయాతి. తదుక్తం శ్రీభాగవతే ''మృత్యు ర్జన్మవతాం వీర! దేహేన సహజాయతే, అద్యవాఽబ్దశతాంతేవా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువ'' మితి. ౪౪. సహచరః స్వదేహోఽపి జీవేన సహ నోపయాతి తర్హి పృథక్ స్థితానాం స్త్రీపుత్రాదీనాం కిం ప్రయోజన మిత్యాహ - స్వదేహ మితి. ౪౫.

